# తెలుగు సాహిత్యము శైవమత ప్రభావము

మొదటి సంపుటము

POST DOCTORAL THESIS

డా॥ వి. రత్నమోహిని

TELUGU SAHITYAMU
SAIVAMATA PRABHAVAMU
(SAIVISIM AND ITS INFLUENCE ON
TELUGU LITERATURE

Post - Doctoral Thesis
by
Dr. V. RATNA MOHINI,
M.A., Ph:D.,

FIRST EDITION : MAY 1992
Copies : 1000


PRICE : Rs. 60/-

Published by
Dr. V. RATNA MOHINI
G. 2. 'ORCHIDS'
2-2-12/1/C.
D.D. Colony (Durga Bai Deshmukh Colony)
HYDERABAD 500 007
Phone : 8 6 4 9 2 4

Printed at
MASTER PRINTERS & GRAPHICS
HABSIGUDA
HYDERABAD 500 007.
Phone : 8 5 1 0 2 1 PP

పూజ్యులు

పితృపాదులు



కీ. శే. డా॥ వల్లూరి హనుమంతరావు

గారి

స్మృతికి

# నా మాట

తెలుగులో "మహాకవి ధూర్జటి జీవితము- రచనలు" అను అంశంపై పరిశోధన చేసిన తరువాత ఈ మహాకవి శైవకావ్యములు రచించుట వలనకాబోలు "తెలుగు సాహిత్యము - శైవమత ప్రభావము" అనే అంశముపై పరిశోధన చేయవలెనని కోరిక కలిగినది.

ఈ సంకల్పము కలిగిన వెంటనే ఆచార్య ఎం. కులశేఖరరావు గారికి విన్నవించగా వారు నన్ను ప్రోత్సహించిరి. యు.జి.సి వారు ఉపకార వేతన మిచ్చి పరిశోధన నిరాటంకముగా సాగుటకు దోహదము చేసిరి.

ఆచార్య ఎం. కులశేఖరరావుగారి పర్యవేక్షణలో నా ఈ పరిశోధన కొనసాగినది. వారు ఉత్సాహ ప్రోత్సాహముల నొసంగుటయే కాక అమూల్యములగు సలహాలనిచ్చుచు ఈ పరిశోధన కనేక విధముల సహకరించిరి. వారికి నేనెంతయో కృతజ్ఞురాలిని.

నా ఈ సిద్ధాంత వ్యాసమును రెండు భాగములుగా విభజన చేసితిని. శివ శబ్దము-దాని ప్రాచీనత, బసవేశ్వరుని వీరశైవము, మల్లికార్జున పండితుని సిద్ధాంతము, పాల్కురికి సోమనాధుని తెలుగు కృతులలోని అంశములు, నన్నె చోడుని కుమార సంభవ కావ్యములోని శైవమత విశేషములు, మున్నగున వన్నియు ఒక భాగము కాగా; ఆగమ శైవము, శివుని మహాత్మ్యము, ఆధిపత్యము, శివుని లీలలు, నాథ సంప్రదాయము, మున్నగునవన్నియు నిరూపించు కావ్యముల నెన్నుకుని అందుగల శైవనిరతిని నిరూపించుట మరొక భాగము. సిద్ధేశ్వర చరిత్ర ప్రతాపరుద్ర చరిత్ర అను గ్రంథములు కూడ నీ పరిధిలో చేరినవి.

శ్రీనాథుని కావ్యములు, ప్రబంధ కాలమున అష్టదిగ్గజములని పేరు వడసిన కవులు వ్రాసిన శైవ ప్రబంధములలోని శైవనిరతిని పరిశీలించితిని. ఇంతే

కాక లఘు కృతులైన శతకములు, ఉదాహరణములు, వచనలును మున్నగు వాటిలో శైవ సంప్రదాయమును కూడ పరికించి వ్రాసితిని. దీనిలో క్రి. శ. 16వ శతాబ్ద్యంతము వరకు వెలువడిన సాహిత్యము మాత్రమే పరిశీలింప బడినది.

పరిశోధన నిమిత్తము అనేక స్థలములు, గ్రంథాలయములు సందర్శించుట, విషయ సేకరణ చేయుట జరిగినది. గ్రంధాలయాధి కారులు దయతో నా పరిశోధనకు కావలసిన విషయ సేకరణకు తోడ్పడిరి. వారికి నేనెంతయో కృతజ్ఞురాలిని.

బెంగుళూరు విశ్వవిద్యాలయ ఆచార్యులు డా॥ బడాల రామయ్యగారు ఈ పరిశోధనకు తమ అమూల్యమగు సలహా నొసంగిరి. వారికి నా కృతజ్ఞతలు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆచార్యులు డా. యస్. వి. జోగారావు గారు, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు కూడ తమ సలహాల నందజేసిరి. వారికి నా కృతజ్ఞతలు.

ఈ పరిశోధనలో అనేక విధముల నన్ను ప్రోత్సహించిన నా భర్తగారైన శ్రీ సూర్యారావు గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఇంకను ఎందరో మహానుభావులు. వారందరికి నా కృతజ్ఞతలు.

ఈ పరిశోధన, సమయమునకు, విస్తృతికి కొన్ని పరిమితులు ఏర్పరచు కొని చేయుట వలన అంతగా ప్రాముఖ్యములేని సాహిత్యము దీనిలో చేరెడు అవకాశము లేకపోయినది.

ఈ సిద్ధాంత గ్రంథము అచ్చువేయుటకు ఆర్థిక సహాయము నందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నేనెంతయు కృతజ్ఞురాలిని.

వి. రత్నమోహిని

## మొదటి సంపుటము

# విషయసూచిక


మొదటి అధ్యాయము

మహేశ్వరుడు - శైవ సిద్ధాంతము 1

రెండవ అధ్యాయము

వీరశైవము 26

మూడవ అధ్యాయము

కుమార సంభవము - శైవ ప్రాధాన్యము 59

నాలుగవ అధ్యాయము

మల్లికార్జున పండితుడు - శైవము (శివతత్త్వసారము) 101

అయిదవ అధ్యాయము

పాల్కురికి సోమనాథుని కృతులు - శైవసిద్ధాంతము 149

1. అనుభవసారము
2. బసవ పురాణము
3. వృషాధిప శతకము
4. బసవోదాహరణము
5. చతుర్వేదసారము
6. చెన్నమల్లు సీసములు
7. పండితారాధ్య చరిత్ర

ఉపయుక్త గ్రంథముల పట్టిక - 250


—)o(—

# మహేశ్వరుడు - శైవసిద్ధాంతము

భారతీయ సంస్కృతికి మూలకందములు వేదములు. సృష్టిజరిగిన తరువాత, భౌతిక ప్రపంచ నిర్మాణము కలిగిన తరువాత జ్ఞానావిర్భావమునకు ఆవశ్యకత ఏర్పడినది. ఈ లోకమును బ్రహ్మ ఎట్లు సృష్టిచేసెనో వేదముల రూపమున జ్ఞానలోకమును కూడ ఆయనయే సృష్టించెను. అందుచేతనే కొందరు వేదములు బ్రహ్మముఖ వినిర్గతములని చెప్పుట కలదు. భారతీయ జ్ఞానసంపదకు మూలమైన వేదములు పౌరుషేయములా, అపౌరుషేయములా అను విచికిత్స జరుగుచునేయున్నది. భగవన్నిర్మితములు వేదములు అను అభి ప్రాయము కలవారు, భగవచ్ఛక్తిని భగవత్స్వరూపస్వభావములను విశ్వసించు వారు మన దేశములోని ఇతర విజ్ఞాన సంపదతోపాటు వేదములు కూడా మానవ నిర్మితములే అని భావించుట కలదు. ఆధునిక పాశ్చాత్యప్రభావము చేత శాస్త్రదృష్టి ఏర్పరచుకొన్నట్టి జిజ్ఞాసువులు ఈ విషయమును విశ్వ సింతురు. ప్రాచీన వాఙ్మయాధారములు మనము ప్రమాణముగా గ్రహించినచో వేదములు అపౌరుషేయములనియే చెప్పవలసి వచ్చును. కాని శాస్త్ర దృష్టిని ప్రమాణముగా ఎన్నినచో, వేదములు ఇతర సాహిత్యమువోలె మానవకృతమే అగుచున్నవి.

ఈ విచికిత్సను శ్రీ అరవిందుడు ఒక విధముగా పరిష్కరింప బూను కొనెను. పూర్వము ఋషులు, మునులు భౌతిక జీవితమునకు, సౌఖ్యములకు తిలోదకములిచ్చి జనపదములకు, పట్టణములకు దూరముగా ఆశ్రమములు ఏర్పరుచుకొని తపస్సాధన, జ్ఞానసముపార్జన, ఆధ్యాత్మిక చింతన, విజ్ఞాన ప్రసారణ జీవిత ధ్యేయములుగా పెట్టుకొని జీవించుచుండిరి. ఈ జ్ఞానసాధ నలో వారు అనేక విశేషములను, విజ్ఞాన సంపదను సముపార్జించిరి. అదే సంద ర్భమున వేదములు ఆవిర్భవించినట్లుగా శ్రీ అరవిందులు చెప్పిరి. అదెట్లనగా తపస్సాధన చేయుచున్న పురుషులకు, మునులకు ఈశ్వర సంకల్పబలముచేత వేదరహస్యములు వేదార్థములు వారి మేధస్సులయందు భాసించెను. వారు

వానిని బహిర్గతము చేసి శిష్యులకు బోధించిరి. ఈ బోధించుట అనునది ఈశ్వర మహిమచేత, తపస్సాధనచేత సాధ్యమైనది. అందుచేతనే వానిని పఠించిన మునులు, ఋషులు వారి వేదజ్ఞానమంతయు ఈశ్వర మహిమవలననే సంభవించెనని భావించిరి. నిజమునకు అట్లు భావించుటలో అసంభావ్యమేమియు లేదు. తపస్సాధకులైన ఋషులందరును ఈశ్వర మహిమను గుర్తించినవారే. వారందరునూ తమ మనోనేత్రముచేత ఈశ్వరుని దర్శించినవారే. శ్రీ అరవిందులు ఈ విశేషములను ఇట్లు సమన్వయముచేసి చెప్పిరి. ఈశ్వరుడు లోకమునకు జ్ఞానమును ప్రసాదించుటకై వేదములను జ్ఞానోపజీవులుగా నుండిన మహర్షుల మనోఫలకములపై వ్యాపింపజేసెను. వారు లోకమున వారిని బహిర్గతములు చేసిరి. అట్లు భగవన్మహిమ చేత నిర్మితములైన వేదములు ఋషుల మూలమున లోకమున వెలువడి వ్యాపించి మానవునకు జ్ఞాన భిక్షను ప్రసాదించినవి.[1]

ఇట్లు లోకమున వెలువడిన వేదములలో త్రిమూర్తులను గురించి చెప్పబడి యున్నది. లోకమును సృష్టి చేసిన బ్రహ్మ లోకస్థితి కారకుడగు విష్ణువు లయకారుడైన శివుడు చాలా చోట్ల వేదములలో ప్రస్తావింపబడియున్నారు. ఈ త్రిమూర్తులు మన దేశమున సర్వమతములకు సర్వజ్ఞాన సంపదకు మూలభూతమైన దైవస్వరూపులుగా భావింపబడిరి.

వేదముల తర్వాత భారతీయ విజ్ఞానమునకు పురాణములు పట్టుగొమ్మలైనవి. అష్టాదశ సంఖ్యలోనున్న ఈ పురాణములు కథాత్మకములై బ్రహ్మ విష్ణు మాహేశ్వరుల మహిమను వారి కృత్యములను వర్ణించి చెప్పుచున్నవి. ఈ పురాణ సాహిత్యములో కూడా శివుడు లయకారుడుగా చిత్రింపబడి యున్నాడు. ఆయన నిర్వహించిన ఘనకార్యములను గురించి ఈ పురాణములందు చాల చోట్ల వర్ణింపబడి యున్నది. ఇట్లు పురాణ సాహిత్యములో శివుడు ప్రధాన పాత్రనే వహించి యున్నాడు. పురాణ సాహిత్యము తర్వాత భారతీయ సంఘములు శివకేశవులు దైవ స్వరూపులుగా ప్రధాన పాత్ర వహించిరి. శివుని అనుసరించి విశ్వసించువారు శైవులుగను, విష్ణుమూర్తిని దైవస్వరూపునిగా భావించువారు వైష్ణవులుగను గుర్తించుట జరిగినది.

---

1. నిగూఢ వేదరహస్యము -- శ్రీఅరవిందుడు.

శివుని ప్రస్తావన ప్రప్రథముగా ఋగ్వేదమునందు కాన్పించుచున్నది. ఇచట ఆ మూర్తి శివుడుగా కాక రుద్రస్వరూపుడుగా దర్శనమిచ్చుచున్నాడు. అచట శివుని ఈశానుడు, యువానుడు, ఉగ్రుడు అని కూడ పేర్కొనుట జరిగినది. ధనుర్బాణములను ధరించి కంఠహారములు వేసికొనినట్లుగా శివుడు వర్ణింపబడినాడు. ఇట్లు చూడగా రౌద్రమునకు అధినేతగా శివుడు ప్రతీకగా నిలిచియున్నాడు. ఐనను అతి ప్రాచీనముగా భావింపబడుచున్న ఋగ్వేదమున శివుని వర్ణన యుండుట విశేషము. తరువాత వెలువడిన సంహితలలో రుద్రుని గురించిన ప్రస్తావన ఉన్నది. అచట రుద్రుడు మరుతులకు నాయకుడుగా వర్ణింపబడినాడు. అతనికి అగ్నితో ఏకీభావమున్నది. భావ సర్వకాళ అను దేవతాస్వరూపుణిలు కూడా శివునికి సన్నిహితులుగా చెప్పబడియున్నారు.

యజుర్వేదములో రుద్రుడు చేసిన ఘనకార్యములు స్పష్టముగా చెప్పబడియున్నవి. అతడు దుష్టులైన అనేక అసురులను సంహరించెను. త్రిపురాసురులను నాశనము చేసి వారి పట్టణములను భస్మము చేసెను. శతరుద్రీయ యాగమును గురించి కూడ యజుర్వేదములో చెప్పబడియున్నది. దీనియందు రుద్రుని ప్రాముఖ్యము ప్రధానవిషయముగా గోచరించును. ఈ విశేషముల నాధారముగా తీసికుని ఉపనిషత్తులయందును, శైవపురాణములందును శివునికి సంబంధించిన అనేక మహిమాన్విత వృత్తాంతములు వర్ణింపబడినవి. తరువాతి కాలములో శతరుద్రీయ యాగము శైవమతమునందు గొప్ప ప్రాధాన్యమును వహించెను. అంతేకాదు దాక్షిణాత్యపురాణమైన పెరియపురాణములో కూడ శతరుద్రీయ యాగమును గురించి చెప్పబడియున్నది.

వేదములకు పూర్వమే శివుని గురించి భావన ఉన్నదని చెప్పుట కలదు. ఇట్లు చెప్పుటకు కారణమేమనగా ఆర్యులకు ముందుండిన నాగరికతా చిహ్నములైన హరప్పా మొహెంజదారో శిథిలములలో శివలింగము కనిపించుటయే. దీనినిబట్టి వేదావిర్భావమునకు పూర్వమే భారతీయులు లింగస్వరూపమున శివుని ఆరాధించెడివారని పండితులు చెప్పుదురు. వేదములలో శివుడు గిరీశుడుగను, అటవీ నివాసుడుగను, కైలాస వాసిగాను చెప్పబడుట వేదాత్ పూర్వమే శివునికి అస్తిత్వము కలదని చెప్పుటకు ఆధారమగుచున్నది. అనార్య

జాతులు శివుని గురించి ఎట్లు భావించిరో మనమిప్పుడు చెప్పలేముగాని ఇప్పుడు మనకు కనిపించు శైవమతము వేద పురాణగాథలపైననే ఆధారపడి విస్తరించిన దని చెప్పుటలో సందేహములేదు.

ఇక వేదము లందు, ఆగమము లందు వచ్చిన మాహేశ్వరుని విశేష ములను పరికింతము. శతరుద్రీయములో శివుడు "పశునాంపతిః" అని వర్ణింపబడియున్నాడు. తన రుద్ర భాష్యమునందు అభినవ శంకరుడు శైవము నకు పశుపతి కారణమని వక్కాణించియున్నాడు. అథర్వశిరస్సు ఉపనిషత్తు నందు భస్మమును గురించి, దాని ధారణమును గురించి చెప్పబడినది. పాశుపత వ్రతమును చేయువారు భస్మధారణమును చేయుదురని దీనిలో నున్నది. ఈ విధముగనే కైవల్యోపనిషత్తులో శివయోగము ముక్తిమార్గముగా సూచింపబడియున్నది. శైవము పరిశీలనా దృష్టితో చూచినప్పుడు సాంఖ్య సిద్ధాంతముతోను, యోగా భ్యాసముతోను, సన్నిహితముగా ముడిపడియున్నట్లు కాన్పించును. వైశేషిక న్యాయమును గురించి చెప్పినవారు మహేశ్వర కృప వలన యోగసాధన వలన సాధ్యమైనదని చెప్పియున్నారు. హరిభద్రుడను జైనముని కనాదుడు, గౌతముడు అను వారు శైవులని వక్కాణించెను. వైశేషిక న్యాయమునకు, శైవమునకు ఈ విశేషములు సాన్నిహిత్యమునే సూచించుచున్నవి కాని ఆశైవము ఏస్వరూప స్వభావములలో నుండెనో తెలియ రాదు. తరువాతి కాలములో అనేక ప్రాంతములందు అనేక విధములుగా శైవము స్వరూపమును దిద్దుకుని విస్తరించినట్లు తెలియవచ్చును.

శైవము సమాజములో విస్తరించినట్లుగనే దానికి తగిన విధమైన ప్రాతి పదిక ఏర్పడినట్లుగను మహాభారతము వక్కాణించుచున్నది. శ్రీకృష్ణుడు స్వయముగా శివుని ప్రధాన భక్తుడుగా చెప్పబడియున్నది.

శివయోగము శ్రీకృష్ణునకు ఉపదేశించినవాడు ఉపమన్యుడను మహాను భావుడు. ఈ గురూపదేశ ప్రభావము చేత శ్రీ కృష్ణునకు జ్ఞానోదయమయ్యెను. శైవ ఉపదేశమును పొందుటకు కొన్ని నియమములు కూడ చెప్పబడినవి. దండనము ధరించి ముండనము చేసికొని మాసాంతము వరకు ఫలహారము తోనే జీవించి మరి నాలుగు నెలలు పయోభక్షణము మాత్రము చేసి ఏక

పాదముపై నిలిచి ఊర్ధ్వ బాహుడై మహాదేవుని పార్వతీ దేవిని ప్రత్యక్షము చేసికొనగలుగును అని మహాభారతము చెప్పుచున్నది. బ్రహ్మ, విష్ణువు కూడా ఇట్టి సాధన చేతనే మాహేశ్వరుని ప్రత్యక్షము గావించు కొన్నట్లును దీనిలో నున్నది. ఈ విశేషములన్నియు మహాభారతమునకు పూర్వమే శైవ మాహాత్మ్యము వెల్లడించుచున్నది.

ఇంకను అనేక చోటులయందు మహాభారతమున మాహేశ్వరుని ప్రస్తావన ఉండుటయేగాక శివుని మహిమ భక్తావన తత్పరత వర్ణింపబడి యున్నది. ఆది పర్వమున వ్యాసుడు ద్రుపదునకు పంచేంద్రియోపాఖ్యానమును వివరించెను. ఈ కథలో శివుని విశేషములున్నవి. మౌద్గల్యుడు నాలాయని యైన ఇంద్రసేనుని విడచి బ్రహ్మలోకమున కరిగిన పిమ్మట ఆమెయు కాల వశమున శరీరము విడచి కాశీరాజునకు కూతురై పుట్టెను. కన్యాత్వమువలననే ఆమె పెద్దకాలముండి తన దౌర్భాగ్యమునకు వగచి పతిని గోరి పశుపతిని గూర్చి ఉగ్రతప మాచరించెను. అప్పుడు ఆమె యొద్దకు యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వినులు వచ్చి ఆమెను దేహాంతరమున తమ కుమారులకు పత్నిగా కోరిరి. ఆమె ఇంకను తపమాచరించుచుండగా ఈశ్వరుడు ప్రత్యక్షమై వరము వేడుకొమ్మనెను. ఈశ్వరుడు దేహాంతరమున ఆమెకు ఐదుగురు భర్తలను ప్రసాదించెను. అట్లు ఆమెయే ద్రౌపదియైనది. ఐదుగురు భర్తలే పాండవులైరి. ఈ విధముగా శివుడు భక్తులను కాపాడుట ఈ పంచేంద్రియోపాఖ్యానములో శివుని భక్త జనావన ప్రణవత్వము ఉల్లేఖింప బడినది.

ఆదిపర్వమునందలి అమృత మథన వృత్తాంతమున దేవదానవులు వార్ధిని ద్రచ్చుచుండగా విష ముద్భవిల్లెననియు, దానిని పట్టుకొని శివుడు మ్రింగెననియు చెప్పబడియున్నది. ఇది త్రిలోక రక్షణమునకై శివుడొనరించిన అనన్యసాధ్యమైన మహాకార్యము.

అరణ్యపర్వములో కిరాతార్జునుల కథయున్నది. అందు కిరాత వేషుడైన శివుడు అర్జునుని పరాక్రమమునకు మెచ్చి జటామకుటేందు రేఖయు శూలమును గరళకాల గరళమును గజాజినమును మూడవ కన్నును పన్నగహారమును నొప్ప ప్రత్యక్ష మయ్యెను. అర్జునుడు సాష్టాంగ దండప్రణామము

చేసి శివుని స్తోత్రము చేసెను. శివుడర్జునునకు పాశుపతాస్త్రిమొసంగి దానిచే అతడు సర్వలోకములు జయించునట్లు వరమిచ్చెను. ఈ ఘట్టమున శివుని వేషాలంకారములు అతని వీర ప్రధానము విశేషముగా చెప్పదగియున్నవి.

ఆరణ్య పర్వముననే కుమారస్వామి జన్మవృత్తాంతమున్నది. దీనిలో మార్కండేయులు ధర్మరాజునకు రుద్రుడు తన వీర్యమును వహ్నియందు సంగ్రహింపగా ఆతేజో విశేషమున పావకుడు కుమారు నుత్పాదించెననియు వేదవిదుడు అగ్నియే రుద్రుడని చెప్పుదురనియు కుమారుడు అగ్నిసంభవుడును, రుద్రసమానుడును అగుట కదియే కారణమనియే తెల్పియున్నాడు. కుమార స్వామి తారకాసురుని సంహరించు సందర్భమున శివుడాతనికి భాస్కరనిభమైన ధ్వజమును అనాయాసమున సమర విరోధి నాశనమునకు కావలసిన భూత మయమగు మహాసైన్యమును ఒసంగెనని చెప్పబడినది.

ద్రోణపర్వమున వ్యాసుడు అశ్వత్థామకు కృష్ణార్జునుల మాహిమను తెలిపి యున్నాడు. దానిలో విష్ణువు అఖిలలోకాభి రక్షణార్థమై జనించి మైనాక పర్వతమున శివునిగురించి తపమాచరించెననియు అప్పుడు శివుడు ప్రత్యక్షము కాగా విష్ణువు ఆతనిని స్తుతించెననియు చెప్పెను. ఆస్తోత్రమువలన శివుని మాహాత్మ్యము తెలియుచున్నది. స్థావరజంగములు శివుని మాహాత్మ్యము వలననే జనించును. ప్రభువునకు శక్తిని అతడే ఒసంగుమ. సురలు మొదలైన వారు పురుషార్థ చతుష్టయము నుండి సుఖించుటకు శివుని కరుణయే కారణము. వేదములు ధర్మశాస్త్రిములు శివుని వలన ప్రాదుర్భవించినట్టివే. శివుని తన్నుగా తెలిసికొని తద్రూపభజన మొనరించిన మహాత్ములు అమృతత్త్వ మొందుదురు. శివు డాతని స్తోత్రములకు మెచ్చి అతనికి సర్వంజయ శక్తిని అజయత్వమును ప్రసాదించెను. విష్ణువే శివుని గూర్చి తపమాచరించి అతని వలన వరములు పొందినాడనగా శివుని పరమేశ్వరత్వమెట్టిదో స్పష్టమగుచున్నది.

ఆరణ్య పర్వములో కుమారస్వామి జన్మవృత్తాంతము దానిలో రుద్రుడు పూర్వము దిజవీర్యమును వహ్నియందు సంగ్రహించగా ఆతేజో విశేషముననే అగ్నినుండి కుమారస్వామి జన్మించెననియు వేదవిదులు అగ్నియే

రుద్రుడని చెప్పుదురనియు అందుచే అగ్నిసంభవుడైన కుమారునకు పుత్ర సమానుడగుట కదియే కారణమని చెప్పుదురు. కర్ణపర్వములో కుమారస్వామి తారకాసురుని సంహరించుటకు శివుడు అతనికి ధ్వజమును మహాసైన్యమును ప్రసాదించెనని చెప్పబడినది. ద్రోణపర్వములో అగ్నిసన్నిభుడైన శివుడు శత్రువులను సంహరించినట్లును అతడు పురుషుడు ప్రకృతి పురుషాత్మకుడు అని చెప్పబడియున్నది. కర్ణ పర్వములో త్రిపురాసుర సంహారవృత్తాంత మున్నది. విశ్వకర్మ నిర్మితమైన రథము నధిరోహించి పితామహుడు సారథ్యము చేయగా శివుడు జగత్కంటకులైన రాక్షసులను సంహరించి త్రిపురములను కూల్చుటలో అతని జగద్ధితబుద్ధి భగవత్స్వరూపము సాక్షాత్కరించుచున్నవి.

దేవతలు త్రిపురాసుర సంహారము చేసి తమ్ము రక్షింపమని వేడినప్పుడు శివుడు 'నేనసురులకు అమరులకు సముడను. అఖిల భూత జాలమునకు సమబుద్ధితో శుభమును కలిగింతును. కాబట్టి నాకు శివుడని పేరు కల్గి, నట్లుగా చెప్పెదరు. అనుశాసనిక పర్వమున యుధిష్ఠరునకు శ్రీకృష్ణుడు శివుని నామములను వాని నిర్వచనములను తెల్పియున్నాడు. మహత్త్వము, ఈశ్వరత్వము అనువానిని కలిగియుండుట చేత మునులాతనిని మహేశ్వరుడని కీర్తించిరి. ఉగ్రత్వము ప్రతాపము అనుగుణముల చేత ఉన్నతుడు కాబట్టి అతనికి ఋతుడను పేరువచ్చెను. దేవతలందరిలో ఈతడు మహత్తరుడగుట చేత మహాదేవుడయ్యెను. అఖిల సత్కర్మ ఫలాకార శుభములు చేయువాడగుట చేత అతనికి శివనామము సార్ధకమయ్యెను. సుస్థిరతేజముననుండుట చేత స్థానుడనియు, జంగమ స్థావరాత్మక సకల భూతరూప బాహుళ్యము చేత బహురూపుడనియు, ధూమ్రవర్ణ జటలను ధరించుట చేత ధూర్జటి యనియు మిత్రులను దేవతలకు ఉద్భవ స్థానమగుట చేత విశ్వరూపుడని బహునేత్రములు శరీరమునందు ప్రజ్వలించుట చేత సర్వతఃచ్చక్షుడనియు భూతములకు పశువులకు తాను పతియగుట చేత పశుపతియనియు వృషభుని వాహనముగా గలవాడగుట చేత వృషభవాహను డనియు అతనికి అన్వర్థములైన నామములేర్పడినవి. రుద్రుడు దక్షాధ్వర ధ్వంసము చేసినప్పుడు (కావించు సమయమున) యజ్ఞము భయమున పరతెంచి గంధమాధనమున తపమాచ

రించు నారాయణుని వక్షస్థలము నాశ్రయించెను. అప్పుడు శివుడు ఆ యజ్ఞ మును వెంబడించి నారాయణునితో ఎదురించగా అతడు ఒక దర్భను పరశు రూపముగా అభిమంత్రించి అతనిపై ప్రయోగించెను. అతడు దానిని ఖండిత ధార అగునట్లుగా కావించుటచేత అతనికి ఖండ పరశువు అను పేరు ఏర్పడెను.

ఇంక శివుని లింగస్వరూపమున పూజించుట చాలకాలముగా సంప్ర దాయముగా నున్నది. ఈ విషయము మహాభారతములో కూడ కాన్పించు చున్నది. ద్రోణపర్వములో కూడ ఈ విశేషము కాన్పించు చున్నది. మహా భారతములో అశ్వత్థామను గురించి వచ్చిన కథాసందర్భములో లింగార్చన ప్రశంస ఉన్నది.

అశ్వత్థామ వ్యాసుని ఒకప్రశ్న అడిగెను. అదేమనగా తాను ప్రయో గించిన దుస్సహమైన ఆగ్నేయాస్త్రము మనుష్యులకు, కృష్ణార్జునులను దహింపక ఎందుకునిలచెనో అనునదే ఆ ప్రశ్న. అప్పుడు వ్యాసుడు శివుని ఆరాధించుటలో లింగార్చనకు రూపారాధనకు గల తారతమ్యములను వివ రించెను. అశ్వత్థామ తొలి జన్మమున శుద్ధమగు మృత్తికతో ప్రతిమగావించి దానియందు పరము నావహించి పూజావిశేషములెల్ల ఒనరించెను. నర నారాయణులు శివుని లింగాధిష్ఠానారూఢి గావించి అర్చించిరి. ఏవిధముగా చేసినను పరమేశ్వరా రాధనము సర్వార్థ సాధన మగుటలో సందేహము లేదు గాని అర్చన యందు ఆరాధించుట కంటె లింగమునందు పూజించుట అనేక గుణములెక్కువ. అందుచేతనే అర్చారాధన చేసిన అశ్వత్థామ లింగార్చన పరులగు నరనారాయణులను (కృష్ణార్జునులను) జయింప జాలదయ్యెను.

సౌప్తిక పర్వములో శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెప్పినట్లుగా ఒక వృత్తాంతము గలదు. అది ఇట్లుండును. బ్రహ్మ భూతసృష్టి చేయదలచి పర మేశ్వరుని దర్శించి అతనికి తన తలంపెరింగించెను. శివుడు తపోనిష్ఠలో నుండెను. పెక్కుసంవత్సరములు బ్రహ్మశివునిరాకకై ప్రతీక్షించెను. కాని అతడు తపోనిష్ఠను వీడి రాలేదు. అప్పుడు బ్రహ్మ తన తపః ప్రభావముచేత దక్షుని సృజించి ప్రజా సృష్టి కావింప అతని నియోగించెను. దక్షుడు దేవాసురా

మనుష్య తిర్యగాత్మకములైన భూతములను సృజింపగా అవి ఆకలిగొని దక్షుని పైననే విజృంభించెను. దక్షుడు బ్రహ్మయొద్దకు వెడలి భూతములు తనను భక్షింపకుండ వానికి తగిన ఆహారము కల్పింపుమని ప్రార్థించెను. అపుడు బ్రహ్మ ఓషధులను వృక్షలతా బిల్వాదులను కల్పించి భూతములకు వాని నాహారముగా సమర్పించుటయే కాక బలిష్ఠభూతములకు దుర్బల భూతములు ఆహారమగునుగాక యని ఆదేశించెను. భూతములు సంతోషించి ఆ ప్రకారంబుగా వృద్ధినొంది సంతానరూపమున సమృద్ధములగు చుండెను. అప్పుడు చాలకాలము జరిగిన తర్వాత శివుడు నీటిలో తపస్సు నుండి వెడలి వచ్చి భూతకోటులను ఆలోకించి కోపించి తన లింగమును పెరకివైచి నేలపై వేసెను. బ్రహ్మ అతనిని ప్రసన్నుని కావించి లింగమునట్లు చేయుటకు కారణమేమని అడిగెను. భూతముల సృష్టి ఒరులచేత జరుగుట వలన తనకింక లింగమేలనని అట్లు కావించితినని శివుడు పలికి తప మొన రించుటకు మాల్యవంతమున కరిగెను. ఆ సమయమున లింగము భాసురమై ప్రకాశింపగా బ్రహ్మ ఇంద్రుడు మొదలైన దేవతలతో దానిని పూజించెను. ఇట్లు లింగారాధనము మహాభారతములో ప్రస్తావింపబడినది.

శివుడు పశుపతిగా కూడా ఆంధ్ర మహాభారతమునందు ప్రశంసింప బడినాడు. కర్ణ పర్వములో దేవతలు శివుని త్రిపురాసుర సంహార మొన రింపుమని ప్రార్థించినపుడు శివుడందుల కంగీకరించి వారి తేజోబలము లందు సగపాలు తనకీయవలెననియు లోకమున నెల్ల పశుత్వమును తనకు పశు పతిత్వము కలిగినగాని పశుసంహారము పాపకారణము కాకుండ దనియు దివ్యరథమును తగిన సారథిని అశ్వములను ధనుర్బాణములను కల్పింప వలెననియు పలికెను. అప్పుడు దేవతలు పశుత్వమునకు శంకించి విషణ్ణులై యుండిరి. శివుడంత పశుభావమోక్షణ విధికలదని ఓదార్చి వారికి పాశుపత వ్రతానుష్ఠానము నెఱింగించెను. దానిని పన్నెండు సంవత్సరములు నడప వలెనని అది నిష్ఠానురూపముగా సంవత్సరమున వాని అర్ధభాగమున ఋతువులో మాసములో పన్నెండు దినములు మాత్రము ఫలించును. ఇట్లు మహాభారతములో పేర్కొనబడిన పాశుపతవ్రతము శైవులకు అవలంబనీయ మైనటువంటిది.

సౌప్తిక పర్వములో అశ్వత్థామ కృతవర్మ మొదలైన వారలు నిద్రించు చున్న దృష్టద్యుమ్నాదులను సంహరింప నిశ్చయించి నిద్రా వివశమైన పాండవ శిబిరము దగ్గరకు వెడలిరి. అశ్వత్థామ ఎదుట ఒక భయంకర భూతము నిలిచి యుండెను. అది శార్దూల చర్మమును, సర్ప రూపములైన హారములను భాసుర కాంతితో కూడిన బహుసహస్రలోచన ములను కలిగి యుండెను. దాని ముఖము నుండి భయంకరమైన జ్వాలలు వెడలు చుండెను. అశ్వత్థామ బెదరక వానిపై అనేకాయుధములు ప్రయోగింపగా ఆభూతము వాని నన్నింటిని మ్రింగివైచెను. అశ్వత్థామ విషణ్ణుడై చూచుచుండగా ఆకాశమున అతనికి చాలమంది విష్ణుమూర్తులు గోచరించిరి. అప్పుడతడు శివుని భక్తితో కొలచి ఆ ఆపదను నివారించుకొన దలచి నేలపై కూర్చుండి ఆత్మోపహార మర్పించుటకు నిశ్చయించుకొనెను. పరమేశ్వరు నుద్దేశించి 'దేవా నేను ఆత్మోపహార మిచ్చెదను, శత్రువులను సంహరించు శక్తి నాకొసంగుము' అని అగ్నిలో ప్రవేశించెను.

అపుడు శివు డాతనికి ప్రత్యక్షమయ్యెను. 'శ్రీకృష్ణుడు నాకు సపర్యలు చేయును. నేనాతనికి అనురక్తుడనై యుందును. శ్రీకృష్ణుని చేత రక్షితమైన పాండవులకు నీవు హాని చేయుట సాధ్యము గాదు. కాని పాంచాలురకు కాలము సమీపించెను. నేడు వారు నీచేత పడుదురు. నా అనుగ్రహము పొందితివి' అని పలికి ఒక మహనీయ ఖడ్గ మాతని చేతికిచ్చి తేజోరూపమున అతని తనువు నావేశించెను. ఈవృత్తాంతములో శివభక్తులు శివునికి ఆత్మోపహార మొనరించు పద్ధతి వర్ణింపబడినది.

శివుడు యజ్ఞము నందలి హావిర్భాగములను గ్రహించుట కూడ మహాభారతము ప్రస్తావించు చున్నది. దేవత లొకప్పుడు మహాధ్వరము చేయదలంచి ద్రవ్యసంపద సేకరించిరి. కాని రుద్రుని మహానుభావము తెలియని వారగుట చేత అతనికి హావిర్భాగము కల్పింప లేదు. శివుడు దీర్ఘమైన ఒక విల్లు సృజించి దానిని ధరించి దేవతలు యజ్ఞము చేయుదగ్గరకు వచ్చెను. అతని రౌద్రరూపమును గాంచి లోకములన్నియు వ్యాకుల పడెను. శివుడు యజ్ఞముపై బాణమును ప్రయోగించగా అది మృగాకృతిలో అగ్నితో కూడ పారిపోయెను. శివుడు యజ్ఞములోని

అంగములను వధించెను. బ్రాహ్మణులు వెడలి నలుదిక్కులకు పరిగెత్తిరి. అప్పుడు శివుడు వారినెక్కడకు పోకుండ చేసెను. బ్రాహ్మణుడు శపించుట చేత అతని ధనస్సు చివరి భాగము ముక్కలయ్యెను. అప్పుడు దేవతలు శివుని శరణు వేడిరి. శివుడు ప్రసన్నుడై తన కోపమును జలాశయమున విసరెను. శివుడు యజ్ఞముల అంగములను తిరిగి అనుగ్రహించెను. దేవతలు క్రతుభాగమును పరమేశ్వరుని కర్పించిరి. అతడు ప్రీతుడయ్యెను. జగము సంతోషించెను. ఈవిధముగా శివునకు హావిర్భాగము కలదను విశేషమును మహాభారతము చెప్పుచున్నది.

శివుడు ఖండపరశుడయిన సందర్భమున రుద్రనారాయణమూర్తి ద్వయము రణముచేయగా లోకము లన్నియు కలత చెందెను. అప్పుడు బ్రహ్మాదిదేవతలు, మునులు అతని కొలువ నచ్చటికి వచ్చిరి. శివుడు కోపము విడిచి నారాయణుని చూపించెను. అప్పుడు నారాయణుడు శివునితో నిన్నెవ్వ డెరిగెనో అతడు నన్నెరిగినవాడే. అట్లే నిన్ను సేవించుట నన్ను సేవించుటయే. మనకెట్టి భేదమునులేదు. నేటినుండి నాకు శ్రీవత్సము శూలాంకితమునై వెలయుగాక! నీకు శ్రీకంఠుడను పేరు కలుగును. మహాభారతములోని ఈ విశేషము లన్నియు హరిహరుడు అను భేదములేనివారు అని హరిహరాభేదతత్త్వమును తెలియ జేయుచున్నది.

శివుడు సర్వజ్ఞుడు అన్న విషయము కూడ మహాభారతమున ఉల్లేఖింప బడినది. ఉమామాహేశ్వర సంవాదములో పార్వతికి తన శ్మశాన వాసితకు కారణములను వర్ణాశ్రమాచార ధర్మములను తపః స్వరూపమును వర్ణ కర్మ పరిపాకముల తెరంగును సాంఖ్య ప్రకారమును మానవ వాచక కాయికములను త్రివిధములైన పాతకములను ఆత్మ సాహిత్య ప్రాప్తిసాధనములను వివిధ ధర్మములను తెలిపియుండెను. ఇది శివుడు సర్వజ్ఞుడనుటకు మహాభారతములోని సాదృశ్యము.

శైవము - చారిత్రకాధారములు :

వేదములను, పురాణేతిహాసములను పరిశీలించినప్పుడు శైవము ఏ విధముగా దర్శనమిచ్చుచున్నదో పైన వివరించితిని. ఇప్పుడు చారిత్రకముగా

శైవము మన దేశమున ఎప్పటి నుండి ప్రవర్తిల్లెనో పరిశీలన చేయవలసి యున్నది. చారిత్రకముగా మొట్టమొదట శివారాధనను గురించి చెప్పినవాడు మేఘస్థనీసు (Megsthanese). అనగా క్రీ. పూర్వము 6వ శతాబ్దము నాటికి మన దేశమున శివారాధన ఉండెనని తెలియవచ్చును. క్రీ. పూర్వము 2వ శతాబ్దిలో నివసించిన పతంజలి శివయోగులను గురించి చెప్పియున్నాడు శివయోగులు, శివ భాగవతులు, వారి సంచారము మన దేశములో నుండెనని పతంజలి వ్రాతల వలన తెలియవచ్చుచున్నది. శివుడు, స్కందుడు, విశాఖుడు అనువారల విగ్రహములను లోహములతో సిద్ధముచేసి పూజించెడి వారని కూడా పతంజలి చెప్పెను[1]. క్రీ. శకారంభములో నివసించిన కుషాణుల నాణెములపై త్రిమూర్తుల చిహ్నములతో పాటు మాహేశ్వరుని చిహ్నము కూడ చెక్కబడి యున్నది. ఇదే కాలములో మాహేశ్వరుని అవతారముగా భావింపబడిన ప్రచారకుడు లకులీశ అనువాడు పశ్చిమ భారతదేశమున ప్రఖ్యాతి వహించెను. ఇతడు పాశుపత శాఖకు ప్రారంభకుడని చెప్పుదురు. లకులీశుడు లింగపూజను ప్రోత్సహించినట్లు తెలియవచ్చును. అతని తరువాత వచ్చిన శైవ సాహిత్యములోనూ, లింగారాధన గురించి అనేక విషయములు తెలియవచ్చుచున్నవి

గుప్త చక్రవర్తులు భారతదేశమును పరిపాలించిన కాలములో శైవము చక్కగా వృద్ధి చెందినట్లు తెలియవచ్చుచున్నది. రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుడు ప్రకటించిన మధురస్తంభ శాసనమున ఉదితాచార్యుడను శైవమతాచార్యులు తన గురువులను తన గురువు, గురువును విగ్రహరూపముగా స్థాపించినట్లు దీనిలో చెప్పబడియున్నది. ఈ గురువులు ఉపవిదు కపిలుడు అనువారు. వీరి విగ్రహములను గురువాయతనములో ఇతడు స్థాపించెను. లకులీశునకు శిష్యుడైన కుశికునకు పదియవ శిష్యుడుగా ఉదితాచార్యుని చెప్పుట జరిగినది. శైవగురు పరంపరలకులీశుని కాలమునుండి కొనసాగుచున్నదనియు, వారి విగ్రహములు స్థాపించుట అనాటి సాంప్రదాయముగా నుండెననియు ఈ శాసనము ప్రత్యక్షముగా మనకు తెలియ జెప్పు

1. Cultural Heritage of India (Vol. 4th) Page 70.

చున్నది. ఉదితుడు సమస్త మాహేశ్వరులను ఆచార్యులను ఆరాధించినట్లు ఈ శాసనము లేఖించుచున్నది.

బాణుడు రచించిన హర్ష చరిత్రలో భైరవాచార్యుని విశేష వర్ణన గలదు. శివయోగులను గురించి చారిత్రకముగా దీనినొక ప్రత్యేక విషయముగా చెప్పవచ్చు. దీనివలన ఆ నాటి సాంఘిక వ్యవస్థపై శివయోగుల ప్రాభవము తగినంతగా నుండెననియే చెప్పవలసియున్నది.

దక్షిణ భారత దేశములో శైవ మతమును గురించి చాలా కాలము పూర్వమే చారిత్రకముగాను, సాహిత్యకముగాను ఆధారములు లభించుచున్నవి. ఈ దేశమును పాలించిన పల్లవుల కాలములోనే బౌద్ధ జైనములతో సంఘర్షణ పొందినట్లు తెలియుచున్నది. సంగము సాహిత్య కాలములో శిలప్పాదిగారమను ఒక గొప్ప కావ్యము తమిళ భాషలో వెలుపడియుండెను. దీనిలో శైవ మతమున అతి ప్రధానమైనట్టి పంచాక్షరి మంత్రమును గూర్చి చెప్పబడియున్నది. ఈ విధముగనే మణిమేఖల అను గ్రంథములో హత శైవ వాదినులు అనువారి ప్రస్థావన గలదు. ఇచట శివుడు అష్టమూర్తి అను సిద్ధాంతము ప్రపంచింపబడి యున్నది. మాహేశ్వరుడే సృష్టిలయకారకుడని వర్ణింపబడినాడు. అరువది ముగ్గురు శివభక్తులైన నాయనార్లలో కొందరైనను పల్లవులకు చాలా కాలము పూర్వమే నివసించియుందురని అంతకు పూర్వమే శైవ మతము దక్షిణ భారత దేశమున ప్రవర్తిల్లెనని చారిత్రకుల అభిప్రాయము. మహేంద్రవర్మ రచించిన మత్తవిలాస కావ్యములో శైవమహత్త్వము ఉద్ఘాటింపబడినది. అంతేకాక శివాచార్యులు చేసిన అత్యాచారములను గురించి కూడ ఈ గ్రంథము విమర్శించు చున్నది. ఇది కాక శాసనములందు క్షేత్రములందు శైవమత సంబంధమైన అనేక విశేషములు చారిత్రకాధారములు లభించు చున్నవి. కాంచి తిరువయ్యూర్, మేలపాడి కొడంబలూరు అనునవి కాపాలిక, కాలముఖ, శైవులకు ప్రధాన కేంద్రములుగా నుండెడివి. దక్షిణ భారత దేశములో వెలువడిన శాసనములను చక్కగా పరిశీలించి శైవ గురువుల పరంపర నొకదానిని స్పష్టముగా సిద్ధము చేయవచ్చును. ఈ శివ గురువుల నామముల చివర రాశి, శివ, పండిత అను పదములు కాన్పించును.

దక్షిణభారతదేశమును పరిపాలించిన చోళరాజ వంశములు శైవులై శైవమతములను ఆదరించిరి. ఒక్కొక్కసారి ఈ వంశపురాజులు వైష్ణవ మతానుయాయులను వైష్ణవ మత ప్రచారమును అణచి వేయుటకు ప్రయత్నించినట్లు కూడ కాన్పించును. వీరికాలములో పల్లవుల రాజ్యములోవలె దేవాలయ నిర్మాణములుకూడ చేయుట జరిగినది. అంతేకాదు, చోళరాజులు అనేక సందర్భములలో శైవ మఠములనుకూడ స్థాపించిరి. ఈమఠములలో నుండిన శైవాచార్యులు శైవమత ప్రచారమునకు మతాభివృద్ధికి తోడ్పడిరి. ఈ కాలములోనే తమిళ దేశములో శైవ మతము సుస్థిరత్వము సంపాదించెను. దాని తరువాత క్రమముగా శైవ సిద్ధాంత పరమైన గ్రంథజాలము ఈ దేశములో సమృద్ధిగానే వెలువడినది. చోళరాజుల కాలములో వెలువడిన శైవ సాహిత్యమును గురించి ఈ సందర్భములో స్వల్పముగా చెప్పుట ఉచిత మనుకుందును.

చోళులు శైవ మతానుయాయులను ఉత్తర భారతదేశము నుండి తీసికొని వచ్చిరని కొన్ని గాథలు చెప్పుచున్నవి. ఈ విషయము ఎంతవరకు యథార్థమోగాని చోళ యుగములో శైవులు తమిళ దేశమునందే సమృద్ధిగా నుండినటుల కాన్పించును. అదిగాక ఈ చోళరాజులకు భారత దేశము నందలి ప్రధాన శైవ కేంద్రములతో సంబంధ ముండినట్లుగా సాక్ష్యాధారము లున్నవి. ఇదికాక తమ దేశములో శైవమత ప్రచారమునకు యథాశక్తి చోళులు తోడ్పడియే ఉన్నారు. మొదటి రాజేంద్ర చోళుడు ప్రకటించిన ఒక శాసనమును బట్టి అతడు ఆచార్య భోగముగా దానమును చేసినట్లు తెలియు చున్నది. ఈ దానమును ఉదయార్ సర్వశివ పండితునకు చేయబడినది. ఈ శివ పండితుడు తంజావూరు ఆలయమున అర్చకుడు. ఈ ఆదాయము ఈ అర్చకునకు అతని శిష్యులకు చెందునని చెప్పబడినది * ఈ విధముగానే తెలుగు దేశమునందు వెలువడిన ఒక శాసనము వీర భద్రుల కిచ్చిన దానమును గురించి చెప్పుచున్నది. ఈ వీరభద్రులు చోళ దేశము నుండి వచ్చినట్లుగను, జటలు ధరించినట్లుగను, చాతుర్వర్ణములలో ఒక వర్ణమునకు చెందినవారుగను వర్ణింపబడినారు. వీరు శైవమత రక్షణకు

---

* South Indian Inscriptions - Vol 2 (No 20)

ఆ మతానుయాయుల రక్షణకు తమ శిరములను ఖండించుకొనుట, తమ పొట్టలను చీల్చుకొనుట వంటి అద్భుతమైన పనులను ప్రదర్శించెడివారట. *

శైవమతము చాలా కాలము పూర్వమే ప్రాచ్యదీవులైన జావా, సుమిత్రా, ఇండోనీషియా మొదలైన ప్రాంతములలో వ్యాపించినట్లు తెలియ వచ్చుచున్నది. క్రీ॥శ. 5వ శతాబ్ది ప్రారంభములోనే ఎవద్వీపము నందు (జావా) పాశుపత శైవము వ్యాపించి యుండెనని ఫాహియాన్ వ్రాసి యున్నాడు. జావాలో ఈ మతము తరువాతి కాలములో ప్రాముఖ్యము వహించెననుటకు ఆదేశములోని ప్రబనాం పానాతరన్ ప్రాంతములలో శివాలయములే సాక్ష్య మిచ్చు చున్నవి. క్రి. శ. 400 సం॥ ప్రాంతములో ఇండోచైనా ద్వీపకల్పములోని చంపా అను దేశము ఒక హైందవ సామ్రాజ్యముగా ఉండెననియు, దానిని శైవమతాను యాయులైన చక్రవర్తులు పాలించు చుండిరనియు తెలియవచ్చు చున్నది. పోనగర్ అను పట్టణములో భగవతి ఆలయమును ఒక ముఖలింగ ఆలయమును ఉండెను. ఈ ముఖలింగ ఆలయము క్రీ॥శ. 8వ శతాబ్దములో నిర్మితమైనట్లు చెప్పుదురు. ఈ విధముగా భారత దేశముననే కాక దాని పరిసర దేశములలో కూడ శైవమత వ్యాప్తి జరిగినట్లు తెలియవచ్చుచున్నది.

కాంభోజ దేశమునకు పూర్వ రూపమైన (Funan) ఫ్యునాన్ దేశములో క్రీ॥శ 5వ శతాబ్దమున కొన్ని దేవతా విగ్రహములను పూజించెడివారు. ఆ విగ్రహమునకు రెండు ముఖములు నాలుగు బాహువులును అట్లే నాలుగు ముఖములు ఎనిమిది బాహువులును ఉన్నట్లుగా వర్ణింప బడినది. ఆ విగ్రహము చేతులలో ఒక శిశువు ఒక పక్షి ఒక జంతువు సూర్యచంద్రులు ఉన్నట్లు వర్ణింప బడినవి. ఈవర్ణన సోమస్కంద సాంప్రదాయము నందలి స్కందుని గురించి కావచ్చును. పక్షి దుర్గాదేవి శుకమనియు, కపాలము శివ సంబంధ మనియు అట్లే చంద్రుడు శివ సంబంధుడే యనియు భావింప బడినది. కాంభోజ దేశములో శైవమతమే అగ్రేసరమైనది. తరువాతి కాలములో బౌద్ధమతము ప్రవేశించి శైవమతమునకు సన్నిహితముగా వచ్చినది. హైందవ మతము వ్యాపించిన ఈ ప్రాచ్యదేశములలో లింగారాధనకు ప్రాధాన్యము నిచ్చుట కూడ యిచట గమనింపవలసిన విషయము.

---

Cultural Heritage of India - 4th vol - Page 72.

తమిళదేశములోని శైవసిద్ధాంతమును ప్రతిపాదించెడు సాహిత్యమును గూర్చి పరిశీలింప వలసి యున్నది. ఈ సాహిత్యము చాల విస్తృతమైనది. దీనిలో నిబద్ధమైన శైవతత్వము సంక్లిష్టమైనది. అయినను ఆనాటి తమిళ సాహిత్యమును సూక్ష్మముగా నైనను సమీక్షించ వలెను. ఈ సాహిత్యములో ప్రధాన పురుషుడు 'తిరుమూళర్' అనువాడు. ఇతడు తమిళ దేశములో శైవ సాహిత్యమునకు మూలపురుషుడుగా భావింపబడు చున్నాడు. ఇతని జీవితమును గురించి మనకు స్పష్టముగా తెలియ రాదుగాని పెరియ పురాణములో ఇతనికి సంబంధించిన అతిమానుష విశేషములు చెప్పబడి యున్నవి. పెరియ పురాణమును బట్టి ఇతడు కైలాసము నుండి దక్షిణ భారత దేశమునకు ఏతెంచెననియు ఒక గోపబాలకుని మృతశరీరములో ప్రవేశించి మనుష్య రూపమును పొందెననియు చెప్పబడి యున్నది. ఇతడు మూడు వేల సంవత్సర ములు శ్రమించి తిరుమందిరమ్ అను గ్రంథమును రచించెనట. ఈ గ్రంథము అసామాన్యమైనది. ఈ గ్రంథ రచనా కాలమును గురించి కూడా స్పష్టముగా చెప్పుట కష్టమై యున్నది.

చారిత్రికులు ఈ గ్రంథరచన క్రీ. శ. 1వ శతాబ్దము నుండి 9వ శతాబ్దము మధ్య కాలములో జరిగియుండునని భావింతురు. సుందరమూర్తి యగు మరియొక గ్రంథకర్త తిరుమూళర్‌ను పేర్కొని యున్నాడు. ఈ కారణముగా ఇతడు క్రీ. శ. 9వ శతాబ్దమునకు పూర్వమే జీవించి యుండెనని మాత్రము స్పష్టముగుచున్నది. ఈ గ్రంథములోని పీఠికాగతమైన విశేషము లను బట్టి తిరుమూళర్ తమిళ భాషలో తమిళ దేశములో శైవమతమును ప్రప్రథమముగా ప్రతిపాదించినట్లు తెలియవచ్చుచున్నది. కాని ఈ గ్రంథ ములో చెప్పబడిన శైవ వర్గములు చూడగా ఈ గ్రంథము చాలా ప్రాచీనము కాదేమో అనిపించును. ఒక శివజ్ఞానికి ఆహారము పెట్టుట వేదవేత్తలయిన కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకంటే అధికమైనదనియు, వేయి ఆల యములు నిర్మించుట కంటే ఘనమైనదనియు ఈ గ్రంథము చెప్పుచున్నది. తిరుమూళర్ వేదముపై దాని ప్రామాణ్యముపై సద్భావము కలిగిన వాడుగానే కాన్పించుచున్నాడు. అతడు శైవాగమము వేదమువలె దైవదత్తమని ఈశ్వర నిర్మితమని ఈతడు భావించెను. ఈ రెండు భిన్నమైనప్పటికి ఏకత్వము కలిగినట్టివేయని ఇతడు భావించెను.

తమిళదేశములోని శైవసిద్ధాంత సాహిత్యము ప్రస్తుత స్థితిని బట్టి 'నంబి అండార్‌నంబి' అను శైవమతాచార్యుని నుండి వచ్చినట్లుగా చెప్ప వలసి యున్నది. ఈ శైవాచార్యుడు క్రీ॥శ 10వ శతాబ్దము చివరిభాగమునను, 11వ శతాబ్దము ప్రారంభమునను జీవించి యుండునని చారిత్రికులు భావింతురు. క్రీ॥శ 14వ శతాబ్ది ప్రారంభమున నుండిన ఉమాపతి శైవా చార్యులు తన తిరుమురై కందపురాణమ్ అను గ్రంథములో 'నంబి అండార్ నంబి' గురించి ప్రస్తావించి యున్నాడు. ఇతడు శైవసూత్రములను పది గ్రంథ ములుగా రచించినట్లుగా అతడు చెప్పియున్నాడు. ఈ పది గ్రంథములలో మొదటి మూడు గ్రంథములు తిరుజ్ఞాన సంబంధర్ పాటలకును, నాలుగు గ్రంథములు తిరునా ఉక్కరుసు పాటలకును, ఏడవ గ్రంథము సుందర మూర్తి పాటలకును, అట్లే ఎనిమిదవ గ్రంథము మాణిక్య వాచగర్ వ్రాసిన తిరువాచకమునకును మూలమైనట్లు చెప్పినాడు. పెరియ పురాణము ఇతని పన్నెండవ గ్రంథముగా పేర్కొందురు.

మేయకందర్ అను మహాకవి శివజ్ఞాన బోధము అను గ్రంథమును క్రీ॥శ 13వ శతాబ్దపు మధ్యభాగమున రచించెను. శైవ సూత్రములను, సిద్ధాంతములను క్రమ పద్ధతిలో రచించిన ప్రథమ గ్రంథ మిదియే. సంస్కృతములోని దాదాపు పన్నెండు సూత్రములకు క్లుప్తమైన వ్యాఖ్యా రూపము శివజ్ఞాన బోధమను గ్రంథము. మేయకందర్ దీనిలో కొన్ని వార్తి కములను తాను స్వయముగా చేర్చి యున్నాడు. ఇవి సూత్రముల అర్థ వివరణమునకు సహాయ పడుచున్నవి. శివజ్ఞాన బోధము అను దానిని ఇట్లు వివరించవచ్చును. శివం ఏక స్వరూపమైనది. జ్ఞానము శివ ప్రకృతికి సంబంధించిన పరిజ్ఞానమే. ఈజ్ఞానమును తెలిసికొనుటయే బోధము. ఈ సూత్రములలో పతి-పాశ, పశు శబ్దములను గురించి వాని పరస్పర సంబంధమును గురించి చర్చింపబడియున్నది. మేయకందరును గురించి తరువాతి వాడగు ఒక కవి యిట్లు చెప్పెను. వేద మనునది గోవు. శైవాగమము దాని క్షీరము వంటిది. నలుగురు తాత్త్వికులు దీనిలోని ఘృతమును గ్రహించిరి. మేయకందర్ గ్రంథమును చదువుట ఆ ఘృతమును రుచి చూచుటయే.

శివజ్ఞాన బోధము తరువాత అరునంది రచించిన శివజ్ఞాన సెట్టియార్ అను గ్రంథమును గురించి చెప్పవలసి యున్నది. అరునంది మేయకందర్ తండ్రి గారికి, తరువాత మేయకందర్‌కి శిష్యుడైనట్లు తెలియవచ్చుచున్నది. ఈ గ్రంథము పద్య రచనలో నున్నది. ఇంతేకాదు శైవ సిద్ధాంతమును చర్చా పూర్వకముగా ప్రతిపాదించుటయేగాక ఈ గ్రంథము బౌద్ధ జైనముల వంటి మత సిద్ధాంతములను విమర్శించుచున్నది.

శివజ్ఞాన సెట్టియార్ అనే గ్రంథమునకు అనేక వ్యాఖ్యానములు వెలువడుటయేగాక తమిళ దేశములోని శైవులకు యిప్పటికిని ఇది ప్రామాణిక గ్రంథముగా నున్నది. అరునంది వ్రాసిన గ్రంథమే ఈ ఇవురు, పావిరుప్పాడు. దీనిలో గురుశిష్య సంవాద రూపముగా శైవ సిద్ధాంతము ప్రతిపాదింప బడినది. ఈ గ్రంథమును అతడు తన గురువు సంస్మరణార్థము రచించెనట.

తమిళ శైవసాహిత్యములో తరువాత చెప్పదగినది 'ఉనమైవిలక్కమ్' అనే గ్రంథము. దీనిని మానవాస గంగదండ అనువాడు వ్రాసియున్నాడు. ఇతడు తిరువడిగై అను గ్రామమునకు చెందినవాడు. ఇతడు తన గ్రంథమును ఆగమములకు అనుగుణముగా రచించితినని చెప్పియున్నాడు. ఇక 14వ శతాబ్దములో జీవించిన ఉమాపతి శివాచార్యుడు శైవ సిద్ధాంతముపై ఎనిమిది గ్రంథములను రచించెను. దీనిలో 'శివప్పిరాకాశమ్' అనునది నూరు పద్యములు గలిగిన చక్కని వ్యాఖ్యా గ్రంథము. అట్లే 'సంకర్పనిరాకరణమ్' కూడ ముఖ్యమైన గ్రంథమే. ఇతడే వ్రాసిన 'ఉన్మైనెరి ఉళక్కమ్' అను గ్రంథము మోక్ష మార్గమును గురించి చెప్పునట్టిది.

తరువాతి కాలములో తమిళ దేశమునందు శైవమతము సిద్ధుల పాటలలో ప్రతిపాదితమైనది. ఈ పాటలు ప్రధానముగా భక్తి భరితమైనట్టివి. వీనిలో అక్కడక్కడ బ్రాహ్మణనింద కూడ కన్పించును. ఈ పాటలు ఆస్తికత్వమును ప్రతిపాదించును. ఇవి దేవరాం, తిరువాచకం అను గ్రంథములలోని పాటలతో సామ్యమును కలిగినట్టివి. ఈ పదములు ప్రధానముగా అస్తితత్వమును బోధించును. ఒక్కొక్కసారి యివి బ్రాహ్మణాధిక్యమును నిరసించుటకూడ

కన్పించును. దేవారాం మరియు తిరువాచకమ్ అను గ్రంథములలోని పదములకును కూడా వీనితో పోలిక ఉన్నది. ఈ పాటలకును క్రీస్తు మతము లోని పాటలకును అక్కడక్కడ సామ్యమున్నదని కొందఱు చెప్పుదురు. ఇట్లు చెప్పుటకు కారణము ప్రాచీనకాలమున అనగా క్రీ॥శ 1,2 శతాబ్దులలోను ఆ తర్వాతను క్రీస్తు మతాచార్యులు దక్షిణ భారత దేశమందును పశ్చిమ సముద్ర తీరమందును నివసించి శైవమత ప్రచారము గావించుటయే. కాని ఇదే కాలములో రోమను దేశస్థులు, పర్షియావారు, అరబ్బులు మనదేశమునందు నివసించియే ఉండిరి. కాని వీరల మత ప్రభావము హైందవమత జీవనముపై ఉన్నదని ఎవరును చెప్పియుండలేదు. హైందవ మతాచార్యులు మతములను నిర్మించుకుని మత ప్రచారము చేయుటకు ఈ కాలములో పూనుకొని యుండిరి. ఇట్టి మతాభిరుచి ఏర్పడుటకు బౌద్ధ జైన మతములు కారణమై యుండవచ్చును గాని క్రైస్తవ మతము కాదనియే భావించవలసి యున్నది.

## ప్రధానమైన శైవసంప్రదాయములు :

శైవమతమునకు సంబంధించి పరిణామము చెందిన శైవ సంప్రదాయములను ఇచ్చట చెప్పవలసి యున్నది. ఈ సంప్రదాయము ప్రధాన శైవముతో పూర్తిగా నిస్సంబంధములు కాకపోయినను స్వతంత్ర ప్రతిపత్తిని పొందునంతటి అస్తిత్వమును కలిగినవి. ఇట్టి సంప్రదాయములలో మొదట చెప్ప దగినది లింగాయత సంప్రదాయము. దీనినే వీరశైవ సంప్రదాయమనియు పేర్కొందురు. క్రీ. శ. 12వ శతాబ్దములో జీవించిన బిజ్జలుని మంత్రియైన బసవేశ్వరుడు దీనిని స్థాపించెను. బ్రాహ్మణాధిక్యమును నిరసించుచు వర్ణాశ్రమ ధర్మమునకు వ్యతిరేకముగా ప్రభవించినట్టిది ఈ మతము. దీనిలోని సంస్కరణ లక్షణములు ప్రజలను ఎక్కువగా ఆకర్షించినవి. అందుచేత ఈ మతమునకు అధిక ప్రచారము కూడ లభించినది. వీరశైవము లేక లింగాయతము ఇప్పటికిని కర్ణాటక ప్రాంతములో ప్రధాన మతముగా నిలిచియున్నది. ఈ మతానుయాయులు తమ కంఠమున లింగమును ధరించి యుండుట చేత సులభముగా గుర్తించబడుచున్నారు.

లింగాయత మతమునకు చాల పూర్వమే ప్రారంభమై వికాసమును పొందినది కాశ్మీర శైవసంప్రదాయము. ఈ సంప్రదాయమునకు సంబంధించిన

సాహిత్యము క్రీ. శ. 9వ శతాబ్దమునుండియే మనకు లభించుచున్నది. అయినను ఈ సంప్రదాయము 9వ శతాబ్దమునకు చాల కాలము పూర్వమే ప్రారంభమైయుండును. కాని అది ఎప్పుడు అస్తిత్వమునకు వచ్చెనో చెప్పుట మనకు సాధ్యము కాదు. కాశ్మీర శైవమునకును దక్షిణ భారతములోని వీర శైవమునకును కొన్ని లక్షణములలో సామ్యము కలిగి యున్నవని చెప్పుదురు. కాని తాత్త్విక విశేషములలో ఈ రెండు మతములు భేదించుచున్నవి. కాశ్మీర శైవము ప్రధానముగా ఆదర్శ సిద్ధాంతములపై ఆధారపడి యున్నది. ఇంక వీరశైవము అధిభౌతిక తత్త్వముపై ఆధారపడినట్టిది. ఈ రెండింటి సంబంధము ఎట్టిదో మనకు తెలియరాదుగాని దక్షిణభారత దేశములో కొన్ని శాసనములలో కాశ్మీర శైవమునకు సంబంధించిన ప్రశంస కాన్పించుచునే యున్నది. శాసనాధారములను, సాహిత్య ఆధారములను గ్రహించి ఒక విషయము మాత్రము చెప్పవచ్చును. అదేమనగా కాశ్మీర శైవము ఉత్తర భారతము నుండి దక్షిణ భారతమునందే గాక జావా సుమిత్ర వంటి ప్రాశ్చ ద్వీపములలో కూడ ఇది వ్యాపించెనుట. ఈ సంప్రదాయము అగస్త్యుని వలన ఉత్తరమునుండి దక్షిణమునకును క్రమముగా ప్రాచ్య దీవులకును ప్రాకియుండునని భావించుటలో అసామంజస్యము లేదు.

## కాశ్మీర శైవము :

కాశ్మీర శైవము ప్రధానముగా ఆధ్యాత్మిక సిద్ధాంతముపై ఆధారపడి యున్నది. దీనికి అనేకమైన పేర్లు ప్రచారములో నున్నవి. త్రికశాసనము, త్రికశాస్త్రము లేక త్రిక మనియే దీనిని పేర్కొనుట గలదు. కొన్ని సందర్భములలో కాశ్మీర శైవమును రహస్య సంప్రదాయ మనియు, త్ర్యంబక సంప్రదాయ మనియు చెప్పుట కూడ గలదు. ఇది మాధవాచార్యులు రచించిన సర్వదర్శన సంగ్రహములో ప్రత్యభిజ్ఞాన దర్శనము అను పేరుతో ప్రపంచింపబడియున్నది. అందుచేత మాధవాచార్యులు ఈ సంప్రదాయమును ప్రధానమైన వానిలో ఒకటిగా భావించినాడనియే చెప్పవలసి యుండును.

త్రికము అను విశేషము దీనియందు ప్రధానమైనది. ఇట్టి పేరు వచ్చుటకు సిద్ధనమక, నామకము, మాలిని అను మూడు విశేషములు చేరుట ఒక కారణము కావచ్చును. తొంబది రెండు ఆగమములలో ఈ త్రికము పరిగ్రింప బడి అంగీకరింపబడినది. ఇది కాక త్రికమునకు మరికొన్ని అర్థములు కూడ చెప్పుదురు. శివుడు, శక్తి, అణువు అను మూడు విశేషముల కలయిక చేత త్రికమైనదని చెప్పుట ఒకటి. ఇక శివుడు, శక్తి, నరుడు కలియుట చేత త్రిక మైనదని చెప్పుట మరియొకటి. అట్లే పరుడు, అపరుడు, పరాత్పరుడు అను వానిని త్రికముగా చెప్పుట ఇంకొకటి. అట్లే జ్ఞాన సంబంధమైన మూడు సిద్ధాంతములను అనగా అభేదము, భేదాభేదము, భేదము అను వానిని చేర్చి త్రికమనుట.

ఈ సిద్ధాంతమునందు ప్రధానముగా రెండు శాఖలున్నవి. 1) స్పందము 2) ప్రత్యభిజ్ఞానము. ఈ సిద్ధాంతమునే ఆభాస వాదము అని కూడ పేర్కొందురు. దీనికి కాశ్మీర శైవము అను పేరు ఎందుచేత వచ్చెననగా కాశ్మీర దేశమందు నివసించిన పండితు లనేకులు ఈ సంప్రదాయ గ్రంథజాలము రచించి ఈ సంప్రదాయము వికసించుటకు చాల తోడ్పడుటయే కారణము.

ఆధ్యాత్మిక తత్త్వము :

త్రిక మనునది ప్రధానముగా ఒక ఆధ్యాత్మిక తత్త్వము. ఎందుచేతనగా దీనిలోని సిద్ధాంతములు ఆధ్యాత్మిక అనుభూతినుండి ఏర్పడినట్టివి. యథార్థము ప్రపంచము, నరుడు అను మూడు విశేషములు ఈ సిద్ధాంతమునకు మూల కందములు. శివయోగులు ప్రధానముగా ఈ సిద్ధాంతమును ప్రచారము చేసిరి. వారు దీనిలోని తాత్త్విక సిద్ధాంతములను లోకమునకు దర్శింప జేసిరి. వారు చెప్పిన విశేషములు సామాన్య మానవుని అనుభూతులతో ఏర్పడినవి కావు. అవి యోగ మార్గ మూలమున అనుభూతికి వచ్చిన ఆనందము, క్రియ, దృష్టి వలన ఏర్పడినది. యోగములలోని విభిన్న మార్గములు మానవుని యందున్న అంతర ప్రకృతిని గురించి మనకు తెలియ జెప్పుచున్నవి. ఈ అంతర ప్రకృతిలో అనేక శక్తులున్నవనియు, జ్ఞాన సంబంధమైన క్రియాశీలత్వము

దానియందు దాగియున్నదనియు యోగ శాస్త్రమున చెప్పబడి యున్నది. ప్రాకృతికముగా ఈ శక్తులు మనకు అజ్ఞాతముగా నుండుననియు యోగాభ్యాస మూలమున ఇవి అనుభూతికి వచ్చుననియు వీరి అభిప్రాయము. ఇట్లు చూడగా ప్రకృతికి అతీతమైన యధార్థ స్థితినుండి, అనుభూతినుండి ఏర్పడినట్టిదే త్రిక మని చెప్పవలసి యుండును.

సా హి త్య ము :

చాల ప్రాచీన కాలముననే శైవ సిద్ధాంతమును ప్రతిపాదించు సాహిత్యము వెలువడినట్లు తెలియవచ్చుచున్నది. ఈ సాహిత్యములో ఈశ్వర తత్త్వమును గూర్చి అనేక విషయములు చర్చింపబడినవి. ప్రధానముగా పర, అపర, పరాత్పర అను అంశములను గూర్చి వాని పరస్పర సంబంధములను గూర్చి విశేషములు కాన్పించును. అధిభౌతిక తత్త్వమును గూర్చి శైవులు, ఆచరించవలసిన విధులను గురించి ప్రయోగ సిద్ధాంతములను గురించి చాలా సిద్ధాంతములు కన్పించుచున్నవి. ఈ తాత్త్విక సాహిత్యమునంతను మన సౌకర్యముకొరకు ప్రధానముగా 3 విధములుగా విభజించవచ్చును.

1) ఆగమ శాస్త్రము. 2) స్పంద శాస్త్రము 3) ప్రత్యభిజ్ఞాన శాస్త్రము.

ఆ గ మ శా స్త్ర ము :

ఈ ఆగమశాస్త్రము అనాదిగా ప్రచారములో నున్నట్లు తెలియవచ్చుచున్నది. దీనికి శాశ్వతమైన అస్తిత్వము కలదనియు చెప్పుదురు.

ఆగమశాస్త్రములో ప్రధానమైనవి యివి: 1) మాలినీ విజయము 2) స్వచ్ఛందము 3) విజ్ఞాన భైరవము. 4) చ్ఛుష్మ భైరవము. 5) ఆనంద భైరవము. 6) మృగేంద్రము. 7) మాతంగము. 8) నేత్రము. 9) నైశ్వాసము. 10) స్వాయంభువము. 11) రుద్రయమళము. అద్వైత సిద్ధాంతమును గురించి చెప్పునప్పుడు ఈ విశేషములను వివరించుట జరుగుచుండును. దీనివలన ఆగమ శైవ శాస్త్రము పూర్తిగా అధిభౌతికమైనదని చెప్పుటయే దీని ఉద్దేశ్యము. క్రీ॥శ 9వ శతాబ్దములో నివసించినాడని భావింప

బడుచున్న వసుగుప్తుడను మహాముని ఈ ఆగమశాస్త్రమును ఉపదేశము పొందెనని చెప్పుదురు. ఈ శాస్త్రమును శైవోపనిషత్ సంగ్రహ మనియు, శైవ రహస్య ఆగమ శాస్త్ర సంగ్రహ మనియు పేర్కొనుట గలదు. దీనికి సంబంధించిన సూత్రములు వృత్తి భాస్కరుడు రచించిన వార్తికము, క్షేమ రాజు రచించిన విమర్శిని రూపములలో నున్నది.

స్పందశాస్త్రము :

స్పంద శాస్త్రములో ప్రధానముగా శివ సూత్రములోని సిద్ధాంతముల వివరణ ఉన్నది. ఇచట తర్కబద్ధమైన హేతువు చెప్పబడలేదు గాని, ఈ వివరణ శివ సూత్రములను చక్కగా వివరించు చున్నది. దీనికి వివరణ స్పంద సూత్రములు లేక స్పంద కారికములు అను పేరుతో వసుగుప్తుడు రచించి యుండెను. దీనినే సంగ్రహ గ్రంథమనియు పేర్కొందురు. వసుగుప్తుని శిష్యుడైన కల్లటుడు ఈ సూత్రములకు వృత్తిని వ్రాసియున్నాడు. వసుగుప్తుడు కల్లటుడు వ్రాసిన గ్రంథములన్నింటిని ఏకముగా స్పంద సర్వస్వము అని పేర్కొందురు. స్పంద సూత్రములపై వ్యాఖ్యాన రూపకముగా క్షేమరాజు రచించిన స్పంద నిర్ణయము, స్పంద సందోహము అను గ్రంథము లున్నవి. రామకంఠుడు వ్రాసిన నివృతి, ఉత్పల వైష్ణవుడు రచించిన ప్రదీపిక అనునవికూడ స్పంద శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములే.

ప్రత్యభిజ్ఞాన శాస్త్రము :

తాత్త్వికమైన త్రికమునకు ప్రత్యభిజ్ఞాన శాస్త్రము ఒక శాఖగా చెప్ప వచ్చును. దీనిని ప్రారంభించినవాడు వసుగుప్తుని శిష్యుడుగా భావింప బడుచున్న సిద్ధ సోమానందుడు. ఈ శాస్త్ర ప్రతిపాదనములో సోమానందుడు తన సొంత అభిప్రాయములకు విస్తృతి కలిగించుచు, వ్యతిరేకుల అభి ప్రాయములను ఖండించెను. అంతేకాదు అతడు తర్క పద్ధతిని స్థాపించిన వారిని స్తుతిచేసెను. సోమానందుడు శివదృష్టి అను గ్రంథమును రచించి ప్రత్యాభిజ్ఞన శాస్త్రమునకు పునాది వేసెను. ఇతడే వృత్తి అను ఇంకొక గ్రంథమును కూడ రచించినట్లు చెప్పుదురు. అది మనకు లభించక పోయినను

దీనిలోని విశేషములను తరువాతి గ్రంథకర్తలు ఉదాహరించుట చూడ వచ్చును. సోమానందుని శిష్యుడైన ఉత్పలుడు ప్రత్యాభిజ్ఞ సూత్రము అను గ్రంథమును రచించెను. దీనిలో అతడు తన గురువు చెప్పిన తాత్త్విక విశేషములన్నింటిని సంగ్రహించినాడు. ఈ గ్రంథము చిన్నదే ఐనను చాల ప్రాముఖ్యమును పొందినది. ఈ గ్రంథము చేతనే ఈ సిద్ధాంతమునకు ప్రత్యభిజ్ఞ శాస్త్రి మని పేరువచ్చినది. ఈ గ్రంథము చేతనే ఈ సిద్ధాంతము కాశ్మీరము నందును, అన్యప్రాంతము లందును ప్రచారము వహించినది. దీని కనేక వ్యాఖ్యానములు లభించును. వృత్తియను వ్యాఖ్యానమును ఉత్పలుడే స్వయముగా వ్రాసినాడు. అభినవ గుప్తుడు లఘువృత్తి లేక ప్రత్యాభిజ్ఞ విమర్శిని అను వ్యాఖ్యానమును రచించెను. దీనికి భాస్కరిటీక అను చక్కని వివరణ యున్నది. ఇంతేకాక అభినవగుప్తుడు పరమార్ధ సారము, తంత్ర సారము అను గ్రంథములను రచించెను. అట్లే క్షేమరాజు ప్రతిభిజ్ఞ హృదయము అను మరొక గ్రంథము వ్రాసెను. ఈ 3 గ్రంథములు చిన్న వైనను ఈ సిద్ధాంత వ్యాఖ్యలో ముఖ్యముగా భావింప బడుచున్నవి. అభినవ గుప్తుడు వ్రాసిన తంత్రాలోకము అను గ్రంథమునకు జయరథుడు వ్యాఖ్యానము చేసెను. ఈ గ్రంథము ప్రత్యాభిజ్ఞ శాస్త్రిమునకు విజ్ఞాన సర్వస్వము వంటిది.

అసలు శాస్త్రిమనగానేమో స్వల్పముగా వివరించవలె. త్రికము అను దానిలో చెప్పిన దానిని బట్టి శాస్త్రిములకు శాశ్వతమైన అస్తిత్వ మున్నట్లుగా చెప్పబడి యున్నది. ఈ శాస్త్రిము ఒక గ్రంథము గాని ఒక సంపుటి గాని కాదు. ఇది స్వతంత్ర అస్తిత్వము కలిగిన వ్యక్తిగతముగాని బుద్ధిగత విశేషము. దీనిని శబ్దము, మరియు వాక్కు అని పేర్కొందురు. ఆగమ తాత్త్విక విశేషములను బట్టి యధార్ధమైన దానిలోని సంచలనమే శబ్దము. సత్యములోని ఆత్మజ్ఞానమే నిజమైన సంచలనము. వాక్కు లేక, ధ్వని ఏదైన ఒక భావమును వ్యక్తము చేయును. సత్యము యొక్క స్వయం వ్యక్తీకరణము పరవాక్కనియు, పరమాత్మ చెప్పినమాట అనియు చెప్పుదురు. ఈ సత్యము యొక్క స్వయంవ్యక్తీకరణము జ్ఞానము. అదియే యధార్థమైనది. జ్ఞాన మన్నది మనుష్యుని బుద్ధిని బట్టి అనేక విధములుగా వ్యక్తమగుచున్నది.

సత్యము అను విషయమును తెలుసుకొనుటయే జ్ఞానమని చెప్పుట సమంజసము.

ఆగమములు, లేక శాస్త్రములు శాశ్వతముగా ఉండునని చెప్పితిమి గదా! ఇదే పరవాక్కు వంటిది. మానవ మాత్రులైన ఋషులు మునులు మాధ్యమస్థితిలో వానిని పొందుదురు. ఇది వారికి మధ్యమ వాక్కు నుండి లభించును. ఈ మాధ్యమ వాక్కు పంచాననుడు అనగా ఐదుముఖములు గలిగిన పరమేశ్వరుని నుండి లభించును. ఐదు విశేషములుండుటచే పరమేశ్వరునకు పంచానను డనుపేరు వచ్చినది. చిత్తు, ఆనందము, ఇచ్ఛ, జ్ఞానము, క్రియ అనునవే పంచాననుని విశేషములు. ఈ విశేషములు కలుగుటచే ఈశ్వరునకు ఈశానుడు, తత్పురుషుడు, సద్యోజ్యాతుడు, అఘోరుడు వామ అను పేర్లు వచ్చినవి. ఇట్లు చూడగా సత్యము యొక్క ఆత్మజ్ఞానము గాని స్వయంవ్యక్తీకరణము శాస్త్రము అని చెప్పవలసి యున్నది. ఈ విషయమునే త్రికము చెప్పుచున్నది.

ఈ విధముగా వేదము లందును, పురాణము లందును, ఐతిహాసము లందును శైవమత విశేషములు మనకు దర్శన మిచ్చుచున్నవి. సృష్టి, స్థితి, లయ కారులైన త్రిమూర్తులలో మాహేశ్వరుడే మొదట భక్తుల మన్ననలను గౌరవమును పొందినట్లు కాన్పించును. ఆగమ శైవము చాల ప్రాచీన కాలములోనే భారతదేశము నందంతటను వ్యాపించినట్లు కాన్పించును. కాని ఇది కాశ్మీర శైవ మను పేరుతో ఒక విధముగా ఉత్తర దేశమునందు వ్యాపించినట్లుగా దక్షిణ దేశమునందు వీర శైవమను పేరుతో వ్యాప్తిచెంది ప్రజలలో ప్రచారము నెందెను.

# వీరశైవము

ప్రాచీన నాగరకతకు చిహ్నముగానున్న మహోంజదారో, హరప్పా శిథిలములలో వెలువడిన శాసనములందు శివారాధనను గురించి, శైవ మతమును గురించి యుండుట చేత ఇప్పుడు ప్రపంచ వ్యాప్తిపొందిన మతములన్నింటి లోను శైవ మతము చాల ప్రాచీనమైనదని చెప్పుట కలదు. మన దేశములో అన్ని ప్రాంతములందును, అన్ని రాష్ట్రములందును ఆలయములలో శివలింగ ములు ప్రతిష్ఠింపబడి యుండుట ఈ మతముయొక్క దేశవ్యాప్తికి, ప్రాచీనత్వ మునకు నిదర్శనముగా నున్నది. శైవారాధన ఒక విశిష్ఠ మతముగా ఎప్పుడు రూపొందెనో చెప్పుట కష్టముగాని శైవ తత్త్వము, ఆచరణ అనువానిని గురించి ఆగమములు చాల కాలము క్రిందటనే చెప్పియున్నవి. సమయము గడ చిన కొలది ఆగమములలో చెప్పిన విషయములు, వేదములలోని విశేషములు ఒకదానితో నొకటి ఏకీభావమును చెందుట సంభవించినది. తిరిగి వానిలో భిన్నత్వము కూడ నేర్పడి అనేక మార్పులు సంభవించినవి. వేదములలోని పంచభూతముల ఆరాధన క్రమముగా ఆలయములలోని విగ్రహారాధనగా రూపొందినది. ఆగమములలో విగ్రహారాధన గురించి చెప్పబడినది గదా! అట్లే వేదములలోని వర్ణాశ్రమ ధర్మము ఆగమములలోనికి ప్రవేశించినది. అందు చేతనే కాబోలు శైవమత శాఖలలో చాల భాగములందు వర్ణాశ్రమ ధర్మము అవలంబించుటను చూతుము. ఈ విధముగా శైవమతము కొద్ది మార్పులతో దేశమంతటను వ్యాపించి 11వ శతాబ్దము చివరివరకు వృద్ధి చెందినది. 12వ శతాబ్దములో జైన మతమునకు వైష్ణవ మతమునకు ప్రాధాన్య మధికమై శైవ మతమునకు బలము తగ్గిపోయినది.

ఇట్టి పరిస్థితులలో 12వ శతాబ్దపు మధ్యభాగమున కర్ణాటక దేశము నందు గొప్ప మతాచార్యుడైన బసవేశ్వరు డుద్భవించినాడు. అతడు శైవమత శైథిల్యము నరికట్టెను. వర్ణాశ్రమ ధర్మ శృంఖలముల నుండి దానిని విడి

పించెను. ఆమతములలో నూతన చైతన్యమును, శక్తిని ప్రవేశ పెట్టెను. ఈ విధముగా పునరుద్ధరణ జరిగిన శైవమతమును వీరశైవ మని, లింగాయత మతమని పేర్కొందురు. బసవేశ్వరుడు ఈ మతములో విప్లవాత్మకమైన మార్పులు చేయుటచే యితడు వీరశైవమతమునకు ప్రారంభకుడుగా భావింప బడుచున్నాడు.

వీరశైవ మతములో బసవేశ్వరుడు ఏర్పరచిన శివానుభవ మంటపము చారిత్రాత్మకమైనది. దీనిని వీరశైవ సిద్ధాంతమునకు జన్మస్థానముగాను, వృద్ధి స్థానముగాను చెప్పవచ్చును. యధార్థమునకు ఈ సంస్థ ఆధ్యాత్మికముగాను, సాంఘికముగాను ప్రాముఖ్యము వహించినట్టిది. దీనిని వ్యవస్థాపించినవాడు బసవేశ్వరుడు. అధ్యక్ష పీఠమున అధివసించినవాడు అల్లమ ప్రభువు. ఈ విధముగా శివానుభవ మంటపము క్రీ. శ. 1160లో స్థాపింపబడి వీరశైవ సిద్ధాంతమునకు బీజప్రాయమైనది.

వీరశైవ సంప్రదాయమునందును, దాని ప్రచారమునందును శివానుభవ మంటపమునకు చారిత్రక ప్రాముఖ్యము ఉన్నది. ఎందుచేతననగా ఈ మంట పము అను సంస్థ మూలముననే లింగాయత మతము ఒక విశిష్ట స్వరూపమును సంతరించుకున్నది. శివానుభవ మంటపము నిజమునకు ఒక కేంద్ర స్థానము వంటిది. దీనియందే సమస్త శైవులు ఆకర్షితులైరి. ఇచ్చట కూడిన వారిలో జాతిమత వివక్షతలేదు. లింగభేదము లేదు. సామాజిక భేదములు లేవు. ఆధ్యాత్మిక తరతమ భావములు లేవు. ఈ మంటపమున జేరిన వారిలో ఏవృత్తుల వారైనను ఉండవచ్చును. రాజకుమారులు మొదలుకొని కృషీవలుల వరకును, సంసారులు మొదలుకొని సన్యాసుల వరకును దీనిలో ఉందురు. శివానుభవమంటపము స్థాపించినప్పుడు దీనిలో జేరిన వారి సంఖ్య మూడు వందలు ఉండెనట. ఈ మూడువందల వీరశైవులలో దాదాపు అరవై మంది స్త్రీలుకూడా జేరియుండిరి అట్టి మహిళలలో అగ్రశ్రేణికి చెందినది అక్కమహా దేవి. ఈ మత సంస్థ కారణముగా వీరశైవ సాహిత్యములో వచన సాహిత్య మునకు ప్రాముఖ్యము గలిగెను. బసవేశ్వరుడు స్వయముగా చాల వచనము లను కన్నడ భాషలో రచించెను. అక్కమహాదేవి, దేవర దాసమయ్య కూడ

బసవేశ్వరుని అడుగు జాడలలో వచనరచనము చేసి యున్నారు. (ప్రాచీన కన్నడ సాహిత్యమునందు వీరశైవ సిద్ధాంత ప్రతిపాదకమైన ఈ వచనములకు చాలా ప్రాధాన్యమున్నది.) ఈ వచన సాహిత్యము నుండి వీరశైవమునందు షడ్స్థల తత్త్వము ఉద్భవించెను. శైవ సంప్రదాయములో ఈ తత్త్వమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. కన్నడ దేశ భాషా సంస్కృతులందు వచన సాహిత్యము ప్రముఖ విశేషముగా చెప్పదగియున్నది-

ఇదికాక అనుభవ మంటపము అను మత సంస్థ వలననే ముఖ్యమైన మతాచారములు ప్రారంభమై అనుభవములోనికి వచ్చెను. వీనిలో పంచాచారము, అష్టావరణము అనునవి పేర్కొనదగినవి. ఈ సంప్రదాయములు సామాజిక ఉద్ధరణమునకు సంబంధించిన కార్యకలాప నిర్వహణమునకు ఆధారములైనవి. సంఘమునందు స్త్రీలకు ఒక ప్రతిపత్తిని కలిగించుట, వర్ణాశ్రమ ధర్మములను కులభేదములను నిర్మూలించుట, అస్పృశ్యతా నివారణము అనువానితో బాటు కాయకష్టము చేయుటయందు గౌరవ భావమును కలిగించుట సామాజిక జీవనము నందు, వ్యక్తిగత జీవనమునందు నిరాడంబరత్వము ఈ సంఘ ఉద్ధరణమునందు సంఘ నిర్మాణమునందు ప్రధానమైన విశేషములుగా చెప్పవలసి యున్నది. నిజమునకు సంస్కార రూపమైన ఈ విశేషములే సంఘమునందు ఒక విధమైన జాగృతిని కలిగించి వీరశైవమత వ్యాప్తికి కారణమైన ఆమతమును వ్యక్తులనుంచి సమాజము వరకు విస్తృతిని కలిగించినవి.

ఇంక వీరశైవ మతము యొక్క ప్రధాన సూత్రములను పరిశీలించి చూడవలసి యున్నది. సాంప్రదాయకముగా శైవము నుండి సంక్రమించిన రెండు విశ్వాసములు వీరశైవమునందు ప్రధానముగా కాన్పించును. 1) వీరశైవము ఈనాటిది కాదు. దీనిని ప్రాచీన కాలమునందే ఐదుగురు మహానుభావులు, స్థాపించి యున్నారు. వారు రేవణారాధ్యులు, మరుళారాధ్యులు ఏకోరామాధ్యాలు. పండితారాధ్యులు, విశ్వారాధ్యులు. వీరు స్థాపించిన మతమునే బసవేశ్వరుడు పునరుద్ధరణము చేసి ప్రచారమునకు తెచ్చెనని వీరశైవ మతానుయాయుల విశ్వాసము. 2) ఈ ఆరాధ్య పంచకము మహోన్నతములైన స్థావర లింగముల నుండి ఉద్భవించిరనియు వీరి

విశ్వాసము. ఈ స్థావర లింగములు కర్నాటక రాష్ట్రము నందలి బేళహళ్లి బళ్ళారి జిల్లాలోని ఉద్యాని, హిమాలయము లందలి కేదార క్షేత్రము, ఆంధ్ర ప్రదేశ్ లోని శ్రీశైలము, కాశీ లేక వారణాసిలో నున్నవట. ఇచటనే ఈ ఐదు గురు మతారాధ్యులు విభిన్న నామములతో విభిన్న కాలములందు ఉద్భవించి నట్లు వీరు విశ్వసింతురు.

ఈ విశ్వాసములను గురించియు, సిద్ధాంతములను గురించియు ఆచార్య సఖారేగారు కొన్ని విషయములను వెల్లడించిరి. ఆయన అభి ప్రాయము ప్రకారముగా ఈ ఐదుగురు శైవాచార్యులు వీర శైవ సంప్రదాయ మును స్థాపించినవారు లేక ప్రారంభించినవారు కాకపోవచ్చును. ఎందుచేత నసగా వీరిలో ఒకరిద్దరు బసవేశ్వరునికి సమకాలికులుగా కాన్పింతురు. మరి కొందరు బసవేశ్వరుని తరువాతి వారుగా కూడా నున్నారు.* ఈ సందర్భముతో డా॥ రామశాస్త్రిగారు తమ సిద్ధాంత దీపిక అను గ్రంథ ములో యిట్లు చెప్పియున్నారు. ఐదుగురు మతాచార్యులు ప్రాచీన కాలములో వీరశైవ సిద్ధాంతమును స్థాపించినారని చెప్పుట యదార్ధము కాకపోవచ్చును. ఈ విషయమును మనము ఆలంకారికముగానే గ్రహించవలయును కాని యదార్థముగా స్వీకరించుట సాధ్యముకాదు. ఒక మతమును ప్రాచీన తరమని చెప్పుటయందు దానికి ఒక గౌరవ స్థానమును ఏర్పరుచుటయే దీనిలోని ప్రధాన విషయము. దీనివలన ఆమత సూత్రములకు ఆమతమునకు తన్మత ప్రచారకుల యందును, అనుయాయుల యందును, సాధకుల యందును పవిత్ర భావ మేర్పడును. ఇట్లు చేయుటకు ప్రచారకులలో కొందరు వీర శైవ సిద్ధాంతమును ప్రాచీనముగా భావించి వాడుకలోనికి తెచ్చిరి. కాని వారి ఈ దృష్టిని నిరూపించుటకు ఎటువంటి చారిత్రికాధారములును కన్పించవు చారిత్రక పరిశోధన జరిగిన కొలదియు బసవేశ్వరుడే వీరశైవమును స్థాపించె నని స్పష్టముగా తెలియువచ్చు చున్నది.

---

* History and Philosophy of Lingayata Religion (By Prof' Sakhare) Page 416-18.

వీరశైవ మతమున శివలింగమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. ఇదియే ఈ మతమునకు కేంద్ర స్థానము వంటిది. అదియే మార్గ దర్శక సూత్రము వంటిది. లింగాయత మతమునకు స్వతంత్రమైన ప్రతిపత్తి గలదు. దానికి స్వతంత్రమైన మార్గము ఆచరణము తత్త్వము వెలసి యున్నవి. ఈ రంగము నందు పాశ్చాత్య పండితులు కూడా కృషిచేసి యున్నారు. ఫ్లీట్, రైస్, ఎందోవన్ అను పండితులు ఈ మత సూత్రము లను గురించి, సంప్రదాయములను గురించి కొంత వ్రాసి యున్నారు. అనగా ఈ మత తత్త్వము పాశ్చాత్యులను సహితము ఆకర్షించె నన్నమాట.

సామాన్యముగా శైవమతము నందు ఆరాధనా స్థానముగా శివలింగ స్వరూపమును చూడవచ్చును. దీనిని ఆ మతానుయాయులు శివ పర మార్థముగాను భావింతురు. కాని వీర శైవము నందు మరొక ప్రత్యేకత ఉన్నది. వీరు శివలింగమునకు మారుగా యిష్టలింగమును శివుని స్థానమున పూజించి ధ్యానింతురు. దీని భావము ఈ విధముగా వివరించ వచ్చును. వీర శైవ సిద్ధాంతమును అనుసరించిన వారందరును తమ శరీరములందు శివ లింగమును విధిగా ధరించవలెను. దీని వలన మానవ శరీరము ఈశ్వరుని ఆలయముతో సమానమగును. అట్లు ఈశ్వరుడు భక్తుల శరీరములందు నివసించును. ఇట్లు చూడగా లింగమును ధరించిన వాడు శివాలయము వంటి వాడన్నమాట. ఆతని శివభక్తికి మతాను సరణమునకు లింగము సంకేత మన్నమాట. అదియే శివస్వరూపము. అంతేకాదు ఈ లింగము వలన శరీరములోని ప్రత్యణువు పవిత్ర పాప పంకిలము నుండి పారిశుద్ధ్యము పొందునని వారి భావము. ఈ విధముగా వీర శైవ సంప్రదాయమును అనుసరించు వారు నిరంతరము ఈశ్వరుని సాన్నిధ్యము నందును, సంపర్కము నందును జీవింతురన్నమాట. ఈ మతము ననుసరించు వారు దాదాపు అరువది లక్ష లున్నారట. భారతదేశ మంతటను వీరు వ్యాపించి యున్నారు గాని కర్నాటక మందు వీరి వ్యాప్తి బహుళము.

వీర శైవ మతానుసరణము :

మనుష్యుడు శరీరమును ధరించి దాని యందు అపవిత్రమైన మల మూత్రములను పొందియుండుట చేత పవిత్రతను కోల్పోవుచున్నాడు. అందు చేతనే ఈ శరీరము మాలిన్య భరితమైనదని చెప్పుదురు. ఈ విషయమందరికిని తెలిసినదే. ఈ మాలిన్యము లేని మనుష్యుడు లోకమునందు లేడనియే చెప్ప వచ్చును. కాని ఈశ్వరుడే అతి పవిత్రమైనవాడు, మాలిన్య మంటనివాడు. అట్టి వానిని స్పృశించగా మానవునిలోని మాలిన్యము క్రమముగా నశించును. అది ఆత్మకు వేరుగానుండి అతనిలోని మాలిన్యమును తొలగించి మాయామల స్వరూపమును కలిగించును. ఈ మాయామల స్వరూపము నుండియే సర్వ ప్రాపంచిక బౌద్ధిక విశేషము లుద్భవిల్లును. ఈ విధముగా ఆత్మ పరిశుద్ధమై కొంత జ్ఞానమును సంపాదించి బాహ్య ప్రాపంచిక సౌఖ్యములను అంటనీయక ఆధ్యాత్మిక భావమును పొంది దాని పరిణామముగా గొప్ప పరివర్తనమును పొందు చున్నది. దీనినే క్రియలోని మాలిన్యమనియు ఖర్మమల మనియు పేర్కొందురు. ఇట్టి పరివర్తనము వలన జాతి ఆయువు, భోగము అనునవి ఏర్పడుచున్నవి. ఈ మూడు గుణములు కలిగిన ఆత్మ పశుతుల్యమైనది. ఇక ఉన్నతోన్నతమైన ఆత్మ లేక పరమాత్మపతి అగుచున్నాడు. పతి అనగా పశు, అనగా మనుష్యులను కాపాడువాడన్న మాట. ఈ రక్షణ అనునది ఐదు విధములుగా సంభవించుచున్నది. 1) సృష్టి 2) స్థితి 3) లయము 4) త్యాగము 5) మోక్షము. జీవన్ముక్తి అను ఫలితము లభించునంత వరకు మానవ శరీరముతో కూడిన ఆత్మ జన్మించుచూ, మరణించుచూ, ముక్తి మార్గ మును సాధించవలెను. ఈ పద్ధతిలో ఆత్మ పారిశుద్ధ్యమును పొందవలెను. అప్పుడే దానికి ముక్తిమార్గ మేర్పడును. జ్ఞానము సిద్ధించును. శాశ్వితత్వము కలుగును.

ఇంక ఇట్టి స్థితి ఆత్మకు కలుగుట ఎట్లు సాధ్యము? ఈ విషయమున వీరశైవము ఒక మార్గమును నిర్దేశించుచున్నది. అదియే దీక్ష. దీక్ష లేక ఉపదేశము అనునది ప్రపంచములోని అన్ని మతములలో ప్రధాన విశేషముగా నున్నది. అన్ని మతములలోను దీక్ష లేక ఉపదేశమునకు ప్రముఖ స్థానమే

గలదు. వైదికమున ఉపనయనము విశిష్టాద్వైతమున అష్టాక్షరీ మంత్ర ఉప దేశము, జైనమున మహావ్రతము యిట్టివి. వీరశైవమున దీక్ష అను దానిని లింగధారణముతో సమన్వయము చేయబడినది. ఇది ఒక సరళమైన సంప్రదాయము. ఈ లింగధారణ సమయమున నైతిక విలువలు యోగ సంప్రదాయము కూడ వీరశైవమును స్వీకరించిన వారిలో, దీక్ష వహించిన వారిలో చేరుచున్నది. ఈ దీక్ష అను సంప్రదాయమునందు గురువు శిష్యున కుపదేశించుట ప్రధానమైన విషయము. ఈ ఉపదేశమునందు గురువు తన ఆత్మశక్తి చేత శిష్యునిలో ఆధ్యాత్మిక శక్తిని ప్రవేశ పెట్టును. ఇట్లు చేయుట వలన ఈ శక్తి అతని దేహాత్మలయందు ప్రవేశించి ఈషణత్రయము చేత బంధింపబడిన ఆత్మకు విముక్తి కలిగించును. ఈ ఈషణ త్రయమునే మలత్రయమని పేర్కొందురు. ఈ విధముగా జ్ఞానమును పొందిన ఆత్మ మలత్రయమునుండి దూరమగును. దీక్షలో క్రియ, మంత్రము, వేధము అను మూడు విభాగము లున్నవి. క్రియ అనునది లింగధారణవలన సిద్ధించును. మంత్ర దీక్ష అశుచియైన శరీరమును పవిత్రము చేయును. మంత్రము గురువు చేత శ్రవణేంద్రియము నందు ఉపదేశింప బడినప్పుడు శరీరమున కిట్టి పవిత్రత్వము కలుగుచున్నది. వేధ దీక్ష వలన శిష్యునకు ఆధ్యాత్మిక జ్ఞానము సిద్ధించుచున్నది. ఈ విధముగా మలత్రయమునుండి విముక్తియైన ఆత్మను అంగ మని, ఆధ్యాత్మిక తత్త్వము కలిగిన ఆత్మ అని పేర్కొందురు. అప్పుడు ఆత్మ ఈశ్వర ఔన్నత్యమును అధిరోహించుటకు వాంఛించును. కాని ఈ అధిరోహణము సామాన్యముగా లభించునది కాదు. దీనికి అతి కఠినమైన ఆధ్యాత్మిక క్రమశిక్షణ కావలయును. భక్తి పరిపూరితమై ఈశ్వర సంబంధమైన లేక లింగ సంబంధమైన జీవితమును సాధించవలెను. ఇట్టి భక్తి పూరితమైన జీవితము, ఆధ్యాత్మిక క్రమశిక్షణ వీరశైవ మతావలంబనమునందు ప్రముఖ పాత్రను వహించుచున్నది.

అంతరంగికముగా లింగాయత మతము ఆచరణములో రెండు ప్రధాన సూత్రములకు ప్రాధాన్య మిచ్చుచున్నది. 1) పంచాచారము 2) అష్టావరణము. పంచాచారమనగా ప్రవర్తనకు సంబంధించిన ఐదు సూత్రములు. లింగాయతులు సామాజికముగానూ, వ్యక్తిగతముగాను అతిశ్రద్ధతో ఆచరించవలసిన సూత్రము లివి. దీనివలన సాంఘికముగా ఆ మతము ఏకీభా

భావమును సంపాదించుచున్నది. ఆ సూత్రములు యివి. 1) లింగాచారము 2) సదాచారము 3) శివాచారము 4) భృత్యాచారము 5) గణాచారము. లింగాచారము వీరశైవులను ప్రతినిత్యము లింగపూజ చేయవలెనను విధిని చెప్పుచున్నది. లింగారాధనము మహేశ్వర రూపమునకు ప్రతినిధి వంటిది. వీరశైవుడు ఏకేశ్వరోపాసనయందు నిష్ఠకలవాడై ఉండవలెను. మాట కూడా లింగాచారము విధించును. సదాచార మనునది జీవిత విధానమునకు సంబంధించి నట్టిది. లింగాయతుడు ఏదైన ఒక వృత్తిని అవలంబించి నైతికమై ఆధ్యాత్మిక జీవనము గడపవలెనని నిర్దేశించుచున్నది. నీతి బాహ్యము కాని వృత్తి చేత అతడు ధనమును సంపాదించి ఇతరుల అవసరమునకు మిగిలిన ధనము అత డుపయోగించవలెను. అంతేకాదు, లింగాయత మతమును ప్రచారము చేసెడు జంగములకు అతడు ఆహార వస్త్రాదికములను సమకూర్చవలెను. శివాచార మనునది లింగాయతమతాచారులలో అభేదమును విధించుచున్నది. లింగాయతులు ఇతరులను భేదభావముతో చూడకూడదు. అందరును శివా రాధకులే గదా. ఈ ఆచారమును బట్టి వారిలో వారు భిన్న వృత్తులను అవలంబించు వారైనను వారితో కలసి భుజించుట యందును, వివాహాది సంబంధములు నెఱపుట యందును వెనుదీయకూడదు. ఇంక భృత్యాచారము ఈ మతానుయాయులకు శివుని పట్లను, అతని భక్తుల పట్లను పరిపూర్ణమైన సేవా భావమును, వినయ భావమును విధించుచున్నది. వీరశైవులు స్త్రీ పురుషుల పట్ల వినయ విధేయతలతో ప్రవర్తించ వలెనని, అన్ని జీవుల పట్ల దయాస్వభా వమును కలిగియుండవలెనని భృత్యాచారము ప్రధాన విశేషము. ఇంక గణాచారములో ఇతర మత సంబంధమైన నిరశనము. స్వమతాభిమానము విధిగా చేయుచున్నవి. ఈ విధిని బట్టి లింగాయతుడు ఆచార్యుని పట్ల వ్యతిరేక మైన మాటలను వినకూడదు, సహింపకూడదు. అంతేకాదు, సమస్త జీవుల పట్ల దయలేని వానిని కూడా సహించకూడదు. వీరశైవ మత అనుయాయి యగుట వలన ఆ మతము వృద్ధికి, ప్రచారమునకు త్రికరణ శుద్ధిగా పాటుపడ వలెను.

## 2) అష్టావరణము :

అష్టావరణ మనగా భక్తునికి ఎనిమిది విధములైన రక్షణ. ఈ రక్షణ అతనికి అజ్ఞానము నుండి అన్నమాట. అష్టావరణము వలన అతడు పరమార్థ

మైన శరణమును పొందుచున్నాడు. భక్తుడు ఈ ఎనిమిది విధముల రక్షణముల వలన ప్రాపంచిక జీవితమునకు మమత కల్పించుకొనక తప్పించుకొనుచున్నాడు. చివరి కివే అతనికి మోక్ష మార్గమును ప్రసాదించు చున్నవి. గురువు, లింగము, జంగముడు లేక శివయోగి, పాదోదకము (గురువుది కాని జంగమునిది కాని) ప్రసాదము, భస్మము, రుద్రాక్షము, మంత్రము అనునవి అష్టావరణములుగా చెప్పబడియున్నవి.

గురువు భక్తునకు లేక వీరశైవునకు ఆధ్యాత్మికముగాను, మత సంబంధముగాను మార్గదర్శకుడై అతనికి వీరశైవములోని రహస్యములను తగిన విధముగా బోధించును. గురూపదేశము వలననే భక్తుడు ఆధ్యాత్మికముగా రెండవ జన్మమును పొందుచున్నాడు. గురువే అతనికి లింగాయత మతము నందలి పరమార్థమును బోధించి ఆచరణమునకు ప్రోత్సహించును. అతడే ధర్మ మార్గమును బోధించి మార్గదర్శకత్వము వహించును. గురువు ఈశ్వరుని గురించి, ప్రపంచమును గురించి పరిపూర్ణజ్ఞానమును కలిగిన వాడగుట చేత భక్తుడు అతని వలన జ్ఞానమును పొందుటకు, అతనిని అనుసరించి సేవించుటకు కుతూహల పడుచుండును. అందుచేతనే అష్టావరణములలో గురువునకు ప్రథమ స్థానము లభించినది.

మత సంబంధమైన ఆచరణమునందు లింగము కేంద్రముగా భావింపబడుచున్నది. అదియే మతాచరణమునకు ప్రధాన స్థానము. లింగము పరిపూర్ణమైన దివ్యత్వమునకు ప్రాతినిధ్యము వహించును. ఆధ్యాత్మికమైన జన్మము పొందినప్పుడు గురువు, లింగము భక్తునకు ప్రసాదించుచున్నాడు. అతడు జన్మించినప్పటి నుండి మరణించు వరకు లింగధారణము చేయవలసియే ఉండును. వీరశైవుడు నిత్యము చేయవలసిన లింగపూజను విస్మరించ కూడదు. దీనివలననే లింగధారునకు ఈశ్వర సాన్నిధ్యము లభించుచున్నది.

వీర శైవము నందు జంగముడు అనునది మూడవ ఆవరణము. ఇది ఈ మతమునకు ప్రత్యేకమైనది. జంగమ మనగా విజ్ఞానమగు అర్థమున

వీరు గ్రహింతురు. ఆగమ, నిగమ అను వానిలోని 'గం' ధాతువు జంగమ శబ్దము నందు చేరినది. ఈ అర్థము ఒక వ్యక్తికి అన్వయింప బడుచున్నది. ఇట్లు జంగము డనగా ఈశ్వరుని గురించి శక్తి మంతమైన జ్ఞానము గలవాడని అర్థము. జంగమునే చారుడనియు పేర్కొందురు. చారుడనగా ఒక చోటు నుంచి వేరొక చోటుకి చరించు వాడని అర్థము. జంగము ఇట్లు చరించును. శైవ మతమును ప్రచారము చేయుట చేత ఈ పేరు సార్ధకమైనది. ఇతనిని జీవన్ముక్తుడుగా భావింతురు. దేశమున తిరుగుచు, ఆధ్యాత్మికముగా జనులకు మార్గదర్శకమును వహించుచు, వారిచేత మత విధులను ఆచరింప జేయుటయే ఇతని విధి. వీరశైవులు గురువు, లింగముడు, జంగముడు అనువారిని సమానముగా భావించి గౌరవించవలసిన విధిని కలిగియున్నారు.

పాదోదక మనగా గురుపాదములు కాని, జంగముని పాదములుగాని కడిగిన నీరనియే అర్థము. దీనిని అతి పవిత్రముగా వీరశైవ మతాను యాయులు భావింతురు. ఒక సందర్భములో యజమాని తన సేవకుడైన వీర శైవుని పాదములు కడిగి ఆ నీటిని గ్రహించినట్లుగా పాల్కురికి సోమనాథుడు ఒక కథను చెప్పియున్నాడు. ప్రసాద మనగా పవిత్రమైన ఆహారమన్న మాట. జంగముడు గ్రహించిన ఆహార పదార్థమును లేక అతడు చూచిన పదార్థ మును కూడ ప్రసాదముగా వీరశైవులు స్వీకరింతురు. జంగముడే కాక గురు విచ్చిన వస్తువును కూడ ప్రసాదముగానే భావింతురు. గురువు లేక జంగముని సన్నిధిలో వీర శైవులందరును తమ జాతి, వృత్తి, లింగ భేదములను, మరచి సర్వసమానముగా భావించి పాదోదకమును, ప్రసాదమును స్వీక రింతురు. ఈ విధముగా పాదోదక ప్రసాదములను ఒక సాంఘిక ప్రాముఖ్య మేర్పడిన సర్వ సమానత్వమునకు సాధనముగా నున్నది. భస్మమనునది ఆత్మను ప్రదర్శించును అజ్ఞానమును కాల్చివేయుట, లేక నశింప జేయుట అనుదానికి భస్మము ప్రతీకగా నున్నది. వీర శైవులకు భస్మధారణము బాహ్య చిహ్నము. దీని వలన లింగాయతుడు ఇతరులలో ప్రత్యేకముగా గుర్తింప బడుచున్నాడు.

ఇక రుద్రాక్ష అనునది అజ్ఞానమును నశింపజేసి శైవునకు జ్ఞానమును కలిగించునని విశ్వాసము. వీరశైవుడైనవాడు రుద్రాక్షమాలను విధిగా ధరింప వలసి యుండును.

మంత్రము తపస్సాధనకు ముఖ్యమైనది. 'నమశ్శివాయ' అను పంచాక్షరి మంత్రము ఉచ్ఛరించుటయే తపస్సు. ఇది ప్రతి శైవుడును ఆచరింపవలసిన విధి.

ఈ అష్టావరణములు వీరశైవ మతమునకు ప్రత్యేకమైనవి. వీని ఆచరణము వలన లింగాయతులు శరీరమును, ఆత్మను పవిత్రముగా భావించి రక్షించుకొందురు. వీని వలననే వారు మాయనుండి కూడ రక్షింపబడు చున్నారు. వీరశైవులు జ్ఞానముచేత పూర్వమే ప్రజ్వలింప బడిన వారగుటచేత మరణించినప్పుడు ఖననము చేయుటయేగాని కాల్చివేయుటలేదు. లింగమును వీరశైవులు ఒక తేజః పుంజముగా భావింతురు. దాని కాంతి. వారు దానిని ధరించినప్పుడు తమదోషములన్నింటిని కాల్చివేయునని వారి విశ్వాసము. ఇట్లు పవిత్రులుగా భావించిన వీరశైవులు. బంధువుల మరణము లందు ఆచరింపవలసిన పంచ సూతకములను కూడా విసర్జించుచున్నారు.

షట్స్థలములు :

లింగాయత మతానుయాయులు ఈశ్వరుని స్థలమని పేర్కొనుట సంప్రదాయముగా నున్నది. ఈశ్వరుడు అనంతమైన వాడు. కాని ఆ అనంతత్వములోను కొన్ని పరిమితులున్నవి. పరమాత్మయైన శివుడు తనను తాను లింగముగాను, అంగముగాను రెండు విభాగములుగా చేసికొని యున్నాడు. ఈశ్వరుని దివ్యశక్తిని కూడ రెండు విధములుగ విభజింతురు. 1) శక్తి 2) భక్తి. భక్తి యనగా ఈశ్వర సన్నిధాన మనియే అర్థము. కాని ఇచట భక్తి అనగా ఉపాసన లేక పూజ అని భావము. ఉపాసన వలనే భక్తుడు ఈశ్వరునకు ఆత్మార్పణము చేయుచున్నాడు. లింగము లేక ఉపాస్యము అను దానిని పూజింతురు. ఇక అంగ మనగా ఉపాసకుడు లేక

పూజించు వాడని అర్థము. ఇట్లు చూడగా భక్తి అనగా ఉపాసనయే అగు చున్నది. ఉపాసన క్రమముగా వృద్ధి చెంది సామరస్యము లేక అద్వైతము అను దానిని సాధించును.

ఇదివరకు చెప్పినట్లుగా స్థలము అంగమనియు లింగమనియు రెండు విభాగములై యుండును. దీనిలో తిరిగి ఒక్కొక్కటి మూడు విధములుగా విభాగింప బడుచున్నవి. ఇట్లు చూడగా అంగము అనునది త్యాగాంగము, భోగాంగము, యోగాంగము అని మూడు విధములు. అట్లే లింగము మరి మూడువిధము లగుచున్నది. ఇష్ట లింగము, ప్రాణ లింగము, భావ లింగము అనునవి ఈ మూడు.

త్యాగాంగ మనగా విశ్వ జీవమును పొందుట. విశ్వ జీవమును పొందిన వాడు ప్రాపంచిక సంబంధములను త్యజించి త్యాగాంగుడుగా ఎన్నబడు చున్నాడు. ఇతడు ఇష్ట లింగమును పూజించి ధ్యానించును.

భోగాంగ మనగా తైజస జీవముగా మార్పు చెందిన వాడు. ఇట్టి భక్తుడు ప్రాపంచిక సంబంధములను విస్మరించి ఆత్మ జ్ఞానమును పొందును. అధ్యాతిక చింతనము నందు ఆనందమును పొందును. అందుచేత అతడు భోగాంగిగా పేర్కొన బడుచున్నాడు. అతనికి ప్రాణ లింగము పూజా స్థానమై యొప్పు చున్నది. ఇక యోగాంగ మనగా భక్తుడు ప్రాజ్ఞ జీవుడుగా పరి వర్తనము నొందుట. నశ్వరమైన శరీరమును గలిగిన వాడగుటచే అతడు అజ్ఞానము నందును వాసనల యందును చిక్కుకొని యుండుట వలన ఈశ్వరునికి దూరముగా ఉండును. కాని ప్రాజ్ఞ జీవనమును పొందిన తర్వాత ఇంద్రియములు మనస్సు మార్పు చెందుట వలన దివ్యశక్తి జ్ఞానమును పొందు చున్నాడు. ఈ విధముగా అతని నశ్వర శరీరము నశించగా నూతన జ్ఞానో దయ మగుచున్నది. అతడు యోగాంగుడుగా భావింప బడుచున్నాడు. అతనికి భావ లింగము పూజా స్థాన మగుచున్నది.

ఈ విధముగా ఇష్ట లింగము, ప్రాణ లింగము, భావ లింగము అనునవి ఈశ్వరుని విభిన్న స్వరూపములే. భక్తుడు తన శక్తి కొలది

ఈశ్వర సాన్నిధ్యము పొందుటకు త్యాగాంగ, భోగాంగ, యోగాంగములను పొంది మూడు విధములైన లింగములను ఉపాశించి తరించు చున్నాడు. ఇదియె షట్ స్థల విధానము.

వీ ర శై వ ము - ప్ర యో జ న ము :

వీరశైవము వైదిక మతమును, జైన బౌద్ధ మతములను ప్రతిఘటించుట కేర్పడిన శైవమతము. భరత ఖండమున ముఖ్యముగ దక్షిణ ప్రాంతములందు వ్యాపకమును బొందిన ప్రాచీన మతమని శైవాచార్యుల చరిత్రలు తెల్పుచున్నవి. ద్రవిడాంధ్ర కర్ణాటక దేశములందు శైవము వ్యాపించిన విధమును భక్తుల చరిత్రములు విశదము చేయుచున్నవి. శంకరాచార్యులు జైన బౌద్ధ మతములను నిర్వీర్యముల జేసినను ప్రజాసామాన్యమునం దామతములు వ్యాప్తిని గాంచి యున్నవి. అద్వైత సిద్ధాంతములు ప్రజలకు దుర్బోధ్యములు. జైన, బౌద్ధ మతములు నాస్తిక మతము. అద్వైత సిద్ధాంతములు, జైన బౌద్ధ మతములు, వైదిక కర్మల ప్రతిభను తగ్గించినవి. ప్రజాహృదయము నందు భక్తి మార్గము ప్రబలి నూతన వికాసము గలిగినది. ప్రజా హృదయమునందు కలిగిన నూతనోత్సాహమును వీరశైవము పల్లవింప జేసిన విధమును బసవేశ్వర చరిత్రము తెల్లము జేయుచున్నది. బసవేశ్వరుడు బ్రాహ్మణ కులము నందు జన్మించినను ఉపనయనమును నిరాకరించి వీరశైవ దీక్షను బూనిన పరమ శివ భక్తుడు. వీరశైవము కర్మమార్గమును నిరసించుచున్న విధమును వీరశైవ సిద్ధాంతములు వెల్లడి చేయుచున్నవి. బసవేశ్వరుడు ఒడుగును నిరాకరించుచు తండ్రికి జెప్పిన సమాధానము కర్మ నిరసనమును తెలియ జేయుచున్నది.

> "శూలి భక్తుల కెత్తుకే లద్రిజాటి - మాలలకెత్తుట మఱి తప్పుగాదె?
> కర్మపాశంబు లొక్కట దెగనిల్గి - కర్మంబు ద్రాళ్ళుదాగట్టుకోదగునే?
> రుద్రాక్ష భసితాదిముద్రలుదాల్చి- క్షుద్రముద్రలుదాల్ప గూడునే చెపుమ?
> యీరీతి ద్రాటికి దూరమైయున్న - వీరమాహేశ్వరాచార దీక్షితుని
> నిర్మితోభయకర్మనిర్మూలు నన్ను - గర్మాబ్ధిముంచుట ధర్మమే నీకు?
> గ్రచ్చుఱ గన్నుల గానవు గాక- వచ్చునే బసవని వడుగు సేయంగ

బ్రహ్మ శిరోహరు బ్రమద్వైకవంశ్య - బ్రహ్మ వంశ్యుండని భావించెదెట్లు?
జాతిగోత్రాతీతు సద్గురు జాతు - జాతిగోత్ర క్రియాశ్రయు జేసెదెట్లు?
అకులస్థుడైయున్న యభవుని భక్తు - నికి నేకులంబని నిర్ణయించెదవు?
కావున నెన్ని మార్గములను వడుగు - గావింపగారాదు కథలేమి చెప్పు"

జీవ యాత్రను, దేవ యాత్రను జేయగల విధమును వైదిక మత ధర్మముల అనంత విధములను నిర్దేశించు చున్నవి. దేహధారుల కవ్యక్తమును గ్రహించుట దుస్తరము. అవ్యక్తము వ్యక్తము ద్వారా గ్రాహ్య మగుచున్నది.

శ్లో॥ క్లేశో z ధికతర స్తేషామవ్యక్తాసక్తచేత సామ్
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవిద్భిర వాప్యతే

జీవయాత్రను విషయ యాత్రను జేయక శివయాత్రను జేయుటకు సర్వకాలసర్వావస్థల యందును శివ సందర్శన సంస్మరణ సంకీర్తనములు సాధనములుగ నున్నవి. జీవ యాత్రను శివ యాత్రను జేయుటకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు గురులింగ జంగమార్చన లందు భక్తి పరవశములు కావలయును. జీవయాత్రను దేహ యాత్రార్థము గాక ఆత్మ యాత్రార్థము చేయవలసిన విధమును సాధకునకు వీరశైవము వివరము చేయుచున్నది.

సకల మానవుల యందును దేదీప్యమానమగు తేజము ప్రక్షిప్తముగ నున్నది. నాద సంజాతమైన లింగ శరీరము సకల దేహాంతర్యామియై జీవ యాత్రను మోక్ష యాత్రను జేయుటకు సాధనముగ నున్నది. జీవ యాత్రను కైవల్య యాత్రను జేయుటకు బాహ్య లింగ ధారణమును, నంతర్లింగ ధారణమును నుపయోగ పడగల విధమును వీరశైవాగమములు వివరించు చున్నవి. ఈ రహస్యమునే అపరోక్షానుభూతి యందు శంకరాచార్యులు విశదము చేయుచున్నారు.

శ్లో॥ యత్ర యత్ర మనోయాతి బ్రహ్మణ స్తత్ర దర్శనాత్,
మనసో ధారణం చైవ ధారణా సాపరామతా

(అపరోక్షానుభూతి)

శ్రీగురు కటాక్షము అధికారియైన భక్తునకు వీరశైవ దీక్ష నొసంగి కృతార్థుని జేయు చున్నది. వీరశైవదీక్ష కధికార లక్షణములను బసవ పురాణము, వీరశైవ దీక్షా బోధ ఇటులు వివరించుచున్నది

"తగని వారికి దీక్ష దగజేయు గురున - కగు బ్రమాదంబు మహాదేవుచేత
గురువులు శిష్యుని గుణవిశేషముల-నరయక దీక్ష జేయగ నెట్లు వచ్చు
బాలురకును మద్య పాయికి, ద్యూత - శీలికి మాంస భక్షికి, నజ్ఞానకును
ఆతురునకు, వేశ్య, కంగహీనునకు - నీతిగాదట వ్యసనికి దీక్షజేయ
నివి దెలియక దీక్షలిచ్చిన గురున - కవు నరకంబని హరువాక్య మనుచు."

జీవ యాత్రకు బరమ ప్రయోజనము బ్రహ్మానందమయమైన విశ్వ కల్యాణము. జీవుఁడు జీవయాత్రను జేయుటకు విశ్వమంతయును స్వాగత బొసగుచున్నది. జీవుడు జీవయాత్రను జేయుటకు విశ్వమంతయును విశ్వేశ్వర జీవ విశ్వభావములను, జ్ఞేయ జ్ఞాతృ జ్ఞాన భావములను, కార్య కర్తృ కారణ భావములను, గురు లింగ జంగమ రూపములను, సాధ్య సాధక సాధన భావములను సంభవమగుచున్నది. అవ్యక్తమైన పరమాత్మకును, వ్యక్తమైన విశ్వమునకును, వ్యక్తావ్యక్తమైన జీవునియందు ధర్మప్రతిష్ఠ గలుగుచున్నది. జీవుడు సహజముగ వ్యక్తమైన విశ్వమునందు దేహభ్రాంతిని బొంది సుఖప్రాప్తికి దూరస్థుడగుచున్నాడు. అవ్యక్తమును గనుగొనుటకు సాధనమైన వ్యక్తము స్వయముగను ప్రతిబంధకమగుచున్నది. జీవయాత్రయందు వ్యక్తావ్యక్తముల పరిజ్ఞానము మతములకు, ధర్మములకు, కర్మలకు, సాహిత్యములకు, కళలకు, శాస్త్రములకు బరమ ఫలము. అవతార మూర్తులు, మహర్షులు, తత్త్వజ్ఞులు, జ్ఞానులు, యోగులు, త్యాగులు, శాస్త్రిజ్ఞులు, ధర్మజ్ఞులు, కర్మజ్ఞులు, భక్తులు, జీవయాత్రా ఫలమును సాధించుటకు జేసిన తపః ఫలమును ప్రపంచ విజ్ఞాన మనంతముగ బోధించుచున్నది. నిగమాగమములు, దర్శనములు, గీతలు, ధర్మ శాస్త్రిములు, పురాణములు, కావ్యములు, నాటకములు, కళలు సువ్యక్తము చేయుచున్న ఈ యనంత విజ్ఞానము జీవయాత్రకు సాధనంబైనను జనసామాన్యంమునకు దుర్గ్రాహ్యముగ నున్నది. జీవ క్షేత్రము

నందు వ్యక్తావ్యక్తములకు ధర్మప్రతిష్ఠను సమకూర్చుటకు భగవద్భక్తి పరమ సాధనముగ నున్నది.

"జంగమావలి వినిశ్చయ మెట్టులనిన - సంగత లింగదీక్షా కాలములను
త్రివిధ మూర్తులకును శ్రీగురుస్వామి - త్రివిధ విమ్మనియే. నా త్రివిధ మెట్లనిన
తనువెప్పుడును గురూత్తమునకు మనము - దనర లింగమునకు ధనము
భక్తులకు
ఘనమనోవాక్కాయ కర్మసత్క్రియల - దనగురుని యనుజ్ఞ దప్పకిచ్చినను
ఘనములకెల్లను ఘనమైన లింగ - మును శ్రీగురుండును, ముదమార నిచ్చు
నటుగాక దీక్ష నీవాసించినపుడు - తటుకున దనుమనోధనము త్రిమూర్తు
లకు సమర్పింప వాలాయంబుగాన - నొకటియు నీది గాకుండుట దెలసి
త్రివిధమూర్తులకును త్రివిధ వస్తువుల - నవిరళప్రీతి నీవర్పించి తేని
బట్టించు సద్భక్తి భావమంతటను - గట్టిగా దొలఁగు నీకార్మికమలము"
(వీరశైవ దీక్షబోధ 42 పుట)

అణవ మలమును, మాయామలమును, కార్మికమలమును బాసిన సాధకుడు ధర్మ ప్రవర్తకుడై, శ్రీగురుకటాక్షమునకు బాత్రుడై, లింగధారణ రూపమైన చిన్మయ దీక్షను బొంది శివస్వరూపుడగుచున్నాడు. శివలింగ స్వరూపుడైన సాధకుడు శివలింగ స్వరూపులైన జంగమ భక్తుల తీర్థ ప్రసాదములను గైకొని ప్రకృతి కల్పితములైన భేదావరణములను విడిచి గురు లింగైక్యమును బొందు చున్నాడు.

సకల మతములకును లక్ష్యము జంగమ సేవ. ప్రాణహింస చేయక ప్రాణులకు సంతోషమును గలుగజేయుటయే ఈశ్వర పూజాఫలమని మతము లన్నియును జాటుచున్నవి. బసవేశ్వరుఁడు లింగధారులైన భక్తులను జాతి మత భేదములను విసర్జించి, పూజించి మానవ సోదరత్వమును జంగమ రూపమునకు, స్థాపించిన విధమును బసవ చరిత్ర రమ్యముగ బోధించు చున్నది.

వీ ర శై వ స ం ఘ ము :

వీరశైవమునకు శివభక్తి లింగధారణము, విభూతి రుద్రాక్షధారణము, పంచాక్షరీ మంత్రము, లింగపసాయత శస్త్రధారణము ప్రధాన లక్షణములు. వీరశైవమందు శివభక్తి వీర స్వరూపమును దాల్చుచున్నది. శివభక్తి పరవశు లైన భక్తులు తమ కన్నులను, దారా పుత్రాదులను, ప్రాణములను, శివార్ప ణము చేసి కైవల్యమును బొందిన విధమును భక్తుల కథలు దెలుపుచున్నవి. కన్నప్ప, సిరియాలుడు, నిమ్మవ్వ, కుమ్మర గుండయ్య, చౌడయ్య, బొమ్మయ్య, వైజవ్వ, దూడయ్య, శ్వపచయ్య, కక్కయ్య, గుడ్డవ్వ, మొద లగు భక్తుల కథ లత్యద్భుతమైన వీరభక్తిని దెలుపుచున్నవి. భక్తుల ప్రాకృత నామములె చిత్త పరివర్తనమును దెలుపు చున్నవి. వీరశైవ ధర్మము సాంఘిక పరివర్తనమును, మతపరివర్తనమును ప్రతిపాదించినది. వీరశైవ సంఘమునకు బసవేశ్వరుడు దండనాయకుడు. మాహేశ్వరులు సేనాపతులు. భక్తులు సైనికులు. భక్త సైన్యము శత్రు మిత్రాభిమానమును, ప్రాణ మాన ధనాభిమానమును లేక శైవ ధర్మ నిర్వహణమును జేయ బూనినది. జంగము లైన శివభక్తులందరును శివస్వరూపులు. వీరశైవులు బ్రాహ్మణులు - మాలలు, పండితులు - పామరులు, ప్రభువులు - ప్రజలు, స్త్రీలు - పురుషులు, దొంగలు - దొరలు మొదలగు భేదావరణము లేని శివభక్తులు. శివ భక్తులు వారి సర్వస్వమును జంగముల కర్పించి శివానందమును బడయుదురు. వీర శైవము జంగమ భక్తిని, భవినిరసనమును బోధించినది. లింగధారణము లేని వారందరును భవులు. భవులు నిరసింప బడిన విధమును బసవ పురాణము వీర శైవాగమములు విశదము చేయుచున్నవి. వీరశైవము బ్రాహ్మణ్యమును, యజ్ఞయాగాదులను, కర్మలను నిరసించి నిందించుచున్నవి. పాల్కురికి సోమనాథాది బ్రాహ్మణులు కొందరు కుల గోత్రములను విసర్జించి వీరశైవ దీక్షను స్వీకరించి కృతార్థులైరి.

మల్లికార్జున పండితారాధ్యులు మొదలగు వారు, వీరశైవ దీక్షను బూని యును గులముతో బొత్తును విడువజాలక, వీరశైవ సంఘమునందు జేరజాలక పోయిరి, "భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు బాయ లేను నేను బసవ లింగ" యనుచు మల్లికార్జున పండితు డాక్రోశమును జేయుట లింగధారణ

స్వీకారమును, బసవమత స్వీకారాభిలాషను సూచించుచున్నది. లింగధారణ స్వీకారముకాక కేవలము శైవమత స్వీకారమునే తెలిసిన యెడలను, బసవ లింగ నామ సంస్మరణమునకును భక్తి వలపునకును నర్థము గనుపడదు. పితృమేధాది కర్మల విసర్జనమే లింగధారణమునకు నిదర్శనముగనున్నది. ప్రస్తుతము లింగధారి బ్రాహ్మణులందు వాద ప్రతివాదములకు మూలమైన ఖనన సంస్కారమును లింగధారణ దీక్షను గైకొనిన వారియందు గొందరు సంబంధ బాంధవ్యములను విసర్జింప జాలక కులాచారముల నవలంబించు చుండిరి. లింగధారులయ్యును వీరశైవాచార పరాయణులు గాని బ్రాహ్మణ వైశ్యాదులుండుట కిదియే కారణమై యుండవలయును. వీరశైవ ప్రతిభ తగ్గిన తరువాత బ్రాహ్మణులు, వైశ్యులు లింగ ధారణ దీక్ష పొందుట యసంభవము. లింగధారి బ్రాహ్మణులు వీరశైవ నామము నెపుడు స్వీకరించినను భిన్నమతముల వారును, భిన్నవర్ణముల వారును, వీరశైవులై వర్ణాశ్రమ ధర్మములను బారద్రోలుటకు జేసిన మహాప్రయత్నములను వీరశైవ మతచరిత్రము విశదము చేయుచున్నది. వీరశైవమతమునకు నేటికినిగల ప్రాబల్యమును గర్ణాటక దేశమునందుగల వీరశైవ మఠములు విశదము జేయుచున్నవి. వీర శైవ మఠాధిపతు లితర మఠాధిపతులవలె సకల గౌరవములను బొందు చున్నారు. వీరశైవము తలపెట్టిన కులావరణ నిర్మూలనము దుస్తరమైనది. లింగాయతము, జంగములు, సాలెలు, జాండ్రలు, ప్రత్యేక కులమువారై మరి కొన్ని కులము లేర్పడినవి. వైదిక ధర్మ ప్రాబల్యము తిరిగి తలయెత్తినది. భక్తి ప్రధానమైన వీరశైవము నిర్జీవమైన యాచార సాంప్రదాయ బద్ధమై సాంఘిక ప్రయోజనములకును, మానవకల్యాణమునకును నిరుపయోగమైనది.

## బసవేశ్వరుడు - వీరశైవము

### బసవేశ్వరుని చరిత్రము :

శ్రీశైలమునకు పశ్చిమ దిక్కుగా కర్ణాటక మను పేరుగలిగిన ఒక దేశమున్నది. ఆ కర్ణాటక దేశములో హింగుళేశ్వరమను ఒక పట్టణము ఉన్నది. అచట మండంగి మాదిరాజు అను ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడుండెను.

అతని భార్య మాదమాంబ. ఆమె భర్తననుసరించుచు పతివ్రతగా ప్రఖ్యాతి నొందెను. ఆమె సమస్త సద్గుణాలంకార. అతిథి సంతర్పణ, అత్తమామల సేవను ఆమె శ్రద్ధగా చేయుచుండును. మాదిరాజు దంపతులకు కలిమికి లోటులేదు. కాని సంతాన రాహిత్య మను వ్యథ ఒక్కటియే వారిని బాధించుచుండెను. ఇట్లుండగా పెద్దల సలహాపైన ఆమె సంతానమునకై నందికేశ్వరుని నోము నోచుటకు పూనుకొనెను. తొలి సోమవారమునాడు శుచి స్నాతయై పసుపు పూసికొని తిలకము ధరించి రుద్రాక్షమాలలను మెడలో దాల్చి పతిసమేత ముగా నందికేశ్వరు నాలయమునకేగి, నవదిన పరిసమాప్తిగా విధ్యుక్తముగా నోము నోచి దశమదివసమున అచటి నంది విగ్రహమునకు సుగంధ జలముల అభిషేక స్నానము చేయించి నానావిధ సుగంధ పుష్పముల బిల్వపత్రముల చేత పూజచేసి దూపదీపావసర నైవేద్యము నొసగి నిశ్చలమైన మనస్సుతో ఇట్లు ప్రార్థించెను. ''ఓ నందీశ్వరా! నీకును శంభునకును భేదమెంతయును లేదు. భక్తులను రక్షించి వారి కోర్కెలు తీర్చుట నీకు దీక్ష. నాకోర్కె నెర వేర్చి నీవంటి కుమారుని నాకు దయచేయుము. నీ పేరు పెట్టుకుని అతనిని పెంచి పెద్దచేసి పున్నామనరకమును తప్పించుకుని నీసాన్నిధ్యమున కైలాస పతి సన్నిధిలో చేరుదుము. ఇట్లు ప్రార్థించగా అదేమి చిత్రమో కాని నంది కేశ్వరుని అనుగ్రహము చేత జనులందరు చూచుచుండగా వాయువశమున పూజ చేసిన బిల్వపుష్పము ప్రసాదముగా ఆమె చేతిలో పడెను. ఆ ప్రసాద మును భర్త చేతికిచ్చి మరలగ్రహించి తలలో అలంకరించుకొనెను.

కొంతకాలమునకు నందికేశ్వరుని మహిమచే మాదాంబ గర్భవతి అయ్యెను. నిజమునకు ఈశ్వరుని అనుజ్ఞచేత నందికేశ్వరుడే ఆమె గర్భమున ప్రవేశించెను. గర్భ లక్షణములు చూచి మాదాంబ చెలికత్తెలు, బంధువులు చాలా సంతోషించిరి. కాని విచిత్రముగా, పదినెలలు దాటినను ఆమె ప్రసవించ లేదు. ఇది ఒక దైవశోధన వలె నున్నది. దైవానుగ్రహమునకు ఎదురు చూడ వలసినదే అని ఆ దంపతులు మూడు సంవత్సరములు సంతానమునకై నిరీ క్షించిరి. అప్పుడు మాదాంబ నందీశ్వరుని ఆలయమునకేగి అతనిని దర్శించి తనకు కలిగిన విపరీత స్థితిని ఇతరుల వలన అవమానమును విన్నవించుకుని "తండ్రీ నన్ను రక్షింపుము. గర్భ భారము వహింపలేక నీ ఎదుట మొరపెట్టు

కుంటిని. నీవుదక్క నాకెవ్వరును లేరు.'' అని అతని ఎదుట వ్రాలి నిద్రావస్థ లోకి జారిపోయెను. ఆ తాత్కాలిక సుషుప్తస్థితియందు నందికేశ్వరుడు స్వప్న మున మాదాంబకు సాక్షాత్కరించెను. అత డిట్లనెను. ''అమ్మా నీది అపూర్వ గర్భము. నీకు ఆది వృషభమూర్తి నందీశ్వరుడే అవతరింపనున్నాడు నేను నీ గర్భస్థుడనై యుండగా నీకింత భయమేలా? నీకు శుభ మగును. శీఘ్రముగనే నీవు ప్రసవించెదవు. నీకు కలిగిన శిశువు బసవన్న యను పేరుతో ప్రఖ్యాతి వహించి బౌద్ధుల నాస్తిత్వమును అణచి శివమత స్థాపనము చేయగలవాడు'' అని పలికి అంతర్హితుడయ్యెను.

ఇట్లుండ నొక శుభదినమ్మున శుభ నక్షత్రమున గర్కాటక లగ్నము నందు మాదమాంబకు కుమారుడు పుట్టెను. ఆ బాలునియం దతర్హితుడై యున్న శివుడు మునివేషధారియై వచ్చి బాలుని ఒడలంతయు విభూతిధారణ చేసెను. జనులందరు ఆశ్చర్యమునందిరి. అంత శివుడు మాదమాంబను గాంచి యిట్లనెను. "సతీ తిలకమా! నేనీసమీపంబునన్న కప్పడి సంగమేశ్వర స్థానంబున మాదస యను నామంబున నివసించెడు మౌనిని. ఈ బిడ్డడు నాసుతుండు. నేనెన్నడు వీని నెడబాసి యుండను లోకహితార్థంబు వీడు నీ సుతుండై నే డుదయించినాడు. నాయనుంగుదనయుం జూడ మదిగుదురుటచే నేడీతనింగన నేగు దెంచితిని. నీపతిధన్యురాలవు. నీగర్భంబతి పవిత్రమైనది. వీని పుట్టుక వలన మీ దంపతులు చరితార్థులైరి. మీకిక భవ పాశ బంధములు లేవు. వీనివలన మీ కఖండ యశము గలుగును. వీనికి జన్మ జన్మంబుల నేనే గురుండను. మరియొక రహస్య మేమననాపై నానవెట్టి జెప్పుచున్నాను. వీని కెన్నడును లింగార్పితము గాని పదార్థ మేదియును బెట్టగూడదు సుమీ'' యని చెప్పి అంతర్థానమందెను. అచట జనులందరు ఈతడే హరుండని కొని యాడిరి. నందికేశ్వరుని యాజ్ఞ ప్రకారము ఈ బాలునకు తల్లిదండ్రులు 'బసవన్న' యని నామకరణంబు గావించిరి. బాలుడు దినదిన ప్రవర్ధ మానుండగుచు విద్యా బుద్ధులు బాగుగా నేర్చినవాడై ఉపనయనవయస్కు డయ్యెను.

తండ్రి మాదిరాజు బాలున కుపనయనము చేయ వలయునని బ్రాహ్మణులచే ముహూర్తము నిశ్చయించుటకు ప్రయత్నించు చుండ బసవన

శివభక్తులకు ఉపనయనము వలదని తండ్రికి బోధించెను. ఇంకను బసవన్న శివుని గూర్చి యిట్లుచెప్పెను. సర్వాత్మ స్వరూపుడును జగదంతర్బహిర్వ్యాప్తుడును, సచ్చిదానందమూర్తి, శ్రీ శివలింగమూర్తియే నాకు గురువును, పరమ గురువును, పరమేష్ఠిగురుండును నై యున్నవాడు. మంత్ర రాజం బనంబడు ప్రణవ సహిత షడక్షరియైన ప్రణవ పంచాక్షరియె నా జప మంత్రంబు, జటాధారణంబును, విభూతి రుద్రాక్షమాలాలం కారణమునే నావేషము శివ మతవైరుల నుద్ఘాటించు కుఠారమగు భక్తియే నాయాయుధంబు. భక్తియుక్త సాష్టాంగ దండ నమస్కృతికే గదా భగవంతుడు ప్రసన్నుడగుసు. ఆట్టి భక్తుల దర్శనము పాపక్షయ కరము మోక్ష ప్రాప్తికరమునగును భక్తియే జీవన్ముక్తి. కనుకనే భక్తికిని బ్రాహ్మ్యమునకును నైకమత్యము లేదని తొలుతనే దెలిపియుంటి నని చెప్పి భక్తియేగాని బ్రాహ్మ్యం బక్కర లేదని తండ్రికి జెప్పి నాకు దండ్రియు, తల్లియు, సమస్త బంధువులును శివుడేగాని తదితరులు గారని తల్లిదండ్రులను విడిచి నాగాంబ యను సహోదరి వెంటరాగా వెడలి బసవన్న ఒక శివాలయ ప్రదేశమునకు చేరి అచట గూర్చుండెను. అతడచట తన గురువగు జాత వేద మహాఋషిని భక్తి శ్రద్ధలతో సేవించుచు ధర్మ, నీతి, సమాజ, రాజ్య శాస్త్రములయందు నిపుణుడగుటయే గాక శివానుభవజ్ఞానమును కూడ నార్జించుచు యాత్రికులకు లింగతత్వమును, శివానుభవజ్ఞానమును ఉపదేశింప మొదలిడెను.

అంత బిజ్జల దేశపురాజు నొద్ద దండ నాయకుడగు బలదేవుడు బసవనకు మేనమామ బసవని తన యల్లునిగా జేసి కుందునని యోచించి వివాహ ప్రయత్నము చేసెను. కూతురగు గంగమాంబను తీసికుని వచ్చి భక్తులకు, పెద్దలకు చూపించి, దీని నామేనల్లుడగు బసవన్న కిచ్చి వివాహము చేయుటకు మీరెల్ల దామోదించి శుభ ముహూర్తము నిశ్చయింపుడని అభ్యర్థించెను. బలదేవుడు బిజ్జలుని రాజ్యమందు ప్రధాన మంత్రియై పుత్ర సంతానములేక ఏక పుత్రిక గలవాడై యుండెను. బసవడు గురునాజ్ఞ ప్రకారము బలదేవుని కూతురగు గంగ మాంబికను పెండ్లి యాడెను. బసవేశ్వరుడు సమీపమందున్న కప్పడి సంగమేశ్వరమున నున్న గురువును దర్శించుట

కేగెను. బసవన్న భార్య గంగాబికయు, నగ్రజయగు నాగాంబికయు వెంటజనిరి. ఆలయముచుట్టు ప్రదక్షణలు చేసి బసవేశ్వరుడు స్వామి కభిముఖంబుగా సాష్టాంగ నమస్కారము చేయగా యీశ్వరుడు పూర్వపు జంగమ వేషంబున శిష్యుని కౌగలించుకుని తన నిశ్చల భక్తికి మెచ్చి యిట్లు పల్కెను "బసవన్నా! ఇచ్చటికి వచ్చుచు బోవుచున్న భక్తవరులచే నీ చరిత్ర విని పలుమార్లు అంతరంగమున నిన్నే తలచు చుంటిని. నేను భక్త పరాధీనుండనగుట నీ యంతరంగ భక్తికి మెచ్చి నీకు నాసామీప్యం బొసంగి నాయంత వానిగా జేసి నీవలన గొన్ని ఘనకార్యంబులు సేయింపందల కొంటిని. నీకును నా కభేద వ్యవస్థా ప్రవృత్తి యగుటం జేసి నీవు చేసిన కార్యంబు లన్నియు నేనుచేసి నట్లంగీకరింతును. ఈ నీ స్వరూపమే నా స్వరూపము. నీ యవతారమే నాయవతారము. ఇంత యేల నీవే నేను. కనుక నాయనా! నీకు జిరకాలము నుంచి మనోగతంబుగా నెలకొని యున్న శివ భక్తి మితి మీఱి కుండునట్లుగా గాపాడు కొనుచు మెలంగు చుండుము. భస్మ రుద్రాక్షలు ధరించిన వారిని శివ స్వరూపులుగా భావించు కొనుము. ఒకవేళ శివభక్తులం దేదేని లోపమున్న యెడల దాని దోషంబుగా ఎంచక మేలు గుణంబుగనే భావింపుము. శత్రువులైనను లింగ ధారులై నీ కంట బడిరేని వారిని మిత్రులుగా నెంచుకొనుము. నీవు పట్టినది వీరవ్రతము. అట్టి వ్రతమున కెప్పటికైనను చ్యుతి లేకుండు నట్లు గాపాడుకొనుము. నీమతంబు వర్ణాశ్రమ ధర్మంబులను పరిపాటింపని సర్వజన సమ్మతంబు; ఏక శివార్చనా పరాయణంబునగు వీరశైవమతము. ఇట్టి వ్రతమున కెన్నడేని భంగము రానీయక శివభక్తులెల్లఱు నేక జాతి వారె గాని భిన్న జాతి వారుగా వారినెంచి కుల భేదంబు వారియం దారోపించి న్యూనాధిక భావంబులంజూడక సర్వ సమత్వ బుద్ధిచే నందఱ నొక్క జాతి వారుగా నెంచి వారలతో గలసి మెలసి యుండుము. ప్రస్తుతము లోకము శివభక్తి వైకల్యం బొంది యున్నది. అది శివభక్తి మార్గమును వదిలి నూతన భక్తి మార్గములం గల్పించుకొని వితండ వాదములు నీతో జేయు దుర్జనుల యెడ మృత్యు ప్రాయుండవై వారల నిర్మూలింపుము. వేదోక్తమున వర్ణాశ్రమ ధర్మ రాహిత్యంబునగు నాది జంగమ శివ భక్తిని యధావిధిగా నీ భూమి పై విల సిల్లం జేయుము. శివార్పిత శేషమునే గాని యితర పదార్థముల నెన్నడు

గ్రహింపకుము. శివతదాత్మ్యంబు గలవాడ వగుట కందర్పుని దర్ప మడచి వానిని భస్మమాత్రావశిష్టునిగా జేసిన శివుని మాడ్కి నీవును వానిని గెలిచి యుండవలెను గాని, వాని భారికిలోనై మోహ కామా వేశంబుల నొంది పరసతులందిలకించి భ్రాంత చిత్తుండవై వారలయందు బుద్ధను రాగుడవు గాక, నారీస్తన భరనాభీ దేశంబులు దృగ్గోచరంబులైన చిత్త చాంచల్యంబు నొందక యవి మాంస పిండవ సాది వికారములని నిశ్చల మనోభావుండవై స్త్రీ పురుష భేదము దేహము నందే గాని లోని యాత్మకు లేదని గ్రహించి అట్టిభేద రాహిత్యంబు సూచించుటకే, శివుడు సగ మాడ రూపును, సగము మగ రూపును దాల్చి దేహ యాత్రమును భేదముం గనపర్చుచు నంత రంగమున భేదము లేదని పరంజ్యోతి రాకారంబున వెలుంగుచు మనలకెఱి గించు చున్నవాడని నీవు తెలుసుకొని యితరులకు సుబోధకంబుగా నెఱుగ జేయుచు నిర్మోహ నిశ్చల తత్త్వంబుతో గూడిన జీవన్ముక్తుని భావంబున నుండుము. శివైక పరాయణుండవై వచ్చి శరణన్న భక్తులను వచింపక రక్షించుటయే యధికతరమగు శివభక్తియని యెఱుంగుము. స్థావర జంగ మాత్మకమగు నీసృష్టి ప్రపంచంబులో జంగమ మగు సర్వంబును నా స్వరూపంబుగా నెఱుంగుము. అట్టి జంగమంబులకు సర్వదా శరణ్యుండవై రక్షించు చుండుము. కొందఱు వితండ వాదులు నిన్ను వశపఱచు కొనుటకు నిన్ను బోధించి పరమతంబులకు ద్రిప్ప బ్రయత్నింతురు. వారి దుర్బోధలకు మోసపోయి వశపడకుము. ధన్యతం జెందియుండి యుచ్చ నీవు ధన్యతం గాపాడుకొనుము. పట్టిన వ్రతమును దప్పిన యెడల జ్యోతి స్వరూప నిరూ పితుడగు ఫాలాక్షుడు వారిని రూపుమాపును నీ నీమంబును, సత్యంబును, ధీమంతుండవై యెంత మాత్రను బోనీక నిలుపుకొనుము. సర్వదా సాంబ సదాశివ పూజా ధురంధరుడవు కావలెను" అని బసవేశ్వరున కుపదేశించి ముని వేషంబున వచ్చిన యీశ్వరుడు యంతర్ధాన మంది గుడి లోపలికేగి యదా ప్రకారము లింగా కారమున నుండెను. కప్పడి సంగమేశ్వర పుర జనులం దఱును బసవని కొనియాడిరి. బసవన భక్తి అపూర్వ మైనదని తెలిసికొని ధన్యులమైతిమని సంతసించిరి. కర్ణాట దేశమున అడుగంటి యున్న శివ భక్తిని బునరుద్ధా రణంబు గావించుటకు యీశ్వరుడు బసవని పంపెనని

జనులు భావించి బసవని వేనోళ్ళకొనియాడిరి. శివజ్ఞాన తత్త్వ బోధచే బసవే శ్వరుడు గొన్ని దినంబులు కప్పడి సంగమేశ్వరమున యుండెను.

ఇట్లుండగా బలదేవుని మరణానంతరము, బిజ్జలుడు బసవని యోగ్యతను వివిధ విద్యల యందుగల నిపుణతను తెలిసి తేటలను జూచి బలదేవుని స్థానమందు ప్రధానామాత్యుని నియమించగోరి ఇతర మంత్రి జనంబును రాయబారమునకు పంపెను. వారు బసవేశ్వరుని జేరి బలదేవమంత్రి కైలాస గతుండగుటవలన బసవని ప్రధానమంత్రిగా నియమించుటకు బిజ్జలరాజు పంపెనని సవినయంబుగా విన్నవించిరి. బసవ దండుల కంగీకరించి వారి వెంట కళ్యాణ పురంబున కరిగెను. పిమ్మట బసవని ప్రధానమంత్రిగా నభిషేకించి ఊరేగించిరి. అంత పట్టణపు ప్రజలందరు భూలోకమున మాటు పడియున్న శివభక్తిని పునరుద్ధారణ మొనరించుటకు మానవరూపమున నిట అవతరించిన సాక్షాత్తు పరమశివు డితడేయని సంతసించిరి.

మరునాడుదయముననే బసవేశ్వరుడు శివ సంధ్యావందన శివపూజ లోనర్చి కొలువు కూటంబున ప్రవేశించెను. ప్రజలందఱును పిలిపించి శివభక్తి పరులై సర్వదా తమతమ కార్యములు దీర్చుకొనుచుండవలెనని ఆదేశించి, తన రాజ్యమందంతటను రాష్ట్రజనులు సదా తమతమ జీవనయాత్రానుకూలంబు లగు కార్యంబులు చేయుచున్న వారైనను నిర్మల నిశ్చలమనంబులతో శివ పూజామాత్రము తిథి వార మాస సంవత్సర నిర్ణీత సమాల పరివర్తితంబుగా పూజలు చేయుచుండ వలెనని చారులచే ఆజ్ఞాపత్రములు పంపుటయే గాక అది ఒక శాసనముగా ప్రకటింప జేసెను. ఇట్లు ప్రత్యేక నిబంధనలు శాసన రూపముగా ప్రకటించి ప్రతివారును నిత్యము ప్రాతరాది ప్రాతః పర్యంతము దాము చేసిన కృత్యములన్నియు శివార్పితము గావింపవలెనని సామాన్య విధి యొకటి కూడ బ్రకటీ కృతంబు గావించెను. సామాన్య విధియనగా "ఆత్మాత్త్వం గిరిజామతిః పరిచరాః ప్రాణశ్శరీరం గృహం పూజాతే విష యోప భోగరచనా నిద్రా సమాధి స్థితిః, సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి పరాగిలో, యద్యత్కర్మ కరోమి తత్తదఖిలు శంభోతవారాధనం!" ఓంశంభూ మహాదేవా, యీ దేహమందలి యాత్మయే నీవు మతి లేక బుద్ధియే

పార్వతి. ప్రాణములే యనుచరులు. శరీరమే యిల్లు అనగా నీ యాలయము. ఇంద్రియ విషయ భోగములన్నియు నీ పూజ నిద్రయే సమాధి. పదసంచారమే నీకు జేయు ప్రదక్షణము. సర్వ విధములగు వాక్కులే స్తోత్రము. ఇట్లు నా యొనరించు ప్రతిదిన నిత్యకర్మ యేదియూ అదియెల్ల నీ యారాధనముగా గైకొమ్ము" అని ప్రతిదిన మీ ప్రార్థనా పూర్వకముగా నిద్రమేల్కొనవలయునని సామాన్య విధి.

ఇట్లు తన మత ప్రచారము రాజశాసనముగా గావించి బసవేశ్వరుడు విధ్యుక్తముగా ప్రజాపాలనంబు చేయుచు ననేక మహిమలు గనపరచుచు రాజు యొక్కయు ప్రజల యొక్కయు మెప్పును బడయుచుండెను. మరియు నీ బసవేశ్వరుని జనులందరు భక్తి జ్ఞాన వైరాగ్య సంపన్నుడనియు, వేదాంగ పారంగతుడనియు, ధైర్య సాహసదార్యాద్యనేక గుణ గణయుతుండనియు, నీతి కోవిదుండనియు, సకల విద్యా పరిపూర్ణుడనియు, దృఢ ప్రతిజ్ఞుడనియు, నిత్యసత్య వ్రతుండనియు, త్రిగుణాతీతుండనియు, త్రికాలవేదియనియు, శాంత స్వభావుడనియు, సర్వజ్ఞుండనియు, సర్వసంపత్సమన్వితుండనియు, వదాన్యోత్తముడనియు, కేవలము పరశివుని యపరావతారమని నుతించు చుండిరి. నిత్యము అనేక మంది భక్తులు బసవని దర్శనార్థము వచ్చుచుండిరి. శివపూజలొనర్చుటకు వారికి తగిన సామగ్రి బసవన యిచ్చుచుండెను. వారంద రకు భోజన పదార్థములు బసవన్న కావెళ్ళతో పంపుచుండెనట. వారు నిర్విచా రులై సకలోపచారంబులు బొందుచు దేవేంద్ర భోగము లనుభవించుచుండిరి.

ఇట్లుండగా బసవన యగ్రసోదరియగు నాగమాంబ భర్తృ సమే తంబుగా బసవేశ్వరుని యొద్దనే ఉండెను ఆమెకొక మంచి ముహూర్తమున కుమారుడు పుట్టెను. వానికి 'చెన్న బసవేశ్వరుడని' నామకరణబొనర్చిరి. ఆ చిన్నవాడు బసవేశ్వరున కేమాత్రము తీసిపోక సకల సద్గుణ సమేతుడై భక్తి జ్ఞాన వైరాగ్యంబులు గలవాడుగా నుండెను. ఈ చెన్న బసవేశ్వరుని లింగధారణంబును పంచాక్షరీ మంత్రోపదేశంబును బసవేశ్వరుడే యొనరించి నిజాగ్ర శిష్యునిగా బరిగణించుచుండెను. అతండు ''గురుర్బ్రహ్మర్విష్ణుర్గురు ర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్పరబ్రహ్మ" యను న్యాయాను సారంబున బసవేశ్వరుడే సమస్తంబునని నమ్మికొని యతని సేవయే సర్వదా యేమరుక

చేయుచుండెను. జనులందరు యితనిని చిన్న బసవేశ్వరునిగా భావించుచుండిరి. మేనమామ అడుగు జాడలందు నడచుచు దర్శించుటకు వచ్చిన భక్తులందరకు తగిన యుపచారములన్నియు చిన్న బసవేశ్వరుడు చేయుచుండెను. భక్తుల కోర్కెలను మన్నించి వారికేలోటు జరుగకుండ చూచుచు. అవసరమగునప్పుడు వారిని నిజగురువు (మేనమామ) సామీప్యంబునకు తీసికొనిపోవుచుండెను.

ఇట్లుండ నొకానొక దినంబున బసవేశ్వరుని జూచు నుత్సాహముతో సంగమేశ్వర స్వామి కప్పడి సంగమేశ్వర పురాధిష్ఠాతయగు అల్లమ ప్రభు రూపంబుతో జంగమ వేషము వైచికొని శివధ్యాన పరాయణుండై, సకల విద్యా సంపన్నుడగు పరమయోగివలె ద్వంద్వాతీతుండై, భక్తిరస ముట్టిపడునట్లును, చూచువారల కితడే శివుడను భ్రాంతి గలుగజేయుచు రెండు లింగములు పట్టుకొని చూచువారు ఆశ్చర్యపడున ట్లేతించినాడు. ఈ తీరున వచ్చిన యల్లమ ప్రభువును చూచి బసవన్న కేవలము సంగమేశ్వర స్వామియేయని తలంచెను. అల్లమ ప్రభువును సంగమేశ్వర స్వామియగు శివుని రూపంబుగా భావించి బసవన పరమానంద భరితుడై భక్తి పూర్వకంబుగా నెదురేగి సాష్టాంగ దండ ప్రణామంబులు పదే పదే గావించి బహువిధముల స్తుతించి షోడశోపచార పూజయొనర్చెను. షడ్రసోపేతమగు భక్ష్యభోజ్యాహారంబులన్నియు నొక బంగారు పళ్ళెమందు వడ్డించి నివేదించుటయే గాక తాను స్వయముగా ముద్దలు కలిపి స్వామినోటి కందించెను. సకల ఉపచారములు జరిగిన పిమ్మట స్వామి ప్రేమ పూర్వకమగు మాటలతో బసవని ముద్దాడి మరల బసవని కృప దేశము చేసెను. బసవని భక్తిని, పరిపాలనా విధానమును పలువిధముల కొనియాడెను. 'బసవా' యని నామముచ్చరించినంత మాత్రము చేతచే జంతువులకు సైతము ముక్తికలుగునని స్వామి చెప్పెను. బసవేశ్వరుడు అల్లమ ప్రభు రూపమున సంగమేశ్వరస్వామి వచ్చెనని గ్రహించినట్లును, అందుకే షడ్రసోపేత పూజలొనర్చినట్లును స్వామికి విన్నవించెను. అంత శివుండు బసవేశ్వరునకు వరము లొసంగి అంతర్ధానమయ్యెను. బసవేశ్వరుడు రాచకార్యమును దక్క మిగిలిన విషయములందు ధ్యాసనుంచక యన్నివేళలందును లింగతన్మయుడై యుండెను.

ఒక దినమున బసవేశ్వరుడు శివపూజ గావించుకొని భక్తుల నారాధించు సమయమున గొందరు లోనికరిగి భక్తులతో దాము కూడ భుజింబదలచి లింగ ధారణ లేనిదే లోని కరుగ కూడదని తనపైనున్న వంచెగుడ్డ చింపి ఒక్కొక్క దానియందు ఒక్కొక్క వంకాయలను గట్టి లింగకాయవలె మెడ లకు గట్టుకుని లోనికరిగిరి. బసవేశ్వరుడు వారిని జూచి 'లింగధారణ లేని వారు శివభక్తులయిండ్లకు రాజాలరని, వారు కూడ శివపూజ చేయవలెనని, లింగములు తీయుడని ఆనతిచ్చిన, వారు సిగ్గుజెంది మూట విప్పుటకు భయము చెంది ఒకరి మొఖము లొకరు చూచుచుండిరి. బసవేశ్వరు డది యెరింగి "భయపడకుడు మీ మెడలలోనివి లింగకాయలే గాని వంకాయలు కావు విప్పి చూచికొను" డనెను. మూటలు విప్పిచూడగా అవి లింగకాయలే. వారు కూడ శివపూజ గావించుకొని భక్తులతో పాటు దామును విందారగించి బసవన వలన బహుమానంబులు పొంది లింగమతధారులై బసవేశ్వరుల మతంబు నవలంబించిరి.

ఇట్లు ఇంకను కుంచము, శివలింగమూర్తియగుట కూడ గలదు. మల్లన శెట్టి యను నతడు వ్యాపారనిమిత్తమై గ్రామాంతర మేగును. మల్లనకు కనీసము శివాలయ శిఖరమైన దర్శింపనిదే భుజించనను వ్రతము గలదు. ఆ ప్రదేశ మందు శివాలయము లేమిచే అతడు కుంచము నొక ప్రదేశమ్మున పాతిపెట్టి శివలింగముగా భావించి, కర్ణికార పుష్పంబులతో పూజించి ప్రక్కన అశ్వత్థ వృక్ష శాఖను పాతిపెట్టి నమస్కరించి భుజించుటకు కూర్చొనెను. ఇంతలో వణిజులు నవ్వుకొనుచు మల్లన వ్రత భంగము కావించెనని తలంచి, కుంచము తేవలసినదని నౌఖరుని పంపిరి. అంత మల్లన అక్కడ ప్రతిష్ఠించిన లింగ మూర్తిని పెరుకుట ఎవరి తరము కాదని పల్కెను. అందరు కలసి చూచెద మని ఆ ప్రదేశమున కేగిరి. అంత నక్కడ నొక దేవాలయము, యశ్వత్థ వృక్షము, దానిలోపల లింగాకారముగానున్న కుంభము, పూజింప బడిన పూలు కన్పించెను. మల్లన భక్తి ప్రభావమున కందరు నాశ్చర్య చకితులయిరి. ఆ మల్లనే మల్లేశమల్లన యని ప్రసిద్ధికెక్కెను. ఇట్లే మేకపెంటిక లింగమగుట, జొన్నల రాశి లింగాకార మగుట, మున్నగు కథలన్నియు బసవని శివమాహా త్మ్యమును చూపునవే. బసవేశ్వరుని ప్రభావముననే జొన్నలరాశి మంచి ముత్యములయ్యెను.

ఒకనాడు బసవేశ్వరుల వారభ్యంగన మాచరించు సమయంబున నొక జంగము వచ్చి ''నాలింగ పూజకు నిత్యము దినమునకు మూడు కుంభముల మంచి ముత్యములు కావలెను. ఈ చాతుర్మాస్య దీక్ష యిక్కడ జరుపవలెనని వచ్చితిని'' అని చెప్పగా ఆయన స్నానమయిన పిమ్మట ముత్యము లెట్లిత్తునని యోచించుచుండు సమయమున ఎదుటనున్న యొక జొన్నరాశి మంచిముత్యములై తనకు గనిపించిన దానిని భక్తులకు జూపి నీ యిష్టము వచ్చినన్ని ముత్యములు తీసికొమ్మని యాజొన్నల రాశిని గునుపరచెను. అది చూచి భక్తుడు బసవేశ్వరుల ప్రభావమునకు నాశ్చర్యపడుచు దనకు వలయు ముత్యములు తీసికొనెను. ఆ భక్తుడు వెళ్ళిన తర్వాత మరల జొన్నల రాశి యెప్పటివలె నుండెను. భక్తపారిజాతమని పేరొందిన బసవేశ్వరులయొద్దకు ఎల్లప్పుడు ఎంతో మంది భక్తులు వచ్చి యిష్టార్థ సిద్ధులు పొంది పోవుచుండిరి. అర్ధరాత్రి ఒక్కొక్కప్పుడు జంగములు వచ్చినచో బసవేశ్వరుడు నిద్రించుచున్నను సవ్వడివిని మేల్కొని వారలకు అతిథి సత్కారములు గావించెడివాడు.

భక్తులు ఏది కోరినను అది బసవేశ్వరు డిచ్చుచున్నాడని బసవేశ్వరుని పరీక్షించుటకు సంగమేశ్వర స్వామి యొక దినమున జంగమ రూపమున ఏతెంచి ''ఓ బసవన మంత్రీ! నీకీర్తి దిక్కుదిక్కుల యందు వ్యాపించినది. భక్త మందారుడవట. నీకు ఇది సాధ్యము, అసాధ్యము అనుమాట లేదు. నీ ఉదార సాహసంబులు విన్నది మొదలు నినుజూడవలెనని ఉవ్విళ్ళూరు చుంటిని. నేడు నిన్నొకటి యర్థింప వచ్చితిని. అది నా కొసంగితివేని నీ కీర్తి సమస్త లోకంబులం దేజరిల్లును" అని యనునంతలో బసవేశ్వరుడు చేతులు జోడించి "స్వామీ! యిచ్చు వాడెవడు? పుచ్చుకొను వాడెవడు? "మహేశః ప్రతి గృహ్ణాతు మహేశోవై దదాతి చమహేశస్తారకో భాభ్యాం మహేశాయనమో నమః" యను న్యాయము వినలేదా, సమస్తము మహేశ రూపమె. ఇచ్చు వాడనను నేను బుచ్చుకొను వాడవను నీవును మహేశుడు భక్త స్వరూపుడు. అట్టి భక్త స్వరూపమున నన్ను గృతార్థు జేయవచ్చిన నీవే యీ మహాదేవుడవు. కావున నో మహాదేవా! యిదిగో ఈ యద్దము దిలకింపుము. నీకు మూడవ కన్ను లలాట ఫలకంబున విస్పష్టంబుగా గోచరించు చున్నది. (సంగమేశ్వర స్వామి బసవేశ్వరుని మూడవ కన్ను వేడుట కరు దెంచెను) అని ఒక

అద్దమును చేతికిచ్చెను. భక్త రూపంబున వచ్చిన సంగమేశ్వరుడా దర్పణంబు నతి దర్పంబుతో వీక్షించి యందు బ్రతిఫలించిన నిశఫాలలోచనంబునుంగని విస్మయమంది బసవనచే బహూనేర్పుగ వంచితుడ నైతినని నవ్వుకొని లేచి పోవుచుండగా బసవేశ్వరులు లేవనీక కూర్చుండబెట్టి యిట్లనెను "దొంగ జంగమా! సంగమేశ్వర స్వామి! నన్ను భ్రమయింపబోయి నీవే భ్రమ పడితివి: "భూసురో బ్రాహ్మణ శ్చైవ భూరుద్రో జగమైవచ" యను లోకోక్తి వినలేదా! ఇప్పుడు జంగమ రూపంబున వచ్చిన నీవె ప్రత్యక్ష రుద్రుడవు. నీకు మూడవ నేత్రముండగా నన్ను యాచింపవచ్చితివి. నీ వెక్కడ దాచితివి. శంకర దాసయ్య కిచ్చినది మరల తీసికొనలేదా! దొంగ చేష్ట లెక్కడ నేర్చు కొంటివి. కనుకనే చేతి కద్దమిచ్చి నీకన్ను నీకు గనపర్చి నిన్ను మాయ చేసితిని. ఈ విషయమున నేను గెలిచితిని. 'పుత్రాదిచ్ఛేత్పరాజయ' మ్మనుట సిద్ధించేకదా! నీ ప్రియసుతుండనుగదా, భగవంతుడవు గనుక భక్తుల నడుగుటకును, వారల కిచ్చుటకును నీవెతగుదువు. దేవర దాసయ్యకు ద్రవ్యనిధి నొసంగితివి. శంకర దాసయ్యకు నీఫాలలోచన మొసంగితివి. శిరియాలు రాజు శెట్టి సుతుని జంపించి యాతని భార్యచే బిలిపించి మరుల బ్రతికించితివి. కుమ్మర గుండయ్యకు నిండు యౌవన మొసంగితివి. ఇట్టివేవియు నిన్ను నేను గోరలేదు. నా కవసరంబులేదు. నాకు స్వర్గాది భోగము లవసరము లేదు. సంపద లవసరము లేదు. భక్త భుక్త శేషమే నాభుక్తికి జాలును. నీసేవ భక్తు లనేకు లనేక విధంబుల జేతురు. ఒకళ్ళొకళ్ళొక్కొక్క కైంకర్యముననే దృప్తులై దాననేవారు నీ సాయుజ్యంబు నొందుచుండిరి. ఒక భక్తుడు కేవల మభిషేకమె ప్రధానసేవగా నియమించుకొని దానికి గొన్ని నియమంబు లేర్పరుచుకొని తన జీవిత మంతయు దాని యందే వెళ్ళబుచ్చి తుదకు నీసాయుజ్యంబు నొందెను. మరియొక భక్తుడు పుష్ప కైంకర్యమె ప్రధానసేవగా భావించి పలువిధములగు పుష్పములు సేకరించి దండలు గ్రుచ్చి నీకు సమర్పించుచు, జీవితంబు గడపి పరమపదము నొందెను. వేరొక భక్తుడు నీకు గంధము సమర్పించుటయే ముఖ్యసేవగా నమ్ముకొని ప్రతి దినము నిండ గంధముతీసి నీకు నలదెదనని నియమము చేసికుని యానియము తప్పక నెరవేర్చి నీ ప్రసాదంబు నొందెను. ఇట్లు ఒకటన నేల?

కోట కోటయ్య, పుష్ప దంతుడు, పూజారి కన్నప్ప, ఇంది రేకవ్వ, నమ్మి నంది, బడయ పళ్ళడు, ఏణుమూర్తి ఓహిళయ్య, నరద సోమప్ప, మౌళిగయ్య, బోళవిభుడు, చిరుతొండనంబి, సంగళవ్వ, కరికాల చోడరాజు, హొన్నయ్య చెన్నయ, వీరచోడయ్య, రేచయ్య, చిచ్చి బాచయ్య, నమిత్తాండి, కళ్ళి దేవయ్య సామవేది, మాయభట్టు, కళియంబ నయనారు, శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, సకలేశ్వర మాదిరాజు, కక్కర దేవుడు కేశిరాజు, దండేశ్వరుడు, గణేశ్వరుడు, ఇరవంతుడు, చరమయ్య, కరయూరి చోడుడు, ఏకాంత రామయ్య, బల్లహుడు, శంకరదాసు, ఏణాధి నాధుడు శివలెంక మంచయ్య, బంకే బంక విభుడు, సురియ చౌడయ్య కులచియారు, బెజ్జ మహాదేవి, రుద్ర పశుపతి, కళ్ళయ్య శివరాత్రి శంకరయ్య, భోగి దేవయ్య' దేవదాసు, కిన్నర బ్రహ్మయ్య, మడివాలు మాచయ్య, కడవలనంబి కోట మల్లయ్య, కుమ్మరి గండయ్య, తెలుగు బొమ్మయ్య, కోవూరి బ్రహ్మయ్య, సురియ చండయ్య, బల్లేశు మల్లయ్య, బిబ్బ బాచయ్య, మొరటద వంకయ్య, గౌడగూచి యీ మొదలగు నీ భక్తు లనేకులు, స్త్రీలు, పురుషులు నీకొక్క రొక్కొక్క యుపచారంబు చేసి తరించిరి." సర్వదా సర్వజ్ఞా అధీశ్వరా, పరమేశ్వరా, సర్వాంతర్యామీ, భక్త వత్సలా, భక్త స్వరూపా, భక్త భావ్య హరా, శంభో మహాదేవా, అనంతనామ వేషధారీ, నిన్ను నాకేమియు నిమ్మని యాచింపను. ఓదయానిధీ! నీవు కాలకూట భక్షణంబు గావింపని మునుపును, బ్రహ్మ విష్ణు లుద్భవులుగాక పూర్వమును త్రిపుర సంహారము గాని నాడును, పార్వతీ పరిణయంబుల పూర్వకాలంబున నీవొక్కండవే దేవుడవు నేనొక్కండనే భక్తుడను. నిన్ను నేకోరునది ఏమియులేదు గాని యిప్పటివలె సర్వదా నీయందలి నిశ్చల తన్మయ భక్తినే నాకిమ్మని వేడుచున్నా" ననుచు బసవడు భగవంతుని అనేక విధముల స్తుతి చేసి తన్ను వంచింప వచ్చిన యాతని తానే వంచించి అనందవార్థి నోలలాడు చుండగా జంగమ వేషధారి యగు శివుడు అంతర్థాన మందెను.

ఒకనాడు బిజ్జల రాజు నిండు కొలువు తీర్చియున్న సమయంబున సభాసదులందరు నుండగా బసవేశ్వరుడు అటు యిటు తిరుగుచునవ్వుచు 'ఓ' యని పలికి "భయపడకుము" నేను బట్టుకొంటినని జేతులు చాచి

యేదియో గట్టిగా పట్టుకొనునట్లు పట్టి యుండెను. అదిచూచి సభికులందరు నవ్విరి. రాజు కూడ నవ్వి "బసవన మంత్రీ! గోరంత బూడిద మేన నలదిన కొండంత వెఱ్ఱి పుట్టు" నను సామెత నిజమాయెను. నీ శివభక్తి నీకు దలకెక్కిన గొలది పిచ్చి చేష్టలు పెచ్చు పెరుగు చున్నవి. ఎందుకట్లు చేతులు చాచితివి? పట్టుకుంటినని వెఱ్ఱి ప్రలాపము లాడుచుంటివేమి, అని రాజు పల్కెను. భూపాల తిలకమా! నేను పిచ్చి వాడను గాను. మన త్రిపురాంతకేగు గుడికి దూరముగా, నాజామడ దూరమున, గపిలేశ్వరమను నొక గ్రామము గలదు. అందున్న కపిలేశ్వరునకు నొక తపసి నన్నూరు పుట్ల పాలు మహాన్యాస పూర్వకంబుగా రుద్రాభిషేకం బొనర్చెను. సోమ సూత్రము వెంబడిన బైలు బారిన యాక్షీర ప్రవాహము పురంబున నెల్ల వీధులను నిండి కాలువలై పాఱుచు ప్రజల గమనాగమనంబుల నడుగుదుమ్ము బురదయై కాళ్ళ ద్రొక్కబడి పెను రొంపియై నడచువారి పాదము కూరుకు పోవుటయు, జారుటయు మొదలగు నిక్కట్లు గలుఁగ జేయు చున్నది. అత్యుత్తమురాలు వయోవృద్ధురాలునగు గాళవ్వ యను నొక గొల్ల గటిత వెన్నయు మీగడయు చల్లయు, నమ్ముకొన బోవుచుండ గాలుజారి బోరగిల బడబోవుచు 'బసవా'యని నన్ను దలంచు కొనెను. అంతనే, నవ్వా! భయపడకు నేను పట్టితి నంటిని. ఇంతకన్న మరేమి లేదని" బసవనరాజునకు చెప్పెను. అదివిని రాజును, సభికులును మఱింత నవ్వి యున్మత్త ప్రలాపమని, ఆజామడనున్న అవ్వను నీవెట్లు పట్టితివని అనిరి. తక్షణమే రాజు దండ నాయకుని బిలిచి ఆ అవ్వను తీసికుని రమ్మని పంపెను. వాడట్టే ఆమెను తీసికుని వచ్చెను. ఆమె వచ్చి బసవేశ్వరులవారు చెప్పిన వృత్తాంతమునే ఆమె కూడ చెప్పెను. కాని బురదను తలపైనున్న భాండమును జూపి యిది యొక వింతగా మీరు గనుచున్నారా. ఈ బసవేశ్వరుని ప్రభావము మీరెఱుగరా? తొల్లి యఱువది మ్ముగ్గురిలో నొకండగు తిరు చిత్తంబులుడను శివ భక్తుడు తన శివపూజ నిమిత్తము పుష్పములు పత్రి కోసుకొని సజ్జలో బెట్టి పట్టుకొని యింటి మార్గ మధ్యమున పెనువాన గురిసి త్రోవయంతయు నడుసై బురదలో గాలు జారి పడుచు పువ్వులు పత్రియు పాడగునను భయమున "స్వామి రక్షింపు" మని యొక కేకవేయు నంతలో నచట శంభుడు సాక్షత్కరించిన, శివుడె యిప్పుడు లింగాకారమున భక్త శంభుడను

పేర బజగు చున్నవాడు. నాడు అంళకరుడు భక్తుని గాపాడినట్లు నేడీ బసవ శంకరుడు నన్ను గాపాడెనని ఇదియే ఈ బసవేశ్వరుని మహాత్మ్యమని ఆమె చెప్పెను. ఇంట్లింకను బసవన మహాత్మ్యమా సూచించు కథలు గాథలు గలవు. ఎన్నో మహిమలు చూపి పరమ శివ భక్తుడై సార్థక జన్ముడై చివరకు శివుని యందే ఐక్యమందిన మహాత్ముడు బసవేశ్వరుడు.

ఆదర్శ జీవుడగు బసవని జీవిత చరిత్రను, హరి హరుడు, పాల్కురికి సోమనాధుడు, పిడుపర్తి సోమనాధుడు, భీమకవి మొదలగు పండితులెందరో ఆంధ్ర కర్ణాట భాషలందు పురాణ రూపమున ఇదివరకే వ్రాసి యున్నారు. బసవేశ్వరుడు సామాన్య మానవునివలె ముఖ్య మంత్రిత్వము దొరికిన పిదప వైభవానందము లందు తుల దూగుచు జీవిత కార్యము ముగిసెనని తలంపక రాజ కార్యములతో బాటు, మానవజాతి కల్యాణమును, వీరశైవ మతోద్ధరణ మును గూడ తన ముఖ్య కర్తవ్యముగా భావించి, అధికార బలముల నుపయోగించక కేవలము సేవా భక్తులతో తను, మనో ధనములను వంచన లేకుండ సమర్పించుచు ఆత్మీయాకర్షణశక్తితో వీరశైవమతమును సంస్క రించి విస్తరింప మొదలిడెను.

బసవన, వీరశైవమత తత్వములను జనులకు బోధించుటకై జాతిమత భేదములు లేక, సర్వులు ప్రవేశించునటులు 'అనుభవ మంటపము' ను స్థాపించగానే విప్రుడు మొదలుకొని అంత్యజునివరకు, జనులు తండోపతండ ములుగా బసవని అనుభవమంటపమున జ్ఞానోపదేశమును బొందుచు వీరశైవ మతమునందు చేరదొడంగిరి. ఇంతకు పూర్వము శూద్రులనియు, అస్పృశ్యు లనియు, ఉచ్చవర్ణములవారిచే దూరీకరింపబడిన వివిధ వృత్తుల వారందరును వేలకు వేలు బసవని శరణుజొచ్చి వీరశైవ మత దీక్ష బడసి శివ శరణుల శ్రేణియందు జేర మొదలిడిరి. బసవన మహిమలు విని, ఆతని ఉదాత్త తత్త్వ ములకు మనసు కరిగి (కాశ్మీర దేశము మొదలుకొని కన్యాకుమారి వరకు) ఆయా ప్రదేశములనుండి వచ్చు సకలేశ మాదరసు, ఆదయ్య సిద్ధరామ శివయోగి, అల్లమ ప్రభువు, అక్కమహాదేవి, మొదలుగాగల శివశరణులకు బసవ ప్రభు వెల్లప్పుడును-

> "తల్లిని బాసిన శిశువు తనతల్లి రాకకై ఎదురు చూచునటులు,
> త్రోవతప్పిన దూడ తన మందకై ఎదురు చూచునటులు,
> నేను నీ శరణుల రాకకై ఎదురు చూచుచుందు,
> సూర్యుని కిరణములు సోకినంత, కమలము వికసించు
> శరణుల జూచి నేసంతసించెదనయ్యా!"

యని స్వాగత మొసంగుచుండును. ఇట్లు బసవనవచనము లనేకములు గలవు.

వీరశైవ మతము దినదినాభివృద్ధి నొందుచు సుసంఘటిత మగునొక గొప్ప సమాజరూపము దాల్చుటయును, బసవేశుడు జాతి విశిష్టమగు వర్ణ కల్పనను ఖండించుచు బ్రాహ్మణుడగు మధువయ్య కూతురిని అస్పృశ్యుడగు హరళయ్య కొమారుని కిప్పించి (నూతన వీరశైవులగుటచే) వారిద్దరికిగల ధర్మ సంబంధమును శరీర సంబధంముతో దృఢపరచుటయును, బిజ్జలుని సంస్థానము నందుండిన కొండెమంచెన్న మొదలగు బసవ విరోధులు, జూచి సహింపక బిజ్జల రాజునకు బసవనిపై వైమనస్సు గలుగునటులు దుర్బోధల నొనర్చిరి. అప్పుడు బసవేశునకును, బిజ్జలునకును వివాదము పెరిగి భిన్నాభిప్రాయము లేర్పడెను. బిజ్జలుడు మతపాక్షిక దృష్టితో, హరళయ్య మధువయ్యలకు అన్యాయముగా ఉరి శిక్షల నొసగుట చూచి బసవేశ్వరుడు ఇట్టి ఘోరమగు అన్యాయమును సహింపక మంత్రి పదవిని తృణీకరించుచు, క్రీ. శ. 1162వ సంత్సరమున మరల కూడల సంగమ క్షేత్రమున కేగి-

> "వొచ్చితినయ్యా, చిచ్చున బడితినయ్యా
> తెరువొసగు మయ్యా తండ్రీ!
> బసవడు వచ్చెను..............."

అనుచు కూడల సంగమేశుని ప్రార్థించుచు లింగైక్య మయ్యెను.

# కుమారసంభవము - శైవ ప్రాధాన్యము

ఆంధ్ర వాఙ్మయములో ప్రథమ మహాకావ్యమైన మహాభారతము వెలువడిన కొద్దికాలమునకు నన్నెచోడుడు అను కవిరాజ శిఖామణి ఒక చక్కని కథా కావ్యమును తీర్చిదిద్ది ఆంధ్రవాఙ్మయమును సుసంపన్నము చేసినాడు. నన్నయకు తరువాత రెండువందల సంవత్సరములకు తిక్కన సోమయాజి ఉద్భవించి మహాభారతమును కొనసాగించుటకు పూర్వము కొందరు కవులు ఆంధ్ర సాహిత్య రచనా వ్యాసంగమును, స్తంభించిపోకుండు నట్లుగా చైతన్యముతో కొనసాగించిరి. ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు వారిని శివకవులు అని పేర్కొనుచున్నారు. ఈ శివకవులలో కాలక్రమము చేతను, కథాకావ్య నిర్మాణ కౌశలము చేతను నన్నెచోడుడు అగ్రేశరుడే అగుచున్నాడు. క్రీ. శ. 12వ శతాబ్దమున జీవించిన ఈ కవి ఒక చక్కని కథాకావ్యమును తెలుగువారి కందించి చరితార్థుడయ్యెను.

దక్షిణ దేశమునందు వీరశైవము బసవేశ్వరు అవతారముతో సమాజము నందును, సాహిత్యమునందును ప్రవేశించినది. ఈ మతము ఏ విధముగా ఆవిర్భావ వికాసములను పొందెనో కడచిన ప్రకరణములో విపులముగా చర్చించి యుంటిని. దీనిని బట్టి చూడగా నన్నెచోడుడు కవితావ్యవసాయము చేయునాటికి తెలుగు దేశము నందుగాని దాని పరిసర ప్రాంతములందుగాని వీరశైవము (బసవేశ్వరుడు ప్రతిపాదించి ప్రచారము చేసిన) ఒక స్వరూపము నందున్నట్లు కాన్పించదు. ఐనచో నన్నెచోడుడు శివకవి ఎట్లగును అను ప్రశ్న ఉదయించక మానదు. దానికి సమాధానము చెప్పుట అంత కష్టమేమియు కాదు.

వేదములు, పురాణములు త్రిమూర్త్యాత్మక శక్తిని ప్రతిపాదించుచున్నది బ్రహ్మను సృష్టికర్తగాను, విష్ణుమూర్తిని రక్షకుడుగాను, శివుని లయకారుడు గాను ఈ ప్రాచీన సాహిత్యము ప్రతిపాదించుచున్నది. ఇక అష్టాదశ పురాణములు ఈ ముగ్గురు లోకనాథుల కథలను నొక్కి వక్కాణించుచున్నవి. సమాజములో ప్రజలలో ఆనాడు సృషికర్తయగు బ్రహ్మకు అనుయాయు

లున్నారో లేదో తెలియదుగాని విష్ణుమూర్తిని కొలిచి సేవించువారు మాహేశ్వరుని ధ్యానించి పూజించువారు ఉన్నట్లు పురాణములు స్పష్టముగా చెప్పుచున్నవి. మహాభాగవతములోని ప్రహ్లాదుడు అంబరీషుడు మొదలైనవారు విష్ణుదేవునిపై అభిమానము కలిగినవారు కాగా హిరణ్యకశిపుడు బలి మొదలైనవారు శివభక్తులుగా చిత్రింపబడియున్నారు. అంతదూరమెందుకు? పురాణములోనే స్పష్టముగా రెండు విభాగములు కాన్పించుచున్నవి. విష్ణుపురాణము భాగవతము మొదలైనవి విష్ణుమహిమను కొనియాడుచుండగా శివపురాణము, మార్కండేయ పురాణము మొదలైనవి ఈశ్వరుని శక్తిని వేనోళ్ళ చాటి చెప్పుచున్నవి. ప్రాచీన సాహిత్యము ఈ విధముగా ద్విధా విభక్తమైయుండుట ఒక విషయమును స్పష్టముగా వ్యక్తము చేయుచున్నది. అదేమనగా సమాజములో కూడా ఈ రెండు మతములు విభిన్న స్థితియందు వెలసియుండుననుటయే అది. ఆనాటి సంఘమునందు కొందరు విష్ణుమూర్తిని శివుని సమానముగా భావించి వారియందు సమాన భక్తి గౌరవములను కలిగియుండుట కూడ చూడవచ్చును. అది వేరు మాట. నన్నయవంటి రచయితలు అట్టి అద్వైత భావము నవలంబించి కావ్యరచన చేయుటవలన వారి కావ్యములందు శైవము కాని, వైష్ణవముకాని ఒక ప్రత్యేక స్థితిని పొందియుండలేదు. అందుచేతనే ఆ కావ్యములను మనము మతప్రధాన కావ్యములుగా కాక సామాజిక అభ్యున్నతికి జగద్ధితమునకు వెలువడిన కావ్యములుగానే సంభావింతుము.

నన్నెచోడుని కాలము నాటికి బసవేశ్వరుడు చెప్పిన వీరశైవము లేక పోవచ్చును గాని పైన వివరించిన పరిస్థితులకు అనుగుణమైన శైవ సంప్రదాయములు లోకమునందు వ్యాపించియే యుండెననుట చాలా స్పష్టమైన విషయము. నన్నెచోడకవి ఆగమ శైవమతము చేతనే ప్రభావితుడై కావ్య రచనకు పూనుకొని శైవ సంప్రదాయ కావ్యమును తెలుగు వారికి అందించి ధన్యుడైనాడు. ఆగమ శైవము ప్రచారమునందున్న కాలమున వెలువడిన నన్నెచోడుని కావ్యములో వీరశైవ సంప్రదాయ విశేషములను అన్వేషించుట ప్రయోజనకారి కాకపోవచ్చును. అయినను యాదృశ్చికముగా అట్టి సంప్రదాయములు మన కిచ్చట దర్శన మిచ్చినను ఆశ్చర్యపడవలసిన పని లేదు. ఇక నన్నెచోడుని కావ్యము ఎందుకు శైవకావ్యమైనది,

అను విషయమును స్థూలముగా వివరింకును. ఏ కావ్యమునకైనను ఇతి వృత్తము శరీరము వంటిది. ఇతివృత్త నిర్మాణమునందు కవి కావ్యస్వరూప మును ఆవిష్కరించును. దాని తరువాతనే కావ్యమునకు ప్రాణప్రదమైన ధ్వనిని దానియందు నిక్షిప్తము చేయును. ఇట్లు చూడగా కావ్య వస్తువును మనము పరిశీలించితిమేని కవి తన ధ్యేయముగా నున్న కావ్యస్వరూపమును కొంతవరకు గ్రహించ వచ్చును. నన్నెచోడుడు స్వయముగా శైవ సంప్ర దాయమునందు అభిమానము కలవాడు. కావ్య ప్రారంభముననే అద్యుడైన మహాదేవుడు తనకు అభిమతము లిచ్చుగాక యని నమస్కార పూర్వక ప్రార్థనము చేసియున్నాడు. ఆ తర్వాత రెండవ పద్యములో, మూడవ పద్యములో "అంబికాధవుడు పరమేశ్వరుడు" స్తుతింపబడినాడు. ఈ పద్య ములు చూడగా ఈ కవికి మహేశ్వరుని యందు ఎంత ప్రీతియో స్పష్టమగును. కావ్య ప్రారంభమునందు కవులు ఆశీస్సు, నమస్కృతులతోపాటు వస్తు నిర్దేశము కూడా చేయుట సంప్రదాయము ఆ పద్ధతిని మనస్సునందుంచు కొనియే కాబోలు ఈ కవిరాజ శిఖామణి ప్రారంభమున తీ పద్యములలో మహేశ్వర స్తోత్రములు చేసినాడు. అట్లు తన కావ్యము మహేశ్వర కథా పూరితము అను విషయమును పరోక్షముగా నిర్దేశించినట్లయినది.

తరువాతి పద్యములలో ఇతర దైవతములకు కవి నమస్కారము చేసెను. అచ్చటకూడా పరోక్షముగా శివస్తుతియే ఉన్నది. విష్ణుమూర్తి కమలా ధిపుడు అతడు ఈశ్వరుని వామామునందు "మున్నుదయమై నియమ స్థితి కొల్చి" నాడట. అతడు ఈశ్వరుని అనుజ్ఞ చేతనే "అఖిల లోకములను కాచుచున్నాడట" ఇట్లు విష్ణుమూర్తిని గూర్చి చెప్పుచునే ఈశ్వరుని ఆధిక్యమును కవి ప్రదర్శించెను.

బ్రహ్మలోకమును సృజించినవాడు వాగ్దేవికి విభుడు. అతనిని కూడా నన్నెచోడుడు సంస్తుతి చేసెను. కాని అతనిని గురించి చెప్పిన మాటలు చూడదగియున్నవి. "అమితరజోగుణస్ఫురణ నావాహమై పరమేశు దక్షిణాంగమున జనించి భక్తి చిరకాలము సద్విధి గొల్చి తత్ప్రసాదమున" విశ్వమును సృజించినవాడు బ్రహ్మ అని చెప్పుటలో ఆ సృష్టికర్తకు-ఈశ్వరుడే మూలపురుషుడనుమాట వ్యక్తమైనది. ఇట్లు చూడగా బ్రహ్మను సంస్తుతించుటలో

కూడ శివపరముగనే ధ్యానింపబడినారు. ఇక కుమార స్వామి మహేశ్వరునకు అపర్ణకు కుమారుడే కదా. చివరకు మన్మథుడు కూడా శివుని సంబంధముగానే స్తుతింపబడినాడు. అతడు "హరుడాదిగ సకల చరాచరమయ జీవాళి నెల్ల సతతము గామాతురులుగా వశగతి చేసిన వాడ" ని చెప్పుటలో మన్మథునితో పాటు శివుడు కూడా ప్రస్తుతింపబడినాడు. ఇక పార్వతీ దేవి శివునికి ఆత్మేశ్వరియే. "ఈశునాత్మ శుభగస్థితిమై మెయి నర్ధనారి చేసిన నగజాత" ఆమె. పార్వతి కావ్యనాయిక అగుటవలన కవి ఇట్లు చెప్పుటలో ఎంతయో ఔచిత్యమున్నది. సందర్భానుసారముగా విద్యాధి దేవతయగు సరస్వతి కూడ స్తుతింపబడినది. ఆమె "వేదాగామ రూపమున మహాదేవు నపారగుణ మహా సంస్తుతి" చేసినట్టిదట.

తరువాతి మూడు పద్యములలోను ఒక వచనములోను గురువును కవి స్తుతి చేసినాడు. ఇతనికి మహేశ్వరునకు సారూప్యము కలిగించి చెప్పుట కవి ధ్యేయముగా కాన్పించును. విచిత్రమేమనగా నన్నెచోడుని గురువు పేరు మల్లికార్జునుడే. ఇట్లు వారిద్దరికి నామసారూప్యము చక్కగా కుదిరినది. ఒక జంగమ శబ్దమును తొలగించినచో ఇద్దరును మల్లికార్జునులే. ఎందుచేతనగా మహేశ్వరునివలె మల్లికార్జునుడు కూడా "సద్వరిష్ట ఫలదుడు". ఇతడు మహేశ్వరుని వలెనే తన శ్రీపాదుకలను శ్రీపీఠంబున నిడినవాడు. పాపహతి చేసి పుణ్యము నాపాదింప జేసెడివాడు. మహేశ్వరునివలెనే సర్వజ్ఞుడు. ఆయన లింగ స్వరూపుడైనచో ఇతడు జంగమ లింగముడు. అతడు సదాశివుడైనచో సదాకళ్యాణుడు. ఇట్లు చూడగా గురుస్తుతి చేసిన పద్యములన్నియు ఇష్టదైవమైన మహేశ్వర స్తుతి పరములుగానే భాసించుచున్నవి. ప్రారంభమైన మొదటి పద్యము మొదలుకొని పదిహేనవ పద్యమువరకు కవి త్రిమూర్తులను ఇతర దైవతములను గురువును సంస్తుతి చేసినాడు అన్నమాటేగాని, ఈ పద్యములన్నింటియందును మహేశ్వరుడే ప్రస్తుతింపబడినాడు. ఇట్లు చేయుటలో కవి కావ్యము శివమైనది. శివమయమైనది అని వ్యంగ్యముగా సూచించినట్లే అయినది. అంతేగాదు త్రిమూర్తులు దేవీత్రయము కుమార విఘ్నేశ్వరులు గురువు వీరందరును శివ స్వరూప స్వభావములను ధరించినవారే యని కవి ధ్వన్యాత్మకముగా సూచించినాడు. తన కావ్యశరీరము శివమయమే అయినట్టిది

అను విషయమును కవి ఈ కావ్య ప్రారంభ పద్యములందు వ్యక్తము చేయు. టలో వెనుకాడలేదు.

నన్నెచోడుడు తాను వ్రాయవలసిన కథను గురించి కూడా పరిపూర్ణ మైన అవగాహన కలిగినవాడు. కావ్య ప్రారంభముననే తానవలంబించబోవు కథా సంవిధానమును గూర్చి చక్కని సూచన చేసియున్నాడు. "పరమభక్తి యుక్తి నావర్జితహృదయుండనై సకల భువనావ తారకారణుండైన పరమే శ్వరుడు నవతారంబగుటయున్ తదంశావతారంబుగా వ్యావర్ణించి నాచెప్పం బూనిన" దివ్యకథా సూత్రంబెట్టిదనిన-

మ. స్ర. సతి జన్మంబున్ గణాధీశ్వరు జననము దక్షక్రతు ధ్వంసమున్ బా
ర్వతి జన్మంబున్ భవోగ్రవ్రత చరితము దేవద్విషత్ క్షోభమున్ శ్రీ
సుత సంహారము భూభృత్ సుత తపమును మా సుందరోద్వాహమున్
దద్రతి భోగంబున్ గుమారోదయము సతడసిన్ దారకున్ బోర
గెల్చున్ (కు. సం. 68)

ఈ గద్యపద్యములలో కవి ఏమి ఉద్దేశించెనో పరిశీలింతుము. కవితాను పరమ భక్తియుక్తి నావర్జిత హృదయుండనై యున్నానని చెప్పెను. ఈ భక్తి పూరిత హృదయము శివుని గూర్చినట్టిదే అని మనము స్పష్టముగా చెప్పవచ్చును. ఇక తాను చెప్ప బూనిన దివ్య కథా సూత్రమును గురించి కూడా సూచించినాడు. అతనికి ఇష్టదైవము పరమేశ్వరుడు. అతడు సకల భువనావతార కారణుండు అందుచేత అతని అంశావతారముగా వ్యావర్ణించి కథను చెప్పుటయే ఇతని ధ్యేయము. ఉపక్రమణిక వంటి ఈ వచనమునందును కవి తన శైవనిరతని చక్కగా ప్రకటించు కొనెను. తాను పరమ భక్తియుక్తుడనని చెప్పుట ఒకటి పరమేశ్వరుడు సకల భువనావతార కారణుండని అతని ఆధిక్యమును ప్రదర్శించుట రెండు. తాను వ్రాయునది ఈశ్వర కథాభరితమగుటచేత అది దివ్య కథా సూత్ర సమన్వితమని అనుట మూడవది.

ఇక పద్యములో కవి తాను వ్రాయబోవు కథా విశేషములను ఒక క్రమములో చెప్పెను. దీనిలో మొదటిది సతీదేవి జన్మము. దీనియందు దక్ష

ప్రజాపతికి ఆదిశక్తియగు సతీదేవి జన్మించిన వృత్తాంతమును చెప్పినాడు. ఈమె ఈశ్వరుని భార్య. అతనికి అర్ధనారీశ్వరం అయినది. అందుచేత ఈ కథ ప్రత్యక్షముగా ఈశ్వరుని గొప్పతనమును చాటించునట్టిదే అనుటలో సందే హము లేదు. ఇక రెండవ వృత్తాంతము గణాధీశ్వరుడైన విఘ్నేశ్వరుని జన్మకథ. ఈ కథ కుమారసంభవమున అపూర్వమైన కథ ఉమామహేశ్వరుల అతిలోక ప్రణయము వారి విచిత్ర సంభోగము మొదలైన వానిని కవి చాల చక్కగా వర్ణించి అల్లినాడు. ఈ కథలో నిజమునకు గణేశ్వరుని ఆధిక్యము కన్న శివాధిత్వమే ప్రవర్తితమైనది. మూడవది దక్షక్రతు ధ్వంసము. వేదోక్తమై ముప్పది మూడు కోట్ల దేవతలు వీక్షించగా జరిగినట్టి యజ్ఞము భంగమగుట దీనిలోని కథ. కాని ఈ కథయందును శైవ మహిమాభివర్ణనయే ప్రధాన విశేషము. కారణమేమనగా శివుని ఆదేశము చేత దక్ష ప్రజాపతి యజ్ఞము ధ్వంసము చేయబడినది. ఈశ్వరనింద చేయుటవలన అతనికే దుర్గతి పట్టినది. మహేశ్వరుని గురించి అవమానకరముగా మాట్లాడిన వారందరును ఇట్టి గతినే పొందుదురను విశేషమును ధ్వన్యాత్మకముగా కవి దీనియందు నిక్షిప్తము చేసినాడు. నాల్గవకథ పార్వతీ దేవి జన్మము. హిమవంతుడు మేనక ఈశ్వరుని భక్తులుగా దీనిలో చిత్రింప బడుట చేత యిది కూడ శివ ఔన్నత్యమునే చాటి చెప్పుచున్నది. ఆనాడు యోగాగ్నిలో దహించి పోయిన సతీదేవియే తిరిగి పార్వతిగా ఉద్భవించినది. అంతేకాదు పార్వతి ఈ కథలో రాజకుమారిగా కావ్యనాయికగా కాక శివ భక్తురాలిగా చిత్రీకరింప బడినది. ఇది శివ మహిమనే అభివ్యక్తము చేయును. తరువాతి కథ ఈశ్వరుని తపస్సు. ఇది ఐదవది. సర్వలోక ఉద్భవస్థితి కారుడైన మహేశ్వరుడు తపశ్చర్యకు ఎందుకు పూనుకొనెనో ఈ కథ వర్ణించి చెప్పుట వలన మహేశ్వరాధిక్యమునే చక్కగా వ్యక్తము చెయుచున్నది. మన్మథుని వివాహము తర్వాతి వృత్తాంతము ఇది ఏడవది. దర్పములు పలికిన మన్మథుడు స్త్రీ భూత చిత్తుడైనాడు. మహే శ్వరుని మనశ్చంచలనమునకు కారణమయ్యెను. అట్లు చేయుట ఈశ్వరునకు సమ్మతము కాదు. అందుచేత మన్మథుని వలన అపరాధమే జరిగినది. దాని పరిణామమే మన్మథదహనము. అపరాధమునకు పూనుకొన్న వాడెట్టివాడైనను ఈశ్వరుని కోపాగ్నికి గురికావలసినదే అను యథార్థమును ఈ కథ నొక్కి వక్కాణించు చున్నది. ఎనిమిదవ కథ పార్వతీదేవి తపశ్చర్య. ఎన్ని

విధములచేత పొందలేని ఈశ్వరుడు భక్త సులభుడు అను విషయమును ఈ కథ ప్రతిపాదించును. ఉమామహేశ్వరుల సంభాషణ సందర్భమున మహేశ్వరుని వ్యక్తిత్వమెట్టిదో, మహిమమెట్టిదో కవి చాల చక్కగా వ్యక్తము చేసినాడు. ఉమామహేశ్వరుల వివాహము, శృంగార పూరితమైన వారి దాంపత్య జీవితము, తొమ్మిదవ కథ. ఈశ్వరుడు లోకనాధుడు, పార్వతి శక్తి స్వరూపిణియగు మహామాయ. వీరిద్దరి సమాగమము లోకకళ్యాణ కారకమై శుభస్కరమగును అను విషయము దీనిలో ప్రస్తావింప బడినది. పదవ వృత్తాంతము కుమారుని జననము. ఇదియు లోక కల్యాణము కొరకే జరిగినట్టిది. అతడు కారణ జన్ముడు. ఈశ్వరాంశ సంభూతుడు. అనన్య శక్తి సంభరితుడు అను విషయము లీకథలో ప్రతిపాదితములైనవి. కుమారస్వామి తారకాసురుని యుద్ధములో సంహరించుట చివరి కథ. లోక కంటకుడు, దుష్ట స్వభావుడు, రాక్షసుడైన తారకాసురుడు ఈశ్వరుని ఆగ్రహమునకు గురియై కుమారస్వామి చేత హతుడైనాడు. దుర్మార్గముగా ప్రవర్తించు వాడెవడైనను ఇట్టి అధోగతికే పాల్పడును అను విషయమును ఈ కథ ప్రతిపాదించి శైవ మహిమనే వక్కాణించు చున్నది.

స్థూలముగా నన్నెచోడుడు తన కథా కావ్యమున ఈ కథ లుండునని సూచించెను. వానిని క్రమముగా వర్ణించెను. కథా సూచన చేయుట యందు అతడు శైవ మహిమను ఎట్లు దృష్టి యందుంచు కొనెనో ఈ కథలను చెప్పు నప్పుడు కూడ జాగ్రత్తగా శైవాధిక్యమును ప్రదర్శించెను. ఇక కథలను పరిశీలింతము.

## సతీదేవి జన్మము. గణేశ్వరుని జన్మము.

నన్నెచోడుడు వ్రాసిన కథలలో మొదటిది సతీదేవి జన్మము. ఈ కథను చెప్పునప్పుడు లోకమాతయు ఈశ్వరుని యందు అర్ధాంశమును గ్రహించెను. పార్వతీదేవి మహత్త్వమును కవి నివేదించెను. ప్రజాపతులలో ముఖ్యుడైన దక్షుడు లోకమును సృజింపదలచి లోకమాతను గురించి తపస్సు చేసెను. ఆమె "ప్రకృతి స్వరూపము" అయినట్టిది. "మహామాయ" "త్రైలోక్య మాత" "ఆధారశక్తి" యీ విశేషణములు ఆమె లోకాధార శక్తిని

ప్రదర్శించును. ఆ మహామాయ తనకు కుమార్తెగాను మహేశ్వరునకు పత్ని గాను ఉండవలయునని కోరెను. అట్లగుట వలన సతీదేవి మహేశ్వరుడు "లోక జననములకు బీజశక్తులై" ఉందురు. విశేషములు చూడగా ఈశ్వరుడు అతని పత్ని లోకకారకులనియు లోకాధారములనియు తెలియవచ్చును.

దక్ష ప్రజాపతియే మహేశ్వరుని గురించియు, తపస్సుచేసి అతనిని ప్రత్యక్షము చేసికొనెను. అతనిని ప్రార్థించిన పద్య మిట్లున్నది-

శా॥ దేవాధీశః సమస్తముంబడయ నుద్దేశించి మున్ భక్తి నీ
దేవిన్ సర్వపదార్థమూర్తి నిఖిల స్త్రీరత్నమున్ భక్తినే
నావాహించితి మీరు సన్మిథున చర్యాసక్తి మైకొన్న నా
కీ విశ్వోదయ కార్యసిద్ధియగు వాణీంద్రావ రేంద్రార్చితా॥
(కు. సం. 1-72)

ఈ పద్యములో లోకసృష్టికి పార్వతీ పరమేశ్వరులు కారణమైనట్లుగా చెప్పుచూ "మీరు సన్మిథున చర్యాసక్తి మైకొన్ననాకీ విశ్వోదయ కార్యసిద్ధియగు" అని చెప్పుట వలన సమస్త సృష్టికి మూలము యను విషయము స్పష్టమైనది.

గజాననుని జన్మమును గూర్చి కవి అపూర్వమైన కథను వ్రాసి యున్నాడు. జగన్మాత యగు సతీదేవి భార్యగా గ్రహించిన తరువాత శివుడు ఆమెయందనురక్తుడై వనమున నంచరించు చుండగా ఆ వనములోని కరి కరిణీ బృందము విహరించుట చూచి "కేతుకరతై కాలీన భావాభిలాష దృగత్యుజ్జ్వల దీధితుల్ బఱపె నీశాన నాబ్జంబుపై" ఈశ్వరి భావమెరింగి "సతికరణియగు త్రిజగత్పతి కరియై" యుండెను. "ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు హరుడు సతియును సురతార్థులై విహీన తరములగు మృగ రూపముల్ దాల్చిరి" వారి కేళీ విలాసము వలన "పురుషాకారము బటుమద కరివదనము గుజ్జ పాదకరములు లంబోదరము హరి నీలవర్ణము గర మొప్పగ దాల్చి విఘ్నకరు డుదయించెను" ఈ కథ మహేశ్వరుడు, ఈశ్వరి లోకము నందలి చరాచరముల సృష్టికి మూల భూతమైన వారు అను విషయమును బోధించు చున్నది. కేవలము మనుష్య స్వరూప స్వభావము

లందే గాక ఈశ్వరుడు ఈశ్వర జంతు స్వరూప స్వభావములలోను సంచరించుటకును, సృష్టికర్త లగుటకును సమర్థులు- అను విషయమును యిచట ప్రతిపాదితమైనది. వారికి కలిగిన గణాధీశ్వరుడు "దాక్షాయణికిని సకల భువన భవనా దీశ్వరుండైన పరమేశ్వరునకును" కలిగినట్టివాడు అని చెప్పుటలో కవి ఈశ్వర పారమ్యమును చాల చక్కగా వ్యక్తము చేసెను.

దక్షాధ్వర ధ్వంసము :-

దక్ష ప్రజాపతికి యజ్ఞము చేయు సంకల్పము కలిగెను. భువనములు పుట్టించు కస్యపుడు దానిని కాపాడు చంద్రుడు లోకము నంతముచేయు యముడు తనకు అర్చనలిచ్చు చుండగా మహేశ్వరుడు తన్ను తాను గొప్పగా భావించుకొని తన యింటికి వెడలి నప్పుడు నన్నవమానము చేసెను., ఇట్టి యవమానమునకు ప్రతీకారము చేయవలయును. ఆ మహేశ్వరుని, ఆగమ బాహ్యుని చేయవలయును అని భావించుకొని మహాధ్వరము ప్రారంభము చేయుటకు పూనుకొనెను.

ఈ యజ్ఞమునకు విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు, వసు రుద్రాదులు మునీంద్రులు, సిద్ధచారణులు, కిన్నర గంధర్వులు, విద్యాధరుడు, అప్సరలు మున్నగువారు విచ్చేసిరి. దక్షుడు యజ్ఞోపకరణ ద్రవ్యాద్యనేక ద్రవ్య పరిపూర్ణంబై నానా విధాలంకారాలంకృతంబై అతిరమణీయంబైన యజ్ఞశాల ప్రవేశించి యజమానస్థానం బలంకరించెను ఋత్విక్కులు అగ్ని నాహ్వానించి యథాక్రమంబున హోమంబు ప్రారంభించిరి. తన వైభవమును త్రినేత్రునకు చూపించి తన కుమార్తెయగు సతీదేవిని కొనిరావలసినదిగా దక్షుడు స్త్రీల నాజ్ఞాపించెను. ఆమె మహేశ్వరుని అనుజ్ఞతో శివగణికా సహస్రము వెంటరాగా దక్షాధ్వరమునకు విచ్చేసెను.

శివ కవియైన నన్నెచోడుడు ఈ సందర్భమున ఈశ్వరుని ఆధిక్యమును ప్రదర్శించుటకు ఒక చక్కని సన్నివేశమును కల్పించెను. ఈ సన్నివేశములో అవమానితుడైన దక్షుడు శివుని నిందించును. ఈశ్వరునకు అర్ధాంగియైన సతీదేవి ఈశ్వరుని అధిక్యమును నొక్కి వక్కాణించును:

ఈ కథలో దక్షునిది ప్రతినాయకుని పాత్ర. శివుని మహిమను కవి పార్వతీ దేవి వలన వ్యక్తము చేయించినాడు. సభా ముఖముగా జరిగిన ఈ తండ్రీ బిడ్డల సంభాషణము ఆంధ్ర సాహిత్యము నందును, శైవ సాహిత్యము నందును తలమానికమైనది. కవి తాను పూనుకొన్నప్పుడు ఒక పాత్ర యొక్క ఔన్నత్యమును ఎట్లు వ్యక్తము చేయునో ఈ ఘట్టము స్పష్టముగా విశదము చేయుచున్నది.

"నేతన యింటికి జన్న నవమాన్యుజేసె నా యల్లుడు నేనునై తన్ను జేయుదు నాగమబాహ్యు" అని భావించి దక్షుడు యజ్ఞము చేయ ప్రారంభించగా ముక్కోటి దేవతలతోపాటు సతీదేవి కూడ యజ్ఞమునకు వచ్చెను.

గీ॥ హరిపితామహా దివిజేశ్వాది దిగధి.
పతుల శురముని ద్విజులవరా బనిచి వరదు
నభవు పరమేశు రావింప వైతి నీవు
దలచి పిలచిన భక్త వత్సలుడు రాడె"?

అని తండ్రితో తన పతి మీద భక్తిని వ్యక్తము చేయుచు తన తండ్రి చేసిన అపరాధమును సతీదేవి ఎత్తి చూపెను. కాని క్రోధమున నున్న దక్షుడు పరమేశుని మాట వినుట తోడనే ఉగ్రుడయ్యెను. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, దిక్పాలురు, సూర్యచంద్రులు, మునీంద్రులు, ఇంద రుండగా "వీరి లోనికి విరుద్ధాచార కంకాల కోపాలోగ్రాహి జటాజినాస్థి ధరుడా భస్మాంగి'' రానర్హుడే! అని ఆక్షేపించెను. దీనితో శివనింద ప్రారంభమైనది. త్రిలోక నాథుడగు ఈశ్వరుని నిందను విని సతీదేవి దిగ్భ్రాంతి చెందెను. ఇచటికి వచ్చిన వారికి కపాలములు, అస్థులు, శరీరములందు లేవా? వాటిని వదిలి వీరిచ్చటికి వచ్చిరా? కపాలధారియగు ఈశ్వరుడు వచ్చుటకు ఆక్షేపణ ఏమిటికి? పరమేశ్వరుని రావింపని నీ యజ్ఞ ఫలము ఎట్లు లభించును? ఈశ్వరునకు ధరణి రథము, సూర్య చంద్రులు చక్రములు, వేదములు అశ్వములు, చతుస్వరములు పగ్గములు, ప్రణవము చేగోల, బ్రహ్మ సారధి, మేరువు విల్లు, ఆదిశేషుడు అస్త్రము, విష్ణుమూర్తి కోల, అగ్ని అస్త్రము, పవనుడే వేగము. దిక్పాలురు ఇరు ప్రక్కల నుండగా ఈశ్వరుడు పురములను కాల్చగా ఈ దేవతలందరు ఆయన ప్రక్కన నిలబడలేదా? ఆ ఈశుడు వీరిని కాపాడిన వారుకాదా? ఇట్లుండగా జ్ఞానములేక పనికిమాలిన వీరిని తెచ్చితివి. వీరందరు ఈశునికి దాసులుకారా? పరమేశ్వరుడు

సమస్త సురాధీశ్వరులకు అధీశ్వరుండు అని సతీదేవి పలుకగా తిరిగి దక్షుడు యిట్లాక్షేపించెను. "నీవు ఈశ్వరుని గొప్పతనమును వర్ణించి వీరి నవమానించి నావు. నీవు నా కుమార్తెవు గాబట్టి వీరు నిన్ను సహించిరి." ఈ యాక్షేపణను దాక్షాయణి సహించలేదు. ఆమె మనస్సులో క్రోధము కలుగగా ఇట్లు పలికెను. విష్ణు మూర్తికి చక్రము నిప్పించినవాడు హరుడు. బ్రహ్మకు శాశ్వతత్త్వము కలిగించినవాడు హరుడు. దేవతలకు అమరత్వము కలిగించిన వాడు హరుడు. వీరందరికంటె నీవు ఘనుడవా? ఇంతటి మహిమాన్వితుడైన పరమేశ్వరుని కాదనుటకు నీకు నోరెట్లు వచ్చెను? ఆ విష్ణుమూర్తి లింగమూర్తి కడనే కదా జ్ఞానమునకై వెదకుచుండును. నీవు హరుని చెడనాడి వీరిని కొని యాడెదవేమి? పూర్వము గరళమును మ్రింగిన వాడెవడు? గజాసురాదులను సంహరించి విశ్వమునకు శుభస్థితి నిలిపిన వాడెవడు? ఈ హరియే. పితా మహుండే. దివిజాధిపుడే. శరతే-మునీంద్రులే. ఈ విషయము నీకు తెలియదా? హరుడు నిర్మించిన వేదమార్గములలో యాగము చేయుటకు నీ కధికార మెక్కడిది? ఈ క్రతువు యధావిధిగా సమాప్తమైనప్పుడు దాని ఫలము నిచ్చుటకు శివుడుకాక మరెవరు సమర్థుడు?" ఇట్లు పలికిన సతీదేవి మాటలు విని హరుని దక్షుడు అవమాన పూర్వకముగా యిట్లు పలికెను. "పూర్వమెప్పుడైనను చర్మములు, ఎముకలు, భస్మము తాల్చిన తాపసుడు యాగములో ప్రవేశించిరా? జ్ఞానములేక సురేశ్వరాదులను ఆక్షేపించ వచ్చునా? నీకు నీ భర్తయైన ఈశ్వరునిపై భక్తి యుండవచ్చును గాని యితరులకేల యుండును? 'ఈ మాటలు విన్న దాక్షాయణి రోషముతో పొంగిపోయెను.' నీవు సోమరసమును త్రాగి యుండుటచేత గర్వించినావు కాబోలు! ఈ హోమ ధూమము కమ్మియుండుటచేత భ్రమించినావు కాబోలు! వృద్ధుడవై పోవుట చేత మైమరచితివేమో! లేక బ్రహ్మదులు స్తుతిచేయు శివుని గురించి యిట్లు పల్కుదువా! అమృతము కొరకు సముద్రమును మధించిననాడు మందర పర్వతమును కవ్వముగాను అనంతుని త్రాడుగాను నియమించినవాడు శివుడు. అతడే కొండను తాల్చుటకు హరిని ఆజ్ఞాపించెను. మీద నిలుచుటకు బ్రహ్మను నియమించెను. సముద్రమును త్రచ్చుటకు దేవాసురలను ఏర్పాటు చేసెను. ఇట్లతడే రాజగుట నీకు తెలియదా? శివుడు విశ్వరూపుడైన అష్టమూర్తి.

ఉరులింగ రూపుడైన విశ్వాత్ముడు. శరణార్థులకు వరములిచ్చు వరదుడు. విష్ణువు అనేకావతారములు ధరించుటకు ఆజ్ఞాపించినవాడు. అటువంటి అక్షయుని నీవు కాదనుట తగునా?" సతీదేవి చెప్పిన ఈ మాటలు విన్న తరువాత కూడా దక్షుడు శివుని నిందించుచునే యుండెను. అప్పుడు బ్రహ్మ విష్ణువు యిట్లు పలికిరి. "మేము ఆ దక్షిణామూర్తి వామాంగములందు పుట్టిన వారము. బ్రహ్మ సృష్టి చేయుచుండగా విష్ణువు లోక పాలన చేయుచుండెను. ఈ యధికారములు మాకు శివుని వలననే లభించినవి." ఈ మాటలు కూడా దక్షుని ప్రసన్నుని చేయలేక పోయెను. వారందరిని ఆక్షేపించుచు దక్షుడు శివదూషణ చేయుచునే యుండెను. ఇది చూచిన సతీదేవి సహించలేకపోయెను. ఆమె కోపముతో ప్రజ్వలించు చుండెను. తన పతిని చెట్టలు బలికిన జనకుం గని "కోపవహ్ని సతిదేహము భోరనమండె" అనగా కోపాగ్నిలో ఆమె దహించి పోయెను. సూర్యుని చూడగా కాలిపోయిన సూర్యకాంత పుత్రికవలె నుండెను. లక్కబొమ్మ అగ్నిలో కాలిపోయినట్లు కాలిపోయెను. మూడు లోకములు ప్రతిధ్వనించు నట్లుగా అచట చేరినవారు ఆహాకారములు చేసిరి.

ఈవార్త నారదుని వలన విని శివుడు కోపోద్దీపితుడై వీరభద్ర రుద్ర గణాధి నాధులను ఆదేశించగా వారు వచ్చి దక్షుని మఖమును ధ్వంసము కావించి దిక్పాలాది దేవతలను భయపెట్టి యజ్ఞ ఫలము దక్షునకు లభింపకుండ నట్లుగా చేయుట దీనిలోని తరువాతి వృత్తాంతము. ప్రధానముగా ఈ కథలోని విశేషము శివభక్తులలో అగ్రగణ్యయైన సతీదేవి వలన శైవమహాత్మ్యమును వ్యక్తము చేయించుట మొదటిది. ఆమె పలికిన ఒక్కొక్క మాటలో యథార్థమైన శివుని గొప్పతనము సహేతుకముగా వర్ణితమైనది. ప్రజాపతులలో మేటియైనను అజ్ఞానముచేత ప్రవర్తించి ఈశ్వరనింద చేసిన దక్షుని శిక్షింప జేయుట రెండవ ప్రధానాంశము. దక్షుడు ఈ కథలో ప్రతినాయకుడుగా ప్రవర్తించినాడని మొదటనే చెప్పితిని. శివ దూషణము చేసిన ఈ ప్రతి నాయకునికి రెండు విధముల శృంగభంగమైనది. ఒకటి, రుద్ర గణముచేత యజ్ఞము భంగముకాగా కలిగిన అవమాన మొకటి. ఎన్నియో ప్రయత్నములు చేసి యజ్ఞమునకు ప్రారంభించగా దానివలన కలుగ వలసిన ఫలితము లభించక పోవుట రెండవది. ఇక శివుడు బ్రహ్మ విష్ణువుల కన్నను

ముక్కోటి దేవతల కన్నను అధికుడు అని ఆగమ శైవ సిద్ధాంతరీత్యా ప్రతి పాదనము చేయుట, నిరూపించుట మూడవది. ఈ విధముగా కవి శివాధిక్య మును ఈ కథ ద్వారా నిరూపించుట యందు కృతార్థుడైనాడు.

## పార్వతీదేవి జననము

సతీదేవి కోపాగ్నితో దహించెను. పరమేశ్వరుని వరప్రసాదము వలన హిమవంతుని భార్యయగు మేనక గర్భము దాల్చెను. వీరిరువురు పరమేశ్వ రుని నియమ నిష్ఠలతో నారాధించుచుండిరి. ఇట్లుండ మేనకకు నెలలునిండెను. దిశలన్నియు కాంతితో నిండగా మేనకకు శుభముహూర్తమ్మున శైలరాజకన్య ఉదయించెను. పార్వతి శరచ్చంద్ర రేఖవోలె పెరుగుచుండెను.

క్రమముగా కాలము గడచిన "పిదప ॥పరమేశు మనముద్దపరిముట్టి సాధింప నెత్తిన గతి దలయెత్తదొడగె'' నట. శివుని భార్య బడియందు ఎట్లు కూర్చుండునో ఈ బాలిక అట్లు కూర్చొనుట మొదలిడెను. ఆమె భూమి మీద నిలబడినప్పుడు శివుడు ఆమెను భార్యగా గ్రహించునని తెలిపినట్లుండెను. ఆమె నడకలు హంసవలె నుండెను. ఆమె పలుకులు చిలుక పలుకులవలె నుండెను. పార్వతీ దేవి బాల్య వర్ణనలో పార్వతి శివభక్తురాలుగా రూపొందుట కవి వర్ణించెను. నెమ్మదిగా బాలిక కూర్చొనుట ప్రారంభించెను. హిమవంతు నింట ఐశ్వర్యము పెరుగునట్లుగానే బాలిక కూడ పెరుగ జొచ్చెను. ఐశ్వర్యము ఈశ్వర దత్తము. బాలిక బాల్య చేష్టలచే తల్లిదండ్రులకు ముద మొనగూర్చుచుండెను.

పార్వతి మొదటి సారిగా మాట్లాడినప్పుడు ''ఓంనమశ్శివాయ సదాస్మద్వ రదాయ నమశ్శంకర'' శరణు మహాదేవా! నీవశరణనజొచ్చెన్'' అని ఉచ్చ రించినదట. దీనిని బట్టి ఆమెకు గల శివభక్తి వెల్లడియగుచున్నది. శివ పారమ్యమే పార్వతి బాల్యక్రీడలయందు ద్యోతక మగునట్లు కవి వర్ణించినాడు. "ఓం నమశ్శివాయ" అనుదానిని ప్రణవ పంచాక్షరీ మంత్రమందురు. ఈ మంత్రాక్షరము తోడనే విద్యాభ్యాస మొనర్చు నాచారము నన్నిచోడుని నాటికే గలదని దీనివలన తెలియుచున్నది.

తోడి బాలికలు బొమ్మరిండ్లు కట్టి అందులోపల చిల్క బొమ్మలను, ఏనుగు కొమ్ముతో చేయబడిన దంతపు బొమ్మలను, గాజు బొమ్మలను మున్నగు వానిని పెట్టి గుజ్జన గూళ్ళు ఆడగా, పార్వతీ దేవి శివార్చన చేయు చుండెడిది. ఇఁక పార్వతీ దేవి విద్యాభ్యాసము వర్ణింప బడినది. లోకమాన్యం బులగు విద్యలెల్లను ఆమె నేర్చుకున్నది. ఆమె శివునకు పరిచర్య చేయుచు నాట్యము, సంగీతము, చిత్రవిద్య, పత్రచ్ఛేదము, కుసుమబంధము మున్నగునవి నేర్చుకొన్నది- ''హరుడు గురుడుగాగ'' అనుట వలన్ననామె శివుని వలన శిక్షణ పొందినది. అని యూహింపవచ్చును. శివుని అనుగ్రహమును అయాచిత ముగానే సంపాదించినదన్నమాట. ఈశ్వరుని యెదుట మిక్కిలి భక్తురాలై నాట్య శాస్త్రమునకు సంబంధించిన యంశములన్నియు నేర్చెను. స్తోత్ర రూపములైన రచనలను పాటలుగా పాడునప్పుడు ఏయేగీతములభేదములో బాగుగా నెఱింగి తెలిసికొని పాడును. శివుని రూపమును పెక్కుమారులు చిత్రించి చిత్తరువులు వ్రాయువిద్య నేర్చెను. చంద్రశేఖరుని నానావిధములగు పూజలు సలుపునప్పుడు చిత్ర విచిత్రమగు రూపములను కత్తిరించు విద్యనూ, పూలను మాలగా దండలుగా గుచ్ఛములుగా కట్టు విద్యను ఆమె నేర్చినది. ఇంకను అన్ని లోకములయందు గౌరవింపదగిన విద్యల నెన్నింటినో ఆమె నేర్చెను.

ఇట్లు ఆమె యౌవనవతి యయ్యెను. కవి ఆమె అంగవర్ణన గావించుచు బొడ్డును గూర్చి చెప్పుచూ

క॥ "కనుగొన నీశ్వరు దృగ్గుచు
లను విపుల వహిత్రములన పాంగ జలాబ్ధిన్
జన దిగిచి, ముంచుసుడి యిది
యనదగి యావర్తనాభి యద్రిజకొప్పున్"

(కు.సం-తృ.ఆ 60)

ఇచట శివుని దృగ్గుచలను వహిత్రముతోను, పార్వతి యపాంగ జలమును వార్థితోడను, ఆమె నాభిని సముద్రములోని సుడిగుండముతోడను పోల్చినాడు. అంగాంగ వర్ణనా విషయమునకూడ కవి శివుని ప్రసక్తి తెచ్చుటలో పార్వతీదేవి

అర్ధ నారీశ్వరి యను నంశమును గుర్తింపజేసి నట్లును, శివుని గొప్పతనమును సూచించినట్లును తోచుచున్నది. ఈ ఘట్టములో కవి పార్వతీదేవి ప్రతి అంగమును వర్ణించినాడు. పార్వతీదేవి చేతులను వర్ణించునప్పుడు.

క॥ "శివునంగయష్టి నిఱియగ
నవిరళముగ బట్టి ప్రాక ననికడునెమ్మిన్
నివుడు నవ కల్పలతికల
పవిదిని మృదు బాహులతలు పార్వతి కొప్పున్"
(తృ.ఆ ౭౮)

తీగలవంటి చేతులు గలది పార్వతి అని దీని భావము. అరచేతులు గొడుగులతో పోల్చ బడినవి. నుదటి పై భాగమును, శిరోజములను అన్నిటిని కవి వర్ణించినాడు.

ఇట్లు వర్ణించిన పిదప శివునికి ఆమె యందు అనురాగము కలుగునట్లు చేయుటకు మన్మధుని ప్రేరేపింప వలసినదిగా నారదా దేశము జరుగును అంత హిమవంతుడు పార్వతిని ఈశ్వరుని యుపచారమునకు నియమించును. శివుడు హిమవంతమున తపస్సు ప్రారంభించెను.

శివుడు పర్వత ప్రాంతమునకు వచ్చుట హిమవంతుడెరింగిన వాడై భార్య, పుత్రిక, బంధువులు మంత్ర పురోహిత సమేతముగా వచ్చి ఈశ్వరుని పాదములపై బడి అన్ని అవయవములు భూమికి తాకునట్లుగా మ్రొక్కి స్తుతించెను. ఇట్లు శివుని పూజించుచు సంతోష పడుచుండెను. కొంతకాలమునకు శివుని దయకు హిమవంతుడు పాత్రుడు కాగా శివుడు హిమవంతునకు కోరిన వరముల నొసంగి నిజపురంబునకు జన వలెనని ఆజ్ఞాపించెను. కాని హిమవంతుడు, దేవతలు, ముని శ్రేష్ఠులు, మున్నగు వారు ఏకాలమందును నిన్ను విన్నవారే గాని కనియెరుగరు. నీ స్వరూపము చూచిన నేను నిన్ను విడిచి పోవ నిచ్చగింతునా! ఇచ్చగింప నని భావము. అనగా ఇచట శివుని స్వభావము కాక స్వరూపము, సాంగత్యము కూడా అంతగొప్పవని కవి భావమై యుడును. శివుని సేవా భాగ్య మెంత గొప్పదని యిచట భావము. శివుని సేవించుటలోగల ఆనంద మెంత గొప్పదో యిచట హిమవంతుని పలుకుల ద్వారా వ్యక్తము చేసినాడు.

క॥ "వివి కానియెన్నఁడును నిను
గనియెఱుగరు; హరి సరోజ గర్భామరస
న్మనును; లిట్టి నీ స్వరూపము
గని యియ్యెడ బాసి పోవఁగానోపుదునే?"

(తృ. అ)

అని కరంబులు మొగిచి దీనానునుండై యున్న, వాని భక్తియుక్తి కింగరుణించి "సకల లోకాభీష్ట ఫలవృద్ధికే వారాత్మకుండ నగుటుం గేదారేశ్వరుండన నీ పురంబున వసియించెద'' నోడకుండమనిన దానికిం బ్రసాదంబని.

శివుడు హిమవంతుని భక్తికి మెచ్చి కేదారేశ్వర పురంబునకే వత్తునని చెప్పినాడు. పరమేశ్వరుని భక్తికి హిమవంతుని వంటి నిజభక్తులు పాత్రులు కాగలరని ఇచట కవి నిరూపించినాడు. భక్తులయెడ శివునికి గల అపార ప్రేమ సులభ మార్గమునసనే ఎక్కువ శ్రమ లేకయే భక్తి భావముతో కొలిచిన పరమేశ్వరుడు కరుణించగలడని ధ్వని ఇచట గలదు.

హిమవంతుడు తన నిజపురంబున కేగుచూ పార్వతిని అచట శివుని పరిచర్యచేయుట కొదిలిపోవ నిశ్చితుండై పరమేశ్వరునితో యిట్లనియె'' ఈ బాల తన్ను తాను తెలిసికొన్నప్పటి నుండియు వేరెవ్వరి యాశ్రయమును లేక ప్రతిదినమును నిన్నే సేవించుచున్నది. మాసుకృతమువలన చూచుటకు సంతోషముతో నేతెంచినది. నిన్ను చూచినది మొదలు భక్తి భావముతో నిచ్చటనే యుండి పోవలెనని వదిలివచ్చుట కశక్తురాలైయున్నది. అందుచే యిచట సేవలు చేయుటకు ఈ పార్వతి దేవి ఇచటనే యుండునని దానికి నీవంగికరించ వలయునని హిమవంతుడు పల్కెను''. అంత పరమేశ్వరుడు నిండు మనస్సుతో హిమవంతుని మాటల కంగీకార భావమో అనునట్లుగా మౌనము వహించెను. ఇచట పార్వతికి శివుని మీద గల అపారమగు భక్తి భావము విశేషము. చిన్ననాడు శైశవ క్రీడలు మొదలు కొని యౌవనవతి యగు వరకును మనస్సునందు ఆరాధించుచున్న దైవము నేడు కంట పడగానే వదిలి వచ్చుట కామె అంగీకరించలేదు. ఇచట భక్తునకు, భగవంతునకు గల సంబంధము ముఖ్యము. భక్తులకు **శివునితోడి లోకము** అను వీరశైవ సిద్ధాంత

ఛ్ఛాయలు కొంత పొడకట్టుచున్నవి. రెంతవది శివునకు కాబోవు భార్య పార్వతి. అందుచే దైవ సమానుడగు పతికి సేవలు చేయుచు గడపవలెనని ఆమె నిశ్చయించుకొన్నది.

హిమవంతుడు పరమేశ్వరుని మౌనము అంగీకార సూచకముగా నెఱింగి మహాప్రసాదంబని భావించి పార్వతీ దేవిని అంతఃపుర పరిజనలముతో కూడా అచటకు పంపించెను. హిమవంతుడు శివుని ప్రత్యక్షముగా కొలుచు చుండుమని కూతునకు చెప్పి తన నిజపురమున కరిగెను. అంత పార్వతీ దేవియు "నీశ్వరారాధనాసక్తియుక్తయై" భక్తితో శివుని గొల్చుచున్నది. నెమలి పింఛపు చీపురుతో వాకిలియూడ్చును. కస్తూరికా పంకముతో ఇల్లు అల్లుకును. కుంకుమ పువ్వు, మంజిడి, గరుడ పచ్చలు, ఇంద్రనీల మణులు, ముత్యములు ముగ్గులు పెట్టుట కుపయోగించును. నగాధిపతి పుత్రికయగుట చేతను, పరమే శ్వరుని యిల్లాలు కాబోవునది యగుట చేతను, ఆయా వర్ణములకు బదులు ఆయా వర్ణములుగల మనర్ఘ్య పదార్థముల చేతనే కవి పార్వతిచే ముగ్గులు పెట్టించినాడు. పూలతో తీగలతో పలురకములైన దండలు గ్రుచ్చును. సువాస నలతో కూడిన పువ్వుల మందిరము నిర్మించినది. శివుని సేవలోనే ఆమె దినమంతయు గడుపుచున్నది.

శివుని మీద భక్తి కలిగిన స్త్రీ పురుషులు స్వాభావికముగా శివునర్రింతు రని శైవుల విశ్వాసము. తుమ్మెదలు కూడ చవిమూడని సుందర పద్మములచే పార్వతీదేవి శివుని పూజించుచుండెను. "మొనలావులించి వాసన సల్లబసిగొని లేదేటిగము లెంగిలింపకుండ, నెడ సూఱగొని వేచిసుడియు తెమ్మరలచే బొడము పుప్పొడి వొలివోవ కుండ" ఆమె పద్మములు శివునకర్పించెనట. కన్యయైన పార్వతి సహజముగా శివభక్తురాలగుట చేత ఆమెకది స్వాభావిక మనియే కవి యభిప్రాయము. ఇట్టి పరిచర్య చేయుట ఔచిత్యవంతము కూడ. తాపసులకు పరిచర్య చేయుట వలన కన్యలకు కోరిన భర్త లభించునందురు. శివునే నాయకునిగా కోరినట్టిది గాబట్టి పార్వతి పరిచర్యయందు ఇట్టి ఔచిత్య మున్నది.

## మన్మధ దాహము

ఇట్లు పార్వతీదేవి భక్తిమార్గమున శివుని కొలుచు చుండగా పరమేశ్వరుడు కూడా జగత్ వ్యాపారము లన్నియు విడిచి తపస్సు చేయుట కుపక్రమించగా తారకుండను రాక్షసుడు విష్ణువు, బ్రహ్మ, దేవేంద్రుడు కూడా జయించుటకు శక్యము కానివాడై ప్రజల సనేక విధముల బాధించు చుండెను. పార్వతీ, పరమేశ్వరులను గలపుటకు మన్మథుని పంప వలెను. వారికి కలిగిన కుమారుడే తారకుని సంహరించ గలడని బ్రహ్మ సెలవిచ్చెను. ఇంద్రుని ఆజ్ఞచే ప్రేరేపింప బడినవాడై మన్మథుడు అమరావతీ పట్టణమునకు వచ్చి దేవేంద్రుని సందర్శించెను. మన్మదుడు కూడ తదుపరి రతీ దేవితో ఈ విషయము సంప్రదించ తలచెను.

రతీదేవి తన భర్తను దేవేంద్రుడు పిలిపించుటకు కారణమడిగెను. అంత మన్మదుడు పెద్ద విశేష మేమియు లేదని పరమేశ్వరుని తపోభంగము కావించుటకేనని, అందులకు తాను సమ్మతి తెలిపి వచ్చితినని పల్కెను అంత రతీదేవి తల్లడిల్లి యిట్లనుచున్నది-

సీ॥ "మన కులదైవమన్ మన్ననలేదేని
త్రిభువనారాధ్యుడన్ తెంకలేక,
పరమ యోగాత్ముడన్ భక్తి లేదేనియు
సర్వేశ్వరుండను శంకలేక".

(61 చ॥ఆ)

మన కులదైవమని, మూడు లోకములను పాలించువాడని భయములేక, సర్వేశ్వరుండను సందేహము లేక, బ్రహ్మ దేవుని శిరము నరకిన మృత్యుం జయుడని భయములేక, మూడు కన్నులు గలవాడు ప్రళయకాల మందలి అగ్ని స్వరూపుడను శంకలేక, అటువంటి ఈశ్వరునిపై నిన్ను పంపుటకు ఇంద్రుడేల జడవలేదో! గొప్పవారితోడి వైరము వలన చావు సంభవించునని తెలియదా! ఇచట శివుని మహాత్మ్యమే కవి వర్ణించినాడు. శివుడు యితరుల కంటె గొప్ప వాడన్న పల్కులు రతీదేవి చేత పల్కించినాడు. శివుని తోడి వైరము వలన చావు తప్ప వేరె గత్యంతరము లేదని ధ్వని; ఇంకను

చ॥ ఎడపక పంచె నాతడొక యేలికవాడని; పూన్కి కాడవై
పొడువగబోయె దీవు నొక పోటరి మూటవ; నీకు నక్కడన్
మృడు డొక యెల్లి దుండకట! మెచ్చక సింగపు వేటలాడగా
గడగెద, రిట్లయైన దుదిగాకెడ నింద్రుడు నీవుదక్కడే
(చ।ఆ 62)

రతీదేవి మన్మధుని యవహేళన చేయు చున్నది. తానొక ప్రభువని ఇంద్రుడు శివునిపై నిన్నంపుటయు నీవు మహాశూరుడ వనుకొని యతనిపై బోవుటయు బాగుగనే యున్నది. పాపము ఆ శివుడెంతటి సత్వహీనుడు· మెచ్చక మీరాతనిపై బోవుచున్నారు. తుదకు మీరతని బారినుండి తప్పించు కొనగలరా! మన్మధుడు శివుని తపోభంగము చేయుటకు పోవుట సింహమును వేటాడుటకు పోవునట్లున్నదని యిచట ధ్వని. జంతువులకు రాజు వంటిది సింహము. అటువంటి సింహము జోలికి పోవుట ఎటువంటిదో, ఇచట శివుని భంగపరచుట కూడ అటువంటిదని భావము. ఇంకొక విశేషము. శివుడు బ్రహ్మ ఇంద్రుడు మున్నగువారి కంటె అధికుడని చెప్పుట, శివాధిక్యమునే చెప్పుట, ఇచట కవి ప్రధానాంశముగా భావించినాడు. ఇంకనూ, స్వర్గలోకము నందున్న స్త్రీలు మన్మధుని మోహించుట చూచి ఓర్వజాలక దేవేంద్రుడు అనెపముతో మన్మధుని ఈ పనికి నియోగించెనని, పైగా మన్మధుని చూచు దృష్టితో వారు దేవేంద్రుని చూడమికి అసూయ చెంది శివుని మీదకు పంపెనని పల్కినది. ప్రాణమునకు తెగించి ఈ పని చేయవలదనియు విష్ణువు లక్ష్మి దేవియు (తల్లిదండ్రులు) మెచ్చరనియు చెప్పినది.

గీ॥ హరుడు నెపమల్గి చూచుడు నక్షణంబ
యఖిల జగములు సంహారమగు రయమున
నట్టి యుగ్రుపై నటివో యెదకట! లగ్గ!
మేలుమే లెంతమీలెంతమీ ల ద్రాగు.
(చ।ఆ 66)

శివుడు కోపముతో చూడగ సకల లోకములు నశించును. అటువంటి మహాను భావుని మీదకు పోవుట క్షేమమా? ఇచట శివుడు లోక లయ కారకుడన్న

విషయము విదితమగుచున్నది పెద్ద చేపలు, చిన్న చేపలను మ్రింగునుగాని చిన్నవి పెద్దవాటిని మ్రింగజాలవు. ఇచట అల్పుడైన మన్మధుడు పరమేశ్వరుని జయింప గడగుట చిన్న చేపలు పెద్ద చేపలను మ్రింగ బూని నట్లున్నదని భావము.

క॥ "కనుకిట్టివ, నిట్టికనమ
లిన విధమున, దేవతావలికి బూనితినే
నని రుద్రునకునెక పై జని
చెనయుట శిఖి శిఖల మిడుత సెనయుటగాదె"?

(చ॥ఆ 67)

కంటికి తాకిన ఇటుకను నోట నమిలినట్లుగా దివిజ సమూహము కొఱకు నీవు శివుని మీదకు పోవుట మిడుత అగ్ని జ్వాలను ఎదుర్కొనుటకు పోయి నట్లున్నది. ఇటిక నమిలిన దంత భగ్నమగును. అట్లే మన్మధుడు శివునిపై జనిన భంగపాటు కల్గునని భావము. ఇట్లు పరమేశ్వరుని గూర్చి రతి మన్మధుని హెచ్చరించెను. తన్నవమానించుచున్న రతీదేవితో మన్మధు డిట్లనియె.

"నేను పుష్పబాణములు వేయ నవి పరమేశ్వరుని హృదయమును గౌరి హృదయమును గ్రుచ్చి యవి యొండొంటి నతుకునట్లు చేయుదునని తలచెద వేమో? అవి యందదుకుల కలయికకాదు. నాయలరమ్ముల తాకకు హరి హృదయములు రెండును కఱంగి ద్రవమై యొండొటిని నీరు నీటిని గలసి నట్లేకమై యొక్కటే హృదయమై రూపాంతరము బొందును. రుద్రుని రౌద్రము జగజ్జనని కరుణతో గలయును. అప్పుడు దక్షాధ్వర ధ్వంస సమయ సంజనిత రౌద్ర మడుగంటగా జీవరాసులకెల్ల మంగళము కలుగునని భావము. "లోకములన్నియు నాఆజ్ఞ జవదాటకుండుట కనియు, వినియు కూడా నీవిటులు భయపడుచుంటివేల? శివుని గొప్ప శత్రువుగా చిత్రించి భయపడి యిట్లు పల్కుచుంటివని మన్మధుడు పల్కెను. ఇది ఒక విధముగా మన్మధుని ఆత్మస్తుతి. అది వినాశకరము. రతీదేవి ఇంక మాట్లాడుట కవకాశ మీయక శివుని గొప్పతనము చెప్పదలచినదైయిట్లను చున్నది. శివుని విల్లు మేరు పర్వతము వంటిది. నీది, తాకిన వాడిపోవునట్టి పుష్పబాణము. శివుడు

త్రిపురములను సాధించినవాడు. నీవు పాంధజనాపహారివి. ఎటుల చూచినను శివునకు, నీకును ఏనుగునకును, దోమకును గల యంత వ్యత్యాసము గలదు. "విరహాతుర పాంధజనాపహారివీ, వతనేకి నీకు హస్తిమ శకాంతర మెమ్మెయి నెన్ని చూచినన్" అన్నది.

గీ॥ "ఈశుదలచు మహాత్ముల హృదయములను
గాడనోపని నీపుష్పకాండ నికర
మితని భేదింపనోపునేః యంగ జన్మ
తమకసాధ్యుల సాధింపదలప దగునేః"

(చ॥ ఆ 73)

ఈశ్వరుల భక్తులకే పుష్పబాణములు హాని కలిగించలేవు. శివునకు సంచలనము కలిగించునాః సాధ్యముకానట్టి వారిని సాధించుటకు పూనుకొనుట బుద్ధిమంతుని లక్షణముకాదు.

శివభక్తులనే తాకలేని నీబాణములు శివుని తాక గలదాః యని రతీదేవి మన్మధునితో అనుచున్నది.

ఆ॥ "అటదాన నబలనైన నేనించుక
యలిగిచూచుడును భయమున దలరు,
దుగ్రనుగ్రులోచనోద్భూత వహ్నికి
నెదిరి నిలువ నీకు నెంత కొలదిః"

(చ॥ఆ 74)

అబలను, స్త్రీను ఐన నేను కోపముతో చూచిన వణికెడు నీవు శివుని తీక్ష్ణమైన కంటినుండి పుట్టిన అగ్నికి ఎదుర్కొని నిలుచుటకు శక్తి గలదాః లేదని భావము. నరసింహ రూపుడైన విష్ణువుకన్న పెద్దవాః ఈ కథ ఉత్తర నరసింహ పురాణమున గలదట. హిరణ్యకశిపు వధానంతరము తన యుగ్రము నుపసంహరించుకొని, శాంతుడు గాక యుండిన నరసింహుని పై శివుడు శరభావతారమెత్తి చని యుద్ధము చేసి యతని వధించి యాతని చర్మము నొలిచి కంకాళమును ధరించినట్లు ఉత్తర నరసింహ పురాణమున చెప్పబడెను.*

* కుమారసంభవము-లఘు పాఠభేదములు - వ్యాఖ్య పుట. 46.
మద్రాసు విశ్వవిద్యాలయ పరిష్కర్తలు వ్రాసిరి.

ఈశ్వరుడు బ్రహ్మదేవుని శిరస్సు ఖండించిన కారణమును దెల్పు కథలు పురాణములందు గలవు. పురాణనామ చంద్రికలోనిట్లు కలదు. ఇతడు చతుర్ముఖుడు. తొలుత ఇతనికి ఐదు ముఖములుండెను. ఒక కాలమున త్రిమూర్తులు కొలువు తీరియుండగా అచ్చటికి పార్వతీ దేవి వచ్చి పంచముఖులగు శివ బ్రహ్మల ఇరువురను చూచి ఇతడు శివుడు, ఇతడు బ్రహ్మ అని తెలిసికోలేక పిమ్మట కనుసైగ చేత అతనిని ఎరిగి చేరబోయెను. అప్పుడు శివుడు తన భార్యకు ఇంత భ్రమ పుట్టుటకు కారణము. బ్రహ్మకు ఐదు తలలు ఉండుటయే కదా అని, అతని తలలో ఒకటిని తీసి వేసెను. అంత బ్రహ్మ అలిగి శివుడు కాపలికత్వమును చెంది భిక్షాటనము చేయునట్లు శపించెను. ఆ బ్రహ్మహత్యా పాపము పోవుటకై విష్ణువు యొక్క ఉపదేశమున తీర్థయాత్ర చేసెను. అటుల యాత్ర చేయుచు కాశీక్షేత్రమునకు రాఁగా అచట ఆ పాపము వలన విముక్తుడు అయ్యెను. ఇంకను రతి ఇట్లను చున్నది. "మిక్కిలి నల్లనగునట్లు దహింపబడిన యమునికంటె నీవు ఘనుడవా? ఎప్పుడు యముడు శివునిచే కాల్చబడెనో తెలియదు. శివునికి 'కాలకాలుడు' అనగా యమునని యముడను నర్థముగల పేరుగలదు. ఇందువలన నత డంతమొందించెనని తెలియుచున్నది. శివుడంతకుని జయించిన సందర్భమొకటి గలదు. ''తొల్లి మార్కండేయ మహర్షి శివుని గూర్చి తపము ఆచరించుచునుండు తఱి యముడు అతని పట్టి బంధించి నిజ సదనమునకు కొనిపోవ సమకట్టెను. అపుడు శివుడు కోపించి ఇతనిని తన్ని ఆ ఋషిని విడింపించెను" (ఈ గాథనను సరించి శివుడు యముని తన్ని తరిమెనేగాని కాల్చి చంపలేదు) నిష్కారణముగా శివుని మీదకు కయ్యమునకు పోవుటకు నీకు శక్యమా? ఇంకనూ రతీదేవి శివుని గూర్చి ఈవిధముగా తెల్పుచున్నది.

మ॥ హరికంకాలము చేతిముద్ర, దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్,
గరళంబభ్యవహార మంతకతను క్షారంబుమైపూత, పం
కరుహాసీన శిరఃకపాలమురుభిక్షాపాత్రగా విశ్వసం
హారు వర్తించు మహావ్రతోపహతి సేయంబూననీ ప్రాప్తియే?

శివుడు మహావ్రతుడనియు, మహావ్రతుల లక్షణములిట్టివనియు వివరింపబడినవి. ఈ పద్యమున శివుని మాహాత్మ్యము తెలియజేయు గాథలు

నాలుగు సూచింపబడినవి. 1) హరి కంకాలమును చేతి ముద్రగ జేసికొనినది. 2) విబుధేంద్రాస్థులు భూషణాపటులుగ ధరించినది. 3) అంతకు తను క్షార మును మైపూతగ బూసికొన్నది. 4) బ్రహ్మకపాలమును భిక్షా పాత్రగ గావించుకొన్నది. శివుడు హరి నెప్పుడు వధించి యతని కంకాలమును చేతి ముద్రగ ధరించెనో స్పష్టమగుచున్నది. పై పద్యమున నరసింహుని వధించి యతని చర్మము నొలిచినట్లున్నది. ఈ కథ ఉత్తర నరసింహ పురాణమున గానవచ్చుచున్నదని మద్రాసు విశ్వవిద్యాలయ పరిష్కర్తలు ఉదాహరించిరి. నరసింహుడు విష్ణుని యవతార మగుటచే శివుడు ధరించిన హరికంకాలము నరసింహుని కంకాలమే కావచ్చును. ఇక దివిజేంద్రుని శివుడు ఎప్పుడు వధించి యతని యెమ్ములను భూషణములుగ ధరించెనో తెలియదు.*

మహావ్రతము శైవులలో కాలాముఖులు ఆచరించు వ్రతము. కాలా ముఖులకు మహావ్రతులని నామాంతరము. వారి వ్రతలక్షణములనను సర్. ఆర్. జి. భండార్కరు గారు ఇట్లు వివరించియున్నారు. "The Kalamukhas

hold that the following are the means for the attainment of desires concerning this World and the next 1) eating of food in a skull, 2) Besmearing the body with the ashes of the dead-body, 3) Eating the ashes, 4) Holding the club, 5) Keeping a pot of wine and 6) Worshipping the God as seated therein.

ప్రాచీనులు కొందరు మహావ్రతులు కాపాలికులని చెప్పుచున్నారు కాలాముఖ కాపాలిక సమయములకు రెంటికిని సన్నిహిత బాంధవ్యము గలదు. వారి యాచారములకు, గాఢమైన పోలిక గలదు. పై పద్యమున మహావ్రతుల లక్షణములు ఐదని చెప్పబడినది. 1) కంకాళ హస్తముద్ర 2) అస్థి భూషావళి

---

* See Sri R. G Bhandakar, Vishnavism Saivism P. 118 and 128.

* కుమారసంభవము, టీక. పుట. 289, డా. నేలటూరి వెంకట రమణయ్యగారు

3) గరళాభ్యవహారము 4) తనుక్షారపు మైపూత 5) శిరఃకపాల భిక్షా పాత్రము.

నన్నెచోడుని కాలము నాటికి తెలుగు దేశమునందు గాని కన్నడ దేశము నందు గాని వీరశైవ సిద్ధాంతములు సుస్పష్టముగా వ్యాప్తిలోనికి రాలేదు. శివుడు లోకోత్తరుడని మాత్రము శైవులు విశ్వసించెడివారు. జంగమ లింగములు ఒకే స్థితియందున్న వారు అనునట్టి కొన్ని సాంప్రదాయములు వ్యాప్తిలోనికి వచ్చినప్పటికి, అప్పటి మతము ఆగమ శైవ మనియే చెప్పవలసి యుండును. ఆగమ శైవమునందు కాలాముఖులు కాపాలికులు, అను రెండు విభాగములు చెప్పమడియున్నది. ఈ సంప్రదాయముల నవలంబించి దీక్షగా ఆచరించువారు మహావ్రతులు. వారు పైన తెల్పిన ఐదు విధములైన లక్షణములు కలిగినట్టి వారు. తపశ్చర్యలో నున్న శివుడు యిట్టి లక్షణములు కలిగి మహావ్రత దీక్షలో నుండెనని చెప్పుటయే కవి ఉద్దేశ్యముగా భావింపనగును. ఇచట ప్రస్తావనోచితముగా మహావ్రత మననేమియో ఆ వ్రత లక్షణము లేవియో కవి చెప్పదలచినట్లు భావింప వచ్చును.

ఇక షష్ఠాశ్వాసమున శివునిపై పార్వతికి గల అనురాగము భక్తి మార్గమున శివ సాన్నిధ్యమును పొందుటకు ఆమె చేసిన ప్రయత్నము వర్ణింప బడినది. ఆ సందర్భముననే కవి శివుని మహత్త్వమును కూడ వర్ణించినాడు. శివపార్వతులకు పరస్పరానురాగము కలిగించుటకు మన్మథుడు ప్రయత్నము చేసి విఫలుడైన తర్వాత పార్వతి మనస్సులో మహేశ్వరుని తన భర్తగా పొందు దీక్ష దృఢతరమైనది. అందువలన భక్తి మార్గముననే మహేశ్వరుని ప్రసన్నుని గావించుకొన వలెనని ఆమె భావించినది. ''పరమేశ్వరున్ దపో మహిమ నర్చించి మెచ్చించి నిజాధీశ్వరుండుగా బడయుదు. తపోవనంబునకుం బోవ" నిశ్చయించినది. ఈ నిశ్చయమును మరలించుటకు పార్వతి తండ్రియైన హిమవంతుడు మేనక అనేక ఉపదేశములు చేసి ప్రయత్నించిరి. వారి మాటలు వినిన పార్వతి "కదలేని విరహవేదన నిడుగడవడు చుంట

రంటె నీ భరమెల్లన్ మృడు సెయద దపోవర్తన నొడలేర్చెద నరిగి దారుణో గ్రాటవులన్'' అను అభిప్రాయమును ప్రకటించినప్పటికి అనేక విధముల తలిదండ్రులు ఆమె మనస్సునందు మార్పు చేయుటకు ప్రయత్నము చేసిరి. అప్పుడు స్థిరమైన చిత్తముతో పార్వతి యిట్లు బదులు చెప్పెను.

చ॥ చెవుడు పడంగ నల్గడల జీరుచు నన్నొంక వెందు చేసి మీ
రివి యవి యంచు బుజ్జవము లిన్నియు నెన్నగ నేల? నాకు నీ
భవమున నీశ్వరుండపతి; ప్రాణము, దేహము, చిత్తవృత్తులున్,
శివపదపంక జార్పణము చేసితి; బాసితి మీకు నింతతోన్

(కు. సం. ష. ఆ. 19)

పార్వతి నోట పలికించిన ఈ పద్యములో శైవసిద్ధాంత విశేషములు అనేకము లుల్లేఖింపబడినవి. శివునిపై ధ్యానము మగ్నము చేసిన వారికి ఎంతటి సన్నిహితులైనను సరే వారి ఉపదేశములు మనస్సు కెక్కవట. చెవుడు పడంగా చేయడమే తప్ప వారి మాటలలోని సారాంశము ఆమె మనస్సుకు పట్టనే లేదు. ఈ పద్యములోనే పార్వతీ దేవి తన నిశ్చయమును కూడ ప్రకటించినది. ఈ భవమున ఈశ్వరుండ పతి అనగా ఈ జన్మమును పాలించువాడు, కాపాడు వాడు భర్తయునైన వాడు ఆ మహేశ్వరుడే. ఇది పరిపూర్ణముగా శివుని పై విశ్వాసము కలిగిన శైవులు పలికెడు మాట. ఆ మాటనే కవి నాయికా ముఖమున ఉచ్చరింపజేసెను. తరువాతి వాక్యము మరింత మహిమాన్వితమైనది. "ప్రాణము, దేహము, చిత్తవృత్తులున్, శివపద పంకజార్పణము జేసితి'' అనుట. అనగా త్రికరణ శుద్ధిగా ఈశ్వరుని నమ్మి ఆత్మార్పణము చేసితినని ఆమె నొక్కి వక్కాణించుచున్నది. శైవులు ఇట్టి ప్రతిజ్ఞలనే చేసి శివసాయుజ్యమును పొందుట గమనించవలెను. చివరిమాటలో కూడా ఇట్టి గొప్పతనమే యున్నది. పాసితి మీకు నింత తోన్". ఇట్లనుట వలన పార్వతి తన తల్లిదండ్రుల ఉపదేశమును అంగీకరించని కారణముగా వారికి దూరమైతినని చెప్పుట కావచ్చును. కాని ఈ మాటకు తాత్వికమైన గంభీరమైన అర్థమును గ్రహించుట కవకాశ మున్నది. శివసాయుజ్యమును గోరెడు వారు బంధువులను మాతాపితరలను వారి సంబంధ బాంధవ్యములను విసర్జించుకొనిననే కాని శివ

సాన్నిధ్యము సమకూడదు. ఒక విధముగా విరాగమును పొందునట్టిది ఈ స్థితి. ఈ స్థితిలో లోక సంబంధమును విడనాడుటయే మోక్ష మార్గము. ఆ మార్గమునకు కావలసిన దృఢమైన చిత్తవృత్తిని ఈశ్వరని యందు పరిపూర్ణముగా మనస్సును నిలిపిన పార్వతి సాధించిన దన్నమాట. విశేషమేమనగా ఇంక రాబోవు కథలో పార్వతి శివునికి అర్ధాంగిగా దర్శనమిచ్చునేగాని హిమవంతుని కుమార్తెగా ఆమె పాత్ర అంతమగుచున్నది.

బాలవైన నీవు తపో దీక్ష వహించి కోరికను సాధింతువా? అని బుద్ధిగరపగా ఆ మాటకు విలువలేక పోయెను. మామాట కాదని నీవు తపోవనమునకు వెడలిన, అక్కడి కాఠిన్యము లెదురుకొనునప్పుడు దానిలోని సాధక బాధకములు నీకే తెలిసివచ్చును. అని తలిదండ్రులు పలుకుచు ఆమె తపస్సున కంగీకరించిరి. హిమవంతుడు నారదుని ఆదేశము జ్ఞప్తికి రాగా యిట్లు పలికెను.

కం॥ "హరిణాక్షి తపోబలమున
పరమేశ్వరు గూడ బడయు పరమార్థంబ
త్యురుతర తపమునకు సవి
స్తర శివయోగంబకాదె? తగుఫలమెందున్"

(షు౹ఆ 23 కు౹సం)

ఈ పద్యములోకూడ శివుని గూర్చిన తపోమహిమను కవి సూత్ర ప్రాయముగా వెల్లడించి యున్నాడు. పరమేశ్వరుని బడయుటకు శక్తి కావలయును. ఆశక్తి తపస్సుచేత సాధింపనగును. పార్వతి జీవితమునకు అదియే పరమార్థము. తపశ్శక్తిచేత సాధింపలేనట్టి పనులులేవు. పరమార్థంబైన శివుని సాన్నిధ్యమును పొందుటకు అదియే రాజమార్గము. ఇక రెండవ విశేషమేమనగా శైవమతమునందు శైవులు ఆచరించునట్టిది శివయోగము. అదియే తగిన ఫలమును అనగా శివ సాయుజ్యమును సంపాదించును. ఆ శివ యోగము సవిస్తరముగ అనగా సక్రమముగ నుండవలె నన్నచో కఠినమై దీక్షా బద్ధమైన ఉరుతర తపమువలననే అది సాధ్యము. ఇట్టి భావములు కవి ఈ చిన్న పద్యములో నిక్షిప్తము చేసెను.

పార్వతి తపస్సు అనెడు ఈ ఘట్టములో కవి ఒక సూత్రమును నిబద్ధము చేసెను. అదేమనగా ఈశ్వర సాన్నిధ్యమును కాంక్షించుట చేతనే సరిపోదు. దానిని సాధించుటకు పట్టుదల కావలయును. మనసా, వాచా, కర్మణా ఆ దీక్షను ఆచరించ వలయును. అదియే శివయోగాన్వితమైన తపశ్చర్య. అట్టి కఠిన వ్రతమునకు పార్వతి పూనుకొన్నది. ఆమె కోరిక నెరవేరుటలో అనగా శివ సాయుజ్యమును సాధించుటలో కొరత యేమి?

తపస్సుకు వెడలుచున్న పార్వతీ దేవిని గురించి చెప్పుచు నన్నెచోడు తన కావ్యములో శివుని మాహాత్మ్యమును ఉల్లేఖించుటకు మరొక చక్కని సన్నివేశమును కల్పించుకొనెను. అదేమనగా పార్వతి తపోవనము నందలి మున్యాశ్రమములను దర్శించుటయే ఆ ఆశ్రమములలో ముని ముఖ్యులు "అనేక ప్రకారంబుల వేదశాస్త్ర పురాణాగమసార వృత్తాధ్యాత్మ శాస్త్ర విధిహేయోపాదేయ పదార్థంబులు నిజశిష్య గణంబులకు విస్పష్టంబుగా వ్యాఖ్యానంబు" చేయుచుండిరట. శివుని గురించి తపస్సు చేయువారు ఎట్లుండ వలెనో ఒక పద్యములో యిట్లు చెప్పెను.

చ॥ "తలకఱనిల్చి, శాంతమోదదాల్చి మమత్వము మాల్చి ధైర్యమి
ట్టిలముగ బెంచి, మోహము లడంచియఘావలిద్రుంచి, కోర్కియ
గ్గలముగ మాన్చి, యీషణలగ్రాంచి, సదాశివు గాంచి, యాత్మలో
పల ననురక్తిని నిశ్చలిత భక్తి దలంచిన ముక్తి చేకుఱున్"

(కు।సం। షష్ఠ।ఆ। 70 పద్యం)

ఇది ఒక కర్మచేత అనగా తపస్సుచేత శివుని చేరుటకు ముక్తిని పొందుటకు మార్గము. ఇచటనే జ్ఞాన మార్గమును గురించికూడ చెప్పినాడు. పై చెప్పిన తపశ్చర్య పరిపూర్ణమైనప్పుడు కాబోలు ఇట్టి జ్ఞాన మార్గముతో శివుని సాధించుట సాధ్యమగును. ఆ విషయమిట్లు చెప్పబడి యున్నది.

తరువోజ - హృదయాంబుజములోన నెప్పుడు బాయ

కేర్పడి వెలుగు మహేశ్వర రూప

మది పరంజ్యోతి సదాఖ్యాన వృత్తి

యంద చిత్తంబులయంబు గావించు
నది భావ భావ్యంబు లడగిన మఱిని
జాకారుడగు పరమాత్ముడు దాన
పదిలమై నిలుచు నిర్బంధమై నిష్ప్ర
పంచమై నిర్వాణ పదవిదానదియు

(షు॥అ 71)

ఈ పద్యములో నిర్వాణపదవి యనగా జ్ఞాన మార్గమున సంపాదించు మోక్షము ఎట్లు లభించునో చెప్పినాడు. మనస్సనెడి పద్మములో ఈశ్వర రూపము అనెడి వెలుగు నిరంతరము ఏర్పడవలెను. అది పరంజ్యోతి. ఇట్లేర్పడిన తరువాత చక్కని అభ్యాసముచేత అనగా మనోనిగ్రహము చేత ఆ పరం జ్యోతి యందు చిత్తము లయము గావించవలెను. అప్పుడు భావ భావ్యంబులు తమంతట తాము నశించును. భావ భావ్యంబు లనగా సంచలాత్మకమైన మనస్సు నిశ్చల మగుటయే. అట్టి నిశ్చల మనస్సులో నిజాకారుడగు పరమాత్ముడు తానే పదిలముగా నిలుచును, అనగా మనస్సు ఈశ్వర తాదాత్మ్యమును పొందునన్నమాట. ఇట్టి స్థితి నిర్బంధమై, నిష్ప్రపంచమై నిర్వాణ పదవి అనిపించుకొనును. ఈ పదవి నిర్బంధమై అనగా సాంసారిక మానసిక బంధములు లేని దన్నమాట. నిష్ప్రపంచమై అనగా ప్రాపంచిక సౌఖ్యములులేని స్థితి అన్నమాట. ఇదియే జ్ఞాన మార్గమున సాధించు అతిలోక స్థితి.

ఈ స్థితి పొందినవారు ఎట్లుందురో మరియొక పద్యములో చెప్పి యున్నాడు. అజ్ఞానులైనవారు, ఇంద్రజాలికులు, కల్పించిన రూపములు చూచి వాని నిజస్వరూపమును తెలిసికొనలేక యధార్థములుగానే భావింతురు. ఇది నిజమునకు అజ్ఞానుల స్థితి. కాని నిర్వాణము పొందిన పారమార్థికులకు లోకము నందలి ద్రవ్యములన్నియు మిథ్యలుగా అనగా అసత్యములుగా కనిపించును. కాని ప్రాపంచిక జీవనము గడుపుచున్నవారు ఆ ద్రవ్యములను యదార్థముగా, భావింతురు. పరమార్థికులకు సామాన్యులకు యిదియే బేదము.

పార్వతీదేవి తపోవనములో ప్రవేశించి అతి భయంకరమైన శీతా తపములకు ఓర్చి నిశ్చలమైన తపస్సు చేసెను. నిరంతరము పరమేశ్వర ధ్యాన లీయమాన మానసయై. దేహంబు నిరంతర తపఃక్లేశంబునం జర్మాస్థి మయంబై కాష్ఠావస్థ నెయిదియుం దపోనిష్ట విడువక నిష్ఠించుచు ఉండగా ధర కంపించెను. నిశా కర ఖర కరగతు లెడలె దారకంబులు దుల్లెను. గిరు లురివెను. శరధు లింకెను. చివరకు పరిమేష్ఠి చలించెను.

సప్తమా శ్వాసములో శివుడు పార్వతి భక్తిని పరీక్షించుట ఆమె యెదుట సాక్షాత్కరించుట అను ఘట్టము రచితమై యున్నది. ఈ ఘట్టము నందు కవి ఒక విచిత్రమైన శిల్ప విన్యాసమును ప్రవేశ పెట్టెను. నటించుట యందు పరమ నిష్ణాతుడైన ఈశ్వరుడు మొదట శివుని నిందించును. పార్వతి శివుని భక్తురాలగుటచేత అతడు చెప్పిన నిందలను ఖండించి ఈశ్వర మహత్త్వమును వక్కాణించును. ఈ నిందాస్తుతులయందు ఈశ్వరుని మహోన్నత స్థితిని వ్యక్తము చేయుటయే కవి పాటించిన శిల్ప విశేషము. శివపార్వతుల సంభాషణ వారిలో వ్యక్తమైన ఈశ్వరుని ఔన్నత్యము యింక పరిశీలింతము. బ్రహ్మచారి రూపమున వచ్చిన మహేశ్వరుడు చతురిక వలన పార్వతీదేవి యొక్క కుల గుణ శీలముల నెరింగెను. ఆమె తపస్సుకు కారణమైన శివుని వాంఛనుకూడ తెలిసికొనెను. ఇఁక ఆ పరమేశ్వరునికి ఈ కన్యపై దయకలుగుట ఎన్నడో. ఈమె కోర్కె ఈడేరుట ఎన్నడో అని చతురిక పలుకగా వినెను. అప్పుడు తన ఆశ్చర్యమును వ్యక్తము చేయుటకై పార్వతి కులగోత్ర వైశిష్ట్యములనెన్ని "రత్నముల గోరి విని జనుల్ రాక జనుల రత్నములుగోరి పైబడి రాక బోలు విరుద్ధ వేషియగు శంకరుని చంద్రుడు చేరుటయే లోక విరుద్ధముగా నున్నది. ఇఁక సుందరి యైన పార్వతి అతని భార్య యైనచో ఎట్లుండునో యని తన భావము వ్యక్తము చేసెను. అతడు మాయావి. ఒకసారి భూవియై, ఒకసారి నీరై, ఒకసారి అనలుడై, ఒకసారి వాయువై, ఒకసారి ఆకాశమై, ఒకసారి చంద్రుడై, ఒకసారి సూర్యుడై, నిజముగాని రూపమున ప్రవర్తించును." ఇచట ఈశ్వరుడు విశ్వరూపమును కలిగిన వాడని స్తుతిచేసినట్లుగానే ఉన్నదిగాని పైకి మాత్రము అతడే రూపము లేని మాయావి అను నింద స్ఫురించు నట్లు చెప్పినాడు.

"లోకమును సృష్టిచేసిన బ్రహ్మ యుండగా లక్ష్మీదేవిని మనస్సున ధరించు విష్ణుమూర్తి యుండగా సమస్త దేవతానీకము సేవించు సురేంద్రుడుండగా "అపదార్థుడైన" శంకరుని పేదవలె కోరితివేమని ఆక్షేపించెను. ఇచట శంకరుడు పదార్థము అనగా లోకమునందలి వస్తువు కాదని లోకతీతుడైన పదార్థమని చెప్పుటకే ఈపదమును వేసెను.

శివుని ఆక్షేపణకు పార్వతి సమాధానము చెప్పెను "ఈ బ్రహ్మాండ ములు శివుని మహిమచేత ఉద్భవించు చున్నవి. అవి పరమాణువులు వంటివి. కాలాగ్ని అతని యందు లీనమై యున్నది. ఆబ్రహ్మాండములలో ఒకదాని కుహరములో నివసించిన బ్రహ్మ, విష్ణువు సురేంద్రుడు ఎట్లు ఆ ఈశ్వరు నితో సాటి యగుదురు? ఇంత జ్ఞానములేని వాడవు. బ్రాహ్మణ జాతిని ఎట్లు పుట్టితివి? గజాసురుని సంహరించినవాడు త్రిపురాసురులను నాశము చేసిన వాడు గరళవహ్ని యందు విహరించినవాడు ఆకాస గంగను తలలో ధరించిన వాడు, సుర సిద్ధ మునీంద్ర గణములకు ఉపకారము చేయువాడు పాప పాశమును ఖండించువాడు అయిన ఈశ్వరుని మూర్ఖుడనగా నీకు చెల్లునా? శివుని ధిక్కరించిన యముడు దక్షుడు మన్మధుడు ఏమైపోయిరో తెలియక బుద్ధిలేని యిట్లు పలుకు పలికితివి. అగ్నికీలలు లోకమునందు వ్యాపించుట ఏమిగొప్ప? ఈశ్వరుడు కోపించిచూడగా అతని కంటినుండి వెలువడిన అగ్నిజ్వాలలు సహస్రములైన బ్రహ్మాండ కోటులను నశింపజేయవా? ఇటి ఈశ్వరుని ఆక్షేపించుటకు నీవెంతటి వాడవు? అని ఈశ్వరుని గొప్ప తనమును త్రిమూర్తుల యందు, దిక్పాలకుల యందు లోకోద్భవ స్థితి లయాదుల యందు అతని ఆధిక్యమును ప్రకటించి చెప్పెను. ఈ ప్రకటనము నకు బ్రహ్మచారి ఆక్షేపణయే కారణమని వేరుగా చెప్పబనిలేదు.

ఇది విన్న మాయా తపసి తిరిగి యిట్లనెను. నీకు ఈశ్వరుడు తగడు. భిక్షుకుని ఒక పెద్దగ జేసెదవు. అతడు భోగములో యింద్రుడా? శౌర్యములో యముడా? వైభవమున వరుణుడా? ఐశ్వర్యమున కుబేరుడా సహన శీల వ్యసనేషు సుసౌఖ్యమును వచనమును వినవా? అతడు ఎముకలను ధరించును. సర్పములను మెడలో వేసి కొనును. బూతిని మైపూతగా వాడు కొనును. బిక్షాన్నమును తినును. ప్రేతావాసములందు ఏకాంతముగా గోచ

రించును. వికృతమైన నగ్నరూపముతో సంచరించును. అట్టి వానికొఱకేనా నీవు తపముచేయుట? స్వర్ణమణి భూషణాలంకృతవైన నీవు అతనికి భార్య వైనచో సంసార సారమెల్ల నిస్సారమే గదా? ఈ మాటలు విన్న పార్వతి శివుని గురించి నీకేమి తెలియును? అతని దూషించగా నీవతని ఆగ్రహ మునకు గురియగుదువు. ఈ సంభాషణ వినుచున్న ఆమె సఖులు శివుని గొప్పతనమును వర్ణించి పార్వతి మనస్సు అతని యందెంత గాఢముగా లగ్నమైనదో స్పష్టముగా చెప్పిరి. "మహాప్రళయము వచ్చినప్పటి ఈమె ధైర్యము సడలించుట ఎవరికి సాధ్యముకాదు. నీ అజ్ఞానము చేత విశ్వజనకుని నిందింతువు. కాని అతడు జ్ఞాన రూపము. సర్వాత్ముడు. పురుష రూపమై ప్రకృతి రూపమున పరగుచుండును. సూక్ష్మరూపమై శుద్ధాత్మ గలవాడు అర్థ స్వరూపమై అమలాత్ముడై యున్నాడు. అట్టివానితో మా పార్వతి కలసి యుండుటకే నిశ్చయించినది. హరుడు రుద్ర రూపమై యున్నచో తాను మారు రూపముగా లోకహితము చేయుటకే ఈమె కాంక్షించుచున్నది. సఖులు ఇట్లు చెప్పగా మహేశ్వరుడు పార్వతీదేవి యొక్క స్థిర మనస్సును తెలిసినవాడై ఆమె యెదుట సాక్షాత్కరించెను. ఇచట నన్నెచోడుడు ఒక మంచి దృశ్యమును వర్ణించి యున్నాడు. ఆ ప్రత్యక్షమైన శివుడిట్లు ఉన్నాడట. "తలలో ఆకాశగంగ చంద్రుడు ప్రకాశించు చుండెను. ముఖమున త్రినేత్రము కెంజెడలు వెలుగు చుండెను. గళమున గరళము నల్లని సర్పములు కాన్పించు చుండెను. శరీరమున తెల్లని కాంతితోపాటు భస్మము దర్శనమిచ్చు చుండెను. నడుమున వ్యాఘ్ర చర్మముతోపాటు ఉగ్ర సర్పములుండెను. పాదపీఠము నందు వజ్రములతోపాటు నఖ కాంతి వ్యాపించుచుండెను". ఈ పద్యమునందు కూడా శివుడు సర్వాంతర్యామియగు సర్వాత్మకుడు, విశ్వరూపి అను విషయమును కవి సూచించినాడు. తరువాతి వర్ణనమునందు కూడా శివుడే త్రిమూర్తులయందు గొప్పవాడను విషయము వ్యక్తమయినది.

పార్వతి తపస్సుతో కూడిన ఈ ఘట్టము కుమార సంభవమున అత్యంత మనోహరమైనది. భక్తి భావముతోపాటు స్వల్ప శృంగారమునకు దీనిలో ప్రవేశమున్నది. అదియే పార్వతీదేవి యొక్క (నాయిక యొక్క) సుస్వరూపమును వర్ణించి చెప్పుట. ఇక శివుని సాక్షాత్కారము ఒక అద్భుత

ఘట్టము. అతని మాటలలోనూ, రూపములోనూ, స్వభావములోను, శివ ద్వేషము స్పష్టముగా కాన్పించును. కాని యిది పైకి మాత్రమే. అతడు పలికిన మాటలలో స్తుతి గర్భనిందలే ఎక్కువ. ఒక విధముగా యిది వ్యాజనింద. దీనికి సమాధానముగా పార్వతి చెప్పిన మాటలన్నియు శివ మహిమాభి వర్ణనాత్మకములే. అతడు మూర్త్యాత్మకుడని ఆమె మాటలలో వ్యక్తమయినది.

ఈవిధముగా నాయికా నాయకులు సమావేశమైన ఈ ఘట్టములో కవి శివుని ఆధిక్యమును చాల చక్కగా వ్యక్తము చేసినాడు. ఈ అభిప్రాయ వ్యక్తీకరణము కావ్య వస్తువునకు బీజప్రాయమై శోభా హేతువైనది.

దారిద్ర్య విద్రావణస్తవము :

కుమార సంభవములోని దశమాశ్వాసములో నన్నెచోడ కవి దారిద్ర్య విద్రావణస్తవము అను శీర్షికలో తొమ్మిది పద్యములను రచించి యున్నాడు. ఈ పద్యములు మత్తేభము, శార్దూలము అను వృత్త విభాగములో చేరుచున్నవి. దారిద్ర్య విద్రావణుడు అనగా ఈశ్వరుడు. ఈ పద్యమునందు ఈశ్వరుని స్తుతి ఉన్నది కాబట్టి ఈ శీర్షిక సార్ధకముగానే యున్నది.

తారకాసురుని సంహరించుటకు దేవతలకు కలిగిన బాధలను నిర్మూలించుటకు చేసిన ప్రయత్నము కొంతవరకు సఫలీకృత మయిన సందర్భములో ఈ స్తుతి ఉన్నది. పార్వతీ పరమేశ్వరుల వివాహము జరిగిన కొద్ది కాలమునకు వారికి కుమారస్వామి జన్మించెను. ఇదివరకు ఊహించిన ప్రణాళిక ప్రకారము కుమారుడు రాక్షస బలమును సంహరించి దేవతల కార్యము తీర్చవలసి యున్నది. కాని కుమారుడు పసివాడు ఇంద్రుడు చాపల్యముతో ఈ పసివాడు మనకేమి దిక్కగునని భావించి అతని శక్తిని పరీక్షించుటకై అతనితో తలపడినాడు. కాని అతనికి యధోచితమైన సత్కారమే జరిగినది. అతడు ఆ బాలుని పరాక్రమమునకు సరికాక అతని చేత నోడుటయే అసత్కారము. తన గర్వభంగమునకు వగచి ఇంద్రుడు మహా దేవుని శరణు జొచ్చెను. అతనిని స్తోత్రము చేసెను. తన తప్పు తెలిసి కొనెను.

ఇదే సమయమున దేవతల కార్యము నెరవేర్చుటకు తగిన తరుణము వచ్చినదని భావించి సుర గురుడైన బృహస్పతి శివుని ప్రసన్నుని చేసికొనుటకై అతనిని స్తుతి చేసెను. ఆ స్తుతియే దారిద్ర్య విద్రావణ స్తవము.

కవి చాల జాగ్రత్తగా ఒక్కొక్క పద్యమున ఒక్కొక్క విషయమును శైవ భక్తికి సంబంధించిన వానిని ఈ పద్యములలో పొందుపరచియున్నాడు. ఆ పద్యములలోని విశేషములు చూతము. 1) సాంసారిక దుఃఖములను అనుభవించు మానవులు ఆ దుఃఖమును తరించుటకై మహేశ్వరుని మదిలో ప్రార్థించి శరణు వేడుదురు. దీనిలో విచిత్రము లేదు. ఎందుచేత ననగా విష్ణువు, బ్రహ్మ మహేశ్వరుని ప్రార్థించుట వలననే అతని పాదములనుభక్తితో ఆరాధించుట వలననే లోకాధీశులైరి. ఇచట రెండు విశేషము లున్నవి. త్రిమూర్తులయందు ఈశ్వరుడే ఇతరులకన్న ఆధిక్యత కలిగిన వాడని చెప్పుట ఒకటి. దుఃఖార్తులైన మానవులను కాపాడి వారి కష్టములను తొలగించు వాడు ఈశ్వరుడే అనుట రెండవది. ఎన్ని కష్టములు కలిగినను వానిని తొలగించు కొనుటకు ఈశ్వరుని శరణు వేడుటయే ఉత్తమ మార్గమని చెప్పుట మూడవది.

2) లోకములో సమస్తమును కోల్పోయిన మానవుడు దీనత్వమును పొంది జడుడై దుర్బలుడై ఇతరులను వేడగా ఆ దీనావస్థ తొలగి పోని విషమ సమయములో మనస్సులో వేడినంత మాత్రమున అమరేంద్రునకు సమానమైన వైభవమును ప్రసాదింతువు గదా! ఇచట ఉన్మత్తుడైన మానవుడు లోకమునందలి బాధల చేత అలసి పోయి, తన బాధలను మాన్చుకొనుటకు ఇతర దైవతములను ప్రార్థించిన లాభము లేదని మానవుని సమస్త బాధలను నిర్మూలించువాడు ఈశ్వరుడే యని ఈ పద్యమున కవి ప్రతిపాదించినాడు. ఇచట కూడ శైవసంప్రదాయమున ప్రధానమైన శివాధిక్యమునే కవి పునరుద్ఘాటించెను.

3) ఈ పద్యములో శివుని మహత్త్వము వక్కాణింపబడియున్నది. ఈశ్వరుని కృపాదృష్టి ఎవరిపై ప్రసరించునో వాడు భయశోకార్తి మహాతురేఘ చయమున్ బాయును. సంతోషమును పొందును. భయమును కోల్పోయి కాల్యాణ సుశాంతి సంపదలను సుఖములను పొందును. దుఃఖము సంక్షయమగును. కర్మబంధములు నిర్మూలించును. సౌఖ్యాత్ముడై మోక్షమును

పొందును. ఇచట శివ మహత్వమును చెప్పుచునే శివభక్తులు ఎట్లు మోక్షమును పొందుదురో కవి చక్కగా వర్ణించి యున్నాడు. శివునే దైవముగా నమ్ముకొని ప్రార్థించిన శైవులపై ఈశ్వరుని అనుగ్రహము కలుగును. అప్పుడు వారు భయ శోకములను పోగొట్టుకొనుటయే గాక సమస్త లౌకిక సంపదలను పొందుదురు. చివరన ఆత్మ సుఖమును పొందగా మోక్షమును సాధింతురు. ఈ విధముగా శైవ సంప్రదాయావలంబి ఏ విధముగా మోక్షప్రాప్తిని పొందునో ఈ పద్యమున కవి చెప్పియున్నాడు.

4) ఈ పద్యములో శివుడెటుంటి వాడో కవి చెప్పెను. వరదుడు, ఈశుడు, భక్త వత్సలుడు, దేవతల చేత సేవింప బడువాడు, శంకరుడు అనగా శుభమును కలిగించువాడు. ఆనందుడు అనాధనాధుడు. ఈ పేర్ల న్నియు, ఆయనకు సార్థకమైనవేనట. ఇచట శివునకు ఎన్ని మహిమలు కలిగినవో కవి చెప్పుచున్నాడు. ప్రధానముగా అతడు భక్తవత్సలుడనుటలో శివ భక్తులపై శివునికిగల అపార వాత్సల్యము స్పష్టముగా వ్యక్తమైనది. శివుడు భక్తపరాధీనుడు అను శైవ సంప్రదాయమును ఈ పద్యములో కవి ప్రతిపా దించి యున్నాడు.

భక్తి పద్ధతియందు ఈశ్వరుని నామోచ్చారణ చేయుట ఒక పద్ధతి. విష్ణు ఈశ్వరులు సహస్రనామములు, లక్ష్మి పార్వతుల సహస్ర నామములు ఈ విధముగానే వెలసినవి. ఈ ప్రకారముగానే ఈ పద్యమునందు ఈశ్వరుని నామోచ్చారణ చేయబడి యున్నది.

5) మనుష్యుడు తరించుట యనగా మోక్షమును పొందుటయే కాదు, ప్రాపంచిక దుఃఖములను, బాధలను తొలగించుకొని సౌఖ్యమును, శాంతమును పొందుటకూడ ఒక విధమైన మోక్షమే. అట్టి మోక్షమునకు ఈ లోకమున మనుజునకు మార్గ మొక్కటియే. అదియే క్షణ కాలమైనను ఈశ్వర ధ్యానము చేయుట. అట్లు చేయుటవలన ఏమి సంభవించునో ఈ పద్యము చెప్పుచున్నది. ఒక క్షణము ఈశ్వరధ్యానము చేసిన మర్త్యుడు దుర్జనుడగునేని సజ్జనత్వమును పొందును. దుఃఖపరుడైనచో సౌఖ్యాత్ముడగును. అల్పత్వము పొందియున్నచో ఘనుడగును. మూర్ఖుడైనవాడు పాండిత్యమును పొందుచున్నాడు. దుష్టుడుగా

నున్నవాడు శిష్ట గుణమును పొందును. దారిద్ర్యము ననుభవించువాడు ధనమును పొంది తృప్తిని అందగలుగుచున్నాడు.

ఇట్లు చెప్పుటచేత లోకములోని సర్వబాధలకు మహేశ్వర ధ్యానము ఔషధప్రాయ మైనట్టిది అను వివేషమును కవి ప్రతిపాదించెను.

6) మనుష్యులు ఈ లోకమున తమ జీవితమును వెచ్చించి నిధులు, ధనములు, మణులు, మంత్రములు, ఔషధములు, రసాయనములు, స్పర్శ వేధులు, గోవులు, కల్పవృక్షములు సంపాదించుటకు ప్రయత్నింతురు ఒక్కొక్కరి జీవితమంతయు వ్యయము చేసినను, దీనిలో ఒక వస్తువు లభించుటయు దుర్లభమే. ఇఁక వానివలన సౌఖ్యము ననుభవించుట ఎన్నఁడు? కాని ఈశ్వరుని కరుణావార్ధి అనంతమైనది. ఆ కరుణా సముద్రమునందు ఈ వస్తువుల సమూహములన్నియు ఒక నురుగు యొక్క అణు సన్నిభములైనవి. అనగా ఈశ్వరుని కరుణను సంపాదించినచో ఈ ధనాధికములు లెఖ్ఖలోనికి రావు. అవి తనంతట తానే సమకూడును. ఇచట ఒక విశేష మున్నది. ఈశ్వరుని దయవలన ఐశ్వర్యము పొందవచ్చును. ఆ దయ ఈశ్వర ధ్యానము చేతను అతని శరణాగతి చేతను లభ్యమగును. అందుచేత మానవుడు ఈశ్వర కారుణ్యమును పొందినచో సమస్త ప్రాపంచిక వస్తు జాలమును పొందినట్లేయని చెప్పుటయే ఈ విశేషము.

7) ఈ కవి ఏవిశేషము చెప్పినను, ఈశ్వరాధిక్యమునే చెప్పుచుండుట మనము చూచియే ఉన్నాము. ప్రాపంచిక సౌఖ్యములను కోరువారు అల్ప దేవతలను కొలిచి వారి దయను పొందుటకు ప్రయత్నింతురు. ఇట్టి ప్రయత్నము నిష్ఫలమే. వానివలన కోర్కెలు సమకూరునా? భక్త వత్సలుడును, సర్వేశ్వరుడును, ఇక ఈశ్వరుని ఎట్టి కోర్కెలు కోరినను అతడే వానిని తీర్చుచుండగా ఈ అల్పదేవతల నమస్కారము లెందుకు? ఇదియే కవి చెప్పదలనిన ఈశ్వర పారమ్యము.

8) ప్రాపంచిక సౌఖ్యములను అనుభవించు నట్టివాడు, వానిని కోరినట్టివాడు ఈశ్వర కరుణకు పాత్రుడుకాడు అనుకొనుట సరియైనదికాదు. ఎందుచేతననగా నిన్నుకోరి నీదయను పొందినవారు మహితాత్ములగు

చున్నారు. కరుణతోకూడిన శివుని ధ్యానించి అతని మన్ననను పొందిన మానవుడు సర్వ సౌఖ్యములతోపాటు ఉత్తమ గుణములను, సత్కీర్తిని, విశాల మైన భూభాగమును పరిపాలించెడు అదృష్టమును, విస్తారమైన ఐశ్వర్యమును పొందుచున్నాడు. భక్తుడైనవాడు ప్రాపంచిక సౌఖ్యములను అనుభవించుచునే ఈశ్వర సాన్నిధ్యమును కాంక్షించి సమస్త సౌఖ్యములను పొందవచ్చుననియే ఈ పద్యములోని సారాంశము.

9) మానవులు సంసారిక జీవితము గడుపునప్పుడు అన్న పానాది ప్రయత్నములతోపాటు ఈశ్వరుని ధ్యానించి సేవించి తరించుటకు ప్రయత్నము చేయవలయును. మానవుని జీవిత ధ్యేయములైన ధర్మార్థ కామ మోక్షములలో మోక్ష మార్గము ప్రధానమైనదని ఆధ్యాత్మ విదులు భావింతురు. అట్టి ఆధ్యాత్మతత్త్వమును గురించి నన్నెచోడుని పద్యములో ప్రస్తావనచేసెను "సార చార విచార దక్షులు" అనగా ఉత్తమమైన ఆచారములలోని విశేషములను గ్రహించి అవలంబించువారు. "అమలజ్ఞాన క్షోణీ ద్వీక్షణ ప్రారంభాత్మకులు" అనగా స్వచ్ఛమైన జ్ఞానముచేత ఆత్మయందు క్షణ కాలము ఈశ్వర సాన్నిధ్యము సంపాదించువారు. ఈ రెండు విశేషణములందు రెండు విశేషములు చెప్పబడి యున్నవి. మొదటి దానియందు కర్మసిద్ధాంతము ప్రతిపాదింపబడినది. రెండవ దానియందు జ్ఞాన మార్గము ఉద్దీపనము చేయ బడినది. ఈ రెండు మార్గముల నవలంబించువారు కూడ ఈశ్వర సాన్నిధ్యము పొందుదురు కాబోలు. కాని "ఆత్మ నిన్ను ఎనయెన్ భావించు" వారే అనంతమైన సంసార కష్టములను తరింతురు. అనగా భక్తి భావముచేత ఈశ్వరుని ఎవరు కొల్తురో వారే సంసారములోని దుఃఖములను సరళముగా దాటుదురు. అని చెప్పుట ఇట్లు చూడగా కర్మ జ్ఞాన భక్తి మార్గములందు, భక్తి మార్గమే సర్వ శ్రేష్టమైనదని కవి భావించినాడు. అంతేకాదు ఆ మార్గమును అవలంబించిన మనుష్యులు "సుమహత్ సౌఖ్యాత్ములై ఆధారాదేయ విముక్తి యుక్తులగుదురు అనికూడ చెప్పెను. శైవమతావలంబకులు శైవ భక్తితోపాటు ఈశ్వర కటాక్షమును సంపాదించి సమస్త ఐశ్వర్యములు పొందుదురు. అదియే సుమహత్, సౌఖ్యాత్ములగుట. ఈ సౌఖ్యము భక్తి భావముచేత ఆత్మకు కలిగినది కావచ్చును. లేదా ఐశ్వర్య లాభముచేత

శారీరకమైనదియు కావచ్చును. ఇక పూర్వ జన్మవాసనలు, పూర్వ జన్మానుభవములు కూడ శైవులకు విముక్తము కావలెను. ఈ రెండును శివభక్తుల వలననే సాధ్యమగునని కవి ప్రతిపాదించినాడు.

10) చివరి పద్యము ఒక విధముగా ఈ దారిద్ర్య విద్రావణస్తవము లేక దారిద్ర్య విద్రావణ దశకమునకు ఫలశృతి వంటిది. ఈ లోకమునందలి రాజ్య సంపదలచేత. ఉన్మత్తులైనవారు అనంత సౌఖ్యముల ననుభవించి శివ లోకము మొదలైన సుఖమును పొందువారు ఎటువంటి వారనగా వారు పార్వతీ ధవుడు అనగా శివుని దయను పొందినట్టివారు. వారు భక్తిపరులు కూడ. ఇట్టి సౌఖ్యాత్ములైనవారు భక్తిమార్గ ప్రతిపాదనముచేయు దారిద్ర్య విద్రావణస్తవమును పఠించి సర్వకామోప భోగ మోక్షములను పొందుదురు. ఇదియే ఈ పద్యమునందలి పరమార్థము.

కుమార సంభవము నందలి దారిద్ర్య విద్రావణస్తవము అను పద్య దశకము తెలుగు సాహిత్యములో అనేక విధముల ప్రత్యేకత కలిగియున్నది. దారిద్ర్య విద్రావణా అను మకుటము పది పద్యములకు ఒకే విధముగా నుండుట బహుశ మన సాహిత్యములో మొదటి విశేషమే కావచ్చును. ఎందు చేతననగా నన్నయగారి మహాభారతములో 'నాకు ప్రసన్నుడయ్యెడున్' అనుమకుటము కేవలము ఇదు పద్యములలోనే కన్పించుచున్నది. ఒకవిముగా ఆపద్యములపై ఇది పరిణామస్వరూపమైన ప్రక్రియయని చెప్పవలసి యుండును.

ఈ పది పద్యములలో కవి ఒక కధా విశేషమునుగాని ఒక కథా శిల్పమునుగాని ప్రవేశపెట్టినట్లు కాన్పించదు. బృహస్పతి ఈశ్వరుని స్తుతి చేసినట్లుగా వ్రాయబడిన ఈ పద్యములు నిజమునకు ఎవరు వ్రాసినను ఎవరు చదివినను ఒకటియే. ఈశ్వరుని స్తుతియే దీనిలోని ప్రధానాంశము. అనగా ఈ పద్యములు ప్రధాన కావ్యముతో విడిపోయినను వాని అస్తిత్వమును స్వతంత్రముగా నిలుపుకొని యున్నవి. శివభక్తులు ఈ పద్యములనెప్పుడైనను, స్తోత్రప్రాయముగా పఠించి యుండవచ్చును అని భావించుటలో వింతలేదు.

నన్నెచోడుడు దారిద్ర్య విద్రావణస్తవము వ్రాయునాటికి తెలుగులో శతక ప్రక్రియ ఉన్నట్లుగాని నిదర్శనములు లేవు. నన్నెచోడుడే దారిద్ర్య విద్రావణా అను మకుటముతో నూరు పద్యములు వ్రాసియుండెనేమో కూడ మనకు తెలియదు. సంఖ్యలో ఈ పద్యములు పదియే అయినప్పటికీ దీనియందు శతకలక్షణములు సమగ్రముగా నున్నవి. ఇట్లు చూడగా దారిద్ర్యవిద్రావణ స్తవమును రచించి నన్నెచోడుడు భావి శతక కవులకు మార్గదర్శకుడైనాడని చెప్పుటలో సందేహములేదు. ఈ పద్యములు అపారముగా తరువాత తెలుగులో విస్తరించిన శతక సాహిత్యమునకు ప్రాథమిక దశగా నున్నదని చెప్పుట సముచితముగా నుండును.

## ఆశ్వాసాంత పద్యములు

నన్నెచోడుడు కుమార సంభవ కావ్యమున తన గురువగు మల్లికార్జుని పై తన భక్తి శ్రద్ధలను ప్రకటించు కొనుటకు తన కావ్యమును ఆయనకే అంకితము చేసెను. ఈ అంకితము చేయు సంప్రదాయమును తెలుగు సాహిత్య మునందు ప్రారంభించిన వాడు నన్నెచోడుడే. ఆ సంప్రదాయమును బట్టి కావ్యమెవరికి అంకితము చేయబడునో అతనిని గురించి ఆశ్వాసాంతములందు స్తుతి చేయుచు, కవులు పద్యములను వ్రాయుచుందురు. అట్టి పద్యములను నన్నెచొడుడు పన్నెండు ఆశ్వాసముల చివరన ఈ కవి రచించెను ఈ పద్యములన్నింటిని నేను విశదముగా పరిశీలించితిని. వానిలో ప్రధానముగా ఒక తత్వమును నిరూపించుటకు నన్నెచోడుడు ప్రయత్నము చేయుచుండును. అదియేమనగా ఈశ్వరుడైన శివుడు ఈశ్వరుడైన జంగమ మల్లికార్జునుడు స్వరూప స్వభావములందు ఏకీభావము కలిగినవారు అని చెప్పుటయే. ఇట్లు చెప్పుటకు అతని గురువుగారు పేరు మల్లికార్జునుడగుట ఈ కవికి చాల సహకారము చేసినది. అశ్వాసాంతములలోని దాదాపు అన్ని పద్యములను మల్లికార్జును డనగా జంగముడైన మల్లికార్జునుడు ఈశ్వరుడు అను రెండర్థములను ప్రదర్శించి వారిద్దరి ఏకీభావమును దాదాపు వంద పద్యములు ఇట్టి విశేషము లనే చెప్పుచున్నవి. అందు కొన్ని పద్యములను మాత్రను దిఙ్మాత్రముగా ప్రదర్శించి ఈ విశేషమును నిరూపింతును.

ఉ. మారమద ప్రహారు గుణమండన మండితు సుందరాంగుదు
ర్వార భవాబ్ధిపారగు సువర్ణ సవర్ణ శరీరు సజ్జనా
ధారు గవీంద్రగాయక బుధస్తులుగా శవికాసహాసది
క్స్ఫూత చారు కీర్తి మునిపుగవు జంగమ మల్లికార్జునున్
(130)

ఈ పద్యము ప్రథమాశ్వాసము చివరి భాగమునందలిది. జంగమ మల్లికార్జును డైన తన గురువు నుద్దేశించి చెప్పిన ఒక్కొక్క విశేషణము క్రమముగా ఈశ్వరునకు, గురువునకు సమముగా వర్తించును.

మారమద ప్రహారుడు - మన్మథుని మదము నణంచిన శివుడు.

2) సంసారికి వాంచలను మన్మధ సంబంధమైన కోరికలను ప్రహరించిన గురువు.

గుణమండన మండితుడు - మంచి గుణములచేత ప్రకాశించువాడు - ఇద్దరికి సమానుడే.

దుర్వార భవాబ్ధి పారగుడు - వారించుటకు సాధ్యము కాని పాపమను సముద్రమును దాటిన వాడు - అనగా పాపము అంటని వాడు, శివుడు; 2) అనంతమైన జన్మమను సముద్రమును తరించిన వాడు. అనగా సంసార బంధము నుండి ముక్తుడైనవాడు.

సువర్ణ సవర్ణ శరీరుడు - బంగారు వంటి మంచి రంగుగల శరీరము గలవాడు - ఇద్దరికి సమానమే.

సజ్జనాధారుడు - భక్తులకు పుణ్యాత్ములకు ఆధారమైన వాడు. (ఇద్దరికి సమానమే)

కవీంద్ర గాయక బుధస్తుతుడు - కవుల చేతను, గాయకుల చేతను, పండితుల చేతను స్తోత్రము చేయబడు వాడు. (ఇదియు నిద్దరికి సమానమే)

కాశ వికాస హాస దిక్స్ఫూరిత చారుకీర్తి - స్వచ్ఛమైన కీర్తి కలవాడు (ఇదియు నిద్దరికి సమానమే)

మునిపుంగవుడు - మహాయోగియైన శివుడు - మునియైన జంగముడు.

క. రమణీ రమణీయాసు రూ
పమయాంగజ శస్త్ర వజ్రపం జరనిభస
ద్విమల శివయోగ తత్పరు
డమల చరిత్రుండు మల్లికార్జునుడెలమిన్. (ద్వి. ఆ 109)

రమణీ రమణీయ సురూపమ యాంగజ శస్త్రి వజ్ర పంజర నిభ సద్విమల శివయోగ తత్పరుడు. 1) సుందరమైన స్త్రీల యొక్క సౌందర్యముతో నిండిన మన్మధుని యొక్క అస్త్రిములకు స్వచ్ఛమైన శివయోగము చేత కూడిన వజ్ర పంజరమైన వాడు మన్మధుని మనస్సున ప్రవేశింప నీయని శివుడని ఒక అర్థము. 2) సంసారిక బంధములైన స్త్రీ సౌందర్యముల చేత కలిగెడు భావ ములను తన వైపుకు రానీయని వాడని యొక అర్థము. అమల చరిత్రుడు - స్వచ్ఛమైన చరిత్ర గలవాడు. ఇద్దరికిని సమాన మే.

ఉ. చారుతరా వదా తనుత శాశ్వత కీర్తి రస ప్రవాహసం
పూరిత రోదసీ కుహరు బుణ్య సనాతన మూర్తి, సజ్జనా
ధారు, సమస్తలోక జనతానుతపాద సరోజ పీఠు, శృం
గార భవారి, నర్థిజనకల్ప మహీజము, మల్లికార్జునున్
(తృ. ఆ. 109)

చారుతరావదాతనుత శాశ్వత కీర్తి రస ప్రవాహ సంపూరిత రోదసీ కుహరు - బంగారువంటి స్వచ్ఛమైన కీర్తి, ఆకాశమున నిండిన వాడు - ఇద్దరికిని సమా నార్థక మే.

పుణ్యసనాతనమూర్తి - ఇదియు నిద్దరికి సమానమే.

సజ్జనాధారుడు - భక్తులాధారమైన వాడు. ఇదియు నిద్దరికి సమానమే.

సనుస్తలోక జనతానుతపాద సరోజ పీఠుడు - అన్ని లోకములందలి జనుల చేత నమస్కారము నందిన పాదపద్మములు గలవాడు. ఇదియు నిద్దరికి సమానమే.

శృంగార భవారి - మన్మధునకు శత్రువు; శివుడు.

శృంగార భవారి - శృంగారము చేత కలిగిన పాపమునకు శత్రువు.

అర్థిజన కల్ప మహీజము - కోరిక కలిగిన వారికి కల్పవృక్షము (ఇదియు నిద్దరికి సమానమే)

సప్తమాశ్వాసాంతము నందలి ఈ పద్యమును చూతము.

> మ. అరిషడ్వర్గ జయుండు దత్త్వవిదు డాత్మారాముడు జ్ఞాన సిం
> ధుర కుంభాగ్ర విదారణోగ్ర నఖవద్ధోర్దర్ప విఖ్యాత కే
> సరిదుర్వారగభీర ఘోర తర సంసారోర్వ కూపారసం
> తరణాత్యున్నత సేతుకల్పు డఖిలాధారుండు ధీరుండెదన్
>
> (స. ఆ. 15౮)

అరిషడ్వర్గ జయుండు - కామక్రోధాదులను జయించినవాడు (ఇద్దరికిని సమానమే)

తత్త్వవిందుడు - వేదాంతము తెలిసినవాడు, శివతత్త్వము తెలిసిన వాడు

ఆత్మారాముడు - మనస్సున ఆనందించువాడు. ఇదియు నిద్దరికి సమానమే.

అజ్ఞాన సింధుర కుంభాగ్ర విదారణోగ్ర నఖవద్ధోరదర్ప విఖ్యాత కేసరి - అజ్ఞానమనెడు ఏనుగు కుంభ స్థలమును చీల్చుటకు సమర్థమైన భయంకరమై, శక్తివంతమైన గోళ్ళు కలిగిన సింహము వంటివాడు. అజ్ఞానమును ఖండించువాడని యర్థము ఈ విశేషణము ఈశ్వరునకు జంగమునకును సమానమే.

దుర్వార గభీరఘోరతర సంసారోర్వకూపార సంతరణాత్యున్నత సేతు కల్పుడు - వారించుటకు సాధ్యము కానట్టి గంభీరమును భయంకరమును, అయినట్టి సంసార రూపమును దాటుటకు ఉన్నతమైన సేతువు వంటివాడు - సంసార బాధలను దాటుటకు శివుడే శరణ్యము. సంసార కూపమును తరించుటకు జంగమ మల్లికార్జునుని ఉపదేశములే శరణ్యములు.

అఖిలాధారుడు ధీరుడు - ఇవి ఇద్దరికి సమానమే.

చివరగా అష్టమాశ్వాసములోని ఈ పద్యమును కూడ వివరింతును.

> కం॥ సజ్జన నిధాను విబుధా
> వజ్జలనిధి కుంభజ ప్రభావు శశిరభూ
> దృజ్జాతాధిపనిన్ని భు
> హృజ్జాస్త్రాసభిజ్ఞు నీప్సితఫలదున్ (198)

సజ్జన నిధానుడు - పండితులకు భక్తులకు ఆశ్రయమైనవాడు. లేక వారి కోర్కెలను తీర్చువాడు. (శివునకు మల్లికార్జునునకు సమానమే.)

విభుదా వజ్జలనిధి కుంభజప్రభావుడు - పండితులైన భక్తుల ఆపదలను సముద్రమును అగస్త్యునివలె హరించువాడు.
శశిరభూబృజ్జాతాధిపసన్నిభుడు - హిమాలయము వంటి తెల్లని స్వరూపము గలవాడు.
హృజ్జన్మాస్త్రానభిజ్ఞుడు - మన్మధుని బాణములను నిర్మూలించుటయందు నేర్పు గలవాడు. ఇదియు ఇద్దరికి సమానమే.
ఈప్సితఫలదుడు - కోరికలను తీర్చువాడు.
ఇదియు నిద్దరికి సమానమే.

ఇట్లు దాదాపు నూరు పద్యములందు నన్నెచోడుడు తన గురువైన మల్లికార్జునుని స్తుతిచేసినాడు. అన్నిచోటులందుకూడ ఆ జంగమునికి ఈశ్వరునితో అభేదము కల్పించి చెప్పియున్నాడు. ఇట్లుచేయుటలో మనము రెండు విశేషములను చూడవచ్చును. తన గురువైన జంగమ మల్లికార్జునుడు ఈశ్వరునియంతటి మహిమాన్విత మూర్తి యని వ్యంగ్యముగా పాఠకులకు నివేదించుట ఒకటి. శైవ సంప్రదాయమున ఈశ్వరుని ఏకీభావముగా తలచుట కలదని శివతత్త్వ విషయము వచ్చినప్పుడు చెప్పియుంటినిగదా: ఆ ఈశ్వరా అభేదమును నొక్కివక్కాణించుట రెండవది. ఇదికాక నన్నెచోడునికి శైవతత్త్వముపై కలిగిన అధికారమెట్టిదో ఈ పద్యములో చాల చక్కగా వ్యక్తము చేయును. ఈ విశేషములేకాక ఇట్టిమార్గము నవలంబించుటకు దానిని శైవ సాహిత్యమునందు పూర్తిగా సిద్ధి పొందించుటకు నన్నెచోడుడు మొదటి వాడని చెపవచ్చును.

# మల్లికార్జున పండితుడు - శైవము

శైవ సంప్రదాయమున శివలెంక మంచన పండితుడు, శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు పండితత్రయ మని ప్రఖ్యాతి వహించిరి. వీరు ఆంధ్ర కర్నాటక దేశములలో శైవ సంప్రదాయమును ప్రచారము చేసిన మహాను భావులు. ఈ ముగ్గురిలో ప్రత్యేకముగా చెప్పవలసినవాడు మల్లికార్జున పండితా రాధ్యుడు. ఎందుచేత ననగా ఆంధ్రదేశమున వెలసిన ఆరాధ్య బ్రాహ్మణ శైవమత వ్యాప్తికి మల్లికార్జున పండితారాధ్యుడే ప్రధానాచార్యుడు. ఇతడు భీమన, గౌరాంబ దంపతులకు పుత్రుడు. భీమన పండితుడు గోదావరీ మండలములోని ద్రాక్షారామ భీమేశ్వర క్షేత్రములో అర్చకుడుగా నుండెడి వాడు. వీరిది వానస వంశము. గౌతమ గోత్రము. మల్లికార్జున పండితుడు అవాంతరదేశికుని శిష్యుడగు కోటిపల్లె ఆరాధ్య దేవుని యొద్ద శివదీక్ష పొంది యుండెను. దానికి చిహ్నముగా విభూతి మొదలగునవి ధరించి శివ ప్రసాద సేవనము మొదలగు విధులను నిర్వర్తించు చుండెను. ఈ విధులను అతని తోడి బ్రాహ్మణులు ఆమోదించలేదు. అంతేకాక ఇతనిని నిందించెడివారు. కాని మల్లికార్జునుడు బహు వేదశాస్త్ర పురాణ విజ్ఞాన పాండిత్యము కలిగిన వాడు. పండితుడు. బ్రాహ్మణ సమాజము యొక్క ఆక్షేపణములను, తన విజ్ఞాననిరతి ఆధారముగా ఖండించెను. వారు చేసిన ఆటంకములను శ్రుతి, స్మృతి పురాణోక్తముగా సమాధానములు చెప్పి వారినికూడా శివభక్తులను చేసెను. ఇట్లు నిత్య శివపూజా విధిచే అఖండజ్ఞాన నిధియు మహిమాన్వితుడు గాను, పండితుడు పేరు సంపాదించెను. ఒకనాడు పోరండ్ల సానమ్మ బెవిదేవి వేమనారాధ్యుడు మల్లికార్జున పండితుని శైవ మహిమను విని అతనిని దర్శించుటకు వచ్చిరి. వారాతని విజ్ఞానాధిక్యమునకు, శైవనిరతికి ముగ్ధులైరి. వారు తమ గురువైన బసవేశ్వరుని మహిమను అతని భక్తుల మహిమను వివరించి చెప్పిరి. మల్లికార్జున పండితుడు నందీశ్వరుని అవతారముగా ప్రఖ్యాతి పొందిన బసవేశ్వరుని దర్శించుటకు సంకల్పించెను.

ఆకాలమున జైనము, బౌద్ధము, చార్వాకము మొదలైన వేద బాహ్యమైన మతములు వ్యాప్తిలో నుండెను. పండితారాధ్యుడు ఇట్టి మతములను ఖండించి శైవమును ప్రచారము చేయుట తన జీవితమునకు ప్రయోజనముగా భావించెను. అందుచేత అతడు దేశ సంచారమును ప్రారంభించి తన విజ్ఞాన మహిమలచేత వైదిక శైవమత వ్యాప్తికి పూనుకొనెను. మొదట గుంటూరు మండలములో రెండవవెలనాటి చోడుని రాజ్యమును చందవోలు (ధనదుపురము) న ప్రవేశించెను. అచట రాజగురువగు బౌద్ధపదాచార్యునితో పండితునికి వాదము జరిగెను. తన ప్రామాణికమైన పరిజ్ఞానముచేత ఆ సభలో పండితుడు బౌద్ధచార్వాకాది వాదములను ఖండించి బౌద్ధపదాచార్యుని ఓడించెను. చివరకు బౌద్ధపదాచార్యుడు శివుని కపాలాస్థి చర్మధరుడని నిందించెను. అయినను పండితుడు అవలీలగా శివలీలల నిరూపించి సమాధానము చెప్పెను. ఇది సహించని బౌద్ధపదాచార్యుడు పండితునే నిందించెను. ఈ నింద పండితుని శిష్యులు ఓర్చుకొనలేక పోయిరి. రేమయ్య, దేవయ్య అను ఇతని శిష్యులు సముద్రపు లంకలో బుద్ధ విగ్రహమునకు నమస్కరించుచున్న బౌద్ధ పదాచార్యుని చంపివేసిరి. ఈ సంఘటన వెలనాటి చోడుని ఆగ్రహమునకు కారణమయ్యెను. వెలనాటి చోడుడు పండితుని శిక్షించి అతని కన్నులు తెయించెనట. నిగ్రహ అనుగ్రహ సమర్థుడగు పండితుడు రాజును శపించెను. శిష్యులతో అమరావతికి బయలు దేరెను. అచట భక్తుల సహస్రనామ గణమాలిక తోను అమరేశ్వరాష్టకము చేతను మాహేశ్వరుని స్తుతి చేసెను. ఈశ్వరుని అనుగ్రహముచేత తిరిగి అతనికి కన్నులు వచ్చెను.

పండితుడు అమరావతిలో ఉన్నప్పుడే బసవేశ్వరుడు పండితునకు శివ మహిమాన్వితమైన భస్మమును పంపించెను. దానిని స్వీకరింపగనే పండితుడు కర్ణాట భాషలో కవిత్వము చెప్పసాగెనట! అతనికి బసవేశ్వరుని దర్శించు కుతూహలము అధికము కాసాగెను. అప్పుడు కళ్యాణ కటకమున బసవడు నివసించియుండెను. పండితుడు ప్రయాణమును కొనసాగించగా త్రోవలో నిడుగుడుములలో సారంగేశ్వరుని దగ్గర శిష్యపూజల నంది పానుగంటికి పోయెను. పానుగంటికి ఉదయనుడు రాజు. అతని మంత్రి పింగళి గోవింద ప్రధాని. అతడు పండితుని భక్తుడు. ఆ ప్రధాని పండితుని తనయింటికి

తీసికొని పోయెను. అచ్చట ధవళేశు నామయ్య అను భక్తుడుండెను. అతడు రాజు కొలువులో సేవకుడు. నామయ్య పండితు వారిలో నున్నప్పుడు రాజు సేవకు పోలేదు. రాజు నామయ్యను పిలిపించి కారణమడిగెను. నామయ్య మాత్రము సేవకుడనగు నాదేహము మీదికాని ఆత్మ మీదికాదు అని పలికి రాజుగారి ఖడ్గము తీసికొని గుడి గోపురమెక్కి తన తలను ఖండించుకొనెను. ఈ సంఘటన పండితుని మనస్సును వికలము చేయగా తన భక్తుని మరణమునకు ఉదయినుడే కారణమని అతనిని నిందించెను.

అచటి నుంచి కళ్యాణమునకు బయలు దేరి పండితునకు ఒక దుర్వార్త చేరెను. అదేమనగా జగదేవ, మొల్లె బొమ్మయ అను వారలుబిజ్జలుని సంహరించిరి. బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వరమునకు బోయి ఆ క్షేత్రము నందలి లింగమున దేహముతో లీనమయ్యెను. ఈ వార్త తెలిసిన పండితుడు, బసవేశ్వరుని తాను కనుగొనలేక పోయినందులకు చాల విచారించెను. ఇంక కల్యాణ కటకమునకు ప్రయాణ మాగిపోయెను. పండితుడు శ్రీశైల యాత్రకు పూనుకొనెను. ఆ యాత్రలో వెల్లటూరు చేరెను. అప్పటికి పండితునికి వార్ధక్యము వచ్చినట్లున్నది. శ్రీశైలక్షేత్ర మధిరోహించి శ్రీశైలేశ్వరుని దర్శించుట అతనికి కష్టతరమయ్యెను. అందుచేత దోనయ్య అను తన శిష్యుని తన పక్షమున శ్రీశైలేశుని దర్శించి రమ్మని పంపెను. దోనయ్య అట్లే దర్శించి వచ్చుచుండగా శ్రీశైలేశ్వరుడు వృద్ధ బ్రాహ్మణ వేషమున కనిపించి పండితుని కుశల మడిగి అతడు తన నెచ్చెలియని దీపవృక్ష శిఖరాగ్రమునుండి శ్రీశైల సర్వస్వమును చూపెను. ఈ విషయమంతయు పండితుడు దోనయ్య వలన తెలిసికొని పరమానంద భరితుడయ్యెను. శ్రీశైలేశుడు తనకు దర్శనమిచ్చి నట్లుగానే భావించి తన్మయుడయ్యెను. ఇంక తన జన్మము సార్ధకమయినదని భావించుకొనెను. బసవేశ్వరుడులేని ఈ లోకమున తాను జీవించి ప్రయోజనము లేదని నిశ్చయించుకొని శ్రీశైల పాదము నందలి వెల్లటూరునందే అతడు శివైక్యము చెందెను.

దక్షిణ దేశమున శైవమత వ్యాప్తి విషయమున బసవేశ్వరుడును మల్లికార్జున పండితారాధ్యుడును ముఖ్యులు. కావుననే పాల్కురికి సోమనాథుడు బసవేశ్వరుని చరిత్రమును బసవ పురాణముదాను పండితుని చరితమును

పండితారాధ్య చరిత్రగాను ద్విపదలో రచించెను. మొదటిది పురాణముగాను రెండవది ధర్మశాస్త్రముగాను వాసికెక్కినది.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర వలన పండితుడు అనేక కృతులు రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతడు లింగోద్భవ దేవు గద్యము గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము పర్వత వర్ణనము, గణసహస్ర నామము ఇష్టలింగస్తోత్రము, బసవగీతలు హరలీల, రుద్రమహిమ, శివతత్వసారము దీపకళిక మహానాటకము ఇన్ని గ్రంథములలో మనకిప్పుడు లభించునట్టిది కేవలము శివతత్వసారము మాత్రమే శివతత్వసారములో 489 పద్యము లున్నవి.

మల్లికార్జున పండితారాధ్యుడు ఈ కావ్యమున అనేక శైవాచార సంప్రదాయములను వివరించినాడు.

పండితుని దృష్టిలో భక్తి అనగా కేవలము శివపరమైన భక్తియే. శివ విరహితమైన కార్యము అదెంతటి పుణ్యకార్యమైనను ఉత్తమ ఫలితము నీయదని ఈయన తలంపు. "సర్వం శివమయమ్జగత్" అను భావము నిచట పొందు పరచవచ్చును. "సర్వవిష్ణు మయమ్ జగత్" అని వైష్ణవులు భావింతురట. అట్లే శైవులు, ముఖ్యముగా వీరశైవ సంప్రదాయమునకు చెందినవారు జగత్తంతయు శివమయముగనే భావింతురు. శివతత్వ సారములో పండితుడు ప్రథమమున ప్రారంభ పద్యమందే శివుని రూపము నిరూపించుటకు ప్రయత్నించినాడు.

కం॥ "శ్రీపతి వాక్పతి ముఖ్యమ
హాపురుషులు నెరగనోపరతి వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ
రూపము నేనిట్టిదని నిరూపింతు శివా!''

శివుని రూపమును శ్రీపతి వాక్పతులు కూడ ఎరుగరనుచు చెప్పి, ఇంకను మనకు ప్రధాన దైవతములైన హరిహర బ్రహ్మాదులలో హరి, బ్రహ్మలకన్న కూడ హరుడే అధికుడని ధ్వని ఈ పద్యమున కలదు. శివరూపము మనస్సుకు మాటలకు నందరానిదని చెప్పినాడు. అంతేకాక శివుని వ్యాపారము సయితము

అతివాఙ్మనసమైనదచట! ఈ విధముగా వినమ్రుడై జగత్పతి రూపమును భక్తితో వర్ణించినాడు.

ఇంకను శివుని ఆధిక్యతను నిరూపించుటకు శ్రుతిస్మృతులనుండి పంక్తుల నుద్ధరించినాడు. తాను శివుని తత్త్వమును నిరూపించుటకు అశక్తుడనని చాటినాడు. మల్లికార్జున పండితుడు పాండిత్యము కలిగియుండి కూడా, గ్రంథ రచనకు తనశక్తి చాలదని ప్రకటించినాడు.

"ఓడక నిను బొగడగనా
యీడగు గాదని తలంప - కేవేరుఅనై
చూడవె పొగడెద ననియెడు
వేడుక కారణము గాఁగ వెఱవక రుద్రా"

(శి. సా.9)

శివుని పొగడుట తన కలవి గాదనియు, అట్లు తలచిన అది వెర్రితనమే యనియు, అయినను వేడుకయే శివుని స్తుతించుటకు పురి గొల్పినదని పై పద్య భావము.

శివ స్వరూపము షట్త్రింశతత్త్వములు. అనగా ముప్పదియారు తత్త్వములకు పైమెట్టుననున్నది. ఆ భావమే కవి ఈ క్రింది పద్యములో చెప్పినాడు.

"సర్వేశ్వర! షట్త్రింశ
త్త్వర్వోపరిగత జగత్ప్రభవ హేతు జగ
న్నిర్వాణ సోమరూపమ
ఖర్వ మహత్త్వంబు బొగడ గడునరిది శివా!" (14)

ము ప్ప ది యా రు త త్త్వ ము లు :-

పృథివి, ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, గుహ్యము, శబ్దము, స్పర్శము, రసము, గంధము, ఆకాశము, వాయువు, వహ్ని, జలము, మాయ, కాలము, నియతి, కల, రాగము పురుష, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య, రూపము. కవి ఇంతవరకు శివుని రూపము యొక్క

గొప్పతనమును, మాహాత్మ్యమును చెప్పి, ముందుముందు శైవమతమునకు సంబంధించిన వివిధ శాఖలను గూర్చి, ఆచారములను గూర్చియు చెప్పినాడు. ఆరాధ్య సాంప్రదాయములు (వీరశైవ సంప్రదాయములు) ఈ గ్రంథమున బహుళముగా వర్ణింప బడినవి.

పశుపాశ పతి జ్ఞానము

మల్లికార్జున పండితారాధ్యుననుసరించి రుద్రుడు పతి. తక్కిన వారు పశువులు. ఈ విధముగా నిర్ణయించుటకు గల కారణము "పతి రుద్రుడు పశువులకని శ్రుతి చెప్పుచునికి" అని పండితయ్య ఘంటాపథముగా పేర్కొనెను.

"పతి రుద్రుడు పశువుల కని
శ్రుతి చెప్పుచు నునికి జేసి, రుద్రుడు పతి త
క్కితరులు పశువులు పొమ్మని
మతిలో నెఱిగితి శ్రుతిప్రమాణమున శివా! (22)

శైవసంప్రదాయ శాఖలలో పాశుపత మతి ప్రాచీనమైనదని ముందు ప్రకరణములోనే చెప్పియుంటిని.

జీవులందరు పశువులు. ప్రకృతి వికృతి బంధము పాశము. ఆవృత్తము పశువులు. ఈ రెంటికి అధిపతి పరమశివుడు. అందుకే పాశముల చేత పశువుల వంటివారైన జీవులకు బంధ మోక్షములను కలిగించుటకు శక్తిమంతుడైనవాడు శివుడు తప్ప ఇతర దైవములు కారు. ఇచట శివుడు తప్ప వేరే దేముడు లేడని చెప్పు భావము వెల్లడి చేయబడినది. ఇదియే వీరశైవ సంప్రదాయమునకు నాంది. పండితయ్య ననుసరించి శివుడు కేవలము జీవరాశులకు, మానవులకు మాత్రమే కాక బ్రహ్మాది సమస్త దేవతలకు సహితము పతియట! ఈ భావమునే ఈ పద్యములో కవి చెప్పినాడు.

"పశువులట! జీవరాసులు
పశు పాశంబులకు నీవ పతివట! శివ! నీ
వశరణ్యమనంబగుదు
ర్వశ భవపాశములు తెగక - వచ్చునే యెందున్" (26)

ఈ పరమ శివుని వలననే గోపతి కృతమున భవపాశ పేతములైన పశువుల వలె త్రిమల కృత దుఃఖ సంసార మహాబ్ధి నిమగ్నమైన సర్వ జగము విముక్తమై వెలుగునట! ఈ భావమును ఆలోచించి చూడగ ఈ చరాచర సకల జగత్తునంతటికి రక్షణ, శిక్షణ, పోషణ, మోక్షాదులను కల్పించునట్టి వాడు సాక్షాత్తు శివుడే యని గ్రహింపగలుగుచున్నాము. ఈయనలో రక్షణ, శిక్షణా దులే కాక సంసార బంధములను ఛేదించు మహోపాయము కూడ నిక్షిప్తమై యున్నట్లు తెలియుచున్నది. అ భావమే ఈ పద్యములో గలదు.

"త్రిమలకృత దుఃఖ సంసా
ర మహాబ్ధి నిమగ్న జీవ - రాసులు నీయు
త్తమ కారుణ్య వంశంబున
విముక్తులై నీ వపోత - వెలుగుదురు శివా!" (౩౧)

శివుడు సమస్త జగత్తునకు శరణ్యుడు. అతడు పతి. తక్కిన జగమంతా పశు తుల్య మైనది.

అద్వైత మత ఖండనము :-

అద్వైతులు సాధారణముగా ముఖ్యముగా శంకరాద్వైతులు ప్రపంచ మును మిథ్యగా చెప్పుచుందురు. 'ప్రపంచము మిథ్య' అను వీరి వాదమును గ్రహించి పండితయ్య ప్రపంచమును మిథ్యగా చెప్పువాడు తొలుత ఆ ప్రపంచము యొక్క సద్భావమును ఎరుగ లేదు. తానెరుగని దానిని మిథ్యగా పేర్కొనుట అనాశ్రయమైనది. అనాశ్రయమును ఆశ్రయించి చెప్పుట దుష్ట టము. ఇచట పండితయ్య అద్వైత వాదమును ఖండించి, శివభక్తిని ప్రతిష్ఠా దించుటకు పూనుకొనినాడు. భక్తి సిద్ధాంతమునకు గల ప్రాముఖ్యత వివరించు టకు కవి పూనినాడు. అద్వైతుల భావము ఇట్లు గలదని చెప్పినాడు.

''అమరగ బ్రపంచ మిథ్యా
త్వమ సెప్పెడు వాదిమున్ను - దానికి సద్భా
వము దానెరుగక మిథ్యా
త్వము నాశ్రయమెట్లు జెప్ప - దలపోయు శివా!'' (౩౮)

ప్రపంచము నందేదియు అనిర్వచనీయము కాదు. నిర్వచనము లేనిదే అని ర్వచనముండదు. కావున ఈ రెండింటి చేతనే అద్వైత వాదము ఖండింపబడు చున్నది.

క॥ "నిర్వచనీయము లేకయ
నిర్వచనీయంబు గలదే? నిర్వచనీయా
నిర్వచనీయోత్పత్తిన
సర్వాద్వైతంబు చెడదె - సర్వానందా॥" (39)

జీవుడు శివుడును వాక్యము
భావింపఁగ నైక్యమునకు బ్రతిపాదకమే
జీవుడు నీ పశుభృత్యుడు
గావున నీవాడవేరు - గాదనుట శివా" (40)

అద్వైత వాదము ఖండింప బడుచున్నదనుచు వారి వాదమును పూర్వ పక్షము చేసినాడు. నిజమాలోచించినప్పుడు జీవుడు శివుడు అను వాక్యము ఐక్యతను ప్రతిపాదించుచున్నది. జీవుడెప్పుడు శివునికి పశు భృత్యుని వంటివాడు. అందుచే అతడు శివునికి దగ్గర వాడు తప్ప వేరుకాదు. మల్లికార్జున పండితా రాధ్యుడు జీవ జీవేశ్వరులకు ఐక్యతను చెప్పినాడు. వీరిరువురిలో శక్తి సామర్థ్య ములను పురస్కరించుకొని భేదములున్నవి. జీవునికి బంధమోక్ష దశావస్థ లున్నవి. శివునికి అవి లేవు. ఆ భావమే ఈ పద్యమున గలదు.

జీవునకు బంధమోక్ష ద
శావస్థలు గలవు నీకు, నవిలే వగుటన్
జీవునకు నీకు నైక్యము
భావించుట ముఖ్య వృత్తి - బాధకము శివా (41)

దీని వలననే ఇరువురు ఒక్కరని భావించుటలో బాధకమున్నది. ఇందు శివునకు, శివభక్తునకు భేదము లేదను ధ్వని కన్పించుచున్నది. శివభక్తునకు నమస్కారమిడిన చాలు! శివునకు నమస్కరించినట్లే పరమక్లేశాత్ములైనవారు పశుజీవులు. పరమేశ్వరునకు, జీవులకు పర్వత పరమాణువులకున్నంత భేద మున్నది.

పరమేశ్వర నీకును మఱి
పరమక్లేశాత్ములైన - పశుజీవులకం
తరము మహా ధాత్రీ ధర
పరమాణుల యంతరంబు ॥ భావింప శివా (42)

* పండితయ్య అద్వైతులకు లోకాయతులకు (నిరీశ్వర వాదులకు) భేదము లేదని వాదించెను. ఎందుకనగా ఆత్మను నిరాకారుడని చెప్పి తిరిగి ఆత్మీయ బుద్ధితో ఆ ఆత్మనే జగదు పాదాన కారణముగ చెప్పుట (భ్రాంతితో కూడినది) జ్ఞాన స్వరూపుడు ఈశ్వరుడు. అట్టి జ్ఞాన స్వరూపుడైన ఈశ్వరునకు అజ్ఞానము ఏ విధముగా తాకును? ఈ సందర్భములో అద్వైతులు అకారణముగా ఈశ్వరునకు అవిద్యను ఎందుకు కల్పించిరని పండితయ్య ప్రశ్నించుచున్నాడు.

---

*క్రీ. శ. 500 సం॥ర ప్రాంతములో సోమనాథుడు శివదృష్టి అనే గ్రంథమును రచించినాడు. శివదృష్టిలో అద్వైతము ప్రతిపాదింపబడినది. కాని శంకరాద్వైతమునకున్ను దీనికిని భేదమున్నది. జీవి సాధన మూలముగా శివునితో ఐక్యమును ప్రత్యభిజ్ఞమూలముగా సాధించ వలెను. ప్రపంచము మాయకాదు. అది ఆభాసము. శక్తిద్వారా శివుడు ప్రపంచముగా పరిణమిస్తాడు. ఈ పరిణామము శివునికి తెలిసే జరుగుతుంది. కాని, ఈశ్వరునికి గల ప్రపంచ పరిణామ జ్ఞానమునకున్ను సాధకుని జ్ఞానమునకున్ను భేధమున్నది. ఈ పరిణామము సాంఖ్యా సిద్ధాంతము ననుసరించి చాలవఱకు కలదు గాని కొన్ని ముఖ్య భేదములున్నవి. ఈ సిద్ధాంతములోని తత్వమునకు త్రిక మని పేరు. శివుడు, శక్తి, అణువు లేక పతి, పాశము పశువు. అనేవే త్రికము. ఈ త్రికమునకు ప్రతిభిజ్ఞను కూడా చేర్చ వలెను. మాధవ రచితమైన సర్వదర్శన సంగ్రహములో ఈ సిద్ధాంతమును గురించిన వివరములు విపులముగా తెలుపబడినవి. ఆగమములు సాధారణముగా శైత సిద్ధాంతమును బోధించును. శంకరాచార్యుని అద్వైత సిద్ధాంతమునకు ఆగమ బోధనలను సంధింప ప్రయత్నించడము చేత ఈ శివాద్వైత సిద్ధాంతము బయలు దేరినదని తజ్ఞులు చెప్పుచున్నారు.
పండితారాధ్య చరిత్ర. పీఠిక, డా॥ చిలుకూరి నారాయణరావు గారు. పుట, 280.

పండితయ ఆరాధ్యుడు, ఆరాధకుడు. ఆరాధకము అని అద్వైతులు వేరుచేయలేక దురాచారకృత సర్వహాన్యాకారస్థితి చేసినారని వాపోయినాడు.

మాతయు మానము మేయము
త్రాతిగ మిథ్యయని పల్కు - పాతికులాత్మా
ద్వైతులు ప్రమాణ శూన్యులు
నీతి యెరుంగుదురె తత్వ - నిర్ణయము శివా (44)

ఇంతే కాక అద్వైత మతమును గురించి చెప్పుచు "ఆ మతము సకల నాస్తిక జాతి నివాసమైనదనియు, మహాపాతకమైనదనియు, సర్వసంకరమైనదనియు, నిత్య మహాజన దూష్యమనియు, ప్రత్యక్షాది ప్రమాణ బాధకమనియు, అత్యనుచితమనియు వాపోయినాడు.

పాతకము సకల నాస్తిక
జాతని వాసంబు సర్వ - సంకరమాత్మా
ద్వైతంబనగా జగదు
త్పాతము దొరకొనునేయిట్లు - పరమానందా (51)

నిత్యమహాజన దూష్యము
ప్రత్యక్షాది ప్రమాణ - బాధా బాహ్యం
బత్యనుచిత మద్వైతము
కృత్యాకృత్యాది శూన్య - కీటకము శివా! (52)

అనుచు అద్వైత మతము పట్ల నిరసన భావన ప్రకటించినాడు. పరమేశ్వరుని గొప్పతనము, శైవమతము యొక్క ఔన్నత్యము చెప్పుటయే కేవలము కవి చేయబూనిన పని. ఇంకను అద్వైత వాదులను గురించి స్వేచ్ఛా చారులనియు, ప్రచ్ఛన్న దోషజ్ఞులనియు, అచ్ఛాదిత దుష్ట చిత్తులనియు, మిథ్యా విచ్ఛేదన వేద శాస్త్ర విప్లవ వాదులనియు కటువుగా పేర్కొనినాడు.

స్వేచ్ఛా చారులు మిథ్యా
విచ్ఛేదన వేదశాస్త్ర - విప్లవ వాదుల్
ప్రచ్ఛన్న దోషలజ్ఞా
నాచ్ఛాదిత దుష్ట చిత్తులద్వైతుల జా (55)

మున్నె ద్వైత వ్యామో
హోన్నతిని సనత్కుమారు - డుష్ట్రింబయ్యెన్
మన్నింపక ధూర్జటినని
యెన్నన్విన రయ్యనంది - కేశ్వరు చేతన్ (58)

అందుకే మాయావాదముతో ఈశ్వరుని స్వరూపము చెప్పునట్టి మాయావాదుల చదువులు విడచి 'శివాయనమో" అనుచు ఆ పరమ శివునే కొలుతునని అద్వైతమత ఖండన షట్టమునందు చెప్పినాడు.

జ గ త్క ర్తృ వి చా ర ము :

శివతత్వ సారములో పండితారాధ్యుడు జగత్కర్తృ విచారమును కావించినాడు. దీనిలో సాంఖ్య సిద్ధాంతమును కొంతవరకు స్వీకరించి మరికొంత దానికి భిన్నముగ తన మత సిద్ధాంతమును నిరూపించినాడు. పండితయ్య ననుసరించి జీవేశ్వరులకు స్వామి భృత్యాభావము స్థిరమైనదిగా గ్రహించవచ్చును. ఈ నిశ్చయముతోనే నిర్గుణము, క్షణికము, అచేతనమైనది జగత్కార్యాకరణమునకు సమర్థవంతము కాదని వాదించినాడు. ఆ విధముగనే ఈయన దృష్టిలో ప్రధాన పరమాణవాదులు అచేతనములు. పురుషుడు చేతను డైనప్పటికిని అజ్ఞుడు కావున కర్త కాజాలడు. ప్రముఖములైన పంచ భూతములు అవయవయుతములైనవి. కావున వానిని కార్యములుగ స్వీకరించి నాడు. ఎచ్చటను కర్తృవిహీనమైన కార్యముండదు. అందుకే జగత్కార్యమునకు ఆదికర్తయుడవలయును. అట్టి కర్త శివుడే. కర్మ ఎప్పుడు అచిత్తు. కర్త, కర్మాధీనుడు అను విచారము వదలి పండితయ్య కర్మఫలదాయు మరియు అకర్మాధీన స్వతంత్రుడు శివుడనియే పేర్కొనినాడు. దాదాపు ఈ వాదమునకు సమీపముగనే జైన, బౌద్ధ, చార్వాకాదుల సిద్ధాంతములున్నప్పటికిని ఆ మతములు శ్రుతి బాహ్యములగుట వలన దుర్మతములని ఈయన భావించి నాడు. రుద్రుని మహిమవల్లనే విష్ణ్వాదులు అండంబులను సృష్టించుటకును, తిరిగి వానిని గ్రతికించుటకును శక్తి సమేతులగుచున్నారని చెప్పినాడు. పై భావములే ఈ పద్యములలో వెల్లడియగుచున్నది)

శ్రుతి బాహ్యంబులు గావున
సతతంబును జైన బౌద్ధ - చార్వాకులదు

ర్మతములు వట్టక పట్టితి
శ్రుతి సారభవన్మతంబు - సుమతి మహేశా! (78)

కీర్తింపగ లోకములకు
గర్తలు విష్ణ్వాదులయ్యు - గారాదిమహా
కర్త భవత్ప్రేరితులై
వర్తిల్లుటగారణముగ - వారలురుద్రా (77)

లోకములకు కర్తలు విష్ణ్వాదులని ఒకవంక ఒప్పుకొనుచు, వారు ఆదికర్తలు కారని చెప్పి, వారికాశక్తినిచ్చినది రుద్రుడేయని భావించినాడు. ఇచట కూడ శివుని ఆధిక్యతనే కవి చెప్పినాడు. జగత్తంతయు శివభక్తిమయమై, రుద్రుడే సర్వమునకు అధిపతియైయున్నాడని చెప్పుటే ఇచట పండితుని లక్ష్యము.

తన తెగిన తలయు మడిసిన
తనయుని బుట్టింపగాద - దారోపనియా
వనజాసన కేశవులకు
జనన స్థితి కర్తృతాది - శక్తులు గలవే! (80)

బ్రహ్మతల తెగిపోవుటయు, చనిపోయిన తనయుని పుట్టించుటకును, రక్షించుటకును, బ్రహ్మ, విష్ణువులు శక్తిమంతులు కాలేదు. అందుచెతనే వారికి జనన స్థితి కర్తృకాది శక్తులు లేవని ఈయన వాదించినాడు.*

భ వా ది శ బ్ద వి వృ తి :

మల్లికార్జున పండితారాధ్యుడు శివతత్వ సారములో భవాది శబ్ద వివృతి

---

*పండితయ్య దృష్టియందు శివుడే పరాత్పరుడై పర బ్రహ్మ, అతడే జగత్కర్త, ఆదికర్త. అతడు అక్షరుడు, సర్వజ్ఞుడు, వికార రహితుడు. అంతేకాక ఈతని దృష్టియందు పరమాత్మ, పరబ్రహ్మ, పరమేశ్వరుడు అన్నియు హరుడే. ఇచట పర శబ్దమును పండితయ్య ఉత్కర్ష పరముగా వాడినాడు. ఈతని దృష్టియందు హరి, బ్రహ్మదులు జీవాత్మలే. హరునికి త్రిమలములు, రాగ ద్వేషములు, కర్మ సంస్కారములు, మాలా బంధములు లేవు. హరుని భక్తితో సేవించుట వలన ఇహపర రూపమైన స్వర్గాపవర్గ సుఖము, నిరర్గళ సామ్రాజ్య సుఖము, ఆత్మ విద్యా వర్గాది సుఖములు చేకూరునట.

యను ఘట్టమునందు ఈశ్వరునకు భవుడని, మృడుడని, హరుడని, వచ్చిన నామములను గూర్చి నిఘంటు పూర్వకముగ చర్చించినాడు. ముప్పదియారు తత్వ సమూహములకు ఉద్భవ స్థానమై నెగడినట్టి రజోగుణ సంగతి వలననే భవుడను నామము శివునకు వచ్చినదని చెప్పినాడు. (శి|త|సారము-పద్యం81)

రజోగుణ సంగతి కలిగినప్పటికిని, సాత్విక గుణ సంపర్కము చేత మృడుడను పేరు శివునకు వచ్చినదని కూడ చెప్పినాడు.

చరాచర సమూహములన్నింటిని సంహరింప జాలిన అతి భీకరమైనట్టి తామస గుణ సంగతి వలన శివునకు హరుడను పేరు వచ్చినదట!

చివరకు పరమ స్వతంత్రమై, నిర్మలమై, పరమానందాత్మకమై పరమ భట్టారకమై విస్తరతైశ్వర్య మహత్తర రూపమువలన మహేశ్వరునికి శివనామము సిద్ధించినదని మల్లికార్జున పండితారాధ్యుడు పేర్కొనినాడు.

జగత్కర్తృత్వ లక్షణము :

పరమ స్వతంత్రుడైయ
క్షరుడై; సరజ్ఞుడై వి - కార రహితుడై
కరుణా కరుడై, స్థిరుడై
వరద! జగత్కర్తయుండ - వలదె మహేశా! (శి.సా. - 85

కవి ఈ ఘట్టములో శివుడెట్లుండవలెనో చెప్పుచున్నాడు. జగత్కర్తయని చెప్పినాడుగనుక జగత్కర్తకుండవలసిన లక్షణములు శివునిలోగలవని అన్నింటికి మూలము ఆయనయే యనియు కవి భావము కవి ఇట్లు చెప్పుటలో శైవమతాభినివేశము ఎంత గాఢముగా గలదో తెలియుచున్నది.

పండితయ్య మతము ప్రకారము జగత్కర్తయైనవాడు. పరమ స్వతంత్రుడై, అక్షరుడై, వికార రహితుడై, కరుణా కరుడై, స్థిరుడై యుండవలయును. ఇటువంటి లక్షణములు గలిగిన వాడు గావుననే విశ్రుతమైన ఈ ప్రపంచమునకు కరుణాకరుడైన శంకరుడు ఆదికర్తయని తీర్మానించినాడు. ఈ జగత్తు యొక్క ఉత్పత్తి స్థితి, లయములను ముఖ్య వ్యాపారములకు విభుడైన వాడు పశుబంధ విమోచనమునకు దక్షుడైన వాడు సర్వ వరదుడైన ఈశ్వరుడే. ఈ భావమే ఈ పద్యములో చెప్పినాడు.

భువనోత్పత్తి స్థితిలయ
వివిధ వ్యాపార ముఖ్య - విభుడవు పశుబం
ధవిమోక్ష దక్షడవునువ
రవరప్రదుడవును నీవే - రాజా భరణా ! (87)

పండితయ్య ననుసరించి పరమాత్మ, పరబ్రహ్మము, పరమేశ్వరుడు అనువారలు మనము సాధారణముగ భావించినట్లు హరి బ్రహ్మాదులు పరంపర విభులు కారు. అట్లు కాని వారు జీవాత్ములట ! సాధారణముగ పరిశబ్దమును ఉత్కర్షాస్ఫోరకముగ గ్రహించుట పరిపాటి. కావున ఉత్కర్ష సూచకముగ పరమేశ్వర శబ్దమును హరి, బ్రహ్మాదులకు వాడవచ్చును కదా అను ప్రశ్నకు సమాధానముగ ఉత్కర్ష స్ఫోరకమైన పరశబ్దము సర్వేశ్వరుడైన జగత్కర్త యుండగ మరొకరికి ఎట్లు చెల్లును ? అని చెప్పి మహాదేవుడు శివుడు తప్ప మరియొకడు లేడని చెప్పినాడు.

శివభక్తి వివరణము :

బసవేశ్వరుడు లింగ ధారణ సంప్రదాయమును మల్లికార్జున పండితు డారాధ్య సంప్రదాయ శైవ మతమును, ఆంధ్ర దేశమున వ్యాప్త మొనర్చిరి. పండితుడు వేద ప్రామాణ్యము నంగీకరించి సవైదిక మగు వీర శైవమునే స్థాపించినట్లు తెలియుచున్నది. అయినప్పటికిని పండితారాధ్యుడు బసవేశ్వరుని వలె ఉపనయనాది సంస్కారములను విసర్జించి జాతిమత వివక్షతలను పాటిం పని వీరశైవము నంగీకరించినట్లు గానరాదు. తన బ్రాహ్మ్యమును త్యజించి, వీరశైవ మత సంఘమం దీతని జేరమని బసవేశ్వరుఁడు కోరగా, నీతడు "భక్తి మీది వలపు, బ్రాహ్మ్యంబుతో పొత్తుబాయలేను నేను బసవ లింగ"యని సమాధానము చెప్పినట్లు చెప్పుదురు. మరియు బసవేశ్వరుడు తన కుపనయన మక్కర లేదని తండ్రితో దెల్పి యిల్లు వెడలిపోగా నీత డుపనయనాది సంస్కారములు పొందియే లింగధారణాది సంస్కారములను పొంది వీర శైవుడైనట్లు పండితారాధ్య చరిత్ర వలన తెలియుచున్నది. ఈతడు శృతి, స్మృతి, పురాణేతి హాసము లందు నిష్ణాతుడు. వీని ప్రామాణ్యముల నంగీక రించి వీని నాధారముగ గొనియే నీతడు వెలనాటి చోడుని సభయందు శైవేతర మతములను ఖండించి శివమత పారమ్యమును స్థాపించినాడు.

మల్లికార్జున పండితారాధ్యుని దృష్టిలో శివుడొక్కడే పరదైవతము. భక్తి అనగా శివునిపై నుంచు అచంచలమైన భక్తియే భక్తి. అందుచే ఆయన ఒక్కడు శివుడని నిక్కముగ ఎరిగి భక్తినిష్ఠా వృత్తితో కొలిచినపుడే భక్తునికి సమస్త దివ్య సుఖములు కలుగునని శివభక్తి వివరణము అను సీఘట్టములో ఈ విధముగా చాటినాడు.

ఒక్కండీశ్వరు డనిమది
నిక్కముగా నెఱిఁగి భక్తి - నిష్ఠావృత్తిన్
ముక్కంటి ! నిన్ను గొలిచిన
దిక్కక దొరవె సమస్త - దివ్యసుఖంబుల్ (99)

తొలుత భక్తిచేత ఈశ్వరుని కొలువ వలయునని చెప్పి ఆ భక్తి ధర్మము వలన ప్రభవించినదనియు, అట్టి ధర్మమును వేదోక్తముగ తెలిసికొన వలయుననియు తీర్మానించినాడు. వేదాదుల గ్రహణము వలన సదాచారము అలవడును. ఈ సదాచారముల చేత పెంపొందిన పశుపులకు (మానవులకు) పురాకృత పాపము క్షయమై ధర్మము వృద్ధి యగును ఈ ధర్మవృద్ధివలన నిర్మల బోధ విరక్తి యందు నిష్ఠ కలుగును. ఈ రెండింటి వలన శివభక్తి పుట్టునట ! ఈ భావమే ఈ పద్యమున గలదు.

ధర్మాధిక్యంబున నతి
నిర్మల బోధయు విరక్తి - నిష్ఠయు గలయ
క్కర్ములకు నీ ప్రసాదము
పేర్మిని శివభక్తి పుట్టు - ప్రౌఢ భావమునన్ (102)

ఈ శివభక్తిని ఈతడు సర్వధర్మ ప్రవర్తకమైన మహా ధర్మమని వక్కాణించినాడు. ఇట్టి లోకోత్తరమైన శివభక్తి. శివధ్యాన, జ్ఞానముల వలన కర్మ క్షయమై మనుష్యునకు ఆనంద ప్రాప్తి కలుగును. ఇట్టి భక్తి కేవలము చరాచర జీవులన్నిటికి ఈశుని కృప వలననే కలుగుచున్నది. 'నరతిర్యక్ గర్భ యవ్వన స్థాది పశూత్కరము లన్నియు నరకస్థములుగాని స్వర్గస్థములు కాని శివప్రసాద స్ఫురణము చేతనే ముక్తిని పొందునని చెప్పినాడు.

కం॥ నరసుర తిర్యక్స చరా
చర జీవుల కెల్ల భక్తి - సంభావనసీ
కరుణ ప్రధాన మముక్తికి
వరుసన యనలేదు భావ - వశ్యుడ వసుటన్ (109)

శివభక్తి వర్ధిల్లుటకు మరొక హేతువు భావశుద్ధియని చెప్పినాడు. ఈ భావశుద్ధి నియతములైన సకల పుణ్య క్రియల వలన చేకూరునట ? శివభక్తులైన వారు జల జాసన, అచ్యుతాది అమరులకు అసాధ్యమైన శివుని నిజరూపమును కనజాలుదురట అందుకే ఈ భక్తి గుహ్యముల కంటె గూడా గుహ్యతరమైనదని మల్లికార్జున పండితారాధ్యుడు భావించినాడు. శివుడు భక్త పరాధీనుడని చూపుటకు, తపస్సు చేతకాని, జపముచేత కాని, సమాధి చేతకాని, కర్మ చేతకాని సాధింప లేనట్టి చిత్తమును కేవల శివభక్తుడు సాధించినాడని చెప్పుటకు ఉదాహరణ పూర్వకముగా నిదర్శనమును చూపినాడు.

వే యేమి తోడబలుకుదు
పాయక నిను గొలుచు నచల - భక్తుల గని "య
య్యా"యని పిలిచిన నంబికి
"నో" యని యెలుగిచె తొల్లి - యురగాభరణా (112)

ఈ విధముగ భక్తి ప్రాభమును చాటి శివభక్తి లేక చేసినట్టి వివిధములైన అధ్వరములు, సకల వేదపురాణాది విహిత కర్మలన్నియు వృధాయనుచు చెప్పి భక్తియే ముక్తికి తెరువు అని నిష్కర్షగా సూచించినట్లుగ శృతి పంక్తి ప్రమాణముతో చెప్పినాడు.

(క) భక్తియ ముక్తి తెరువు వి
ద్యుక్తముగ నమేయ ప్రియచ - తుర్వేదా 'మ
ద్భక్తశ్చ శుచీ' యనునా
సూక్తి ప్రధానంబుగా బ - శూత్తములకజా (114)

ఈ విధముగ పండితయ్య శ్రుతి పంక్తు లాధారముగ శివభక్తి పారమ్యమును ప్రపంచిచినాడు.

## భ క్తు ల మ హి మ :

శివభక్తులైన వారికి దుస్తరములైన దురితములు వాటంతటవే తొలగు చుండును. శివభక్తులకు జాత్యాది సూతకములు కాని, హత్యాది సమస్త పాతకాదులు కాని సమీపించుటకు వెరచునట! పండితారాధ్యుడు శివభక్తుడెటువంటి కులమున పుట్టినప్పటికిని శివపూజతో పూజ్యుడగు చుండునని చెప్పి, రొంపిని పుట్టిన పద్మము పూజ్యము కాదా ? యనుచు ఉపమానమును చూపినాడు. అట్లే శివభక్తుడు అంత్యజుడైనను పరమ పవిత్రుడై పూజకర్హుండని చెప్పినాడు.

అట్లే శివభద్తెడు అంత్యజుక్తునను పరమ పవిత్రుడై పూజకర్హుండనిచెప్పినాడు.

ఒండేమి భక్తి సంగతి
జండాలుండైన భూతి - శాసన ధరుడై
యుండిన బూజ్యుడె యతనిన్
బండనగా జనదు భక్తి - యోగమున శివా (119)

ఇంకను ;

(క) విను పరుస వేది సోకిన
యినుముక్రియన్నిన్ను గొలిచి - యెవ్వండైనన్
ద్రనయున! యుత్తముడనబడు
పౌనరక శివభక్తు డగ్ర - పూజ్యుండగుటన్ (120)

క్షుద్రమైన ఇనుము పరుస వేదిని సోకి బంగారము అయినట్లుగ శివుని చెందిన దుర్జాతి కూడ శ్రేష్ఠత్వమును పొందును. శివభక్తులనగా నావారు, నేను శివ భక్తుల వాడను అనుచు చిత్తమునందు ఆనందముతో నుండు మనుష్యుడు శివునికి అత్యంత ప్రియుడు కాని, యితరుడు కాడు. శివభక్తులను అల్లంత దూరమున కనిన వెంటనే భక్తులు వచ్చిరని పొంగుచు వారికి ఎదురేగి యథా శక్తిని సేవలు చేయవలయునట! దాన ధర్మములు చేయు సందర్భమున సహితము శివభక్తులే ప్రమాణము. అనగా దానము చేయువారును, గ్రహించు వారును శివభక్తులై యుండవలయును ఈ భావమునే పండితయ్య ఈ విధముగా చెప్పినాడు.

కొనునది భక్తుని చేతనే
ధన మతనిక యిచ్చునదియు, "తస్మైదేయం"

బనియును "తస్మాద్గ్రాహ్యం"
బనియును గలదనిరి వేద - భక్తి విధిజ్ఞుల్ (116)

శివభక్తుడైనవాడు మూఢుడు, పతితుడు, దుర్జనుడు అయినప్పటికి భక్తి ప్రభావము చేత అతడు పండితుడు, అతి పవిత్రుడు అతి సుజనుడు అగునట! ఈ భావమే పండితయ్య ఈ పద్యములో చెప్పినాడు.

అతిమూఢుండతి పతితు డు
నతి దుర్జను డనగలవ - డతి శయ భక్తి
స్థితి నెగడు నేని నాతం
డతి పండితుడతి పవిత్రు - డతి సుజనుడజా (117)

కాలు డెప్పుడును రుద్రాక్ష, విభూతి, ధారల ఇండ్ల దిక్కు పోవద్దనుచు తన భృత్యులను శివాశాసన యుక్తుడై శాసించునట! పండితుడు, శివభక్తులును చూచి ఏ జాతి వారని విచారింప కూడదని, శైవమతమున జాతి భేదములుండ రాదని ఈ విధముగా చెప్పినాడు.

అవిచారంబున నెప్పుడు
శివ శాసన పూజనంబు - సేయగ వలయున్
శివభక్తుల గనిజాత్యా
దవిచారము విడువలయు - దృఢభక్తి మెయిన్ (121)

శివభక్తులైన చాలు, ఏ వర్ణము వారను విచారణ అవసరము లేదని పండితుని అభిప్రాయము. ఇది యే వీర శైవ సంప్రదాయము. ఈ సంప్రదాయము గ్రంథ మందంతటను మనకు కన్పించుచున్నది. ఈ జాతి విచక్షణ లేకపోవుట శివశాసన పూజనముతో సమానమట అంతేగాక ఆతని ఆజ్ఞా పాలనమున శివుడెంతయు ప్రీతుడగుననుచు చెప్పి వీర శైవులందు వర్ణ భేదమును తొలగించుటకు పూనుకొనినాడు. ఈతని దృష్టిలో శివభక్తులను పూజించుట మాత్రమే గాక, ఆ భక్తులను సాక్షాత్తూ శివుని గనే చూడవలయు నట! పండితయ్య దృష్టిలో భక్తుడు లోకహితార్థుడు శివుడెప్పురు భక్తులను కాపాడువాడు. వీరిద్దరి కెప్పుడూ అవినాభావ సంబంధమున్నది. ఈతని తత్త్వము విచిత్రము. లోకము విడువని వానిని లోకము విడువదట! అందుకే

లోకమును విడిచి శివుని కోరెడి వానివి లోకము తనంతటతాను విడుచును. అప్పుడు సమస్త లోకము అతనికి ఈశ్వరుడె. అందుకే శివభక్తుడైన వాడు కలలో కూడా ఇతర దైవము కలడను చింతను మరచి దేవుడొక్కడే శివుడను దృఢ నమ్మకముతో ఉండిన వానికి ఇరువది ఎనిమిది కోట్ల నరకములు లేవట! మల్లికార్జున పండితుని దృష్టిలో శివుడు పరిపూర్ణుడు. అట్టి భావమునే శివ భక్తులందరును కలిగి సర్వ జగత్తు నందును శివుని చూడవలయును. పండితయ్య ననుసరించి జంగమ లింగరూపుడైనవాడు శివుడు. అందుకే కోటి విధముల లింగార్చన కన్న, జంగమ లింగరూపి యైన శివభక్తుని పూజించుట ప్రధాన మని చెప్పినాడు. ఈ విధముగ శివ భక్తుల పూజించుట, సేవించుట, సపర్యలు చేయుట మున్నగు సత్క్రియలన్నియు భక్తులైన వారికి నియతా చరణములని సూచించుచూ పండితయ్య మానవ సేవను భక్తుని మనస్సునందు భద్రము కావించినాడు. దీని వలన భక్తులలో పరస్పర గౌరవము సౌహార్ద్రము సేవా నిరతి, త్యాగము మున్నగు గుణములన్నియు పెంపొంది, తారతమ్యములు సడలిపోయి, అనురాగములు వర్ధిల్లుటకు అవకాశము కలిగినదీ.

ఈ విధముగ పండితయ్య ఈ కట్టుబాట్లను మరింత దృఢపరచి నట్లుగ భూతలము తల్లడిల్లినను, బ్రహ్మ ప్రళయము వచ్చినను, కుల గిరులు తల్లడిల్లినను, జలరాశులు మేర తప్పినను శివభక్తుడైనవాడు శివపూజను విడువ డనుచు నిర్ణయించినాడు.

పండితయ్య శివుడు భక్త పరాధీనుడని తొలుత స్థాపించి, తిరిగి ఆ భక్తుని లోకమునందు పరివ్యాప్తము చేయుట కొఱకు, శివుడేకాక శివ సంబంధ ములైన ప్రతి వస్తువునకును, మహాత్మ్యమును అను సంధింప జేసినారు. మలహరుడైన శివుడు జలకమాడిన జలములే జలములట, ఆ నీరే సమస్త విషములకు విరుగుడట! వ్రణసంకులమునకు దివ్య ఔషధమట! ఆ జలమే త్రిలోచన భక్తులకు దీప తైలమై ఉపకరించుననుచు సాధారణముగా చెప్పి, ఆ ప్రభావమును మరింత దృఢ పరచినట్లుగ కంఠోక్తిగా పేర్కొనినాడు.

పండితయ్య శివభక్తులలో వీరు, వారనక అందరినీ చేర్చుచు, ఇందు నియతాత్మలనియు, అని యతాత్మలనియు, నియ వినయాన్వితులనియు,

వినయవర్జితులనియు. నీచులు, అనీచులనియు, పరిమిత వాక్కులు, వాచాలురు అను భేదములు లేక పువ్వుల సంపర్కముతో నారలు, తలకెక్కినట్లుగ శివ భక్తివలన శివ భక్తులందఱు త్రిలోక వంద్యులేనని స్పష్ట పరచినాడు. ఈ భావము ఈ పద్యములలో వెలుపరించినాడు.

నీచుల నీచులు పరిమిత
వాచులు వాచాలురాత్మ-వశుల వశులు స్వ
ష్టాచారుల నాచారుల
గోచర చరితులు పినాకి-కూరిమి భక్తుల్ (191)

నియ తాత్మలని యతాత్ములు
నయ వినయాన్వితులు నయవి-నయవర్జితుల
న్వయజులన న్వయజులుని
ర్లయ విరహిత మహిములఖిల-నాయక భక్తుల్ (192)

పండితయ్య శివభక్తి రహితులనువారు ఉత్తమ కులజులైనప్పటికి కిన కమ్మని పువ్వులలో పుట్టిన పురుగులుగ ఉపమించినాడు.

పుట్టనని, చచ్చిచానని
పుట్టెడు ప్రువ్వులు విధమున-బురహరు భక్తిన్
ముట్టని మనుజులు సచ్చుచు
బుట్టుచు నుండుదురు ముక్తి-పురికెడదవులన్ (199)

పురుగులకు బ్రతికి యున్నప్పుడు తమకొకప్పుడైన చావు కలదు అనుజ్ఞాన ముండదు. చచ్చినపుడు పునర్జన్మ యుండునను జ్ఞానము కలుగదు. ఇట్లు జ్ఞానములేక మరల మరల పుట్టుచు పురుగులు చచ్చుచుండును. అట్లే మానవులకు శివభక్తిలేని యెడల పుట్టుచు, చచ్చుచు, ముక్తికి దూరమై పురుగులవలె నశింతురని పై పద్య భావము. అంతేగాక శివభక్తులను తెగడిన దుర్గతిని పొందుదురనియు, పొగడిన సుగతిని పొందుదురనియు చెప్పినాడు. ఆ భావమే ఈ క్రింది పద్యములో గలదు.

తెగడిన దుర్గతులగు గడు
బొగడిన సుగతులగువారి-బురుషోత్తములన్

జగదేక విభుని భక్తుల
బొగడరె కృతమతులగణ్య-పుణ్యోదయులన్ (205)

ఇంకను శివభక్తులను నిందించునట్టి పాపాత్ములకు శ్రీయును, కులమును, శీలమును, ఆయువును నష్టమగుట తథ్యమనుచు శాపమును పెట్టిన రీతి పలికినాడు. ఆభావమే క్రింది పద్యమున గలదు.

శ్రీయును, గులమును శీలము
నాయువు నష్టమగునతిర-యంబునముక్తి
శ్రీయుక్తుల శివభక్తుల
బాయక నిందించునట్టి-పాపాత్ములకున్ (206)

ఏదేశమున శివభక్తుడు వసియించి యుండునో ఆ దేశమునందు, ఆ పురమునందు, ఆ దిశయందు, హరతీర్థములు వెలసియుండునట.

ఏ దేశంబుననే పురి
నే దేస వసియించి యుండు-నిల శివ భక్తుం
డా దేశంబౌన నాపురీ,
నాదె సవసియించియుండు-హర తీర్థంబుల్ (207)

ఇంకను

శివ భక్తుల యుండెడి చో
ట విముక్త క్షేత్రమంద్రు-రధిక ప్రీతిన్
శివుడెప్పుడు నుండుజగ
త్ప విత్రముగ నదియ సర్వ-పాపహరంబున్ (208)

అది సర్వ పాపహారమైన అవిముక్త క్షేత్రమట! దండన విధానమునందు నయితము అగ్ర వర్ణులైన బ్రాహ్మణులకు ప్రాణ దండన విధిలేనట్లుగనే. అపరాధము చేసినవాడు అధముడైనప్పటికిని వాడు శివభక్తుడైనచో బ్రహ్మణుని విధమున వధకు అనర్హుడని చాటినాడు.

అది కాపధాధకృతమున
నద మాంతుంండెవండేని నగు శివభక్తుం

డధిక బ్రాహ్మణ విధమున
వధకు ననర్హుండు వేద-వాదుల దృష్టిన్ (212)

ఈ శాసనము కేవలము సామాన్యులకు కాక 'వధకు ననర్హుండు వేదవాదుల దృష్టిన్' అనుచు శాస్త్రమును స్వప్రమాణముగా పేర్కొనినాడు.

ఈ విధముగ పండితయ్య శివభక్తి పారమ్యముతో పాటు శివభక్తుల మహిమలను సంఘమునందు వారికి కల్పింప దగిన స్థానమును తానొక సూత్రకారునివలె, ధర్మశాస్త్ర కారునివలె బోవు తరములను సమకాలికులను ఆదేశించినట్లుగ నిర్ణయించినాడు. అందుచేతనే శైవ సంఘమునకు ప్రధానాచార్యుడైనాడు.

శివ నిర్మాల్యము :

నిర్మలమైన పదార్థమగుట వలన నిర్మాల్య మనబడినదని మల్లికార్జున పండితారాధ్యుడు నిర్మాల్య పదమునకు వ్యుత్పత్తిని చెప్పినాడు. ఈ భావమే ఈ క్రింది పద్యమున చూతము.

నిర్మల పదార్థమగుటను
నిర్మాల్యంబనఁగ నెగడు-నీ నిర్మాల్యం
బర్మిలి గుడుతురు భక్తులు
కర్మక్షయ మగుట మోక్ష-కాంక్షలురుద్రా (219)

ఈ నిర్మాల్యమును శివభక్తులైనవారు అధికమైన ప్రేమతో భక్షింతురట! దీనివలన కర్మక్షయమగునట! మోక్షకాంక్షులైన వారికి ఈ నిర్మాల్యమునందు ప్రీతి యెక్కువని పండితుడు చెప్పినాడు. ఈ నిర్మాల్యము కుడుచుటకు, అందరికి అధికారములేదు. మలదేహులైన వారికి ఈ నిర్మాల్య సేవనము నిషిద్ధమైనది.

గురుకృతమైన శివదీక్షతో పవిత్ర దేహులైనవారు, భక్తులైన వారు, పరమేశ్వరుని యందు దాస భావమును వహించినవారు ఈ నిర్మాల్యమిను కుడుచుట కర్హులు ఈ భావమే పండితయ్య యిట్లు వివరించినాడు.

గురుకృత శివదీక్ష మెఱయన్
విరహిత మలదేహులగు ప-విత్రులు భక్తుల్
హర నిర్మాల్యము గుడుతురు
పరమేశ్వరునందు దాస-భావము తోడన్ (220).

శివ శాస్త్రి వచన సిద్ధాంతాను సారముగా భవదోష విమూతార్థమై శివభక్తులకు నిరతిశయమైన భావనిష్ఠలతో శివనిర్మాల్యమును కుడుచుటయే "పరమ శివా చార పథమని" పండితుడు చెప్పినాడు. శివ భక్తుడైనవాడు ఆకు కాని, పువ్వు కాని, కాయకాని కాక, అన్న, పాన, భక్ష్య, ఔషధములు మొదలగునవి ఏవి యైనను శ్రీ కంఠున కర్పించనిదే సేవించిన యెడల మద్య, మాంస సేవనము చేసిన దానితో సమానమని పండితయ్య ఈ ఘట్టములో చెప్పినాడు.

శివదీక్షితుడు :

మల్లికార్జున పండితుని దష్టిలో శివ దీక్షను పొందినటువంటి వానికే శివలింగమును ముట్టి అర్చించు అర్హతలున్నవి. శివ దీక్షితుడు కానివాడు స్వార్థపరార్థముగ శివార్చన చేయుట వ్యర్థమే కాక భయావహమని స్పష్ట పఱచినాడు.

స్వార్థ పరార్థ శివార్చన
మర్థిని శివ దీక్షితులకు - సగు జేయగ న
త్యర్థము నిరర్థకంబు భ
యార్థంబు నదీక్షితునకు - నర్చన మెందున్ (225)

ఇచట పరార్థ శివార్చన యనగా ధనము దీసికొని గుళ్ళలో పూజారులు చేయు పూజ అని యర్థము. ఒక వ్యక్తి వేదాది శాస్త్రములు చదివినప్పటికిని శివ దీక్షితుడు కాని వాడు వివలింగమును తాకు అధికారము లేదని నొక్కి చెప్పి నాడు. దీక్షారహితుడైన శివభక్తుని గూర్చి చెప్పుచు జన్మాంతర సంస్కార వశముతో సహజ భక్తి కలిగి శివుని పూజించి ఉత్సాహము కలిగినట్టి వానికి ఆశాంబవుడే సాక్షాత్తూ గురువగునని నిర్ణయించినాడు.

ఒక గురువు చేత దీక్ష పొందిన వారందరికిని సౌభ్రాతృత్వముతో

సోదర భావము చెల్లునని చెప్పి, ఆ విధముగనే వారి సుతులకు సయితము దీక్ష నొసగవలయుననియు, ఆదీక్ష వలన కృతి యోగ్యత కలుగునని చెప్పినాడు,

శివభక్తుడు కాని పతి :

మల్లికార్జున పండితుడు ఈ ఘట్టములో శివభక్తి ప్రచార సందర్భమునందు సంప్రదాయముల కన్న భక్తికే ప్రాధాన్యము నీయవలెనని స్త్రీలకు ఉద్బోధించినాడు. భక్తురాలైన స్త్రీ తన పతికి శివభక్తిని గురించి బోధింపవలయునట ; భర్త ఆ బోధనను పెడ చెవిని పెట్టినప్పుడు ఆ స్త్రీ భర్తను మీరి నడువ వచ్చును. శివభక్తి లేని పురుషుని అనుసరించి, అతడు చెప్పినట్లు స్త్రీ నడువ వలసిన పని లేదని పండితుడు చెప్పినాడు. పురుష ప్రతికూలత్వము స్థిర దోషముగ భావింపబడు చున్నది. కాని ఆ పురుషుడు శివభక్తి రహితుడైనప్పుడు మగని మాటను మీరుట స్త్రీకి దుర్గతి కలిగించదు. ఆమె భర్తను అతిక్రమించి శివుని పూజింప వచ్చునని చెప్పినాడు. ఈ భావమునే స్థిరపరచుట కొరకు పూర్వగాథను ఉదాహరణముగా చెప్పినాడు. ఆ పద్యమిది.

> అనసూయయు నాలాయని
> యను ముని భార్యయ, నిజాధి - పాతిక్రమ వృ
> త్తిని శివునిచే నభీష్టము
> లనూనముగ దొల్లిపడసి - రచలిత భక్తిన్ (234)

శివుని మహాత్మ్యమును గురించి తెలియు లేనివారు నూతిలోని కప్పలతో సమానులని చెప్పినాడు. అట్టి వారు ఇంకను మహా పాపులనియు, మానసి గాడిదలనియు, అమాన్యులనియు, నోరార తిట్టినాడు. శివభక్తులు కాని వారు, మనుష్యులు కానేరరనుట, శివుని మాహాత్మ్య మెరుగనివారు పాపులనుట వీర శైవ సంప్రదాయములే. ఈ సంప్రదాయముల నాధారముగా గొనియే వీర శైవము ముందు ముందు విజృంభించినది.

భక్తి లేక ముక్తి లేదు :

ప్రభువు ఏ రీతిగా తనను కొలుచు వానిని కేవలము జ్ఞానము కలిగి

యున్నంత మాత్రము చేత కాపాడడో, తనకు సేవల నొనరించు వానిని రక్షించు చుండునో, అట్లే శివుడు కూడ జ్ఞాని యైనవాడు భక్తి హీనుడైనప్పుడు అతనికి ముక్తిని ప్రసాదింపడు - కనుక అట్టి మోక్ష పదమును పొందుటకు భక్తుడైన వాడే అర్హుడు. ముక్తి అనునది కేవలము జ్ఞానము చేత సర్వేశ్వరుని ఈశ్వరుడనుచు నమ్మినంత మాత్రము చేత లభింపదు. గజ శాస్త్ర మెరిగినంత మాత్రము చేత గజారోహము చేయుటకు ఎట్లు అసర్హుడో, అట్లే భక్తి లేక మానవుడు ముక్తి పొందలేడని పండితయ్య వాదించినాడు. ముముక్షు వైన వాడు క్రియాఫల సన్యాసము కావించినను క్రియల యొక్క నానా విషయ వ్యాసంకములు ఉడుగు నకత వరకు మోక్షము లభింపదు. అంత వరకు అతడు శివుని కొలువ వలసినదే. క్రియలుడిగినంత మాత్రము చేత బంధ ములు దిగి మోక్షము సిద్ధింపదు. క్రియాశూన్యుడై తాను యోగిననుచు విష యములను విడుచుకున్న వానిని గురించి పండితయ్య ప్రత్యయ రహితాత్ము డనియు, రాగాంధుడనియు భ్రష్టుడనియు, పాపాత్ముడనియు నిందించినాడు. అట్లే క్రియలెరిగి వదిలిపెట్టిన యుక్తియుక్తుని గురించి పతితుడని పిలిచినాడు. పండితయ్య దృష్టిలో క్రియాశ్రితమైన అహంకారము క్రియను చేయుటను వదలి పెట్టదు. సాధారణముగా మానవునికి 'నేను' అనునట్టి అభిమానము పోదు. ఆ అభిమానము క్షీణించుటతో ఆతని బిరుదు కూడ తగ్గుచుండును. (ఇచట బిరుదనగా అహంకారముని గ్రహింప వలయును.)

అహంకారము తగ్గిన నాడే నిజక్రియలు కూడ తమంతట తామే అణగి పోవును. భక్తుడైన వాడు బాహ్యాభ్యంతరము లందు శివైక్య భావమును పొంది తన్నుతాను మరచు నంత వరకు శివ సంబంధములైన బాహ్యాపూజలను చేయ వలయునని చెప్పినాడు. ఈ విధముగ నిస్సంగుడై నిత్య విధులను చెల్లించు చుండగా, ఈ నిరంతరాభ్యాసము వలన పరిపక్వ నిర్ణీతాంతఃకరణుడై శివైక్య స్ఫురణ కలుగును. ఇట్టి జ్ఞాన ప్రతీన బుద్ధిచే కర్మలుడగునని పండితయ్య చెప్పినాడు. కావున భక్తుడైనవాడు 'నేను' అని గ్రహించుట మరచి శివానందాను భవమగ్నుడగు నంతవరకు బాహ్య శివారాధనమును కావించుట మరువ కూడ దని హెచ్చరించినాడు. పండితయ్య ననుసరించి అంగజహరుడైన శివునికి అభ్యంతరము అంగము, ప్రధానమైనది బాహ్యము, కావున అంగ ప్రధానములు

రెంటిలో అంగమునకు మాత్రము చేకొని ప్రధానమును విడుచుట తగునా ? అని ప్రశ్నించినాడు. ఇంతే గాక అంగాభ్యంతర విధమున అంగజహరుని కొలిచి ముఖ్యమైన బాహ్య విధిని లింగాకృతితో నున్న శివుని కొలువని మానవులు, వెంగిలి మానవులనియు, వెడగులనియు దూషించినాడు. బ్రహ్మ, విష్ణు, సనకాదులు సహితము ముఖ్యమైన బాహ్య శివపూజను విడిచి పెట్టిన వారు కాదు. అట్టి వారిని గూర్చి ఈ విధముగా చెప్పినాడు.

> వన జాసన వనజోదర
> సనకాదులు ముఖ్య బాహ్య - సరత్యాగము చే
> సినవారు గారు తక్కటి
> పినుగులు బాహ్యంబు విడిచి - పెద్దయి జెడరే (256)

ఒకవేళ బాహ్య పూజాకరణము లేనిచో గౌణకృత్యాం భ్యంతర విధి నైనను పరమేశ్వరుని కొలువ వలెనని నాడు శివలింగ పరాఙ్ముఖమైన మానవ సంభాషణములన్ని నరకార్థములని స్పష్ట పఱచినాడు.

బాహ్య పూజ :-

మల్లికార్జున పండితుడు ఈ ఘట్టములో మహాదేవ పరాఙ్ముఖులైన వారిని గురించి చెప్పుచు వారిలో వేదోక్త విహిత కర్మ మహా దేవార్చన విహీనులను చేర్చినాడు. వారిని గూర్చి పాషండులని కఠినముగ పలికినాడు. అట్లు పలుకుటయే గాక అట్టి వారిని చూడ కూడదని శాసించినాడు. మల్లికార్జున పండితారాధ్యుడు కేవలము అభ్యంతర పూజా విధానమునే గాక బాహ్యపూజను గూడ స్వీకరించి నాడు. ఈయన దృష్టిలో అభ్యంతరము అంగము కాగా, బాహ్యము ప్రధానమైనది. అందుకే బాహ్య చిహ్నములైన రుద్రాక్ష, విభూతి ధారణలకు ప్రాధాన్యము నిచ్చినాడు. "రుద్రాక్ష విభూతి దృఢాంగు జూచి సన్మతి సాక్షాచ్ఛివుడను నదియ విచారము" యని పేర్కొనినాడు. ఈయన దృష్టిలో భక్తుడు లోక హితార్థుడు. శివుడు భక్త హితార్థుడు. అందుగే భక్తునికి అవినా భావ సంబంధమున్నది శివభక్తుడైనవాడు పరమ పునీతుడు. ఈ సందర్భము నందు ఈయన కొంత సీమను అధిగమించి.

"అతి మూఢుండతి పతితుడు
నతి దుర్జనుడనగ వల వదతి
శివ భక్తిస్థితి నెగడు నేని
నాతండతి పండితు డతిపవిత్రు డతి సజ్జనుడ జా"

అని నిర్ణయించినాడు. అంతేకాదు పరికొంత ముందునకు వెళ్ళి శివభక్తునకు జాత్యాది పాతకములు గాని, హత్యాది పాతకములు గాని పొందనేరవని చెప్పినాడు.

శివ సమయమును సమ్మానింపని అవినీతులు వారెంత పెద్దవారైనను వారికి నమస్కరింపకూడదు, వారి మ్రొక్కులను స్వీకరింపకూడదు; మహాదేవ పరాఙ్ముఖాత్ములైన పతితులకు ఋణమివ్వరాదు. గ్రహింపరాదు. వారిని చూడరాదు వారితో సంతోషముగ ముచ్చటించరాదు. సామాన శయ్యలో నిదురింపరాదు. సమ ఆసనమున కూర్చుండరాదు. సహపఠన ము చేయరాదు. సహవాసము చేయరాదు. అనుచు ఈ విధముగ ఆంక్షలు విధించినాడు. శివుని కొలువనట్టి పాపాత్ములకు భోజనము పెట్టిన దాతకు నయితము యమదండనము తప్పదట!

శివయోగి దర్శన మాత్రము చేతనే గంగా స్నాన సమఫలము లభించునట! ఆతనితో సంభాషణము సకలతీర్థ సేవనముతో సమానమట! వేద విదులైన కోటిమంది బ్రహ్మణోత్తములకు భోజన మిడిన ఫలము ఒక్క శివయోగికి భిక్షచేయుటిచే లంభించునట! శివయోగి శిరమున శివుడెల్లప్పుడు నెలకొని యుండును. కావున శివ యోగికి చూచి సాక్షాత్తూ శివుడని పూజింప వలయునని చెప్పినాడు.

శి వ ని ం ద కు ల చ ం ప వ చ్చు ను :-

పండితయ్య ఈ గ్రంథమునందు సర్వజీవ తంతు కారుణ్యమును, అహింసను ప్రోత్సహించినాడు. కాని శివ నిందకుల విషయములో మాత్రము ఈతడు అతి కాఠిన్యమును వహించి "శివ నిందకులగు పాపులన విచారిత వృత్తి జంపనగు నీశానా" అని వ్రాసినాడు. అంతేగాక శివనిందా విషయమైన గ్రంథములను కాల్పవలయు ననియు, శివనిందకుని జంపినను, నా ప్రయత్న మందు జచ్చినను ముక్తి వచ్చుననియు పండితయ్య చెప్పినాడు.

ఇట్లు శివనిందకుల జంపవచ్చునని యీ గ్రంథము నందు జెప్పెను, బసవ పురాణము నందు కొందఱు భక్తులు భవులను జంపిరన్న కథలున్నను దరువాతి వీరశైవులిట్టి యమానుష కృత్యముల నొప్పిన వారుకారు. కర్నాట దేశమందలి బ్రాహ్మణులగు లింగాయతు లేమి, తెలుగు దేశమందలి బ్రాహ్మణులగు నారాధ్యులేమి, ప్రభుత్వము వారిచే మిక్కిలి శాంత ప్రియులయిన వారుగ నెంచబడు చున్నారు. కావున నీబోధ నుత్తర కాలీనులైన శైవులంగీకరింప లేదని యే చేప్ప వలయును. *

జీ వ త్యా గ ము :-

శివః నీత దర్ధమొండెను
శివ భక్తార్థంబయొండె-శివ విద్యాచా
ర్య విషయ మొండెను జీవ
మ్ము విసర్జించినరుండు-ముక్తుడురుద్రా (279)

మల్లికార్జున పండితారాధ్యుడు ఈ షట్పములో శివుని కొఱకుగాని, శివభక్తుని కొరకుగావి శివ విద్యార్థమై కాని, శివా చార్యుని నిమిత్తమై కాని మానవు డెవ్వడేని తన జీవమును త్యజించినప్పుడు ఆతనికి ముక్తి స్థిరముగ లభించునని చెప్పినాడు. పావనమైన శివ క్షేత్రాదులందు నివసించుచు కాడే, నిరాహార దీక్షతో కాని ప్రాణములు కోల్పోయిన వ్యక్తి మోక్ష పదవిని పొందునని చెప్పినాడు. అంతేకాక శివుని గురించి వక్ర బుద్ధితో నున్న వానిని జనకుడైనను "తేశీఘ్రంహంతవ్య" అను సూక్తి చొప్పున సంహరించుటయే పథమని పలికినాడు.

ఇంకను శివునికొరకు మృతినొందు వానికి దిన వారములు మొదలయిన

---

* లోకములోని ఏ మతమైనను హింసను ప్రతిపాదించదు. పండితుడు చెప్పిన విషయములు కేవలము సిద్ధాంత పరమైనవే కాని ఆచరణీయములు కావు. ఈతనితో పాటు శైవమత ప్రచారము చేసిన బసవేశ్వరుడు హింసను ప్రోత్సహించినట్లు కానరాదు.
పీఠిక (శివతత్త్వసారము) శ్రీ విడదవోలు వేంకటరావుగారు. పుట 87.

ప్రేత క్రియలు చేయగూడదు అని చెప్పినాడు. ♦ వాని పుత్రాదులకు సూతకము లేదు. వాని చావుకై యందరును పండుగ చేసికొనవలసినది. ఈ భావమే పండితయ్య రెండు, మూడు పద్యములలో వివరించినాడు.

వెండియు శివార్థ మృతునికి
నొండొక పరలోక విధులు - నొడబడిలే వా
రొందు డిగియు ధా శక్తిం
బండుగ సేయుదురు రుద్ర - భక్తులకు శివా (283)

ఈ విధానము పండితయ్య యొక్క శివభక్త్యా వేశమును చూపుటయే గాక, ఆ శైవ మెంతటి బలీయమైన మతముగా నాడు సంఘంలో వ్యాపించినదో మనము గ్రహించవచ్చును.

పై పద్యములో ఇంకను ఈవిధముగా చెప్పినాడు. బంధువులెవ్వరైనను పరలోక క్రియలు చేయదలచినప్పుడు యధా శక్తిగా శివ భక్తులకు విందు భోజనములు పెట్టవలయునట! పండితయ్య దృష్టిలో శివ భక్తుడు పితృలోక విష్ణులోకములను అతిక్రమించి శివపురికి పోవును. ఆ భావమే ఈ క్రింది పద్యములో చెప్పినాడు.

పితృలోక విష్ణులోకము
లతిక్రమించి శివపురికి - నరిగెడుభక్త
ప్రతతికి బితృమేధక్రియ
లతిశయముగ జేయునాత - డజ్ఞుడు రుద్రా (284)

---

♦ ఆరాధ్యులలో ఇప్పటికి నొక విధముగ సూతకమును బాటింపరనియే చెప్ప వచ్చును. వారు సూతక దినములలో ఇతరుల నుండి దూరముగా నున్నను, ఆ దినములలో సంధ్యావందన శివ పూజాదికమును మానరు. ఎప్పటి వలెనె చేసికొందురు. స్త్రీలు రజస్వలయైన దినములలోను, బురిటిలోను శివ పూజను జేసికొందురు. అట్లేలయనియడుగ, యజ్ఞ దీక్షితునకు, నాశౌచము వచ్చిన యెడల గర్మ విడువదు. అట్లే చేయవలయునని చెప్పుదురు. (పీఠిక 87.) శ్రీ నిడదవోలు వెంకటావు గారు (శివతత్వ సారము)

అట్టి భక్తుని పితృ మేధము చేయుట అజ్ఞతయని భావించినాడు. పండితయ్య దృష్టిలో శివ సంతతి తక్క తక్కిన సంతానము పశు సంతానముతో సమానమైనది. అందుచే మరణించిన శివభక్తుని ఆస్తి పాస్తులకు వారసులు శివభక్తులే కాని (శివ సంతతి) నిజమైన సంతతి (పశుసంతతి) కాదు.

శి వా ప చా రు ల కు శి క్ష :

శివ భక్తుల దుర్గణ లేశములను వెదకువాడు చండాలుడని ప్రకటించి, శివభక్తులు ఎట్టివారైనను నిందకు అనర్హులని పండితయ్య తీర్మానించినాడు. ఈతని దృష్టిలో శివుని, వేదములను, శివభక్తులైన బ్రాహ్మణులను చెడుగా పలుకునట్టి పుణ్యహీనుడు అవిరళమైన నరకాగ్ని బాధలను పొందునట! శివ భక్తులను దూషించిన దోషి ఘోర రౌరవాగ్నుల బడి ఆచంద్ర తారార్క ముగ కాలుచు బాధపడుచుండునట. గుడిలోపల గుర్రు పెట్టి నిద్రించుటకాని, స్త్రీ సంభోగము చేసిన కాని, ఉమ్మి వేసిన కాని, కాళ్ళు చాచి పరుండిన కాని జూదమాడిన కాని అమితమైన నరక బాధలు పొందుదురట! గుడిలోపల చెప్పులు, పావుకోళ్ళు ధరించి తిరిగిన పాపులు నిగళ బంధములతో నరకములో బాధింప బడుదురట! అట్లే గుడిలోపల నలుగు పెట్టుకున్నాను, నీళ్ళాడినను, భుజించినను, అతిగ నవ్వినను, దుర్గతి పాలగుదురట! అట్లే గుడిలో వెంట్రు కలు దువ్వుకొనినను, స్వేచ్ఛగా విహరించినను నరకాగ్నిలో పడుదురట అటులనే అతి గర్వముతో కాని, ఉదాసీనత్వముతో కాని భయరహితుడై శివో పకరణ ద్రవ్యములను కాళ్ళతో తన్నిన వాడు రౌరవాగ్నిలో కూలునట! ఈ విధముగనే శివుని తోటలోని పువ్వులను గోసి శిగలో ధరించినను, వాటిని వాసన చూచినను నరకములో కాలిన సూదులతో కాలకింకరులు బాధింతురట! అట్లే శివాలయములందు మూత్రాది అకార్యములు చేసినవాడు ఘోరమైన రౌర వాగ్నిలో కూలునట! శివభక్తిలేని ఉత్తమ కుల, గుణ, విద్యా, విత్త, ఉద్యోగాది సకల విషయములు రిత్త యని చెప్పినాడు. ఏవిధముగ కులము, ప్రాయము సంపత్తి కలిగియుండియు, ముక్కు లేని కాంత జీవితము వృథాయగునో అట్లే. కులము, సంపత్తి, ప్రాయము కలిగి నప్పటికి శివభక్తి లేని కష్టుని జీవితము వృథాయని పండితయ్య అభిప్రాయము.

దక్షాధ్వర ధ్వంసము :-

శివభక్తి రహితుల దుస్థితిని ప్రకటించినట్లుగ పండితయ్య శివతత్వ సారమునందు 'దక్షాధ్వర ధ్వంస'మను పురాణ గాథను జతపరచినాడు. శివుని విడిచిన సత్క్రియ లేదు. మానవులందరు శివుడే కర్మ ఫలదాత, త్రిజగన్నిర్మాత, నిఖిల పశువ్రాతమ్ములకు అధిపతి యని భావించి ఈశ్వర పూజ చేయవలయునని ప్రబోధించినాడు. ఈ విధముగా దక్షాధ్వర ధ్వంసమును వర్ణించుచు, ఆహవనీయాగ్ని శిరము తెగి అగ్ని యందు పడుటతో వీరభద్రునికి బాహుబలము ఒప్పినదని ముగించినాడు.

ప్రళయ వర్ణనము - గాణాధిపుల ఆటలు :

మల్లికార్జున పండితారాధ్యుడు హరుడు కావించు జనసంహారమునకును ప్రళయమునకును చక్కని హేతువులను చూపినాడు. లోకములో జీవకోటికి కర్మ క్షయము కానిదే నిర్మలమైన మోక్షము లభింపదు. మోక్షము పొందలేని పశువ్రాత మంతయు (జీవకోటి) జనన మరణాది రూపమైన దుఃఖములో మునిగు యుండును. ఈ జీవకోటి యొక్క దుఃఖ నివృత్తి కొరకే శివుడు లయమును సృష్టించునని చెప్పినాడు. పండితయ్య దృష్టిలో శంకరుడు కరుణామయుడు. అందుకే ఆ కరుణామయుడు ఈ సమస్తమయిన మల జగత్తునకు విశ్రమ హేతువుగ ఈ సర్వ భూతరాశిని కరుణ చేతనే సంహారము కావించునట ! శివుడు తనకు ప్రధానమైన త్రివిధములైన మూాల దళములతో ఈ జగత్తు నంతటిని సంహరించునని చెప్పి ఆ దళములను ప్రమథ గణములనియు, రుద్ర గణములనియు, భూత గణములనియు మువ్విధములుగ పేర్కొనినాడు. పండితయ్య దృష్టిలో శివుని యొక్క మూడవ కన్నే ప్రళయమును సృష్టించు నటువంటిది. కుమ్మరి దరికొల్పిన చిచ్చు ఆవములోని కుండ లన్నిటిని కాల్చివేసినట్లుగ రుద్రుని మూడవ కంటి నుండి వెడలిన మంటయే ఈ జగత్తులను సమూలముగ కాల్చినట్టి ప్రళయ మని చెప్పినాడు. రుద్రుని యొక్క ఫాల భాగము నందలి నేత్రము వలన వెడలిన మంటలే విప్లవ హేతువై ప్రమథులకు అధిక తరమైన సుఖకారకము లగునట. లోకము లన్నియు ప్రళయాగ్ని శిఖలయందు తగుల్కొని కాలుచుండగా ప్రమథ

గణములన్ని పండు వెన్నెలలో తేలియాడు నట్లు సంతోషమును పొందునట!
ఈ విధముగ శివనేత్ర కృతమైన ప్రళయ వర్ణన సందర్భమున ప్రమధ విభుల యొక్క ఆడంబరములను పండితయ్య వింతగ వర్ణించినాడు. ఈ సందర్భము నందు ప్రమధులు చేయునట్టి అద్భుత కృత్యములతో సముద్ర ద్వీపాంచలమైన భూమిని వడిగా ఆకాశము వైపునకు ఎగురవేసి నక్షత్ర సురావాసమైన ఆకాశమును క్రిందికి దించుట అధికముగ మండుచున్న బడబాగ్నిని వడిగా పట్టి తమ నుదుట తిలకముగ తీర్చుకొని ఆనందముతో సోలుచు ఆడుచుండుట, సకల సముద్ర కలములను గణనాయకు డొక్కడు త్రాగి త్రేన్చుట, సకల గ్రహ తారకము లన్నింటిని చెదురునట్లుగ ఊదుట, ద్వీపము లేడింటిని చక్ర వ్యాపార విధమున త్రిప్పివేయుట మొదలగు వానిని పేర్కొనినాడు. ఆ విధముగనే కాలుని వాహనమైన మహిషశృంగములను, ఇంద్రుని మహా గజ దంతములను పెరికి తాళములుగ చేసి పాడుదురట! మృత్యు దేవతను పడవేసి మడమలతో మెడను త్రొక్కి మెరసెడి కోరలను పెరికి వాటిని త్రిప్పుదురట! గణనాధు డొక్కడు వరుణ దేవుని వాహనమైన మొసలిని వాయువు యొక్క జింకను ముద్దగా చేసి మ్రింగునట! అట్లే దిగ్గజములను కూడ తిని ఆ సురముగ గణనాథు డొక్కడు త్రేన్చునట! కొందరు గణపతులు సుర పర్వతాదికుల పర్వతములను బంతులుగా ఆడుకొని, ఆ క్షణమునందే నుగ్గు నుగ్గుగా చేసి పొడిని చల్లుదురట!

ఒక మహా గణాధిపుడు ఆదివరాహము యొక్క దంష్ట్రలు పెరికి వానిని తన ముఖమువరకు అంటించుకొని నటించునట! మరొక గణనాధుడు ఆది కూర్మము యొక్క వీపును పొడిచి ఆ రంధ్రములో ఆదిశేషుని దూర్చి త్రిప్పుచు ఆడుకొనునట! మరియొక గణాధిపుడు నరసింహుని కంఠమును ఆతని ఎఱ్ఱని జటాకేశరములను పెరికి అంబిక యొక్క పాదపీఠమున సమర్పించునట! కొందరు ప్రమదాధిపతులు సూర్య చంద్ర మండలములను దండలుగా గ్రుచ్చి ఆడుకొందురట! మరొక ప్రమదుడు బ్రహ్మాండ భాండ మవియునట్లుగ అరచేత వేసి మరి బ్రహ్మ ఎక్కడ? యనుచు వెదకునట. ఇంకొక గణాధిపతి బ్రహ్మకపాలమును తీసి త్రివిక్రముని వెన్నుపూస చివర నిలిపి ఛత్రమువలె పట్టి ఆడునట! ఈ ప్రళయ సందర్భమునందు గణేశ్వరు

డొక్కడు బ్రహ్మ విష్ణు శవములను కాళ్ళను కాళ్ళతో, కరములను కరములతో ధరించి ఆడుకొనునట! ఈ సందర్భములో వసు, రుద్ర, ఆదిత్య, గణేశ, సమస్త దేవతా రాక్షస పన్నగ గణములన్నియు చెడి పారగా ఆకాశమంతా ప్రమథ గణమే నిండునట! ఇట్లే లోకా లోకము స్వర్గ, బ్రహ్మలోకములు, వైకుంఠము మొదలగు లోకములు చెడగా లోకత్రయ మంతయు, ప్రమథ లోకమైనదని అతిశయోక్తులతో ప్రళయ స్వరూపము వర్ణింపబడినది.

శి వ గ ణ వ ర్ణ న ము :

పండితయ్య ప్రమథ గణములను గూర్చి చెప్పుచూ ప్రమథ గణముల సంఖ్య అసంఖ్యాతములైనవనియు, ఆ సంఖ్యలిన్నియని లెక్క పెట్టుటకు ప్రయత్నించుటయే ఆశ్చర్యకరమనియు, అందులకే వేదములు 'అసంఖ్యాత' మని ఘోషించుచున్నవనియు తెలిపినాడు. ఈ సందర్భములో అత్యద్భుత నృత్యములను కావించిన గణాధిపతులను వేరు వేరు పేర్లతో సంబోధించుచు ఆ పేర్లు వచ్చుటకు గల కారణములను గూడా విచారించినాడు. ఉదాహరణకు-

1) పర్వతా భరణుడు : సకల కుల పర్వతములను కంఠహారముగ ధరించుట వలన వచ్చినది.

2) మేరు పాతనుడు : ప్రళయ వేళ మేరువును పరిమార్చుట వలన వచ్చిన పేరు.

3) అండాభరణుడు : సమస్త బ్రహ్మాండములను పూస పేరులుగ గ్రుచ్చి ఆడుట వలన వచ్చిన పేరు.

4) రుండా భరణుడు :- హరి బ్రహ్మాదుల రుండములను ఆభరణములుగ ధరించిన కారణములతో వచ్చిన పేరు.

5) హల హలాంకులు :- లాలాసుర వక్ష స్థలమునందలి రక్తపు మడుగు నందు కేళి సలిపి నట్టి భయంకర శూల హస్తులైన కారణమున వచ్చినదీ పేరు.

6) రాజ ప్రియులు :- అర్ధచంద్ర ధరులు, నర, సుర, రాజా మర భయులు, రాజరాజ సఖులు, గోరాజ పతాకులు మొదలగు వారు రాజ ప్రియులు.

ఈ గణములందు బ్రహ్మభివంద్య ముఖ్యులు, బ్రహ్మ కపాల వళీ విరాజితులు శ్రీరమణులు, వేదశాస్త్రి శివతత్వ విదులు, గణేశ్వరులు, భువన త్రయ సుందరులు శ్రీశ్రీ దిగంబరులు, భక్తిశ్రీ శ్రితహృదయులు, లంబోష్ఠ, లంబనాసిక, లంబోదర, లంబనేత్ర, లంబశ్రవణ, లంబహను, లంబ జిహ్వులు, అజకర్ణ, అశ్వకర్ణులు, గజకర్ణ, వరాహకర్ణులు, అజ ముఖులు, వరాహ ముఖులు, నానావర్ణ సమేతులు, నానారూప ధరులీగణ సమూహము లందున్నారని వాల్మీకి రామాయణము నందు సుందర కాండలో హనుమంతుడు అశోక వనమునందు సీతాదేవికి కావలిగానున్న రాక్షస స్త్రీలను వర్ణించిన విధానము ననుసరించి సుదీర్ఘముగ పండితయ్య వర్ణించినాడు.

స ద్భ క్తు ల మ హి మ :

శివతత్వ సారములో మల్లికార్జున పండితారాధ్యుడు సద్భక్తుల మహిమాభి వర్ణనము కావించుచు ఈ భక్తులను శివగణములని పేర్కొన్నాడు. అంతేగాక తాను వర్ణించిన విధానమంతయు పురాణములలో వర్ణించిన విధానమేయని చెప్పినాడు. ఈయన అభిప్రాయము ననుసరించి ఈ గణాధిపులు స్వేచ్ఛాచార నిష్ఠితులు, ఇచ్ఛా వ్యాపార ముక్తహృదయులు. భవపాశ భేదనకారులు. దయాచ్ఛాదిత తనులు. ఇంతేకాక వీరు శాశ్వతులు, సర్వజ్ఞులు, సర్వగతులు, సర్వ సంగ పరిత్యాగులు, సర్వ శుభోదయులు, సర్వ పరిపూర్ణులు. ఇంకను వీరు శివజ్ఞాన రతులు, మహామతులు, సకల సుగుణాన్వితులైనవారు. ఈ మహా మతులైన శివజ్ఞాన రతులను పండితయ్య కేవల గణములని కాక ప్రమథ గణ ములని పేర్కొనినాడు. ఈ విధముగ ప్రమథ గణముల స్వరూప స్వభావ ములను వర్ణించిన తరువాత పండితయ్య తనను కూడ ఆ గణము లందు చేర్చుకొమ్మని శివుని ప్రార్థించినాడు. ఈ ప్రార్థనయందు సయితము కేవలము శివునే కాక శివ గణములైన ప్రమథుల చరిత్రల శ్రవణ, స్మరణ, పఠనాదుల వలననే దురితములు తొలగుననని చెప్పినాడు. ఈ సందర్భమునందు పండితయ్య భక్తునికి భగవంతునికి నిత్య సంబంధమును సమకూర్చుచు భక్త పరాధీనుడైన శివుడు భక్తుని భావనాబల నిరూపితుడను భావము నిరూపించినాడు. మరొక్క విశేషము మల్లికార్జున పండితారాధ్యుడు తన శివతత్వ సారమునందు "తన్ను గణములో జేర్పుమని కవి ప్రార్థన" అను శీర్షికలో

ప్రారంభించిన పద్యములందు "తొలి పద్య రచనలు" అని చెప్పదగిన సింహ గిరి, వేంకటేశ్వర వచన కావ్యములకు ప్రాతిపదికలు గోచరించుచున్నవి. ఆ పద్యములు చూతము.

దేవా! సంసారాంబుధి
లోవెలువడ జేసి ప్రమథ - లోకం బెఱుగున్
నావాడు వీడు సుండీ
నావే నన్నుంపవే! గణముల నడుమన్ (386)

ఒందేమి మల్లికార్జున
పండితుడన నుండుకంటె - బ్రమధులలోనె
న్నండొకొ! నీయాజ్ఞోన్నతి
నుండగ గాంతునని కోరు - చుండుదు రుద్రా (387)

పరమేశ్వర! నీ ప్రమధుల
చరితలు సతతమాను విన్న - జదివిన బ్రమథ
స్మరణము చేసిన శుభములు
దొరకొను దురితంబునెల్ల - దొలగు మహేశా! (388)

కొందరు భక్తుల చరిత్ర :

పండితుడు "కొందరు భక్తుల చరిత్ర'' అను శీర్షికలో పూర్వ శివ భక్తుల గాథలను ప్రవేశ పెట్టినాడు. ఈయన ప్రవేశ పెట్టిన కథలన్నియు సూక్ష్మాతి సూక్ష్మములై సూచ్యప్రాయముగ నున్నవి. ప్రాచీన మహా కవులు కొన్ని పూర్వగాథలను తాము చెప్పుచున్న కథా సందర్భములం దిమిడ్చి చెప్పి నట్లుగ మల్లికార్జున పండితారాధ్యుడు కూడా గాథలను కొన్నింటిని నామ మాత్రముగ పేర్కొనినాడు. సాధారణముగ వైష్ణవ సంబంధములైన పురాణ గాథలను స్వీకరించి అవి ప్రసిద్ధములై అందరును ఎరిగినవను తలంపుతో వాటిని సంక్షేమ రూపములో ఉదాహరణ కొరకు ఉద్ధరించుట పరిపాటి.

అట్లే పండితయ్య కూడా శివభక్తుల చరిత్రములను స్వీకరించి ప్రధాన ములైన ఐతిహ్యముల విధమున ఆయా కథా పురుషుల నామములను పేర్కొను చుండును. సాధారణముగ శివ సాహిత్యముతో సంబంధము లేని సాధారణ

పాఠకులకు ఈ అంశము అవగతము కాదు. పూర్వ గాథాలహరియందు ఈ భక్తుల చరిత్రములకు సంబంధించిన కథా విశేషములు గోచరింపవు. ఆ సందర్భమునందు శివ సాహిత్యమునకు గురు పీఠమని చెప్పదగిన పాల్కురికి సోమనాథుని గ్రంథములలో ప్రధానములైన బసవపురాణము, పండితారాధ్య చరిత్రలు. ఈ కథా విశేషములను మనకు అవగత మగునట్లు చేయుచున్నది.

శివతత్త్వ సారమునందు కానవచ్చుచున్న 'కొందఱు భక్తుల చరిత్రలను' పరిశీలించునపుడు పండితయ్య ఇచ్చిన స్వల్పమైన కథ ఒక్క కందపద్యము నందుడుటచేత ఆ కథా స్వరూపమును గూర్చి ఇతమిత్థమని నిర్ణయించుటకు సాధనములు పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్య చరిత్రములే యని చెప్పవచ్చును. శివతత్త్వ సారమున సూచ్య ప్రాయముగా నున్న కథలన్నియు, పై గ్రంథములలో విపులముగా గలవు. కొన్ని కథలను చూతము.

కాటకోటుని కథ :-

ఈ కథ శివతత్త్వ సారమునందు ఒకే ఒక కంద పద్యమునందు చెప్పబడినది. అందు కాటకోటుడు గొరియల పాలను లింగనాథునిపై పితుకుచుండగా కోపించిన తండ్రిని చంపి, అతడు గణపతి పదవిని పొందినాడని చెప్పబడి యున్నది.

బసవపురాణమునందలి కథ :-

కాటకోటుడనే గొల్లడు గ్రొత్తియాట పెంట్రుకను ఈశ్వరుడుగా భావించి ఆ పెంట్రికకే పాలెల్లను పోయు చుండెడివాడు. ఈ విపరీతమును చూచిన అతని తండ్రి గేలిచేయుచు ఆ పెంట్రికను కాలదన్నినాడు. ఆ అవమానమును భరింపలేని కాటకోటుడు కోపించి తండ్రిని గొడ్డలితో తలతెగి పడునట్లుగ కొట్టినాడు. కాటకోటుని తండ్రి తలతెగి భూతలమున పడగనె పైన కైలాస హార్మ్య కవాటజాలము లన్నియు జర్జరితములై పడినవట. అప్పుడు ఇది చోద్యమని నరులందరు భయపడుచుండగా ఆ పెంట్రిక లింగమైనదట! కనుక ఈ కథలో భక్తుని భావన ప్రధానముకాని జరిగిన అద్భుతములో గొప్ప లేదను సత్యము నిరూపింపబడినది.

మొ ర ట ద వం క య క థ :

మొరటదవంకయ తన తలను శివునకు సమర్పించి శివభక్తిచేత తిరిగి పొందినాడు. ఇచట శివభక్తులు వీరావేశముతో ఘోరమైన కృత్యములు చేయుచు భక్తియే ప్రధానముకాగా తమ అవయవములను తామే ఖండించుకొని శివునకు ఉపహారముగ సమర్పించిన విశేషములు చెప్పు సందర్భమున ఈ కథ చెప్పబడినది. ఈ వీర శైవమతము ననుసరించినవాడే పాల్కురికి సోమ నాథుడు కూడ.

బ స వ పు రా ణ ము నం ద లి క థ :

బసవ పురాణము నందు ఈ కథ పండితయ్య చెప్పినట్లుగా కాక వేరు విధముగా గలదు. ఒకనాటి రేయి శివభక్తు డొకడు మొరటద వంకయ ఇంటికి వచ్చినాడు. వచ్చిన భక్తుని వంకయ సరస క్రియలతో తృప్తి పరచినాడు. సేవ తీరిన శివ భక్తుడు "ఆవుపాలు పత్తిరి లింగపూజకు అవసర మైనవి. ఇప్పుడు ఈ ఊరిలో శివభక్తులు లేరు. పొరుగూరికి వెళ్ళ వేళకాదు. నీవు సమకూర్ప గలవా" అని తన కోరికను తెలిపినాడు వెంటనే ఏ శంకయ లేక వంకయ తన గొడ్డును కొని వచ్చి ఉత్తరాటకు సంధించి శివభక్తి సమూహమును తలచి ఈ కొరడులోనే వత్తిరి, ఈ గొడ్డులోనే పాలు తప్పక పొందుదుననుచు కుండ కొని తెచ్చి పాలను పితుకుటకు ప్రారంభించినాడు. అతని భక్తి విశేషముచేత ఆరాటలోనే పత్తిరి అంకురితము కాగా గొడ్డు కుండెడు పాల నిచ్చినది. ఈ రెంటితో ఆ శివ భక్తుడు తన నియమమును చెల్లించినాడు. ఈ అద్భుతము శివ భక్తుడైన వంకయ భక్తి మహిమకు ఉదాహరణమని శివ భక్తులు చెప్పుదురు. ఈ రెండు కథలను పరిశీలింపగా వంకయ అను నామ సామ్యము గోచరించును. నిజమునకు ఈ వంకయ్య లిద్దరో లేక ఒకరో చెప్పుటకు సాధనములు లేవు.

బె జ్జ మ హా దే వి క థ :

తొల్లి బెజ్జ మహాదేవి యనునామె ప్రీతితో శివుని కొడుకుగా భావించి, అట్లు పిలుచుట చేతనే ఆమె ముక్తిని పొందినదని శివతత్వ సారమునందు

చెప్పబడినది. ఇంతకు తప్ప బెజ్జ మహాదేవి గురించి విశేషము లిందు కాన రాలేదు. బసవ పురాణమునందు ఈ కథ వివరముగా చెప్పబడినది.

ఉడుమూరి కన్నప్ప :-

శివతత్వ సారము ననుసరించి ఈ కన్నప్ప అనువాడు అతిశయ భక్తితో తాను ముందర చవిచూచిన మాంసమును శివునికి పెట్టి, ఆ భగవంతుని దయవలనే ముక్తిని పొందినాడని చెప్పబడినది. వేరే విశేషములు కన్నప్పను గూర్చి పేర్కొన బడలేదు. ఇదే కథ ధూర్జటి 'శ్రీకాళహస్తి మహాత్మ్య'మందు విపులముగా వర్ణింప బడినది*. బసవ పురాణములో కూడ ఈ కథ కలదు.

సకలేశ మాదిరాజయ్య :-

ఈ మహానుభావుడు గానకళా సరస్వతిగా పేరొంది మృత్యువును జయించి దాదాపు ఏడువందల సంవత్సరములు జీవించినాడట. ఈ పరమ మాహేశ్వరుని గూర్చి శివతత్త్వ సారములో పండితయ్య "భూతలమున ఇది యంతయు నూతనమని పొగడగ" సకలేశ మాది రాజయ్య తన భక్తి చేత ఏడు నూరేండ్లు మని నాడని వ్రాసినాడు. ఇంతకన్న విశేషములు తెలుపలేదు. పాల్కురికి సోమనాథుడు సకలేశ మాది రాజయ్య కథను బసవ పురాణము నందును, పండితారాధ్య చరిత్రము నందును మృత్యువుని జయించిన సకలేశ మాది రాజయ్య శతాధిక వర్ష జీవియైన విధానము చెప్పబడినది. పండితారాధ్య చరిత్రలో మృత్యువు కనుగవలో ధూలి చల్లిన ఇతడు తన మాహాత్మ్యము చేత భక్తుడైన చిక్క మాదరసును బ్రతికించిన విధానము ప్రస్తావింపబడి యున్నది.

మడివాలు మాచయ్య :-

శివతత్వ సారము నందు ఈ మడివాలు మాచయ్య భక్తిని వర్ణించుచు కడు రౌద్రముతో జతపడిన మదకరిని చంపి బిజ్జలుని ఉక్కడగించినవాడు

---

* రెండవ సంపుటములో ఈ కథ విపులముగా చర్చింప బడినది.

మఱి వాలు మాదయ్య అని మాత్రము చెప్పినాడు. బసవ పురాణమునందు కూడ ఈ కథ వివరముగా కలదు.

ఇ రు వ ద త్తు డు :-

శివతత్వ సారమునందు "చోడని యేనుగు జంపుచు" అను పద్యమును చదివి నప్పుడు కథా విధానముగాని, కధా సంబంధమైన ప్రధాన సూత్రము గాని తెలియ వచ్చుట లేదు.

బసవ పురాణము - ఇరువ దత్తుని కథ :

పూర్వము చోడుని రాజ్యములో సర్వసంగపరిత్యాగుడైన ఇరువ దత్తుడైనవాడు. శివాచార పరుడై శివభక్తులకు ఎగ్గు చేసిన పాతకులను అవిచారముగా చంపునట్టి నియమముతో నుండువాడు, ఇట్లుండగా చోడాధీశ్వరుని మద గజము మదోద్రేక బలధార లొలుకగా రౌద్రము తోపుర పీధిని పరుగెత్తు చుండినది. ఆ సందర్భము నందు భక్తుడొక్కడు వేకువ జామున లేచి శివ పూజకై పువ్వులను తెచ్చుటకు పోయి, పూసజ్జనిండుగా పువ్వులను కోసికొని వచ్చుచుండగా ఈ మదగజము వానిని కూడ ముట్టి తొండముతో త్రిప్పివేయ సమకట్టినది. అప్పుడు ప్రాణభయముతో శివా! పరమాత్మా! అని ఎలుగెత్తి అరచినాడు. ఆర్తనాదమును విని ఇరువదత్తుడు ఇది మలహరుని పలుకని భావించి నిశిత మైన కుఠారమును, చేత ధరించి మదగజమును ఎదుర్కొని నాడు. కొంతసేపు పోరాడిన తరువాత వజ్రాయుధము చేత పర్వతము త్రెళ్ళి పడినట్లు ఇరువ దత్తుని చేత మదగజము కూలిపడినది. ఈ విషయమును తెలిసికొనిన చోడ రాజు నా ఏనుగుచేత శివభక్తు డొకడు బాధింప బడెను కదా! అని బాధపడుచు ప్రాణములు విడచుటకు సిద్ధపడినాడు. అపుడు శివుడు ప్రత్యక్షమై చచ్చిన మావంతుని, ఏనుగును కూడ బ్రతికించినాడు. ఈ విధ ముగా ఇరువ దత్తుని మహిమ చెప్పబడినది.

ఇంకను శివతత్వ సారములో బ్రహ్మయ్య కథ, మలహణుని కథ' కదిరి రేమణార్యుని కథ, మున్నగునవి ఒక్కొక్క కంద పద్యములో కుదించి చెప్పబడినవి. కదిరి రేమణార్యుని కథ పండితారాధ్య చరిత్రము నందు కలదు. మిగిలిన కథలు బసవ పురాణములో గలవు.

ఇంకను పండితయ్య వీరకృత్యములతో శివ సాయుజ్యము పొందిన భక్తులను గూర్చి శివతత్త్వ సారములో చెప్పినాడు. అటువంటి భక్తుల గూర్చి పండితయ్య చెప్పిన విశేషములను తెలిసి కొందము.

దూ ర్జ టి :

ఇతడు తన కన్న తండ్రి తలను తెగనరికి శివభక్తియుక్తితో అత్యనువమైన శివ పదమునకు వెళ్ళినాడు.

అ చ్యు తు డు :

ఈయన అత్యనువమైన శివభక్తితో పూజించి సుదర్శనమను చక్రమును పడసినట్లు చెప్పబడినది.

భ వా ని :

ఈతడు శివనిందా శ్రవణమునకు రోసి తన దేహమును, ఆత్మాగ్నికి అర్పణ చేసి ఆ భక్తి ప్రభావముతో శివుని అర్ధాంగమును పడసినాడు.

వ్యా ఘ్ర పా దు డు :

ఈయన శివనింద వింటినని ప్రాణములను వదలినాడు. ఆ ప్రాణ వియోగాగ్ని చేత ఇతడు ఎర్రని పెదవులు కలవాడై గణపదవికి అర్హుడైనాడు.

రా వ ణు డు :

ఇతడు వీర భక్తిని అవలంబించి తన తలలను నరికి శివుని పూజించిన కారణముతో చంద్ర హాసమును పొంది దేవేంద్రుని జయించినాడు.

భ ట్ట బా ణు డు :

ఈతడు తన చేతులు రెండును నరకుకొని మహా తాత్పర్యముతో శివుని పూజించుట వలన తిరిగి తన చేతులను పొందగలిగినాడు.

వీ ర శ ం క రు డు :

ఇతడు శివభక్తితో శివాగ్ని యందు తన శరీరమును కోసి కోసి వీర హోమముగా వేల్చి తద్వారా ముక్తిని పొందినాడు.

శివ నాగయ్య :

ఇతడు తన రెండు కన్నులను పెరికి హుంగర గ్రామములో సోమ వారము నాడు శివుని పూజించి ప్రసిద్ధి కెక్కినాడు.

చిరుతొండనంబి :

ఈతడు మహాభక్తుడై తన కొడుకును తునిమి వంటకము కావించి శివునికి నివేదించి ముక్తిని పొందినాడు.

జంబూరి మహాకాళయ్య :

ఈయన తన శిరమును శివుని పాదపద్మముల కర్పించి, ఆ భక్తి చేతనే అఖిలైశ్వర్యమును పొందినాడు.

కర గోవిందుడు :

ఇతడు శిరమును తెగకోసికొని శివుని పాదపద్మముల కర్పణ చేసి తిరిగి ఆతని కృపతో మూడు నాళ్ళకు ప్రాణములను పొందగలిగినాడు.

బండారు బసవడు :

ఇతడు "ఉమేశుదే పరమదైవము, అతనిని మించిన దైవము మరొండు లేడు" అని చెప్పి ఆ మాటకు నిరూపణగా విషమెత్తి త్రావి తిరిగి జీవించినాడు. ఈ విధముగ తమ వీర కృత్యములచే అనేక మంది భక్తులు శివ సాయుజ్య మును పొందినారు.

ఇంకను బొందితో కైలాసమునకు పోయిన భక్తులను గూర్చి కూడ పండితయ్య చెప్పినాడు. వరగొండ చక్రవర్తి బొందితో కైలాసమునకు పోయిన భక్తాగ్రేశరుడు.

బడయ పళ్ళె :

ఈతడు ఆబాలవృద్ధముగా తన ఊరి వారందరిని తొలుత పంపి, తిరిగి తాను శివలింగముతో ఐక్యమును పొందినాడు.

మ ల య రా జు :

ఈతడు అమితమైన దృఢ భక్తి చేత శివు ననుగ్రహమును బడసి శివలోకమునకు దేహముతోడనే వెళ్ళినాడు.

ఉ ద్భ టు డు :

హర లీలా స్తవమును కావించి అమితమైన భక్తితో తన దేహముతోనే, సురచిరమైన విమానము నెక్కి కైలాసమును చేరినాడు.

శ ం క రు డు :

శివభక్తుడైన ఇతడు తన చేతి తాళములతో శివభక్తిని పాడుచు మీది కెగసి శివపురమును పొందినాడు.

కు మా ర పా ల ఘూ ర్జ రు డు :

ఇతడు తన గుఱ్ఱము, సతులు, పరిజనులను తనకు తోడురాగా కైలా సమునకు వెళ్ళినాడు. ఈ కథ పాల్కురికి సోమనాథ కృతమగు బసవ పురాణము నందును గలదు.

ఇంకను వివిధ క్రియలచేత శివసాయుజ్యమును పొందిన భక్తుల గూర్చి కవి తెల్పినాడు.

శ్రీ ప తి పం డి తు డు :

శివుడొక్కడే దైవమను మాటను నిక్కము చేయుటకు నిప్పులు కొంగున మూట కట్టిన అద్భుత వ్యక్తి శ్రీపతి పండితుడు.

బ ద య నం బి :

శివుడు భక్తులకు సదాబాసటయై నిలుచును అని చూపుటకు బదయ నంబి లంజయింటికి సయితము చోద్యముగా శివుడు వెళ్ళెనట!

నం బి. కి న్నె ర బ్ర హ్మ య్య లు :

హరుడొక్కడే దైవమని ఎదలో గట్టిగా నమ్మినవారు శివా! అని పిలువగనే 'ఓ' యని శివుడు పలికినాడట!

కుమ్మర గండయ్య :

ఇతడు ఎంతో తొందరగా కుండలు చేసి చేతితో వానిని చక్కబరచు చుండెడి వాడు. ఆ చప్పుడుకు అనుగుణముగ శివుడు నర్తన మొనరించెడి వాడట. ఇదిచూచి లోకమంతయు కుమ్మర గండయ్య భక్తి పెంపునకు విస్మయ మొందినదట.

ఆరియ రామరాజు :

ఈతడు తన భక్తి మహిమతో తను కట్టిన చీర ఒక మూరడు కనిపించు చుండగా నరు లెల్లరు చూచు చుండగనే శివుని ఉదరము నందు ప్రవేశించి ముక్తుడై పోయినాడు.

ముడిడి చౌండరాయడు :

ఇతనిని చూచి మ్రొక్కగా దీర్ఘాయువు అను చుండగనే ఆ మ్రొక్కిన స్త్రీ చచ్చినది. ఆ వెంటనే ఇది తగునా? అని ప్రశ్నించుటకు వీలులేకుండా తిరిగి ఆమె ప్రాణములను పొందినది.

ఆదకూతురు (ఒక స్త్రీ) :

తన భర్త శివభక్తుడు కాదని ఆతని నొల్లక అసహ్యించు కొనుచు శివుని శరణుజొచ్చిన ఒక స్త్రీకి పులస్త్వము సిద్ధించినదట.

కెంబాగి భోగిదేవి :

ఈమె వెంబడి విప్రులందరు పొగడు చుండగా తమతమ స్థానము లన్నియు వదలి లింగములన్నియు నడచి వచ్చు చుండెడివట.

మాదర చెన్నయ్య :

ఇతడు బీదవాడై సన్నుతమైన భక్తితో సలిది అంబలినేదే శివునికి నైవేద్యముగా పెట్టుచు మ్రొక్కి ఆ భగవంతుని దయతో ముక్తిని పొందిన భక్తుడు.

తేడర దాసయ్య :

మహా భక్తుడైన ఇతని చేత అసూయా గ్రస్తమైన జగమెల్లయు బడి

పోయినది. ఏడయ ఒంకయ చూచు చుండగనే శివుడు ఇతనికి తలుపులు తెరచినాడట.

శంకర దాసయ్య :

ఇతడు నేత్రాగ్ని చేత శివుని ప్రసాదముతో పర దైవముల పొంక మడగించినాడట.

వైజకవ్వ :

తెలియక వైజకవ్వ జిన ప్రతిమకు నమస్కరింపగా ఆమె నడుమప్పుడే ప్రవస్సిపడి జిన ప్రతిమ క్రిందపడినది. ఆ పడిన జైన విగ్రహములో పుర హరుని దయవలన ఈమెకు లింగమూర్తి కనిపించి నాడట.

సురియ చముడు :

ఇతడు ప్రతినిత్యము అన్నపు కడిని శివునికి నివేదింపగా, శివుడు కరుణతో ఆ అన్నపు ముద్దను తిని సర్వలోకములు పొగడునట్లుగా చేసినాడట.

అంబన :

ఇతడు సర్వకాల సర్వావస్థలయందు శివభక్తితో లీనమైయుండి, ఆ శివునిపై అనేక ఉత్తమ కావ్యములను చెప్పి శివలోక ప్రాప్తిని పొందినాడు.

బొమ్మయ :

ఇతడు వృత్తిచేత జీవహింస చేయుచుండియు, శివభక్తుడైన కారణముతో ఆతడుఆను నిత్యము అడవులలో చంపిన మృగములకు శివ సాయుజ్యమును పొందింప గలిగినాడు. అందరు చోద్య పడునట్లుగా అడవిలో చంపబడిన మృగములన్నియు శివలోకమునకు చేరినవట.

కరికాల చోడుడు :

ఇతడు శివుని యందు స్థిర భక్తియుక్తుడై కొలుచు చుండగా, ఆ శివుడు తన భక్తుని కనికరించి అతడు కోరునట్లుగ బంగారు వాన కురియించినాడు.

కే శ వ రా జు :

శివుడు తన భక్తుడైన కేశవరాజును కనికరించి ఆతని తలయందే స్థితుడై యుండి, చివరకు భువియందు లింగమూర్తి అవతారమును అత్యద్భుతముగ పొందినాడు.

పాం డ్య నా య కు డు :

పాండ్యనాయకుని యొక్క ధీర భక్తికి మెచ్చి సాక్షాత్తూ శివుడేవచ్చి ఆతని సమీపమునందు పీఠము వెలయగా తాను లింగ రూపమును ధరించినాడు.

కి న్నె రు డు :

ఈయన స్వామిని అనునిత్యము కుంచియతో సేవించుచుండెను. ఒకనాడు ఆగుడి (వాడు) ఆకుంచెను దాని గుడికి తాళమును వేసి పోయినాడు. అప్పుడు భక్తుని కొరకై తలుపు తెరచి శివుడు ప్రత్యక్షమైనాడు.

చే మ ర చ క్ర వ ర్తి :

శివపూజాంతరము నందు చేమర చక్రవర్తి గుడి యందలి చిరుగంటలు చెలగి మ్రోగు చుండగా వాద్య విశేషమును వాయించెడివాడు. ఈ వాద్యమును విని శివుడు సాక్షాత్తుగా ఆడుచుండెడివాడట !

క న్న డ బ్ర హ్మ య :

ఇతడు శివునికి నమ్మిన భక్తుడు. ఈయన అనునిత్యము త్రాళ్ళు, గునపములు, మొదలగు సాధనములను కొని రాత్రులందు కలవారి యిండ్లకు కన్నములు పెట్టుచుండెడి వాడు. ఆ విధముగ తాను చొరబడి ఇల్లు శివభక్తులవైప్పుడు వారికి సాష్టాంగ పడి వారి శరణు వేడుచుండెడివాడు. శివభక్తులు కాని వారి ఇండ్లను దోచి శివభక్తులకు పంచేడి వాడు. అతిథి పూజలను చేసెడి వాడు. ఈ విధముగ జీవించుచు ఒకనాడు ఆ నగర పాలకుని ఇంటికే కన్నము పెట్ట తలపెట్టి పరికరములను కొనిపోవు చుండగా త్రోవలో బసవన్న అగుపించినాడు. కనిపించిన బసవన్నకు నమస్కరించి బిజ్జలుని ధనాగార మెక్కడున్నదో వివరములు తెలుపమన్నాడు. తాను చేయునది తప్పుడు పనియని

శంకింపక శివ కైంకర్యముగ భావించిన బసవన్న బిజ్జలుని భాండాగారపు విశేషములు చెప్పినాడు. అప్పుడు కన్నడ బ్రహ్మయ బిజ్జలుని ధనాగారము నకు కన్నము వేసి బంగారము నంతయు దోచుకుని వెళ్ళినాడు. విషయము తెలిసిన బిజ్జలుడు క్రుద్ధుడై బసవన్నను ప్రశ్నించు చుండగనే వాకిట తన కనక రాశి గోచరించినది. అవి చూచి ఆశ్చర్య పడుచుండిన బిజ్జలునితో బసవడు బ్రహ్మయ భక్తి మహిమను గురించి చెప్పినాడు. అప్పుడు బిజ్జలుడు బ్రహ్మయను పిలిపించి సత్కారమును చేసినాడు. ఇట్లు అసత్కార్యము సత్కార్యమైనది.

పండితయ్య శివతత్వ సారములో బాణ, మయూర, కాళిదాసాది మహా పురుషులు కూడ శివభక్తులే నని చెప్పినాడు.

భ క్తి మ హి మ :

చిట్ట చివరిదగు ఈ ఘట్టమున మల్లికార్జున పండితారాధ్యుడు 62 పద్య ములలో భక్తి మహిమను గూర్చి తెలిపినాడు. మల్లికార్జున పండితారాధ్యుని దృష్టిలో భక్తి అనగా కేవలము శివ పరమైన భక్తియే. ఈ భావనను దృఢ ముగా నమ్మిన పండితయ్య తాను నమ్మటే కాక లోకమునకు బోధించినట్లుగ రచనలు కావించినాడు. ఈయనననుసరించి దక్షుడు చేసిన విహిత క్రియ శివ రాహిత్యము చేత ఏ విధముగ విఫలమైనదో అట్లే లోకము నందు భక్తి లేక చేసిన పనులన్నియు దుఃఖావహము లగునని చెప్పినాడు. ఈయన కొంత స్వేచ్ఛాయుత మైన అధికారముతో శివభక్తుడు చేసిన పాపము పుణ్యమగు ననియు, భక్తులు కాని వారు చేసిన పుణ్యమైనను పాపమగునని చెప్పినాడు. అట్లే తాలవైచిన గణాధిపుడు అపవర్గమును పొందుటయు, పూవిల్తుడు పువ్వు లను వేసి మృతిని పొందుటయు ఉదాహరణములుగ పేర్కొనవచ్చును. శివుని భక్త వాత్సల్యమును పొగడుచు, సనక సనందాదులకును, బ్రహ్మ, విష్ణ్వాదులకును ఎరుగరాని మహిమ గల శంభుడు భక్తికి మెచ్చి ఆ భక్తుని యొద్దనే ఉండునట; భక్తుని మరగిన శివుడు అనేక విధములైన నిత్యనైమిత్తి కాది కర్మానుష్ఠానముల నేమియు నొల్లక భక్తుని చెంతనే యుండునట. శివానంద సుఖలీనులైన శివభక్తులకు విష్ణ్వాదుల పదవులు కూడ దూదిపింజ

లతో సమానమైన వట ! ఈ విధమైన కేవల భక్తి సంబంధము (స్వామి భృత్య సంబంధము) నకును విధి నిషేధములతో కూడిన చదువుల వలన పుణ్య పాపములు ఆయా కర్మల వలన కలుగు భోగములు, ఆ భోగాంతమున తిరిగి పుట్టుకలు కలుగు చుండును. కావున భక్తుడైనవాడు ఉభయ కర్మఫల విరహితుడై కేవల భక్తను చేకొని శివుని ఆరాధింప వలయును. పండితయ్య దృష్టి యందు పరమేశ్వరుడైన శంభుడే శరణమని కొలుచుట "భృత్యాచారము" దీనికి సరితూగునట్టి మంత్ర తంత్రములేవియు లేవని స్థిరపరచినాడు ఇతని ననుసరించి భక్తియే విధి. ఆ భక్తుని మించిన వేరు విధి మరి లేదు. ఇందులకు ఉదాహరణముగా విధి పుత్రుడైన దక్షుడు విద్యుక్తముగా అశ్వమేథమును ప్రారంభించి భక్తి విరహితుడై (శివుని నిరాకరించి) పతనమును పొందిన విషయమును స్మరింప జేసినాడు. పండితయ్య దృష్టిలో ఎవ్వడు శివునకు తనువును, మనువును, శివభక్తులైన వారికి ధనమును ఇచ్చుచుండియు తానే శివుడను అహంకారము చూపడో వాడే శివభక్తుడు. ఇంకను, చిత్తములోని మలము పోవుటకు బాహ్యమైన పారిశుద్ధ్యము అక్కరలేదు. కాని భావ శుద్ధియే శివభక్తికి ప్రధానమని చెప్పినాడు. కత్తినికొని దేహమును ఖండ ఖండములుగ కోసి నెత్తుటితో కడిగినను శుద్ధికాదు. కేవలము చిత్తశుద్ధి చేతనే శివుని పూజింప వలయునని పండితయ్య చెప్పినాడు. ఒకవేళ శరీర మందలి అవయవము లన్నింటిని కడిగి నిప్పటికిని దానిలోని చేదు అనగా మాలిన్యము క్షాళనము కాదు. అందుకే చిత్త శుద్ధికి బాహ్యశుద్ధి అనవసరమని చెప్పినాడు. అత్యంత ప్రధానమైన అంతర్గతమైన చిత్తమే దుష్టమై నప్పుడు నిరంతర పుణ్య తీర్థ యాత్రాదులచేత ఆ చిత్తము శుద్ధి పొందదనినాడు. అంతేకాక సకల జగత్పతియైన శివునికి భక్తులైన వారిలో దోషములను వెదకు వారు పాప జాతులని దూషించినాడు. శివభక్తుడైనవాడు పండితయ్య దృష్టిలో సౌందర్యవంతుడు, గుణవంతుడు, యశోవంతుడు, రూపవంతుడు, జగత్పవిత్రుడు, సంపత్సమృద్ధుడు అయినట్టివాడు. శివ సంస్కారవిహీనుడైన మానవుడు అంత్యజునికి కూడా అంత్యజుడు. శివభక్తి యుతుడైనవాడు అగ్రజునికి కూడ అగ్రజుడైనవాడు. నీల గ్రీవుడైన శివానుగ్రహము వలన మాలకులజుడు కాగా ఆ భక్తి లేని కులజుడు మాలతో సమానుడని చెప్పి అందు కుదాహరణముగ

తొల్లి చెన్నయ్య అను మాలడు శివుని కొలిచి ముక్తిని పొందినట్లును, శివుని మన్నింపని దక్షుడు యజ్ఞము చేసియు, పచ్చి మాలడు అయినట్లును చెప్పినాడు. పండితయ్య భక్త్యావేశముతో మరికొంత ముందుకుపోయి, విద్యలు, వలశమును కలవారు ముక్తికి పోయినారా? కులహీనుడైన బోయ, సాలీడు హరుని గొల్చి ముక్తిని పొందలేదా? అని ప్రశ్నించినాడు. శివుడు యమనియమములకు కాని ఘోరవ్రతములకు కాని జప, తపాది ఉపవాసములకు కాని లొంగునట్టి వాడుకాడు.

కేవలము భక్తి చేతనే పొంద బడునట్టి వాడని చెప్పి అంమ కుమారహరణముగ శివనిందను విని తన శరీరమును త్యాగముచేసిన గౌరి సతిని, అట్లే ఉపమన్యుని పేర్కొనినాడు. శివభక్తి ప్రభావమును, శివానుగ్రహమును పొగడుచు పండితయ్య అనేక భక్తుల చరిత్రలను స్మరించినాడు. ఇందులో తన తండ్రిని చంపిన చండీశ్వరుడు, మాదర చెన్నయ్య, వీర చోడుడు. దశాననుడు, కాటకోటుడు, కన్నప్ప, చిరుతొండనంబి, భోగన్న బాణుడు, హలాయుధుడు, కలికాళచోడుడు మున్నగు వారున్నారు. ఈ విధముగా పండితారాధ్యుడు తన శివ తత్వసారమున సిద్ధాంత పరమైన శైవమును బోధించి, శివ భక్తుల కథయు చెప్పి వానిని ఉదాహరణముగా చిత్రించెను. అనగా శైవము కేవలము సిద్ధాంతమేకాక ఆచరణ సాధ్యమనియు పండితయ్య నిరూపించె నన్నమాట!

# పాల్కురికి సోమనాథుని కృతులు - శైవ సిద్ధాంతము

ఆంధ్ర వాఙ్మయములో నన్నయ యుగము తర్వాత పేరు పొందినది శివ కవి యుగము. శివ కవుల యుగములో అనేక నూతన కావ్య ప్రక్రియలు వెలసినవి. తెలుగు వాఙ్మయమునకు క్రొత్తమలుపు శివ కవి యుగమని చెప్ప వచ్చును. వైదిక కర్మ మార్గమే కాక, శైవము, వీర శైవము అనునవి కూడ వాఙ్మయముపై ప్రభావితమైనవి. ఈ మతోద్రేకము వలన ప్రజలలో భక్తి భావము, వర్ణ వ్యవస్థలో మార్పు సాహిత్య ప్రక్రియలలో నూతనత్వము కలిగి నవి. కేవలము మార్గ కవిత్వమునకే ప్రాధాన్యము కలిగియుండిన రోజులలో 'దేశి' కవిత కూడ ఈ మతోద్రేకపు రచనలలో చోటు చేసికున్నదని చెప్ప వచ్చును.

శివ కవులని పేరు వడసిన శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, శివలెంక మంచన పండితుడు ఈ వ్యవస్థకు ముఖ్యకారకులు. వీరి కవితా విధానము మత ప్రాధాన్యముతో కూడుకున్నదై ప్రజలలో నూతన చైతన్యము కలిగించినది. ఈ మార్పు కారణముగా తెలుగులో అనేక ప్రక్రియలు వెలువడి నవి. ద్విపద రచన, జాను తెనుగు, మణి ప్రవాళ శైలి మున్నగునవి. ఈ ప్రక్రియలే కాక, ఛందస్సులో కూడ క్రొత్త వృత్తములు, వివిధ రకములు మనము చూడ వచ్చును. త్రిభంగి, క్రౌంచ పదము, మయూరం, మానివి వంటివి ఉదాహరణములుగా పేర్కొన వచ్చును.

పాల్కురికి సోమనాథుడు కావ్య రచన చేయుటకు పూనుకొన్నప్పుడు శివ కవులకు మత ప్రచారమే ధ్యేయమై కర్మమార్గము వైదిక మత సిద్ధాంత ములయందు నిరసన భావము కలిగినదని చెప్పవచ్చును. వీరిది వీర శైవ మతము. ఇందు జాతి, మత భేదములు లేవు. అందరూ సమానమే. కలిమి, లేములు అనునవి కూడ వీరిమతములో లేవు. కేవలము శివ భక్తులైన చాలు.

మంత్ర తంత్రములతో, చదువు సంధ్యలతో పని లేదు. సంఘములో నున్న దురాచారములను నిర్మూలించి సమానత్వము ప్రతిపాదించుటకేర్పడిన మతము ఈ వీర శైవ మతమని శివ కవులు చాటినారు. ఇట్టి భావములను దృష్టియందుంచుకుని వీరు రచనలు సాగించినారు. శివ భక్తుల మహిమలు, భక్తి ప్రభావము ఎంతో గాఢముగా వీరి మనములో ప్రతిపాదింపబడినవి.

సోమనాథునికి ముందు కాలములో సాహిత్య సృష్టికి మతము నాధారముగా చేసికొన్నవాడు మల్లికార్జున పండితుడు. ఇతనికి పూర్వుడైన నన్నెచోడుడు కూడ 'కుమార సంభవము'లో శైవ మత సిద్ధాంతముల విశేషములను చెప్పియుండెను. కాని అప్పటికి బసవేశ్వరుడు ఉద్భవించి వీర శైవ సిద్ధాంతములు ప్రతిపాదించియుండలేదు. ఈ కారణముగా తెలుగు దేశమునగాని కన్నడ దేశమునగాని 'వీర శైవము' అనునొక మతము ప్రాదుర్భావము చెందియుండలేదు. అందుచేత నన్నెచోడుని కావ్యమున బసవన్న మతము కలదని చెప్పుట సమంజసము కాదు. ఇక మల్లికార్జున పండితారాధ్యుడు బసవేశ్వరునికి సమకాలికుడు. ప్రత్యక్షముగా బసవేశ్వరుడు కర్నాటక దేశమున ఉద్యమించుచున్న విషయములను చూడకపోయినను సమగ్రముగా విన్నవాడు. దాని చేత ప్రభావితమైన వాడు. ఆ ప్రభావము ఉద్బోధకము కాగా తెలుగు దేశమున మత ప్రచారము చేసియు, గ్రంథములను రచించియు, వీర శైవమునకు తన జీవితమును అంకితము చేసినవాడు.

ఇక పాల్కురికి సోమనాథుని మార్గము విశిష్టమైనది. ఎందుచేత ననగా ఈ కవి రంగమున ప్రవేశించునాటికి తెలుగు దేశములో పండితత్రయము కన్నడ దేశములో మహానుభావుడైన బసవేశ్వరుడు శైవ మతమును ప్రతిపాదించి ప్రచారము చేసి లింగైక్యము చెందియుండిరి. అట్లు కొంతకాలము గడచినదిగాబట్టి ఆ శైవ సిద్ధాంతమునకు ఒక స్వరూప మేర్పడినది. ఒక స్వభావము నిర్దిష్టమైనది. దీనికి లోకములో ఖ్యాతి కూడా కలిగినది. అధిక సంఖ్యాకులు స్త్రీ, పురుష, జాతి, కుల వివక్షత లేక కర్నాటాంధ్ర దేశములలో ఆ మతమును నిత్య జీవిత విధానముగా అవలంబించియుండిరి. ఇట్టి స్వరూప, స్వభావ లక్షణములు కలిగిన మతమును కేవలము పామరులలోనేకాక అక్షరాస్యులలో సాంస్కృతిక సాహిత్య పరిణతి కలిగిన వారిలో కూడ ప్రచారము

చేయవలయునను అభిప్రాయము పాల్కురికి సోమనాథునికి కలిగినట్లున్నది. ప్రచారమునకు ఉత్తమోత్తమ సాధనము సాహిత్యమను విషయము సోమనాథుడు గుర్తించినాడు. బసవేశ్వరుడును, పండితుడును, సాహిత్యమును తమ మత ప్రచార సాధనముగా గ్రహించిన మాట వాస్తవమే అయినను ఆ సాధనమునకు కల పరిపూర్ణ శక్తిని నూటికి నూరుపాళ్ళు వినియోగించుకొనిన వాడు పాల్కురికి సోమనాథుడే అని చెప్పవలసియుండును.

సోమనాథుడు సాహిత్య నిర్మాణము చేయునాటికి తెలుగు దేశమునందలి పండితుడు కన్నడ దేశమునందలి బసవేశ్వరుఁడు మరణించియుండిరి. వీర శైవ మతావలంబకులు ఈ మహా వ్యక్తులను మహోన్నత పురుషులుగా భావించి గౌరవించుచుండిరి. వీరిని గురించిన గాథలు, కథలు అతిమానుష శక్తులు మహిమలు, మత సాహిత్య పాండిత్యములు లోకమునందు వ్యాపించి యుండెను. ఈ విశేషములను పాల్కురికి సోమనాథుడు వినియుండును. వాని చేత ప్రభావితుడై యుండును. ఆ వ్యక్తిత్వముల గొప్పతనమును, తాను స్వీకరించుటయే గాక లోకమున ప్రకటించుటకు పూనుకొనెను. ఈ పనికి సాహిత్యము కన్న మరొక శక్తిమంతమైన సాధనము లేదు అని అతడు గుర్తించినాడు. అందు వలననే ఒక కావ్యమునకు బసవేశ్వరుని నాయకుని చేయగా మరొక కావ్యమునకు పండితుని ప్రధాన పాత్రగా తీర్చిదిద్దినాడు. ఈ రెండు వ్యక్తిత్వములకు అతడు చారిత్రిక ప్రాధాన్యముతోపాటు పౌరాణిక ప్రాధాన్యము కూడ సంతరించినాడు. సోమనాథుని సాహిత్య సృష్టి ఉన్నతోన్నతమైనది. ఆతడు కన్నడమున, సంస్కృతమున రచనలు చేయుటయే గాక తెలుగులో మనకు లభించినంతవరకు గ్రంథములను రచించి వీర శైవ మార్గమును ప్రచారము చేయుటకు పూనుకొనెను. ఆ గ్రంథములు క్రమముగా ఈ క్రింద పరిశీలింపబడినవి.

## అనుభవసారము

పాల్కురికి సోమనాథుడు రచించిన గ్రంథములలో 'అనుభవ సారము మొదటిది. సోమనాథుడు యిందు శైవ వీరశైవ సాంప్రదాయములను వివరించినాడు. ఈ గ్రంథములో 242 పద్యములు గలవు. మొదట సీస పద్యములలో (7,8,9) ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకుడైన మల్లికార్జున పండితుని ప్రశంస

గలదు, మఱియు సోమనాథుని కవితా గురువగు కరస్థలి విశ్వనాథుని స్తుతి కూడగలదు. సోమనాథుడు దీక్ష పొందినది ఈ కరస్థలి విశ్వనాథుని వద్దనే. ఈ కృతి గొడగి త్రిపురారియను భక్తున కంకితమీయబడినది.

అద్వైత వేదాంతమున శ్రీ శంకరాచార్యులవారి 'అపరోక్షాను భూతి' వలె నీ యనుభవసారము వీరశైవ మత సారమును వివరించు చున్నది. ఇందు శైవము, శివలింగము, లింగ ధారణము, వీరశైవము, జీవయాత్ర సాధన సాధ్యములను సూక్ష్మ విషయములు, గురు మహిమ, భక్తి స్వరూపము, భక్తుల లక్షణము, భక్తి మహిమ, భావ క్రియార్చనా విధి, లింగార్చనా విధి, షట్స్థల స్వరూపము అను స్థూల విషయములతో సమన్వయము చేయబడి వీరశైవతత్త్వము నిరూపింపబడినది. ఈ గ్రంథము కేవలము వీరశైవ మత వ్యాప్తి కొఱకే రచితమైనదని చెప్పవచ్చును. ఇందు పరమత నింద, మతావేశము అంతగాలేవు. సోమన ఉత్సాహముతో శైవ ధర్మములను దెల్పిన తొలి గ్రంథమీ 'యను భవసారము'. అనుభవ సారము నందు కథా రూపమైన ఇతివృత్త మేదియులేదు. ఇందు గురుభక్తి మహిమ, భక్తి స్వరూపము. భక్తి లక్షణము, శివపూజా పద్ధతి, ఇష్ట లింగార్చనా విధి, జంగమ సేవ, షట్స్థల వివరణము మున్నగు వీరశైవ ధర్మములు ప్రతిపాదింప బడినది. తన సహాధ్యాయుడగు గొడుగు త్రిపురారిని కథా శ్రోతగా నుంచి "మనసిజహరు శుద్ధ భక్తి మార్గము వేదోక్త నిరూఢి బురాణ రహస్య నియుక్తిని" సోమనాథుడు విస్తరించినాడు.

ఈ కావ్యమునకు నామకరణము చేయుటయందు సోమనాథుడు ప్రత్యేకతను చూపించెను. బసవేశ్వరుడు 'అనుభవమంటపము'న ప్రవేశించిన వారికి శైవదీక్ష యిచ్చెడివాడు. అనగా అప్పటినుంచి వారు వీరశైవులన్న మాట. ఇట్లు 'అనుభవ మంటపము' వీరశైవ ప్రవేశమునకు ముఖద్వారమగుచున్నది. ఈ విశేషమును దృష్టి యందుంచుకొనియే సోమనాథుడు తన మొదటి కావ్యమునకు 'అనుభవసారము' అని పేరు పెట్టెను. అనగా వీరశైవ మత ప్రధానమైన అనేక గ్రంథములకు ఇది ప్రారంభమని సూచన చేయుట అన్నమాట. అంతేకాదు వీరశైవులకు అనుభవసారమును పఠించుటతో ఆ శైవ మత దీక్ష

ప్రారంభమగునని కూడ దీనియందు సూచించినాడను కొనవచ్చును. 'అనుభవ సారమును' గూర్చి సోమన ఈ క్రింది విధముగా చెప్పినాడు.

క॥ అనుభవ సారంబునఁగా
మనసిజహరు శుద్ధ భక్తి మార్గము వేదో
క్త నిరూఢి బురాణరహ
స్య నియుక్తిని విస్తరింతునది యెట్లనినన్
(అ।సా। 30)

క॥ వారక వేదపురాణ
ప్రారంభార్థముల నెల్లఁ ద్రచ్చగ 'హంస
క్షీరమివాంభసి' యనుగతి
సారమే కొని తెలుపువాఁడ సద్గురు కరుణన్
(అ।సా. 31)

ఈ అనుభవసార మందలి విషయము లన్నింటికి ప్రమాణ వాక్యములుండు నను భావము పై పద్యము వలన తెలియుచున్నది. శైవమతమునందు 'అష్టా వరణను' లుండును. అవి క్రమముగా గురువు, లింగము, చరుడు, తీర్థము, ప్రసాదము, విభూతి, రుద్రాక్ష, పంచాక్షరి యనునవి. ఆగమములో కూడ నీ యష్టావరణములను గూర్చి వివరణ గలదు. వీనిని గురించి సోమనాధుడు 'అనుభవసారమున' వివరించినాడు. శైవమతమున గురువు, లింగము, జంగములు ముఖ్యులు. గురువునకు, లింగమునకు, జంగమునకు అవినాభావ సంబంధము గలదు. ముగ్గురును నొకేవిధముగ మోక్ష ప్రదాతలు. ఈ విషయ ముతోనే సోమనాథుడు గ్రంథమును ప్రారంభించినాడు.

ఉ॥ శ్రీ గురులింగ జంగమ విశిష్ట విభేద సదన్వయంబులన్
శ్రీ గురు లింగ జంగమము జెప్ప త్రిమూర్తి నిరూఢమై చనున్
శ్రీ గురు లింగ జంగమ విశేషము లేకముగా దలంచియా
శ్రీ గురు లింగ జంగమ వశీకృతమౌ మది గొల్చి సమ్మతిన్
(అ।సా 1)

శైవ మతములో అష్టావరణము లున్నట్లే పంచాచారములును గలవు * లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భక్త, మాహేశ్వరీ, ప్రసాది ప్రాణలింగ శరణ, ఐక్యస్థలములను ఆరు ప్రధాన స్థలములును, వానిలో అంగస్థలములు నలుబది నాలుగు, లింగస్థలములు యేబదియేడు మొత్తము నూట ఒకటి యావాంతర స్థలములు బేర్కొనబడినవి.[1] వీరశైవ పరిభాషలో లింగస్థల శబ్దములు రెండును గూడ పరబ్రహ్మ వాచకము లగు సమానార్థకములయి యున్నవి. సచరాచర ప్రపంచ మెల్ల దేనియందు సృష్టి స్థితిలయము లొందు చున్నదో యదియే లింగము, స్థలము నిర్వచింప దగును. కావున బూర్వోక్తములయిన యష్టావరణ, పంచాచారముల గూర్చిగాని, షట్స్థల విజ్ఞానమును గూర్చి గాని, పంచాచార్యులను గురించిగాని యీ మతో ద్ధరణమునకయి యవతరించిన బసవేశ్వర, మల్లికార్జున, పండిత సోమనాధాది మహాపురుషుల విషయమునగాని వెలసిన వాఙ్మయముగా బరిగణింపదగును.

పంచాచారములలో రెండవదియగు సదాచారమునందలి యష్టాంగము లలో నెనిమిదవది. గురువే శివుడు. శివుడే గురువు. గురువు, శివుడు, మంత్రము నను వానికి రూపమున భేదమే గాని వస్తు భేదమెంత మాత్రము లేదు. శివుని యందెంత మహాత్యము గలదో మంత్రమునందు కూడ అంత మహాత్మ్యము న్నది. గురువు, శివుడు, మంత్రము నీముగ్వురిలో నెవ్వరిని పూజించినను ఫలము సమానమేయని యిచట భావము. సోమనాధుడుకూడా నిదేభావమును వ్యక్తము చేసినాడు. వీరశైవ మతములో శివభక్తుని పూజించినట్లేయను సిద్ధాంతము గలదు. శివభక్తులు గురువునొద్ద దీక్ష పొందెదరు. వారు గురువునే శివునిగా భావింతురు. ఈ భక్తిభావములనే సోమనాధుడు 'అనుభవసార' మందెల్లెడల వివరించినాడు. శివభక్తుడు గూడ శివునితో సమానుడని చెప్పు వాక్యము లాగమములందు గలవు.

యస్తుమల్లాంఛన ధరస్సచ పూజ్యోయధా హ్యహం
భక్త ద్రోహిమ మద్రోహిత్యతద్ధి శివశాసనం
(చ. జ్ఞా. ఆ. ద్వి. శ్లో. 42)

---

* వీరశైవ వాఙ్మయము. తద్విశేషములు
వ్యాసావళి-బండారు తమ్మయ్య (పుట 255)

భస్మ రుద్రాక్ష శివలింగములను ధరించిన వానిని నన్ను బూజించినట్లు పూజింపవలయును. నాభక్తునకు ద్రోహము చేసిన వాడు నాకు ద్రోహము చేసినట్లేయని శివశాసనము గలదు. శివభక్తులను బూజింపక శివుని మాత్రము పూజింతురేని అయ్యది వ్యర్థమే యగునని కూడ శివశాసనము గలదు. అనగా తోడి శివభక్తులను దూషించుచు,శివుని పూజించినను దాని వలన ఫలితముండ దని, శివభక్తులను శివునితో సమానముగా భావించ వలెనని ఇచట భావము.

పాల్కురికి సోమనాథుడు గురుభక్తిని గూర్చి అనేక పద్యము లీగ్రంథ ములో చెప్పినాడు. ఆగమములలో కూడ గురుభక్తిని గూర్చి విపులముగా చెప్ప బడినది. అనుభవసారములో 36వ పద్యము మొదలుకొని 55వ పద్యమువరకు గురుభక్తిని గూర్చి వివరింపబడియున్నది. 37వ పద్యమున చెప్పిన భావమును బట్టి గురువు పలికిన వాక్యములు శైవ మూల మంత్రాక్షరములైన 'ఓంనమ శ్శివాయ' అను వానికి సారభూతము వంటివి. ఇక ఓంకారమునకు మూలమైన మహేశ్వరుడు జన్మించు ప్రదేశమే అతని మనస్సు. మహేశ్వరుని ఆశ్ర యించిన శరణునికి గురువు యొక్క చేయి మాతృ స్థానీయమైనది. భక్తి భావము మహేశ్వరునకు లేక మహాశరణునకు ఆభరణము వంటిది. గురువు పాదములు ఆ భక్తిచే ఆధార భూతములైనవి. గురుని దయతో కూడిన దృష్టులు జీవన్ముక్తికి సోపానముల వంటివి. ఇట్టి మహోన్నతమైన గురుని గురించి అతని వాగమృతమును వర్ణించుట ఎవరికి సాధ్యము? ఈ పద్యము లోని భావమును ఇట్లు వ్యాఖ్యానించ వచ్చును. మూలమంత్రమునకు గురువే మూలమైనవాడు. ఎందుచేతననగా అతని ముఖముననే శైవుడు మంత్ర దీక్ష పొందుచున్నాడు. గురువు మనస్సు స్వచ్ఛమై లింగమూర్తికి స్థానమైనది. కారణమేమనగా శివగురువు నిరంతరము శివధ్యాన తత్పరుడగుటయే. శివుని శరణువేడిన శరణునికి ఎట్టి ఉన్నత మార్గము లభించునో అట్టిదే దీక్షవహిం చిన శిష్యునకు గురువు వలన లభించుచున్నది. ఎందుచేతననగా గురుని ఆశ్ర యించకయే శివమంత్రము లభించదుగాబట్టి. ఇక శివభక్తి లభించుటకును శివగురువు యొక్క పాదములే ఆధారములైనవి. ఆతని పాదములు కొలువక శిష్యునకు శివదీక్ష లభించక పోవుటయే దీనికి కారణము. శివుని దయాదృష్టి పరమ పదవితో సమానమైనట్టిది. అదిలేక శైవముకాని, శైవదీక్షగాని, భక్తిగాని ఏదియు లేదు కాబట్టి. శైవమతములో మహేశ్వరుడు అనగా శివుడు ఎంతటి

ప్రధానమైనవాడో మహేశ్వరుడైన శైవునకును అంతటి ప్రాధాన్యమే ఉన్నది. ఈ సూత్రమును ఈ పద్యము చాల చక్కగా వక్కాణించినది. ఇంకను గురు భక్తిని గూర్చి సోమన ఈ విధముగా చెప్పినాడు.

క। గురుమంత్రార్థ: కృతియును
గురునాజ్ఞోల్లంఘనంబు గురువిముఖతయున్
గురురంధ్రాన్వేషణమును
గురుపాతకమంద్రడు బుధులు గురుభక్తనిధీ (అ. సా 45)

తనకు శ్రేయస్సు జరుగవలయునని కోరుకొను వాడు గురునాజ్ఞను మనసున నైన తిరస్కరింపరాదు. గురునాజ్ఞను మీరని వాడె జ్ఞానసిద్ధినొందును. దీనికి సరియగు శ్లోకము చంద్రజ్ఞానాగమమున గలదు.

శ్రేయోర్థీమడిగుర్వాజ్ఞాంమసనాపినలంఘయేత్
గుర్వాజ్ఞావాల కోయన్మా జ్ఞాపంర్తి మశ్నుతే
(చం। జ్ఞా. అ. ద్వి. వ. శ్లో. 10)

గురు సద్గుణ వంచనమును
గురువంశా మాన్యతయును గురు విస్మృతియున్
గురు దుర్గుణ ప్రకటనమును
గురుపాతక మంద్రడు బుధులు గురుభక్తనిధీ (అ.సా. 46)

దీనికి ప్రమాణ వాక్యములు చంద్రజ్ఞానాగమమున గలవు.

నైర్గుణ్యేఖ్యా పిలేతన్య నైర్గుణ్య శతిభాగ్భవేత్
గుణే సఖ్యా పితేతద్వస్వర్వం పుణ్యపలం భవేత్
(చం.జ్ఞా.అ ద్వీ. వ. శ్లో. 19)

క దుర్మల దుష్ట పురాకృత
కర్మేంధ ననిచయ దాహకౌశల నిచితాం
తర్మహిత జ్ఞానానలు
నిర్మల గురుమూర్తిగొలుతు నిరుపమ భక్తిన్ (అ।సా 40)

దీనికి చంద్రజ్ఞానాగమములో

యథా ప్రజ్వరి తోపహ్నిర్నిష్టాం కాష్ఠస్య నిర్దహేత్
తథాయఃపి సంతుష్టోగురుః పాపంక్ష బాద్దహేత్
(చం।జ్ఞా।ఆ।ద్వి।ప।శ్లో। 15)

మండుచున్న అగ్ని దగ్గరనున్న తట్టెలను గాల్చునట్లు సంతస పడిన గురుడు పాపములనెల్లను క్షణ కాలమున కాల్చివేయును.

ఓపి మనో వాక్కాయ
వ్యాపారములందు గురుదయాత్మకరసధా
రా పాత్రుడు గాడేనిన్
ఙ్మాపాత్రుడు భక్తుడే? కుమార్గవిదూరా (అ।సా। 51)

మనసా కర్మణా వాచా గురోః క్రోధం సకారయేత్
తస్య క్రోధేనదాహ్యాస్తే హ్యాయు శ్శ్రీరా సస్త్రిక్రియాః
(చం। జ్ఞా। ఆ। ద్వి। ప। శ్లో 19)

తత్రోక్రధ గారిణోయేస్యుస్తే పాయజ్ఞాశ్చ నిష్ఫలాః
యమాశ్చనియ మాశ్చైవసాత్ర కార్యా విచారణా (17)

మనో వాక్కాయ కర్మములలో దేనిదేనైనను గురునకు కోపము కలిగించరాదు. గురునకు కోపము వచ్చెనేని శిష్యుని యొక్క ఆయువు, సిరి, జ్ఞానము, పుణ్యము అన్నియు నశించును. గురువునకు కోపము వచ్చిన యెడల యజ్ఞములు యమనియమాదులు నన్నియు వ్యర్థమైపోవును.

గురుని సంపత్తిని గుడుచుట
గురుని సమాసనమునందు గూర్చుండుటయున్
గురుని సమశయ్య నొందుట
గురుపాతక మంద్రుడు బుధులు గురుభక్తనిధీ (అ।సా। 49)

త్వం శబ్దం ప్రయాంజీత గురౌ శిష్యః కదాచన
అజ్ఞాన లంఘయేత్తస్యసం మనో పవిశేత్తధా
ఆసనం వాహనం వస్త్రం భూషణం శయణం తథా (శి)
సకుర్యాద్గురు సాదృశ్యంగతిసిద్ధి హితేప్సుభిః
చం।జ్ఞా।ఆ।ద్వి।వ శ్లో (41)

శిష్యుడు గురుని 'సీష' అని సంబోధించరాదు. గురుని ఆజ్ఞనతిక్రమింపరాదు. గురునితో సమానముగా కూర్చుండరాదు. ఆసనము, వాహనము, వస్త్రము భూషణము, శయనము మొదలగు వాని నుత్తమగతి గోరువాడు గురునితో సమానముగా నేర్పరచుకొన గూడదు. పాల్కురికి సోమనాథుడు గురుభక్తిని గూర్చి చెప్పిన తరువాత ఈ కావ్యములో భక్తుడు ముక్తి నొందుటకు ఆచరింప వలసిన విషయములను చెప్పినాడు. ఈ ఆచరింపదగు విషయములనే 64 శీల ములలో ముఖ్యమగు వానిని వివరించినాడు.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు వీడవలయునని తెల్పును. ఈ విషయమునే సోమనాథుడీ క్రింది చిన్న పద్యములలో తెల్పినాడు.

క కామంబు భక్తి రతియెడ
దమటి క్రోధంబు దేహ ధర్మముల యెడన్
వ్యామోహము భక్తులయెడ
శ్రీమతి లోభంబు వలయు శివపూజ యెడన్ (అ।సా 59)

క మద మాత్సర్యంబులు మది
వదలిన కార్యములు గాఁగ వర్తించుచునె
మ్మదిఁ జను నాతని జన్మం
బది సఫలము; కాని నాడునది శ్లాఘ్యంబే? (అ।సా। 60)

కామం భక్తి రతౌ కుర్యాద్విష యేషు న జాతుచిత్
ఏకత్రింశ మిదం నిష్కామత్వం ప్రకీర్తితం
(చ।జ్ఞా।అ।వి।ప।।వ।60)

భక్తియెడనే కోరికను వహింపవలయును గాని విషయ భోగముల యెడ కోరి కను వహింప గూడదు. ఇదియె నిష్కామత్వమగును. ఇది 31వ శీలమని చెప్పబడినది.

మోహం భక్తజనే కుర్యాన్న కాంతాయాం సుతేషు వా
అమోహాఖ్య మిదం శీలం చతుస్త్రిం శంప్రకీర్తితం
(చ।జ్ఞా।అ।ద్వి।ప।శ్లో 93)

మోహమును భక్తుల విషయముననే ధరింపవలయును. అంతియే కాని దానిని భార్యా పుత్రాదుల యెడ ధరింప గూడదు. ఆ మోహము అని ఎన్నబడు నీ శీలము ౩౧వది.

సదమేదేవ నిర్లోభం శివస్యారాధ నేవ హేత్
అలో భాఖ్యమిదం శీలంత్రయస్త్రిం శం సమీరితం
(చ॥జ్ఞా॥ద్వి॥ పశ్లో. 92)

లోభమును శివారాధనము నెడునే వహింప వలయును. కాని ధనాదుల యెడ వహింపగూడదు. ఇది యలోభమని చెప్పబడును. ఇది ముప్పది మూడవ శీలము.

వహేత్రోక్ర ధర్మేతు సవైరిషు కదాచన
ద్వాత్రింశక మిదం శీల మక్రోధం ముక్తి సాధనం.
(చం॥జ్ఞా॥అ॥ద్వి॥ప॥శ్లో 91)

కోపమును అధర్మము మీదనే ఉపయోగింపవలయును. కాని శత్రువుల మీద నుపయోగింప కూడదు. ఇదియు క్రోధమని చెప్పబడును. ఇది ముప్పది రెండవ శీలము ఇంక రెండవ పద్యములో మద మాత్సర్యములను గూర్చియు అవి ఎన్నవ శీలమో కవి చెప్పినాడు.

మాత్సర్యం కరణీ ష్వేపస జనేషువహేత్క్వచిత్
అమాత్సర్యమిదం శీలం పంచత్రింశంస మీరితం
(చం॥జ్ఞా॥అ॥ద్వి॥వ॥శ్లో 94)

మాత్సర్యమను దానిని ఇంద్రియముల మీద వహింపవలయునే గాని జనుల యెడ వహింపగూడదు. ఈ శీలము ముప్పదిఐదవది యగును.

మదం మాయా జయే కుర్యాత్ సధర్మోహేపి సంపది
అమదా ఖ్యామిదం శీలం షట్త్రింశ మిత కీర్తితం
(చం॥జ్ఞా॥అ॥శ్లో 95)

మాయను జయించు విషయముననే యహంకారము దాల్ప వలయునుగాని దానిని ధర్మమునెడగాని సంపత్తు విషయమున గాని దరింప కూడదు. మద

మను నీ శీలము ౩౭ ముప్పది యేడవది యగును. భోగములనెల్ల శివార్పణ బుద్ధితో గావింపవలయును. పరమేశ్వరున కిట్టి భోగముల నర్పింప గల్గితినిగదా పరమేశ్వరుఁడు భోగించుచున్నాడు గదా యను తృప్తి మనకు గల్గవలయునే గాని యాయారుచులను మనము భోగింపరాదు. దీనినే యర్పణ సద్భావ మందురు. ఈ విషయమునే సోమనాథుడిట్లు చెప్పినాడు.

(క) ఇంద్రియ పరవశుడధముం
'డింద్రియ నిగ్రహుడు భక్తియెడ మధ్యముడౌ
నింద్రియ జయుడుత్తముడు శి
వేంద్రియ సంధాయకుడు మహేశుడు కాఁడే?

(అ.సా 63)

(క) పంచేంద్రియముల మది దూ
లించి మనోగతియు లింగ లీనంబుగ భా
వించిన భక్తుం డటుగా
కించుక మఱచినను భక్తుడే? త్రిపురారీ (అ।సా 64)

(క) విగ్రహ సకలేంద్రియముల
నిగ్రహ లీలా నిరూఢి నిలుచునది సదా
నుగ్ర శివ పదవశ విష
యగ్రహణ సుఖంబు దొరకునంతకు నియతిన్ (అ।సా। 65)

తాను పరమేశ్వరుని ధ్యానించుచు తానును చేయు కృత్యములను ఈశ్వరుని ఇంద్రియముల ద్వారా చేయబడుచుండునట్లు భావించుచుండుట ఇరువది రెండవ శీలమని గ్రహింపవలెను. పై పద్యములకు ప్రమాణ వాక్యములు చంద్ర జ్ఞానాగమములో ఇట్లు గలవు.

సోహంభావేన విశ్వేశం ధ్యాయన్ కృత్యాని సర్వతః
తదింద్రియముఖే నైవ క్రియమాణాని భావయన్
యత్సంచరతి తచ్ఛీలం ద్వివ ష్టిక ముదాహృతమ్

(చం।జ్ఞా।ఆ।9వ।ష।శ్లో 121)

క॥ హర భక్తుడేని నిందం
బొరయునే? హింసా గుణంబు బొందునె? యొరులం
దిరియునె? యొరుమర్మము దా
నరయునె? యనృతంబు పల్కునయ్యా? మహాత్మా!
(ఆ। సా. 117)

ఈ పద్యములో నింద పొందకుండుట, ఇతరుల హింస గావింపకుండుట, పరుల నర్దించకుండుట, ఇతరుల రహస్యములు తెలిసికొనకుండుట చెప్పబడినవి. ఈ లక్షణములు శివ భక్తులు కలిగి యుండవలెను. ఇందు ప్రమాణ వాక్యములు చంద్రజ్ఞానాగమములో ఈ క్రింది విధముగా గలవు.

ప్రాణినోయస్య కన్యాపి బాద న్యాకరణం హియత్
అహింసాఖ్యమిదం శీల మష్టిత్రింశంస మీరితమ్
(చం।జ్ఞా।ఆ। 9వ ప। శ్లో 97)

అన్యాన ధర్మానుష్ఠానం పరద్రవ్యా పరిగ్రహః
అస్తేయాఖ్యం శీలమష్ట సత్వాంశ ముదాహృతమ్
(చం।జ్ఞా।ఆ।9వ ప।శ్లో 107)

భక్తినిష్ఠేన యద్వాచాయ ధార్దస్యైవభాపణం
తత్సత్వం సర్వ శాస్త్రేషు ప్రధమం శీల ముచ్యతే
(చం।జ్ఞా।ఆ।9వ ప।శ్లో 55,

(క) కొనునే నిషిద్ధపాకము
వినునే శివ దూషణంబు వేఱొక త్రోవం
జనునే సద్భక్తుడనే
ననునే గర్వించి భక్తియందు మహాత్మా!
(ఆ।సా 120)

సద్భక్తునకు గర్వముండ కూడదు. పై విధముగా సోమనాథుడు పంచా చారములలో నొక్కటగు సదాచారమున భాగములయిన నీ యఱువది నాలుగు శీలములను చిన్న చిన్న కంద పద్యములలో నిమిడ్చినాడు. భవిసంబంధము కూడదని సోమనాథుడు పలుతావుల చెప్పియున్నాడు.

(క) పెట్టునె భక్తుడు భవికిని
మెట్టునె మున్నన్య పదము యెయ్యెడఁపులఁ దా
ముట్టునె లింగార్పిత
మెట్టైనను బ్రతుక దలచునే త్రిపురారీ (ఆ। సా 123)

భవులకు భిక్షము పెట్టిన శరీరముతో నరకమున కేగుదురని భావము. లింగార్పిత వస్తువును ఎవ్వరును ముట్టరని సోమనాథుడు ఈ పద్యములో చెప్పినాడు.

పాల్కురికి సోమనాథుడు చతుర్వేద పారగుడు. వేదముల యెడ ప్రత్యయము గలవాడు. తన గ్రంథముల నెల్లడల శైవ మతము నిరూపించు వేదవాక్యములనే ప్రమాణములుగా గ్రహించి యున్నాడు. ఇఁక పై పద్యములో సోమనాథుడు చెప్పిన భవులెవరు అను ప్రశ్న ఉదయించును. దీనికి పలువురు పలువిధములుగా దలంచు చున్నారు. గురువు, లింగము, జంగము, ప్రసాదము తీర్థము, విభూతి, రుద్రాక్ష, మంత్రము నను నష్టావరణములతో గూడిన వీర శైవము నంగీకరింపని వారినందరిని సోమన 'భవి' యని పిలిచినట్లు కొందఱి తలంపు. బసవేశ్వరుఁడు వర్ణాశ్రమ ధర్మములను విడిచిపెట్టి లింగ ధారణ మునే ప్రధానముగా గ్రహించెననియు నందుచే వర్ణాశ్రమ ధర్మనిష్ఠా పరులైన వైదికుల నెల్ల సోమన 'భవులని' నాడని మఱికొందఱి యూహ. కాని వర్ణాశ్రమ ధర్మములను విడువజాలనని ఘంటాపథముగ జెప్పుకొనిన పండితారాధ్యుడు శైవుడు గాడని కాని భవుడని గాని సోమన అనుకొనలేదు. అందుచే నిక లింగధారణము మాత్రమే ప్రధానముగా తోచుచున్నది. శైవమన నెట్టిది? లింగధారణ లేని వాడు శైవుడగునా? కాదా? లింగధారణ లేకపోయినను శైవుడన వచ్చునన్నచో 'భవుడెవరు'? అను ప్రశ్నను పరిశీలించినచో సోమన దృష్టిలో భవుడు తెలియును.

ఈ సందర్భమున శైవ వాఙ్మయ పరిశోధకులుగా పేరుపొందిన శ్రీ బండారు తమ్మయగారి యభిప్రాయము చూతము. 'పాలకురికి సోమనాథ కవి' యను గ్రంథ మందలి 'సోమనాదుని యాచార వ్యవహారము' లను ప్రకరణమున వారీ విధముగా వ్రాసిరి. "సోమనాథుడఘోర వీర మాహేశ్వరాచార ధౌరేయుడని విఖ్యుతి గాంచిన మహనీయుడు.''

అనయము బాలకురికి సో
మనాథుడన బరగువాఁడ మానవ సంస
ర్గ నివర్తకుడను గురు భ
క్తినిరూపిత మానసుండ గృతగృత్యుండన్

(అ. సా. 34)

అని యనుభవ సారమునను

"వీర మాహేశ్వరాచారవ్రతుండ - సంభావితుడ భవిజన సమాదరణ సంభాషణాది సంసర్గ దూరగుడ" అని బసవ పురాణమునను

"భవికృతారంభ సంభవధాన్య నిచయ
భవి నిరీక్షణ రస పాక వితాన
భవి హస్తగత ఫల పత్ర శాకాది
భవి గృహ క్షేతాంఘ్రి పథ వర్జితుండ
భవిజన దర్శన స్పర్శనాలాప
వివిధ నాదాన విషయ దూరగుఁడ
శుద్ధ భక్తిస్థల శ్రుతి మతాచార
సిద్ధ వీరవ్రత శీలాన్వితుండ"

అని పండితారాధ్య చరిత్రమునను నాతడు స్వయముగ జెప్పుకొనినాడు. ఈ యాచార సంపత్తినే పిడుపర్తి సోమనాధుడు కూడ పద్య బసవ పురాణావతారికలో

భవి పాక భవి సహోదిత
భవిదృష్టి స్పృష్టి దుష్ట భవికృష్ట మహీ
భవధ్యాన భవికరద్ర
వ్యవివర్జన శీలునకు దయాలోలునకున్

అను పద్యము నుగ్గడించినాడు. భవిశబ్దమునకు భవము - పాపము - కలవాడను నర్థము పొసగును.

శైవ మతమునకు శైవాగమములు పరమ ప్రమాణములు. శైవాగమములలో శైవ మన నేమో శైవమున నెన్ని భేదములు గలవో లింగధారణ లేని

వారు శైవులగుదురో కాదో యన్న విషయము చెప్పబడినది. 'భవి' శబ్ద ప్రసక్తికూడ గలవి.

ఆగమములను బట్టి శైవ మెనిమిది విధములని చెప్పబడినది. అనాది శైవము, ఆది శైవము, పూర్వ శైవము, మిశ్ర శైవము, శుద్ధ శైవము, మార్గ శైవము, సామాన్య శైవము, వీర శైవము.

ఇందులో వీర శైవములో పట్టిన వ్రతములను ప్రాణాత్యయ కాల మందును వదలని వారు వీర శైవు లగుదురు.

పైన చెప్పిన విషయములబట్టి అష్టావిధ శైవములలో 'భవు'లను వారు ఏశాఖకు చెందరు. నాస్తికుడును, శివ ద్వేషియును నగువాడు మాత్రమే 'భవి' యని పిలువబడును. బసవ పండితారాధ్యుల సమకాలములను, సోమన విరచిత బసవ పండితారాధ్య చరిత్రములను బరిశీలించినచో నానాడు జైన బౌద్ధ చార్వాకముల విజృంభణము మిక్కుటముగా నున్నదనియు నలువైపుల జనులనేకులు మొగ్గు చూపుచున్నారనియుగూడ తెలియును. అందుచే జైన బౌద్ధ చార్వాకులను వైదిక సంప్రదాయములను విడిచి బౌద్ధాదులవైపు మొగ్గు చూపెడి వైదికులను మాత్రమే సోమన 'భవులని' పిలిచినటుల దోచును.

సోమన కొన్ని పద్యములు భక్తిని గూర్చి స్వతంత్రించి వ్రాసినను మిగిలిన పద్యములు ప్రమాణ వాక్యముల నాధారముగా వ్రాసి నాశనిపెంచు చున్నది.

కొన్ని పద్యములలో శివ భక్తుని గుణమే గాని కులమెన్న రాదని చెప్ప బడినది. ఇచట శివ భక్తు దేజాతి వాడైనను శివ భక్తుడగుటచే గౌరవింపదగిన వాడని యర్థము గాని శివ భక్తి యున్నచో వర్ణాశ్రమ ధర్మము విడిచి వారితో బంధుత్వము నొందవచ్చుననిగాని, వర్ణాశ్రమ విరుద్ధ కార్యములు జరుప వచ్చునని కాని భావింపరాదు. అంత్యజుడైనను శివ భక్తుడగునేని గౌరవింపవగునని పురాణములును పేర్కొన్నవి. శివ పురాణములో

సమేప్రియశ్చతుర్వేదీ మద్భక్తశ్శ్వపచోపియం:
తస్మై దేయంతతో గ్రాహ్యంసుర పూజ్యోయథా హ్యహమ్

పత్రం పుష్పం ఫలం తోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి
రస్యాహంస ప్రణశ్యామి సరమేవ ప్రణశ్యతిః
(శివపురాణం వాయుసంహిత. ఉత్తర భాగం)
(10 ప.అ. 7173)

కుల విద్యాచారాదులు
దలపక నీవలని భక్తి - తాత్పర్యమెడం
గల మానవుఁడు సమస్తము
గలవాఁడని పూజసేయఁగావలయు శివా ! (126)
(శివతత్త్వసారము)

యని పండితుడు శివతత్త్వసారములో చెప్పినాడు. ఇంకను దీనిని గూర్చి 10 పద్యములు గలవు. ఇఁక ఈ చిన్ని గ్రంథములో ఛందో విశేషములు గలవు. ఇందుగల వృత్తములు చంపకమాల, మత్తేభము, ఉత్పలమాల, కందము, సీసము అనునవి కాక శార్దూలము, తరువోజ, మహాస్రగ్ధర, త్రిభంగి, క్రౌంచ పదము, మానిని, వనమయూరము, చతుర్విధ కందము, సీస భేదములు కలవు. గ్రంథము చిన్నదే యైనను శైవ విశేషములతో పాటు క్రొత్త ఛందో లక్షణములతో కూడిన పద్యములుండుట విశేషము. త్రిభంగి వృత్తమును వాడిన వారిలో సోమనయే ప్రథముడు. క్రౌంచ పదమున ద్వితీయుడు. సీస పద్య రచనలో శ్రీనాథునకు మార్గ దర్శకునిగా బలువిమర్శకులచే బేరొందిన వాడు.

## బ స వ పు రా ణ ము

### బసవడు ప్రతిపాదించిన వీరశైవ సిద్ధాంతము - సంక్షిప్త వర్ణనము.

పాల్కురికి సోమనాథుని రచనలలో రెండవ కృతియగు బసవ పురాణము వీరశైవ సిద్ధాంతములకు ప్రతీక యనవచ్చును. ద్విపద వాఙ్మయమున పేరొందిన కృతి ఇది. ఇందు సోమనాథుడు వీరశైవ సిద్ధాంతములను బసవ పురాణ కథానాయకుండగు బసవేశ్వరుని చరిత్ర తెలుగు వాఙ్మయ చరిత్రలో అజరామర మనవచ్చును. సోమనాథుడు కేవలము కవియేకాడు. అతడు

* పండితారాధ్య చరిత్రలో ఈ విషయము చర్చించ బడినది.

కవిత్వము మూలముగా వీరశైవమత వ్యాప్తికి కంకణము కట్టుకొన్న అసమాన మేధాశాలి. లోకములో వ్యాపించి ఉన్న బౌద్ధ, జైన, వైష్ణవాది మతములను, శంకరాచార్యుని అద్వైత వేదాంతము మొదలైన సిద్ధాంతములను ప్రతిఘటించి వాటిని త్రోసి రాజు చేసి వాటి ఆటను కట్టడానికి కావలసిన పాండిత్యము నంతటిని సంపాదించుకొన్నవాడు. ఆ పాండిత్యమును చతుర్వేద సారము, సోమనాథ భాష్యము మొదలయిన గ్రంథములలో వినియోగించినాడు. కాని వాటి వల్ల శాస్త్రీయముగా వీరశైవ సిద్ధాంతము స్థాపితమగును కాని, అది జన సామాన్యములో వ్యాపించవలెనన్న కేవలము విద్వాంసుడును, పండితుడును పనికిరాడు. దాని ననుష్ఠించి, ఆచరణలో పెట్టి, లోకమునకు లక్ష్య ప్రాయుడై ఉన్నవాడు కావలెను. తనవలె ఇతరులున్ను అనుష్ఠింప వలెనను బుద్ధిని కలుగ జేయవలెను. వారి కుత్సాహమే కాక ఆవేశముకూడ కావలెను. ఆవేశము పుట్టించుటకు తాను ఆవేశ పరుడు కావలెను. జనులలో ఆవేశము పుట్టించుటకు దేశభాషలో, దేశీయచ్ఛందస్సులో, దేశీయ రీతిని కవిత్వము చెప్పుటకంటె మరొక మార్గము లేదను రహస్యమును తెలిసికొని యుండవలెను. ఈ గుణము లన్నియు సోమనాథునిలో పరిపూర్ణములుగా నున్నవి. అతని పాండిత్యము నిరుపమానమైనది. పండితారాధ్య చరిత్ర చదివిన ఈ విషయము తెలియ గలదు.

సోమనాథుడు పరమ వీరశైవుడు. ఈ విషయము సోమనాథుని సహజ వీరశైవునిగా బండారు తమ్మయ్యగారు నిరూపించిన దానిని బట్టి తెలియు చున్నది. భవులంటే ఈయనకు సరిపడదు.*

భవులయిన బ్రాహ్మణులను సోమనాథుడు తిట్టినాడు. ఈ నింద పండితా రాధ్యుని నోటినుంచి వెలువడినా, తిట్లన్నియు సోమనాథునివే. బ్రాహ్మణులను త్రాటిమాలలు, పచ్చిమాలలు అనినాడు.

"శూలి భక్తుల కెత్తు కేలది ద్రాటి
మాలల కెత్తుట మఱి తప్పుగాదె" (బ।పు 19)
"మాలల యీ త్రాటిమాలల, పచ్చి
మాలల మాటలు వోలునే వినగ?" (బ।పు 209)

---

* ఈ విషయము అనుభవసారమున చెప్పబడినది.

అసమాక్షు గొలువని యగ్రజుండైన
వసుధ మాలల మాలవాడ కాకెట్లు
మాలడే యీతని మాలడన్ ద్రాటి
మాలలు భువి బచ్చి మాటలు గాక: (బా।పు 217)

మార్గమే యీ త్రాటి మాలల గలియ? (బా।పు 240)

పురహరార్చితునకు మున్నెత్తుకేలు
ధర నెత్తగూడునే త్రాటిమాలలకు? (బా।పు 237)

వారిని త్రాటి కుక్కలు, మాల కుక్క లనినాడు.

శ్రీ మహాదేవు నర్చించు చేతులను
నా మాలకుక్కల నర్చింపఁదగునే? (బా।పు 237)

కుక్కయే యిది? దీని గుక్కయన్ ద్రాటి
కుక్కలు భువి జెడ్డ కుక్కలు గాక: (బా।పు 142)

బ్రాహ్మణులను గాడిద లనినాడు.

''వేద భరాక్రాంతులనగ
బడిన బ్రాహ్మణ గార్దభంబులతోడఁ
.... .... ....
బ్రతిసేసి యాడిన బాపంబు వచ్చు (బా।పు 225)

'వేద భారభరాక్రాంత' యనవ
గవ 'సవై బ్రాహ్మణ గార్దభ' యనె
గడి శ్రుతుల్ మోపరి గాడ్దవైమోవ
బడిన బ్రాహ్మణ గార్దభంబుల కంటె (బా।పు 85)

బ్రాహ్మణులను 'కర్మచండాలురని' పలికినాడు. మరియు వారు వ్రత భ్రష్టులని, అధిక పాపాత్ములని, కర్మజీవులని, సోమపానంబు గావించు పాఱులు, దుర్జాతులని నిందించినాడు. 'బాపన కూళఱపు' లని పలికినాడు. బ్రాహ్మణులు శివభక్తుని కాలి చెప్పుతో తుల తూగరని దానినొక కథ కల్పించి చెప్పినాడు. ఇంకను బ్రహ్మణుల ఇంటిపేళ్లను వికారముగా కల్పించి చెప్పినాడు. ఉదాహరణకు గ్రుడ్డి గోవిందుడు, కొమ్మన ఘటశాళి, బమ్మన భట్టు, వామనప్పన, త్రేదులవారు, ఆదిత్యకూంచి, మచ్చతాడన, బచ్చలి

కేశవుడు, మాస కొమ్మన, సన్యాసి వామన, కుశదర్భ పిన్నయ్య, ఆశనము వారు (ఐ. పు. 216) సోమనాథుడు చెప్పిన ఇంకొక విషయము వీరశైవుడు బ్రాహ్మణుని చంపినచో రాజు అతనిని దండింప కూడదట. (2 - 18) అయితే సోమనాథుడు నిందించిన బ్రాహ్మణులెవరు? అతడు వేదముల ప్రమాణముల నంగీకరించినాడు. వీరశైవ మతమును స్థాపించుటకు వేదములనే ప్రమాణములుగా అంగీకరించినాడు. తాను చతుర్వేద పారగుడు. వేదముమీద ఆధారపడి ఉన్న స్మృతేతి హాసములు కూడా అతనికి ప్రమాణములే. కాని, వీరశైవులకు వేదాధ్యయనాధికార మున్నది. వారి యింటి కుక్కలు కూడ చతుర్వేదములను నేర్చి ఉండునట. కేవలము నేర్చుకొనుటే కాదు. *

అవి శాస్త్రీయముగా తత్తన్ముద్రాసనాదులతో కూడ వేదములను పఠించగలవు. వేదము లనాదులు కావు. శివుడే అనాది పురుషుడు. విశ్వములోని సమస్తమును అతని నుంచి కలిగి, అతనిమీద ఆధారపడి, అతని అనుగ్రహము వల్లనే సత్తాను కలిగి ఉన్నది. ఈ సిద్ధాంతము నామోదించిన వారి మీద సోమనాథునికి ద్వేషములేదు. సోమనాథునికి పూర్వము శివద్విజులున్నారు. నంబెన్న వనిత అయిన పెరియనంగ 'శివ ద్విజుని వనిత' (2 - 154) నంబి 'శివద్విజుడ స్వాధ్యాయ పరుండ' అన్నాడు. నంబెన్న శివద్విజుని 'భూవి బుధేంద్ర' అని సంబోధించినాడు (2 - 168) మల్లికార్జున పండితారాధ్యుడే 'ద్విజోత్తముడు' వేద విదుడు పండితుడు పల్నాటి చోడుని ఆస్థానమునకు వారము కోసము వెళ్ళినప్పుడు అతనివెంట

"ఉపనిషచ్ఛయములు, రుద్రప్ర-
శంసా పరోక్తులాశ్చర్యం బెలర్ప
బరమ లింగార్చనా పరులు, స్వాధ్యాయ
పరులునై చను మహా బ్రాహ్మణోత్తములు
సదువుచు వేద భాష్యములు సెప్పుచును
ముదమున నిధుదెస మ్రొక్కుచును"

నడచినారు. (1-515)

---

* బసవ పురాణము 128.

ఒకరాజు బెలిదేవి వేమనారాధ్యునికి మ్రొక్కగా అత డల్పాయుష్కుడని తెలిసినవాడు కాబట్టి అతడు రాజును దీవించలేదు. అందుమీద రాజు

"...... ...... ...సంతతాభ్యుదయ
కరులు మహాభక్త వరులు భూసురులు
హరవేషధరు లఘహరులు సిత్వరులు
నార్యులు, శివ మతాచార్యు లవార్య-
వీర్యులు, సన్మార్గచర్యు, లుత్తములు"

మీరని పలికినాడు. గర్భాష్టకమున వడుగు చేయడము బ్రాహ్మణాచారము నంబి కొడుకుకు గర్భాష్టకమున వడుగుచేయ నెంచినాడు (1- 190)'చేయుము వడుగభిజిత్కాలమున' (2 170) అని నంబికి నంబెన్న చెప్పినాడు బసవని కాలము వరకున్ను శైవులలో గర్భాష్టమములోనే ఉపనయనము చేస్తూ ఉండేవారు. బసవేశ్వరుని తండ్రి "గర్భాష్టమమున, సుతు నుపనయనంబు శుభ ముహూర్తమున జేయుదునని" తద్దఱిడి ముడి పడగ, నా యెడ బసవ డిట్లనియె దండ్రికిని:-

బసవేశ్వరుఁడు వడుగు వలదని తండ్రితో వాదించుట-

"వడుగని యిదియేమి గడియించెదీవు-ఒడుడ వెట్లయితి వీశ్వరుని గొల్చియును.

బరమాత్ము గురునిగా బడసి దుర్నరల-గురులని తలుచుట నరకంబు గాదె?

గత పూర్వజన్మ సంస్కారుడై పిదప-వితత ద్విజత్వంబు పతితంబు గాదె?

నిర్మల గురుకృపాన్విత జన్మనకు-గర్మజన్మంబు దుష్కరంబు గాదె?
యగ్గురు పాదంబు లర్చించు నతని-కగ్గిలో హవివేల్చుటది దప్పు గాదె?
మలహరాత్మకమగు మంత్రంబు గఱచి - పలు మంత్రములు గొన బాపంబుగాదె?

శూలి భక్తుల కెత్తు కేలది త్రాటి-మాలల కెత్తుట మఱి తప్పు గాదె?
కర్మ పాశంబు లొక్కట దెగనిల్గి-కర్మంబు త్రాళ్ళుదా గట్టుకో దగునే?

రుద్రాక్ష భసితాది ముద్రలుదాల్చి-క్షుద్ర ముద్రలు దాల్పగూడునే చెపుమ?
యీరీతి ద్రాటికి దూరమైయున్న-వీర మాహేశ్వరాచార దీక్షితుని
నిర్మితో భయ కర్మనిర్మూలు నన్ను-గర్మాబ్ధిముంచుట ధర్మమే నీకు?
గ్రచ్ఛుల గన్నులగానవు గాక- వచ్చునే బసవని వడుగు సేయంగ
బ్రహ్మ శిరోహరు బ్రమథైక వంశ్య-బ్రహ్మవంశ్యుండని భావించె దెట్లు?
జాతి గోత్రాతీతు సద్గురుజాతు-జాతి గోత్ర క్రియాశ్రయు జేసె దెట్లు?
లకులస్థుడైయున్న యభవుని భక్తు-నికి నేకులంబని నిర్ణయించెదవు?
కావున నెన్ని మార్గములను వడుగు- గావింపగారాదు కథలేమి చెప్ప"

బసవడు ఉపనయనము వీరమాహేశ్వరాచార దీక్షితునికి తగదని తండ్రిని మందలించినాడు. పరమాత్మునైన శివుడే గురువు. ఇతర దుర్నరులను గురువుగా భావించడము నరక హేతువు. శైవ దీక్షితుడు గతపూర్వ జన్మ సంస్కారుడై మళ్లీ ద్విజత్వమును పొందడము పతిత్వమునకు- పాల్పడడమే. గురుకృప జన్మముగల వానికి కర్మ జన్మము దుష్కర్మమే. గురుపాదముల నర్చించేవాడు హవిస్సుతో అగ్గి నర్చించడము తప్పు. మలహరాత్మకమైన మంత్రమును నేర్చిన వాడితర మంత్రములను నేర్వకూడదు. శూలి భక్తులకు నమస్కరించే చేతులతో త్రాటిమాలలకు నమస్కారము చేయకూడదు. కర్మ పాశములను తెగగొట్టుకొన్న శివదీక్షితుడు తిరిగి "కర్మంబుత్రాళ్ళు" కట్టుకో గూడదు. రుద్రాక్ష భసితాది ముద్రలు ధరించిన వాడు క్షుద్రముద్రలను ధరించ గూడదు. ఉభయ కర్మలను నిర్మూలించుకొన్న వాని కుపనయనము చేయడ మతనిని కర్మాబ్ధిలో ముంచడమే. శివభక్తుడు ప్రమథైక వంశ్యుడు బ్రహ్మవంశ్యుడు కాజాలడు. అతడు జాతి గోత్ర క్రియాశ్రయుడు కాడు, ఇది బసవని వాదము. ఇక అతని తండి శైవద్విజుడు. గర్భాష్టమమున ఉపనయనము వేదోక్తమని నమ్మినవాడు. బ్రాహ్మణులకు షోడశ సంస్కారములు వేదోక్తములు. వాటిలో ఒక్కటి లోపించినా ద్విజకులోత్తముడు కాజాలడు. ఉపనయనము పదహారు సంస్కారములలో ఒకటి. శైవ సంప్రదాయము ననుసరించినది. బసవని తండ్రి ఉపనయన కర్మను సమర్థిస్తూ పలికిన వాక్యములివి.

"వినవయ్య 'బసవయ్య' విప్రమార్గంబు
నాగమవిధి బదియా (దునా?) ఱు కర్మంబు-లాగర్భ సంస్కార
మాదిగా గలవు.

వానిలో నొకడైన మానమౌనేని-కానేర డాత దగ్రకులోత్తముండు
అందు విరుద్ధ మెయ్యది రుద్రగణము-నాంది ముఖ్యంబుపనయన
పూజకును.

బనుగొన బ్రణవంబు భర్గుడేదైవ-మనుటయు మంత్రంబు నట్లును గాక
పెట్టిన సూత్రముల్ భీమ సర్పములు-పట్టిన పాత్రంబు బ్రహ్మశిరంబు.
పాలాశ దండంబు వంక జోదరుని-కోలెమ్మ దలచుట్టు కూఁకటుల్
జడలు.

నళితి కృష్ణాజిన మది గజాజినము-వఱలు మేధావియే నెఱిభూతిగాఁగ
హరుడు భిక్షాటన మాచరింపగ-నరిగిన వేషమింపార దాల్చినను
నట్టైనగాని బ్రాహ్మణుడు గాడనిన-నిట్టు విరుద్ధమే యాశు భక్తునకు?
వడుగు చేసిన భక్తి వట్టి పాటగునే?- నొడువరితనము నగడవ
నాడెదవు"

ఉపనయన విధిని తిరస్కరించి, కులగోత్రముల నెడబెట్టి, జాతి వర్ణ విభేదములను పాటింపక లోకమంతటిని వీరభక్తిమయముగా చేయుటకు బసవేశ్వరుఁడు సంకల్పించినాడు. అతనికి పూర్వమట్టి వీరశైవము లేక పోలేదని పాల్కురికి సోమనాథుని అభిప్రాయము. బసవడు పొత్తిళ్ళలో నున్నపుడు అతని నీవిధముగా సోమనాథుడు వర్ణించినాడు.

ఇలమఱపడ్డ నిర్మల శివభక్తి
దలయెత్తు వడువున దాదలయెత్తు
కడకతో నాదిమార్గము తప్పకుండ
నడుగిడులీల దప్పుడు గులువెట్టు
(బా।పు।ప్ర।ఆ)

కాని, బసవన్న లేవదీసిన వీరశైవ సంప్రదాయము మాత్రమంతకు పూ[illegible]
మున్నట్లు సోమనాథుని వ్రాతల వలన స్థిరపడదు. బసవడు పుట్టగనే అతని

తల్లితండ్రులు "భక్తుల బిలువంగ బనిచి, ప్రణామ మాచరించి, సింహాసనమ్మిడి, విభూతివీడ్యమ్ము లర్పించి, పాదోదకమ్ములు వట్టిమై గడిగి, భూతిఫాలమ్మున బూసి పై జల్లినారు."

బసవడు వడుగు నొల్లక తండ్రి యిల్లు విడిచిపోగా, బిజ్జలుని బండారి బలదేవ దండ నాయకు డాపరమ శైవ భక్తుడయిన బసవనికి తన కూతురైన గంగాంబ నిచ్చి పెండ్లి చేసినాడు. ఆ పెండ్లి సమయములో బలదేవుడు,

> "రండు! భక్తుల బిలువుండు! మీరెదురు
> వొండు! వేగమతోడి తెండు! తెం డనుచు
> నిట వచ్చు నయ్యల కెదురు వచ్చుచును
> నట వచ్చు నయ్యల కర్థి మ్రొక్కుచును
> సింహాసనస్థుల జేసి యాకర్మ
> సంహార మూర్తుల చరణముల్ గడిగి"

అర్చించినాడు. ఇట్లు బసవేశ్వరు పెండ్లికి తండోపతండములుగా వచ్చిన భక్తులు, కర్మ సంహార మూర్తులెవరు? వారీ క్రొత్తరీతి పెండ్లి నామోదించిన వారు, బసవేశ్వరుని క్రొత్త సిద్ధాంతము నామోదించిరనుటకు సందేహములేదు వారిలో పూర్వకాలము నుండి ఉన్న జంగములున్ను క్రొత్తగా బసవని మతము నంగీకరించిన వారున్నా కూడా ఉండి ఉంటారు. బ్రాహ్మణులలో సన్యాసుల వలె శైవ బ్రాహ్మణులలో కూడా యాజ్ఞోప వీతమును త్యజించి శైవ ధర్మ ప్రచారమే ముఖ్యముగా చేసుకొన్న వీరశైవ సన్యాసులు కూడా ఉండే వారన డాని కాక్షేపణ ముండ కూడదు. వీరిని జంగములనిన తప్పులేదు. కాని, సోమ నాదుడు వారు భక్తు లనినాడుగాని జంగమము లన లేదు. ఆనాడును, అంతకు పూర్వమును జంగమములుండవచ్చు. కాని, జంగమ జాతి ఉన్నట్లు కని పించదు. బ్రాహ్మణ సంస్కారములను శివ సంప్రదాయము ననుసరించి జరుపుకొంటూ ఉండే సాధారణ శైవ గృహస్థులున్ను, వారిలోనే శైవ ధర్మ ప్రచారమునకు గాను తిరుగుతూ ఉండే జంగమములున్ను ఉండే వారు - శైవ బ్రాహ్మణులలో జాతి వర్ణ భేదములుండేవి, వాటి కతీతులైనవారు జంగమములు. శైవులనందరినీ జంగమములుగా చేసి, వారిలో వీరశైవ భక్తిని ప్రబల చేయ డమే బసవేశ్వరుడు సంకల్పించినది. ఇంతకు ముందు ప్రకరణములో చెప్పి

నట్లుగానే వీరశైవునికి జాతి వర్ణ భేదముండ కూడదు. అంత్యజుడయినా భక్తుడై వీరశైవ దీక్షను గ్రహిస్తే వానిని పూజించవలెను. అతడు శివమూర్తి, కర్మ సంహార మూర్తి, కులజుడెవడు అనే ప్రశ్నకు సమాధానముగా

'కులజులు గులజులే? కులహీనులైనఁ
గులజుల శివ భక్తి కలిమి' (1-151)

అని సోమనాథుడు సూరసాని ముఖమున చెప్పినాడు.

'కర్మ దృష్టుల జూడగా గులభ్రాంతి
ధర్మంబయై తోచు; తత్త్వోక్త శైవ
ధర్మ దృష్టుల జూడ దత్కుల భ్రాంతి
ధర్మేతరం బసద్ధర్మమైతోచు' (1-151-2)

అని అతని అభిప్రాయము. 'భక్తుడే యాకృతి నున్న నిటల నేత్రుడ కాక నిందింపదగునే?, (1-132) అన్నాడు. అంత్యజుడెవడు? శివ కేశవుల 'ఐక్య మన్వాడచన నంత్యజుడుగాక సహజ మంత్యజుడు నంత్యజుండే? (1-385;) 'శివునకు విష్ణునకు నభేదంబు బలుకు నజ్ఞానియు పతితుండు' (1-373). బసవని ఈ సిద్ధాంత మానాటి కొందరు బ్రాహ్మణులకున్ను బ్రాహ్మణేతరులలో అనేకులకున్ను సమంజసమైనట్లు తోచినది. బ్రాహ్మణేతరులలో క్షత్రియ వైశ్యులు బసవని వీరశైవము నంగీకరించినారో లేదో తెలియదుగాని, చతుర్థ పంచమ వర్ణములలో మాత్రమది అతి శీఘ్రముగా వ్యాపించినది. బ్రాహ్మణు లయినా మొదటి ఆవేశముతో కొందరు బసవని జాతి వర్ణ పరిత్యాగ సిద్ధాంతము నామోదించి బసవని అనుయాయులలో కొందరు చేరినప్పటికిన్ని, అనేకులు బసవని అవతార పురుషునిగా గ్రహించి, అతని యెడల భక్తిని ప్రకటిస్తూ వచ్చినారే కాని, తమ బ్రాహ్మణత్వమును ద్విజత్వమును విడిచి పెట్టలేదు. ఎప్పటివలెనే వేదములకు శైవపరము, అర్థము చేసుకొని బ్రాహ్మణాచారములను అవలంబించుచూ వచ్చినారు. బసవని మీద నిర్వ్యాజమైన భక్తి కలిగి, అతని సందర్శనార్థము దాక్షారామము నుంచి కల్యాణ కటకమునకు వృద్ధాప్యములో కూడా బయలు దేరిన మల్లికార్జున పండితారాధ్యుడే బ్రాహ్మణధర్మమును విడిచి పెట్టలేదన్నప్పుడు సాధారణ బ్రాహ్మణుల మాట చెప్ప నక్కర లేదు.

బసవని పెండ్లి వేదోక్త శివధర్మ విధిగా జరిగినదట. ఆపెండ్లిని చూచిన వారు "ఏనాట విందుమే యిట్టి పెండ్లిండ్లు" అని ఆశ్చర్యముతో వినుతింప జొచ్చినారట. బసవని పెండ్లి కొడుకు వేషమును చూతము.

'దివ్యాంబర యుగ్మంబుసాతి,
భసితంపు నెఱపూత వలుచగాఁ బూసి,
నొసల త్రిపుండ్రమొప్ప సగధరించి,
మౌళి బ్రసాద సుమంబులఁ దుఱిమి
పొలగ రుద్రాక్ష భూషలు దాల్చి,
సారమై లింగప సాయితంబనెడు
పేరను గల్గు కఠారంబు గట్టి

భక్తి శృంగార మేర్పడ జూఱగొన్న
భక్తి కళార్ణవుడుగా' ఉన్నాడు.

వధూవరుల మీద శివ భక్త వనితలు చల్లినారు. శివబలం బగ్గలించిన ముహూర్తములో పెండ్లి చేసినారు. తక్కిన గ్రహచంద్ర తారాబలములల యెక్కువతక్కువలతో బనిలేదు.

'కరుణ జూచుటయ లగ్నంబు; సేయుటయు
వరముహూర్తంబు దీవనయ బలంబు'

పెండ్లి కెక్కువగా తంతులేమి లేవు.

బసవడు పట్టిన లింగప సాయితమనే కఠారము తన సిద్ధాంతమును లోకములో వ్యాపింపజేయడమునకు పుట్టినది. 'లింగప సాయిత' శబ్దము 'లింగ ప్రసాదిత' శబ్ద భవము. బసవన్న ఈ కఠారమును ధరించినట్లే ఆతని కాలములో బసవని మతమును వ్యాపింపజేయ సంకల్పించిన మరికొందరు భక్తులు కూడా ఆయుధములను పట్టుకొని విచ్చల విడిగా తిరుగుతూ ఉండేవారు. సురియ చౌడయ్య, ముసుండి చౌడయ్య లట్టివారు. ముసుండి అనేది ఆయుధము. తరువాతి కాలములో చౌడయ్య ముసిడి పండ్లు తినే వాడను కథలు

బయలు దేరినది. వీరశైవులు పరమతములను నిర్మూలించుటకు దౌర్జన్యమును నిరాటంకముగా ఉపయోగించినారు. జైనుల వసదులను నిర్మూలనము చేసి ఆ స్థానములలో శివుని ప్రతిష్ఠించిన వృత్తాంతము పండితారాధ్య చరిత్రములో ఎక్కువగా వర్ణింపబడినది. పండితారాధ్యుని నిందించిన బౌద్ధుని ఆతని అనుయాయులు చంపివేసినారు. బసవని అనుసరించిన వీరవ్రతులలో దొంగతనములో ఆరితేరిన వారున్ను ఉన్నారు. కన్నద బ్రహ్మయ్య కథ ఇందుకు సాక్షి. కన్నద బ్రహ్మయ్య అనే పదము కొన్ని ప్రతులలో కన్నడ బ్రహ్మయ్య అని కనబడు చున్నది. ఆ పాఠములు తప్పని చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్ర పీఠికలో వ్రాసినారు. వీరశైవ మత వ్యాప్తి కోసము చేసినది హింస కాదనే సిద్ధాంతము ఆనాడు పూర్తిగా ప్రబలినది. శివ ప్రీతి కోసము చేసిన ఏపని అయినా ఒప్పయినదే. తప్పొప్పులు సంకల్పితార్థము ననుసరించి ఉండు. ఫలము ననుసరించి సాధకులకు నిందాస్తుతులు కలుగును. కన్నద బ్రహ్మయ్య దొంగతనము చేయుట కుమార్గముకాదు. అది భక్తి మార్గము కాబట్టి సన్మార్గము.

"ఇల జూదమున బాండవులు భ్రష్టులైరి
నలి జూదమున మూర్ఖు నగజేశు గూడె;
వేటాడి రాముండు వెలఁది గోల్పడియె
వేటాడి యెఱుకుదా విశ్వేశు గలిసె;
పరసతీ వశ్యులై నరపతుల్ ద్రుంగ
బరసతీవశ్యుడై హరుగూడె సంబి,
చండి మాండవ్యుండు సరిగొఱ్ఱ బడియె
జంపి చండుండు ప్రసాదంబు గనియె,
బొంకిన బ్రహ్మకు భువి బుట్టుమాలె
బొంకి చిర్తొండండు బొందితో జనియె,
గొఱియ ముచ్చని శూద్రకుఁడు నఱకు వడె
గఱకంఠు గణనంది గలిసె దెర్వడచి,
రమణ 'రాజ్యాంతే నరక' మన ముక్తి
విమలత గనిరి నేరమయు జోడండు,
గాన యెట్లను నమార్గం బనరాదు

దా నీశ్వరార్ధమున్ తలపున జేసి,
ధర 'నధర్మో ధర్మతాం వ్రజే' త్రనగ
హరుని వాక్యము గాన యట్టిదీ పథము.
(బసవ 159)

శివుడు భీతునికి మృత్యుత్వమును ప్రసాదించి నప్పుడు భీతుడందు వల్ల తనకు పాపమురాదా అని అడుగగా శివుడు ఈ విధముగా చెప్పుచున్నాడు.

'సన్నుత లింగ ప్రసాదివి నిన్ను'
బున్నెంబు బాపంబు బొందవు
మదీయ మహీయః ప్రసాది
వొందునే యెట్లను బుణ్య పాపముల' (1-105)

అని శివ భక్తుల యెడలను, శివప్రీతి కోసము అహింసనే అవలంబింప వలెను. దసరయ్య హింసే తరుడు. జితకోపుడై సర్వజీవ దయాపరత నుతి కెక్కు- సువ్రతుడు. తన సుఖమెరుగక సర్వభూత హితమునే కోరు బుధుడు. తాను నొచ్చినప్పటికిన్ని నొప్పించడము తగవు కాదని సైరింపజాలే సజ్జనుడు. ఎదిరి చిత్తము లెట్లానో అని బత్తిలి మాటాడడు. జంతువులెట్లానో తన కాలి క్రింద పడి చచ్చునేమో యని ముందు చూడకుండా పాదము కదల్చడు. చేతు లిటు నటు త్రిప్పితే ఎవరైనా జీవులు పడునేమో అని త్రిప్పడు. చెట్టున ఉన్న పువ్వులను కోస్తే చెట్టుకు నొప్పి కలుగునేమో అని భూమి మీద తమంతట పడిన పుష్పములనే తీసుకొని వస్తాడు. (1-242) ఖ్యాపితంబగు శాంతియను ఖడ్గముననను గోపమున్ దెగగొట్టు నెవ్వండు, వాడచూ శూరుండు వాడ మాంత్రికుడ, వాడ విద్వాంసుండు, వాడ తపస్వి' 'అహింసా పరిమో ధర్మః నహంతవ్యః ప్రయత్నతః, నవిచార్య శివాజ్ఞయా' ఇంటువంటి వెన్నో అహింసాపరములైన వాక్యములు శైవ శాస్త్రములలో ఉన్నవి.

వీరశైవములో జంగముడుత్తమోత్తముడు. అతనికిన్ని లింగమున కున్ను భేదములేదు. లింగ శరీరమే జంగమ శరీరము. లింగ ప్రాణమే జంగమ ప్రాణము. జంగమ మూర్తి లింగమూర్తి అని అర్చింపడ ముత్తమము. అతడు గురుమూర్తి అని అర్చించుట మధ్యమము. అతడు శివ శాసన ధారుడని అర్చించడము తుది కక్ష్య. ఒక రీతిగా ఆలోచించిన లింగముకంటే జంగమమే

అధికుడు. లింగమచరము, జంగమము చరలింగ మూర్తి, లింగము కాయము, జంగమము ప్రాణము. లింగము ప్రాణ లింగావతారము, జంగమ మాచార్యావతారము. లింగమంగ సన్నిహితమునకు మంత్రము, జంగమము ప్రాణ సన్నిహితమునకు. లింగము మంత్ర క్రియాధారము. జంగమము తంత్ర క్రియాధారము. లింగమునకు యోగమజ్జనము, జంగమమునకు భోగ మజ్జనము. ఒక మూర్తి పూజాస్థానము, రెండోది ఆరాధన స్థానము. ఒక దానికి త్రికాలార్చనలు మాత్రము, రెండో దానికి సర్వ కాలార్చన. ఒక దానికి షోడశోపచారములు, రెండో దానికి రాజవదుపచారములు. లింగమునకు మనోగుణ నివేదనము మాత్రము, జంగమమునకు తను మనోధన నివేదనము (1-204-6). లింగార్చనముకంటె జంగమార్చన ముత్తమమైనది. 'శివభక్తి పరుల బూజింపకే ప్రొద్దు, శివపూజ లోకాకోటి సేసిన వృథయ, శివభక్తి పరుల బూజించినజాలు, శివపూజ లొకకోటి సేసినవాడు' (1-200) 'జంగమ భక్తి హీనుని పూజ, పీనుగుగ్రైసేయ బూనిన యట్లు' (1-201) లింగము కేవల శిల అని భావించి చేసిన పూజ నిష్ఫలము పాతక హేతువు 'జంగమములో లింగ భావము నారోపణ చేసి ప్రాణవంతుడయిన ఆ జంగమమునే ఆరాధించ వలెను. 'బ్రతికి ఉన్న మనుష్యుని ఆరాధించండోయి' అని సోమనాథుడు చేసిన ఉద్బోధము భారతీయ జాతికి తిరిగి ప్రాణము పోసినది.

నెఱి నంకురించు ద్రుమానికి నీరుమాని
నెఱవట్టి కొఱటికి నీరెత్తినట్లు,
గుటిలుడై జాతి నాగుల జంపుచుండి
ప్రతిమ నాగులకును బాల్వోయునట్లు,
వడిగొని భుజియించు వదన ముండంగ
గడిసేసి పెడతల గుడుపు చందమున,
నొనర ముందటి శిరంబుండ మోఁకాలి
కిని సేస వెట్టుంగ గ్రియ గొనినట్లు (1-202)

జంగమ పూజను వర్జించి కేవల లింగ పూజను చేయుట బసవ భక్తుని బాల్య వర్ణనము మనోహరముగా ఉన్నది. అతనికి శివలింగ సౌఖ్యాను భవము చన్బాలు, గురుపద ధ్యానము వెన్న, వేదాంత సూక్తులు తొట్టు బల్కులు,

ఆది మార్గము తప్పటడుగులు, లింగపూజలే బాల్య క్రీడలు, శివభక్తి స్వరూపమున్న శివునికిని తద్భక్తునికిన్ని గల సంబంధమున్ను ఎంతో చక్కగా సోమనాథుడు నిరూపించినాడు. (1-176-9) శివభక్తునికి వీర వ్రతము, వీర మాహేశ్వర వ్రతము కావలెను. వీర మాహేశ్వర పూజయే పరమ శివ పూజ. అసంఖ్యాక వీర మాహేశ్వరపూజ ఆకాలములో విస్తరించి ఉండేది. గురువు సంసారికి వీరభక్తి దీక్ష నిస్తూ ఉండేవాడు. ఈ దీక్ష పండితా రాధ్యునికి పూర్వమును కలదట. ఆ సంప్రదాయము ప్రకారమే మల్లికార్జున పండితుడు ఆ దీక్షను పొందినాడు. వీరభక్తి దీక్షను పొందు ఆచారము బసవనితో ప్రారంభించినది కాదు. బసవని కంటె పండితారాధ్యుడు వయస్సున పెద్ద వాడు. అతడు బాల్యమునందే ఆ దీక్షను పొందినాడు. వీరభక్తి (1-314)లో నిరూపింపబడినది. నిజమైన శివపూజ ఎట్టిదో (1-173;4-223)లలో వర్ణింప బడినది. అది బాహ్యాభ్యంతర భేదముల చేత రెండు విధములు. బాహ్యపూజ మంచిదే కాని, అభ్యంతరపూజ ఉత్తమోత్తమము. భక్తి ప్రాబల్యమునకు ఆత్మార్పణము గురుతు. తమ భక్తిని రుజూవు చేయడానికి వీరశైవులు కళ్ళు పొందుతూ ఉండేవారట. నాలుకలు పెరుకుకొని నాలుకలు పొందుతూ ఉండే వారట. తలలు తరుగుకొని తలలు పొందుతూ ఉండేవారట. శ్రీశైలములోని వీర మండప మిట్టి భక్తి ప్రకటనమునకు స్థానముగా ఉండేది. లేపాక్షి వీర భద్రాలయము గర్భ గృహము వెనుక గోడలో ఉన్న ఎర్రని మచ్చ విరుపణ్ణ అర్పించిన కన్నని ఇప్పటికిన్ని చెప్పుకొనుచున్నారు. భక్తి నిరూప ణార్థము ఘట సర్పములను చేతితో పట్టుకొనే వారు. దీపమునకు చమురు లేకపోతే జుట్టుకు నిప్పంటించుకొని దీపము వెలిగించేవారు. ధూతమునకు గుగ్గిలము లేకపోతే దేహములను కాల్చి ఆ పొగతో ధూపమును వేసేవారట. వీరభక్తి అంటే ఇదియే. "పురుషుకు శివభక్తి విరహితుడేని బురుషుని మీఁబుటి దరుణికి బతము" (బ-180) ఇట్టివీర భక్తులా కాలములో లెక్కకు మీరి ఉండేవారు. వీరే అసంఖ్యాత మాహేశ్వరులు. బసవని కాలములో కల్యాణ కటకములో మాత్రము లక్షా ఎనభైవేల మంది భక్త లింగములు, తొమ్మిదివేల మంది వ్రతస్థులు, పదివేల మంది ఛలవాది శీలవంతులు, ఏడువేల, యేడు వందలమంది వీర గణములు, పన్నెండు వేలమంది మిండ జంగములు

మొత్తము రెండు లక్షల పద్దెనిమిదివేల ఏడువందల మంది వీర వ్రతము నవలంబించిన వారుండే వారట (1-232,34).

మల్లికార్జున పండితారాధ్యునినోట సోమనాథుడు ఖండించిన మతములలో బౌద్ధ జైన మతములు కూడా ఉన్నవి. ఇవి వేద బాహ్యములు. వీటి సిద్ధాంతములు, సంప్రదాయములు వేరు. ఆంధ్ర దేశములోనే కాక దక్షిణ దేశమందం తటా ఇంచు మించు క్రీ శ. నాలుగు అయిదవ శతాబ్దముల వరకు బౌద్ధ మతము మిక్కలి ప్రచారములో నుండెడిది. బౌద్ధ మతము క్షీణించగా అరవ దేశములో శైవము, కర్ణాటకాంధ్ర దేశములలో జైనమును తలయెత్తినవి. ఆంధ్ర దేశములో 10వ శతాబ్దమునకు జైన మతము క్షీణించినదని చెప్పవచ్చును. కర్ణాటకములో మాత్రమది మరి రెండు శతాబ్దముల వరకు నిలిచినది. బౌద్ధ జైన మతములు క్షీణించుటకు శైవమత వ్యాప్తియే కారణము. వీర శైవము వచ్చిన తరువాత-అవి బొత్తిగా క్షీణించినవి. వీరశైవులు బౌద్ధా రామములను జైన వసదులను బుద్ధి పూర్వకముగా, బలవంతముగా, దౌర్జన్యముతో క్రూరముగా పాడు చేసినారు. ఆ స్థానములలో లింగ ప్రతిష్ఠలు చేసినారు. పండితా రాధ్య చరిత్రములో శైవులు జైనవసదులను నాశనము చేసిన విధముగా శైవోత్కర్ష కుపబలముగా వర్ణింపబడినది. దేవర దాసయ్య పొట్ల చెరువులోని ఏణ్నూరు వసదులను ద్రచ్చి వైపించి, జిన ప్రతిమలను విటతాట మాడినాడట. అల్లే కోవూరిలోవి వసదుల నన్నిటిని బ్రహ్మయ్య నాశనము చేయించినాడు. అబ్బలూరిలోని వసదులను ఏకాంత రామయ్య పడగొట్టించినాడు. కటకములో బండారు బసవన్న జైనులను భస్మము చేసినాడు. వరవశిగెలో వైజకవ్వ జిన ప్రతిమను పడగొట్టి ఆ స్థానములో వైజనాదేశ్వరుని ప్రతిష్ఠించి జైనుడనే వార్త లేకుండా చేసినది. మారుశిగెలోని హిరియ వసదిలోని జైనులను హిరియ నాగయ్య మొదలయిన పదముగ్గురు వీరవతారులు వధించి మహేశ్వర ప్రతిష్ఠ చేసినారు. పులిగెఱలోని సురహొన్న వసదిని పడగొట్టి ఆదయ్య అనేవాడు సౌరాష్ట్రమునకుపోయి సోమ లింగము నాహ్వానించి ప్రతిష్ఠించినాడు. పిళ్ళనయనారు జైనులను వాదములో ఓడగొట్టి కూన పాండ్యుని గూనిని పోగొట్టి, జిన మంత్ర పత్రమును శివమంత్ర పత్రమును అగ్నిలో వేయగా జైన పత్రము కాలిపోయినదట. శైవ పత్రము కాలలేదు. తరువాత ఆ పత్రములను కావేరి వరదలో విడువగా జైన పత్రము వరదలో కొట్టుకొని పోయినది, శైవ వ్రత

మేటి కెదు రెక్కినది. ఈ ప్రత్యయమును చూచి రాజు జైనులను కొఱ్ఱు లెక్కించినాడు. నిడుమారడనే రాజు రాజ్యములోని జైనులందరిని పిలిపించి, వారిని వాదములో ఓడించి, వారి తలలు తీయించినాడు. వాగీశ నాయనారిని జైను లనేక విధములుగా బాధింపగా అతడు పంచాక్షరీ మంత్ర దహనేభజల విషోద్ధతి చేత వారినందరిని చంపినాడు. ఇరిత్తాండి అనే పుట్టు గ్రుడ్డి అయిన శివ భక్తుని జైనులు బాధింపగా, అతడు శివుని ప్రార్థించి రెండు కన్ను లను పొంది, జైనుల కళ్ళు పోయేటట్లు చేసినాడు. నమినంది అనే శైవ భక్తుడు ప్రతి దినము శివుని ముందు వేయి నేతి దీపములు పెట్టే వ్రతముకలవాడై యుండగా జైను లతనికి నేయి దొరకకుండా చేసినప్పుడు లింగోదకములతోనే దీపములు వెలిగించి, జైనుల పశువులు చచ్చేటట్లు శపించి, 'వసది జైనుండను వార్తయు' నడచినాడు. తొండమండలములో జిన బుద్ధ ముఖ్య సమయములు నిస్తుషమయేటట్లు శపించి వాటిని తుడిపించి వేసినాడు. ఇట్టి తీవ్రాపదలకులోనై అనేకులైన బౌద్ధులును జైనులును మృతి పొందినారు. కొందరు శైవమతములో ప్రవేశించినారు. నానాటికిన్ని ఈ రెండు మతములు భరత వర్షములో నామ మాత్రావశేషములైనవి.

ఇక పాల్కురికి సోమనాథుని బసవ పురాణములోని కథలన్నియు వీరశైవ భక్తిచే ప్రభావితమైనవే. బసవ పురాణములో ప్రథమాశ్వాసములో 'బసవని పెండ్లి' ఘట్టములో బసవని సహోదరిగా నాగమాంబ పరిచయము చేయబడినది. * బసవ పురాణములో నాగమాంబను గూర్చి ఈ విధముగా చెప్పబడినది.

'యనుచు సహోదరి యగు నాగమాంబ-యను దాను నచ్చోట నుండ గాదనుచు
నరుదెంచె మతిపణి హారి యింటికిని - నరులిది సోద్యమనంగ నంతటను
దుగనక నిమున్ను వచ్చిన యతడు - పడతి మాదమాంబకు భ్రాత సజ్జనుడు
పాడు రాంగుని భక్తి దురుడు బిజ్జలుని-బండారి బలదేవ దండ నాయకుడు
''శివ భక్తునకు బెండ్లి సెయుదుగాని భవికినీ''నను తొంటి బాసదలంచి.

* వీరశైవ మహిళా శివశరణులు. రెకళిగె మఠము వీరయ్య

బసవనకు వరుసకు ఈమె అక్క అగునని చెప్పబడినది. ఈమె తలి దండ్రుల పేర్లు బసవ పురాణమున చెప్పబడలేదు. బసవన్న ఉపనయనమును నిరాకరించి, ఇల్లు విడిచి, కూడల (కప్పడి) సంగమ క్షేత్రమునకు పోవునప్పుడు, అక్క నాగమ్మ కూడ చిన్న వయసునందే తన భవిష్యత్తును ఆలోచించక బసవన్న వెంబడి వెడలి పోయినట్లు తెలిపియున్నాడు. కూడల సంగమ క్షేత్రమునందు ఈమె బసవన్నకు తోడు నీడయై ఆతని సంరక్షణ భారమును వహించియుండెను. *శివ శరణులయందలి అన్న చెల్లెండ్ల ఆదర్శ ప్రాయ మగు ప్రేమ, భక్తి అజగన్న - ముక్తా యక్కల యందు; అక్క - తమ్ముళ్ళ ఆదర్శ ప్రాయమగు వాత్సల్యత, అనురాగములను, నాగమ్మ - బసవన్న లందు గానవచ్చును. భవిష్యత్తును లెక్కింపక నాగమ్మ బసవని వెంట వచ్చుట ఆమె త్యాగ బుద్ధిని చాటుచున్నది.

కూడల సంగమ క్షేత్రము నందున్నప్పుడే నాగమ్మ బసవన్నతో బాటు, సకల శాస్త్రముల నభ్యసించి, ఉచ్చ తరగతి విద్యావంతురాలును, ఉత్తమ తత్త్వజ్ఞానియును అనుభావియునునై యుండెనని ఆమె వచనముల వలన తెలియుచున్నది. నాగమ్మ జీవితమునందు ఆమె కుమారుడు చెన్న బసవన్న జననము ఒక దివ్య ఘట్టము. ఈమె కూడల సంగమ క్షేత్రము నందున్నప్పుడె ఆమె గురువు జాత వేదుని సమ్మతి ప్రకారము శివస్వామి యను నొక సత్య శరణునితో ఆమె వివాహమైనట్లును, అక్కడనే వారిరువురికి చెన్న బసవన్న జనించెననియు కొందరి అభిప్రాయము. బసవవేశ్వరుడు కళ్యాణమునకు వచ్చిన తదుపరి అక్క నాగమ్మకు కక్కయ్య గారి మహాప్రసాదానుభవము వలన, చెన్న బసవన్న జనించెనని మరికొందరి యభిప్రాయము. బసవ పురాణమున మాత్రము ఇట్లుండగా "బసవన యగ్రసోదరి యగు నాగమాంబ భర్తృ సమేతంబుగా బసవేశ్వరుని యొద్దనేయుండెను" అని చెప్పబడినది. పై రెండు అభిప్రాయములలో కొంత కాలవ్యత్యాసము, శబ్దముల యందు భేదములున్నను, తాత్త్వికముగా రెండును నొక్కటియే యనవచ్చును. సంసారిక జీవనము గడుపు దంపతులకు సంతానాపేక్ష గలుగుట సహజమే. ఆ అపేక్ష గలిగిన హర గురుచర మూర్తుల ప్రసాదానుభవ

* వీరశైవ మహిళా శివశరణులు (రెకళిగె మఠము వీరయ్య) పుట 33

మును పొందుటయును సాంప్రదాయ సిద్ధమే: గనుక ఇంతవరకు సహజముగానే ఉన్నదన వచ్చును.

ఈ చిన్న వాడు 'చెన్న బసవవేశ్వరుడు' బసవన కేమాత్రము తీసిపోక అతని అడుగు జాడలయందే మెలంగెడివాడు. చెన్న బసవన్న ఆర్జించిన షట్స్థల జ్ఞానము, మహోన్నత పాండిత్యము,సాహిత్యనై పుణి మొదలగు సర్వో త్కృష్టములగు గుణములను జూచి, అతనిని ప్రసాద జీవిగాను, మానవాతీత వ్యక్తిగాను వర్ణించుచు అతడు అయోనిజునిగా కొందరు కవులు,భక్తి పారవశ్య మున తమ తమ కావ్యములందు చిత్రించిరి. అందుకు శివస్వామి మౌన ప్రతిభ, ప్రచ్ఛన్న జీవనములు కొంత తోడైనందున, అక్క నాగమ్మకు కక్కయగారి ప్రసాదము వలన బుట్టిన చెన్నబసవన్న అయోని సంభూతుండనియు, పురాణ మందలి కథ ప్రసిద్ధియయ్యెను. సోమనాథుడు తన బసవపురాణమున ఈ విష యములు తెలుపలేదు.

ఐతిహాసికయుగము నందలి ఐతిహాసిక పురుషులను, అయోని సంభవు లనిన, ఆవ్యక్తుల అస్తిత్వమునకే లోటు గలుగును. అంతేగాక స్వయముగా బసవన్నయే "కర్ణముల నుండి జనించినవారు గలరా?" [1]అని తన వచనము లందు చెప్పుట వలన, చెన్న బసవన్న జననము నైసర్గిక మార్గమునందు జరిగినదనియు, అతడు నాగమ్మ శివస్వాముల జీరస పుత్రుండనియు తలంచు టయే సమంజసము - సహజము.[2]

బసవేశ్వరుడు కూడల సంగమ క్షేత్రమునుండి కల్యాణమునకు పోయి యున్నపుడు అక్కనాగమ్మ అతనికి అత్యంత సమర్థతతో సర్వవిధములగు సలహాల నొసగుచు, అతనికి అండదండగా నుండినది. ఆమె కల్యాణము నందు న్నప్పుడు ముఖ్యముగా చెన్నబసవన్న జననము తదుపరి ఆమె బాధ్యతలు ఇనుమడించినవి. వానినన్నింటిని ఆమె అత్యంత కుశాగ్ర బుద్ధితో నిర్వ హించుచుండెను. కల్యాణమునందు చెలరేగిన రక్త పాతకమునకు విసుగు జెంది బసవేశ్వరుడు తిరిగి కూడల సంగమక్షేత్రమునకు పోవునప్పుడు, అక్క

1 బసవేశ్వరుని వచనము.

2 వీరశైవ మహిళా శివశరణులు (రెకళిగె మఠం వీరయ్యగారు)

నాగమ్మ బసవేశ్వరుని వెంబడి పోక, భర్త శుశ్రూష, పుత్రుని సంరక్షణల బాధ్యతలను నిర్వహించుటకు కల్యాణమునందే నిలిచెను.

ఐనను ఆ సంఘటన వలన శరణులు చెల్లా చెదరై పోవునప్పుడు తన కొడుకు, చెన్న బసవేశ్వరుని వెంబడి పోవుచుండిన గుంపును అనుసరించి వారి వెంబడి 'పుళివి'యను గ్రామమునకు పోయెను. అక్కడ ఆమె వీరశైవ ధర్మ రక్షణమునకుగాను విరోధుల నెదుర్కొనుట యందు తన కొడుకునకు సహాయ కారిగా నుండెను. చెన్న బసవేశ్వరుడు లింగైక్యమైన తదుపరి ఆమె తుంగ, భద్రానదుల మధ్యప్రదేశమున లింగైక్యమొందినదను ఐతిహ్యము గలదు. ఇంగుళేశ్వర గ్రామము సమీపమునందలి గుట్టపైన 'అక్క నాగమ్మ బిల మ'ను పేరుతో నొక బిలము గలదని "వీరశైవ మహిళా శివశరణులు"యను పుస్తకములో రెకళిగె మఠము వీరయ్య గారు వ్రాసిరి. జనులు నేడును ఆ ప్రతిమను భక్తితో పూజింతురట. దీనిని బట్టి నేటికిని ఆ బిలము కలదని ఊహించవచ్చును. శిథిలావస్థయందున్నదేమో తెలియదు. అందు ఆమె ప్రతిమ యొకటి గలదని కల్యాణమునందలి త్రిపురాంతక చెరువు ప్రక్కన గూడ ఆమె పేరుతో నొక విశాలమగు బిలము గలదు. ఆమె మహాతపస్వియై అక్కడ వున్నప్పు డాబిలములందు శివయోగమగ్నయై యుండెనని తెలియవచ్చును. బెళ్గాము జిల్లాయందలి నాగలా పురమునందు రెండడుగుల ఎత్తుగల ఆమె దొక మూర్తి గలదు. దాని ప్రక్కనే చెన్న బసవేశ్వరుని మూర్తియును, రుద్ర ముని దేవస్థానము గూడ అచట గలదట. ఈ విషయములన్నియు చూచిన, ఆనాటి శివశరణు రాండ్రయందు, అక్క నాగమ్మ ఉచ్చశ్రేణికి చెందిన శివ శరణురాలని తెలియజేయుచున్నది.

అక్క నాగమ్మ బసవన్న చేయుచుండెను నిత్య గణార్చనలను, శరణుల రాకడను, వారు సంతృప్తి చెందుటను అనుభవ మంటపము నందలి భవ్యమగు శివానుభవ గోష్ఠులను విని, అందులో పాలుగొని, అనుభావ మును పొంది సంబరపడినది. బసవన్న కల్యాణమును విడిచి, రెండవసారి కూడల సంగమ క్షేత్రమునకు పోయినపుడు, ఆమె కల్యాణము నందే ఉండి ఆ పరిస్థితిని చూచి మనసు నందు ఆవేదన సుపొంగు చుండగా

హృదయ విదారకమగు నటుల వచించిన వచనము గమనించదగియున్నది.*

వచనములు :

1) శ్రీ గురువే తల్లి దండ్రులై, లింగమే పతియై
జంగమమే అత్తమామలై, శివభక్తులే బంధువులై
సత్య సదాచారమను ఇంటికి నన్నప్పగించిరి గాన;
శరణసతి-లింగపతియను పేరు, నిజమయ్యెను
అటులే ఉండెద వెనుక ముందాడక నడిచెద
మనసుకు మనసే సాక్షి యుండునటుల జేసెద
బసవప్రియ చెన్న సంగయ్యా మీ అడుగులకు

2) మనసున కొదయడగు మహాదేవుడు
మనసును పరీక్షించుటకు గాను
మనుజులలో ఒకటొకటి పలికించుచుండును
ఇందులకు ఓ మనసా కలవర పడకుము
ఓ తనువా భయ పడకుము
నిజమును మరువక యుండుము
నిశ్చింతుడవై యుండుమో మనసా
బసవన్న ప్రియ చెన్న సంగయ్య
గుట్టంతయ పరాధమైనను
చిటికెన వేలుతో తొలగించుము

3) నా తనువు చెన్న బసవన్నగారి, బయలు నందు గలిసెను
నా మనను సంగన బసవన్న, నిజపదము నందు గలిసెను
నా ప్రాణము ప్రభుదేవుని, జ్ఞానమునందు గలిసెను
ఇటులీ ముగ్గురు ఒక్కొక్కటిని పంచుకొని నందుకు
నాదేమియు లేదిక, బసవన్న ప్రియ చెన్న సంగయ్య
హృదయ కమలమందు నిజవాసియైతిని.

---

* వీరశైవ మహిళా శివశరణులు, రెకళిగె మఠము వీరయ్యగారు.

4) బసవన్నా! నీవు మర్త్య లోకమునకు వచ్చి నిలిచిన
భక్తి పెంపు దిశ దశల కెల్ల ప్రసరించెను
అయ్యా, స్వర్గ మర్త్య పాతాళముల యందెల్ల మీ
భక్తి పెంపు ఘనత నెవ రెరింగిరి?
అన్నా శశిధరుడు చెప్పి పంపిన పని
పూర్తియైనదని నీవు లింగైక్యమయిన
నీవెంబడే భక్తి పోయె నయ్యా!
నీవెంబడే సదాచారము పోయెనయ్యా!
నీవెంబడె అసంఖ్యాకులగు మహాశరణులు పోయిరనా!
మర్త్య లోకము నందలి మహా మందిరము
శూన్యమాయెగద బసవనా!
నన్ను గొనిపోవకనే పోయితివి.గద
మహాపురుషమూర్తి బసవన్నా!
బసవన్న ప్రియ చెన్న సంగయ్యకు
ప్రాణలింగమై పోతివా సంగ బసవన్నా!

5) బసవడె నా ముఖ సజ్జిక బసవడె నా ముద్దుల మూట
బసవని నే నెత్తి ముద్దాడితిని
బసవా సంగన బసవదేవా జయతు
బసవా సంగన బసవలింగా జయతు.
బసవనికి నాకును భావ భేదము లేదు
బసవనికి నాకు రాసి కూటము గలదు
బసవన్న ప్రియ చెన్న సంగయ్య యందు
బసవని గనిన బాలెంతను నేను
బసవా! బసవా! బసవా!

6) భక్తి తన నిధివగు ఓ బసవన్నా
ముక్తి మూర్తియగు ఓ బసవన్నా
లింగ జంగమములు, చైతన్యమగునో బసవన్నా!
నిన్ను వదలి నేనెట్లు సైరింతునయ్యా, బసవన్నా!

నా పరమ గురువగు ఓ బసవన్నా!
నా అంతరంగ జ్యోతివగు నో బసవన్నా!
నీ ప్రసాద శేషము నిచ్చి, నన్ను పావన మొనరించి
బ్రతికించితివిగద ఓ బసవలింగా!
నాకు గతి మతి యింకెవరు, నీవుగాక?
చెప్పవయ్యా, బసవన్నా
బసవన్న ప్రియ చెన్న సంగయ్యా
నీవు వదలిన నా ప్రాణము నిన్ను వదలగలదా బసవా!

గంగాంబిక :

ఈమె బసవని భార్య, బలదేవ మంత్రి బసవన్నకు మేనమామ. అతడు తన కుమార్తె గంగమాంబను, బసవన్న కూడల సంగమ క్షేత్రమునకు పోకముందే, అతనికిచ్చి వివాహ మొనరించెననియు, ఆమెకూడ బసవన్న నాగాంబికల వెంట కూడల సంగమ క్షేత్రమునకు పోయినదని సోమనాథుడు బసవ పురాణములో తెల్పియున్నాడు. బసవన్నకు ఇద్దరు భార్యలని రెకళిగె మఠం వీరయ్యగారు తమ 'వీరశైవ మహిళా శివశరణులు' అను పుస్తకములో చెప్పిరి. ఇది బహు జనాంగీకృత విషయమని వారందు పేర్కొనిరి. పాల్కురికి సోమనాథుడు బసవ పురాణములో బసవేశ్వరుని రెండవ వివాహ ప్రసక్తి తీసికొనిరాలేదు. ఈ గంగాంబిక బసవని రెండవ భార్యయని వీరయ్య గారు పేర్కొనిరి. హరి హరుడు 'బసవరాజ దేవరరగళె' యందు గంగాంబిక వివాహమెపుడు జరిగినదను విషయమును స్పష్టముగా తెలుపలేదు. ఈమె అతని రెండవ భార్యయని తెలిపినాడు. బసవన్న మొదటి భార్య నీలాంబిక యని వీరి యభిప్రాయము.

*గంగాంబికయును, బసవేశ్వరుని దాసోహనియమము నందు, నిస్స్వార్థ బుద్ధితో, నిరహంకార మనస్సుతో, చిత్త శుద్ధితో అన్ని విధముల అనుకూల మగు వ్యవస్థను చేయుటయందు నీలాంబికతో సమభాగినియై యుండెను. ఈమెకు "బాలసంగయ్య" అను నొక కుమారుడు జనించినట్లును, ఆ బాలుడు పిన్న వయస్సునందే శివలోక ప్రాప్తి జెందెననియు తెలియుచున్నది.

---

* వీరశైవ మహిళా శివశరణులు, రెకళిగె మఠం వీరయ్యగారు.

గంగాంబికయు కూడ గొప్ప విద్వాంసురాలు-అనుభావి-తత్త్వ జ్ఞాని. ఈమెకూడ అనుభవ మంటపము నందలి గోష్ఠులలో భాగము వహించు చుండెను. వచనములను రచించుచు తన అభిప్రాయమును వ్యక్తపరచు చుండెను. ఈమె వచనములను "గంగాప్రియః కూడల సంగమదేవా" యను మకుటముతో వచించి యున్నది. ఈ వచనములు రెకళిగె మఠము వీరయ్యగారు వ్రాసిన "వీరశైవ మహిళా శివశరణులు" అను చిన్న పుస్తకములో కొన్ని పేర్కొనిరి. ఇవి అముద్రిము. ఈమె జీవితము నందలి ముఖ్యమగు ఘట్టముల వివరము లేవియును తెలియవు. ఐనను నీలాంబిక గంగాంబికల కిద్దరికి సంబంధించిన నొక ఘట్టము బసవేశ్వరుని కుటుంబమునకే సంబంధించి నది. బసవని జీవిత చరిత్ర యందు గలదు. బసవేశ్వరుని భక్తి, దాసోహము మొదలగు వానిని జూచి, పర మతస్థులు బసవన్నపై బిజ్జలునితో చాడీలు చెప్పిరి. బిజ్జలుడు బసవన్నను పిలిపించి రాజ్య భండార "మంతయు శరణులకు ధారవోయు చుంటివి. ఇక నీ మంత్రి పదవి చాలు" నని తీక్ష్ణముగా పలికెను. బసవన్న ఈ సందర్భము వచ్చునని ఊహించి ఎల్లప్పుడును తన వద్ద నుంచుకొనుచున్న పదవీ త్యాగ పత్రమును బిజ్జలుని ముందుంచి, బిజ్జలుని మారుత్తరము నెదురుచూడకనే, మహా మందిరమునకు తిరిగి పోయెను.

అచట గంగాంబిక, నీలాంబిక, అక్క నాగమ, శివస్వామి 'చెన్న బసవన్న మొదలుగా గల వారందరు యథా ప్రకారము ఇష్టా గోష్ఠి యందుండిరి బసవన్న మనసున ఆనందమున్నను ముఖమున కొంత చింతను జూపుచు మహా మందిరము నందు ప్రవేశించి జరిగిన వృత్తాంతమును వారలకు తెలిపి మొదట నీలాంబిక ముఖమును జూచెను. పతి అంతరంగము నెరుంగ గలిగిన సూక్ష్మజ్ఞాని యగుటచే నీలాంబిక

> "నేడు నాసంతసపు సంపద నెంతని యందునమ్మా!
> నాసుకృతపు సంపద నెంతని యందునమ్మా
> బసవ ప్రియ కూడల సంగమ దేవుడు కృపతో
> తానే, తన చేతులతో ఈ రత్న
> సంకెళ్ళను విడిపించెనమ్మా"

అనుచు హర్షోన్ముఖియై పతి చూపునకు ఉత్తర మిచ్చెను. బసవన్న తర్వాత గంగాంబిక ముఖమును జూచెను. ఆమెయు అత్యంత ఉల్లాసముతో తన పతి పదచ్యుతుడయ్యెనను చింతను మనసున ఆవంత యైనను రానీయక "అంతయు సంగనికృపయే" యని తన త్యాగ బుద్ధిచే తెలిపెను

ఇట్టి ప్రవృత్తి భార్యలయందు గలుగుట మిక్కిలి అరుదు. "పతి తృప్తియే లింగమూర్తి తృప్తి"యని భావించిన సతీ రత్నముల కిది వింతగాదు. సుఖ భోగములు అస్థిరములనియు, క్షణికములనియు నమ్మిన ఆదర్శమైన అక్క చెల్లెండ్లు వారు, పతి భక్తి పరాయణులు. కనుకనే వారి జీవితములు నిత్య సత్యము లయ్యెను. వారు అమర జీవులయినారు. సర్వ కాలములయందు వంద్యులు, స్తుత్యులునై యున్నారు.

1. ఇదేమో ఎత్తికనుపించు మూర్తి
పువ్వుల గుంపులో కనుపించక పోయెను.
ఇదేమో ఎత్తికనుపించు మూర్తి
కరస్థల మందలి లింగమునై
కదలక కనుపించుచున్నది
ఇట్టి మూర్తిని గాంచి
గంగాప్రియ! కూడల సంగని శరణుని సతి
ధన్యురాలయ్యె చెన్న బసవన్నా!

2. మాయయ్య మనసునందు
మాటలలో కనుపించు మూర్తి
చూచు చుండగనె బయలయ్యె గదా!
ఇది అల్లమ ప్రభు చేసిన ఆట
పోయినదే నిశ్చయమైనచో,
హృదయము కలవర పడుచుండె!
ఇట్టి బిడ్డపోయినను పోనటులే
గంగాప్రియ! కూడల సంగని శరణురాలి
చన్ను గుడుచుటకు రావయ్యా, చెన్న బసవన్నా!

3. •"ఆమె కొడుకు బాల సంగడు
నీ కొడుకు చెన్న లింగడు
అని చెప్పెను గదమ్మా నాయజమానుడు
ఫలము లేని కొడుకు గలదామెకు
ఫలములేదు కొడుకు లేదు నాకు.
ఇదేమో దుఃఖము నిచ్చు తొందరగద
గంగాప్రియ కూడల సంగమదేవా!

4. సాంద్రముగా హరగణములకు, భక్తి చేయున దెపుడో
మాదాలాంబికా నందనుడు
సాంద్రముగా బిజ్జలుని రాజసభయందు
న్యాయమును చేకూర్చునదెప్పుడో,
మాదరసుని మోహంపు సుతుడు
సాంద్రముగా లింగార్చన, లింగ తృప్తి
చెందున దెప్పుడో!
గంగాప్రియః కూడల చెన్న సంగని శరణుడు.

5. ఒక పాడు భూమియందు పులివచ్చి
నాకోడె లేగను భక్షించెగదా!
పాడు పడిన చోటునకు పులిపొద
ఆ పులి పసిపాపను జూచి జనని యయ్యె,
దీని నేమందు గంగాప్రియ
కూడల సంగమదేవా!

6. మడి వాలన్న కెందుకు రాదమ్మా కరుణారసము
మడివాలన్న కెందుకు రాదమ్మా శౌర్యరసము
మడివాలన్న కెందుకు రాదమ్మా అద్భుతరసము
మడివాలన్న కెందుకు రాదమ్మా
గంగాప్రియ కూడల సంగని శరణునకు
ప్రాణదాన రసము సిద్ధ రామయ్యా,

• వీరశైవ మహిళా శివశరణులు రెకళిగె మఠము వీరయ్యగారు పుట 59

అ క్క మ హా దే వి :

బసవపురాణములో ఈమెను గూర్చి వివరముగా లేక పోయినను ఈమె ప్రస్తావన గలదు. ఈమె శివశరణు రాంధ్రయందు మణిమకుటము వంటిది. శివకవి పిడుపర్తి సోమనాథుడు తన 'ప్రభు లింగలీల'లో ఈమె గూర్చి కొంత వివరించినాడు. కన్నడ సాహిత్యములో ఈమెను గూర్చి చాల విపులముగా గలదు. ఈమె ఉడుతడి గ్రామము నందలి శివధర్మానుయాయులగు సుమతి, నిర్మల సెట్టి యను సదాచార సంపన్న దంపతులకు బుట్టిన కుమార్తె. ఆమె పుట్టుక తోడనే అఖండ శివభక్తి సౌశీల్యము, పరిపూర్ణ, తత్త్వజ్ఞానము, సాహిత్య కళ, వైరాగ్య తేజములు బీజ రూపముననే ఆమె యందు గలిగి యుండెను.

ఆమె వయసుతో బాటు, సుగుణములు కూడ అభివృద్ధి చెందుచు వచ్చెను. నవయౌవనమునకు రాగానే, ఆమె రూపలావణ్యములతో బాటు, ఆ తేజస్సు, ఆ సుగుణములు నవవికసిత కుసుమ మందలి పరిమళమువోలె, అందరిని ఆకర్షించుచు వచ్చెను.

ఒకనాడు ఆ పూరి అధిపుడు, కౌశికుడు, వ్యాహ్యాళికి వెళ్ళినపుడు, తన వాకిలి ముందట నిలుచుండిన అక్కమహా దేవిని గాంచి, ఆమె సౌందర్యమునకు మోహించి, కామోద్రేక భరితుండై తన వ్యాహ్యాళిని రద్దుపరచి, రాజ భవనమునకు తిరిగి పోయెను. చారులను పిలిపించి, తాను జూచిన సుందరి "యెవ్వరనునది తెలుసుకొని, ఆమె తన అంతఃపురమునందు చేర్చు"మని ఆజ్ఞాపించెను. ఆ చారులు ఆమె నిర్మల సెట్టి - సుమతి యను దంపతుల కుమార్తె యని తెలుసుకొని వారింటికి బోయి, రాజు కోర్కెను తెలిపిరి. వారు సమ్మతించనందున, కౌశికుడు తన నమ్మకముగల మంత్రిని పంపెను ఆ మంత్రి, మహాదేవికి ఆమె తల్లిదండ్రులకు రాజ దండన భయము పెట్టెను. అప్పుడు మహాదేవి "కౌశికుడు తన మూడు నియమములకు అవరోధమును కలుగించ నటుల ఒప్పుకొనిన తాను రాజ భవనము నందు ప్రవేశింతున"నియు, "కౌశికుడు ఆ మూడు నియమములకు అవరోధము కలిగించిన వెంటనే తాను రాజభవనము నుండి వెడలి పోవుదు"నని అనెను. కౌశికుడు కామాతురతతో మొదట 'సరె' ననెను కాని, కామోద్రేకమువలన తానంగీకరించిన నియమములకు అచిరకాలముననే అవరోధమును కలిగించుటయే గాక, తన కామేచ్ఛను తీర్చుకొనుటకు

ఒకనాడు ఆమెపై బడ జూచి, చీరను లాగెను. అంత మహాదేవి కోపోద్రేకముతో 'ఛీ పశువా, నన్ను విడువు' మనుచు చీరను విప్పిపారవైచి కేశాంబరియై రాజ భవనము నుండి వెడలిపోయెను. ఆమె తలిదండ్రులు, పూరి వారలు ఎంత వలదన్నను వినక "చావు బ్రతుకుల మగడు నాకెందుకమ్మా! చావు లేని చెడుపులేని చెన్న మల్లికార్జునుని కూడి సుఖముండెదనని "*మీ బిడ్డనే గాను, మీరిక నుండి మా బిడ్డ యనియెడు మమత వాయుండు. హరునకు నాదేహ మర్పించినాను, గురునాథు బ్రభువు గన్గొన బోదునని" ఉడుతడిని విడిచి కల్యాణ కటకమునకు ప్రయాణమయ్యెను. మహాదేవి, లౌకిక వైభవమునకు మరులు జెందక, భయ భీతులను లజ్జలను వదిలి, సర్వసంగ పరిత్యాగినియై

"ఆకలి గలిగిన భిక్షాన్నములు గలవు
దప్పు గలిగిన ఏరు, బావి, చెరువులు కలవు
నిదుర వచ్చిన పాడు గుళ్ళు గలవు
చెన్న మల్లికార్జునా! ఆత్మ సాంగత్యమునకు నీవు గలవు"

అనుచు చెన్న మల్లికార్జునుని యందు అనన్యమగు సాత్త్విక ప్రేమను మనసున నిల్పి అడవులనక, చెట్లనక, గుండ్లనక, ముండ్లనక అతనిని వెదుకుచు వెడలి పోయెను.

అప్పుడు కల్యాణ కటకము నందలి 'అనుభవమంటపము'నందు బసవాది శివశరణులు అనుభావ గోష్ఠుల వలనను, ప్రభు దేవుని తత్త్వోపదేశముల వలనను, చెన్న బసవన్న షట్స్థల తత్త్వనిరూపణ వలనను కల్యాణ పట్టణము యెల్లరకును ఆత్మ కల్యాణము నొసగు నట్టి షట్స్థల తత్త్వజ్ఞాన పీఠముగా నుండినది. మహాదేవి అనుభవమంటపము నందలి బోధల వలనను అనుభావులగు శరణుల సాంగత్యము వలనను తన ప్రియుండగు చెన్న మల్లికార్జునుని ఒనగూడు సాధనమును తెలియ గలుగుదునని, కల్యాణమునందలి అనుభవ మంటపమునకు బోయెను. అక్కడ పరివేష్టించియున్న బసవాది శివశరణులను శూన్య సింహాసనముపై ఆసీనుడైయున్న అల్లమ ప్రభువును, ప్రక్కన నున్న

* ప్రభులింగ లీల పుట 80. పిడుపర్తి సోమనాథకవి, పరిష్కర్త బండారు తమ్మయ్య (1963) కాకినాడ.
* అక్క మహాదేవి వచనములు శివకవి రెకళిగె మఠము వీరయ్యగారు.

షట్స్థల చక్రవర్తి చెన్న బసవన్నను గాంచి మనసున ఆనందాతిశయమును పొందుచు, అక్క మహాదేవి "శరణు శరణార్థి" యని నిలుచుండెను. ఆమె నిజస్థితిని అనుభవమంటపమునందలి శరణులకు విశదమగు నట్లు తెలియజేయ వలయునను తలంపుతో అల్లమ ప్రభువు:

1 "గోకయు మొలగట్టుకొన కాడుదాన, పీగలి నీవున్న నిందలు వేలు, లాగుగా జూతురేలా వచ్చితిరనిన" అక్క మహాదేవి "జగదేక భరితుని సతికి గోకేల? దగులేల? తనుమనోధన సంగమముల దిగ విడిచిన నాకు దియ్య విల్కాని, మొగ మాటలేలను ముక్కంటి శరణులకు నేల? నన్నొకలాగుగా జూడ, వికృతి బాసిన నాకు వేషమేమిటికి" అనుచు ఉత్తర మొసగెను.

అల్లమ ప్రభువు ఇతర శివశరణులు, ఆమె వైరాగ్యమును ఆమె యందలి తత్త్వజ్ఞానమును పరీక్షించుటకు అనేక ప్రశ్నలను వేసిరి. అన్నింటి కిని ఆమె లింగము మెచ్చి 'ఔనౌ' ననునట్లు సమాధానముల నొసగెను. అప్పుడు అనుభవ మంటపమునందలి శివశరణులందరును ఆమె సర్వసంగ పరిత్యాగమునకును, తత్త్వజ్ఞానమునకును మెచ్చుకొని, 'అక్క' అను గౌరవ పదము నిచ్చి ఆమెను అనుభవ మంటపమునందలి గోష్ఠుల యందు పాలు గొనుటకును ఉన్నతాసనమును నియమించిరి. శరణులందు లింగ, వర్ణ, వృత్తి, వయసు భేదరహితమగు సమతకు నిదియొక నిదర్శనము.

అక్క మహాదేవి అనుభవ మంటపమును నందలి అనుభావ గోష్ఠుల యందు, చర్చల యందు పాలుగొనుచు, తన అనుభావ వచనములను విని పించుచు సంపూర్ణ అనుభావియై తన ఆత్మపతియగు చెన్న మల్లికార్జునుని యందు ఐక్యమగు ఉద్దేశముతో శ్రీశైలమునకు పోవుటకై అల్లమ ప్రభువు తన అనుభావముతో "శ్రీశైల క్షేత్ర మందలి కదలీవనము నందు చెన్న మల్లికార్జునుని ధ్యానించుచు అచ్చట ఐక్యమగుము-పొమ్మని" శెలవిచ్చెను. ఆ ప్రకారముగ అక్క మహాదేవి శ్రీశైల క్షేత్రము నందలి కదళీవనము నందు ఏకాంత స్థలమగు నొక గుహయందు శివయోగ ధ్యానము నందుండి లింగైక్యము చెందెను.

---

1. ప్రభులింగ లీల, పుట 31

అక్కమహాదేవి గొప్ప సాహిత్య నిర్మాత. ఆమె రచించిన వచనములు వచన వాఙ్మయమునందు మిక్కిలి ఉన్నత స్థానమును పొందియున్నవి. ఆమె షట్స్థల వచనములనే గాక, సృష్టి వచనములను "యోగాంగ త్రివిధిని" (త్రిపది) మరియు అనేక పాటలను రాగ తాళ బద్ధములుగ వచించియున్నది. కొన్ని వచనములు చూతము.

1) నేల మరుగుననున్న నిక్షేపమువలె
ఫలము మరుగుననున్న రుచివలె
శిలల మరుగుననున్న హేమమువలె
తరుల మరుగుననున్న తేజమువలె
భావము మరుగున బ్రహ్మమైయున్న
చెన్న మల్లికార్జునుని ఉనికి తెలియరానిది

2) పాలయందున్న నెయ్యి కనిపించునా?
సూర్యకాంతియందున్న యగ్ని
నెవరు వేరు పరచగలరు?
అపార మహిమా, చెన్న మల్లికార్జునా!
నీవు నాయందడిగి యున్నను
నిన్ను వేరుగా జూచి, కన్ను దెరిచితినయా?

3) నా దేహము మట్టి బొమ్మ!
నా జీవము బట్టబయలు
దేనిని బట్టుదునయ్యా! నేను
నిన్నే తీరున స్మరింతునయ్యా! నేను
ఈ మాయను తప్పించుమయ్యా
చెన్న మల్లికార్జునయ్యా?

4) అ మేధ్యపు కడవ, మూత్రపు బుడిగె
ఎముకల తడక, చీముబుడ్డ
కాలిపోసి! ఈ దేహమును
ఈ ఒడలిని నమ్మి, చెడకము
చెన్న మల్లికార్జునుని తెలియని మూర్ఖుడా!

5) లోకపు చేష్టలకు రవి బీజమైనటులు
కరణాదుల చేష్టలకు మనసే బీజము
నాకు గలదొక మనసు
ఆ మనసు నీయందు లీనమైనచో
నాకిక భవమున్నదా? చెన్న మల్లికార్జునా!

6) చిలిమిలి చిలిమిలి యని
పలికెడు చిలుకలారా!
మీరు కంటిరే మీరు కంటిరే!
కంఠమెత్తి కూయుచున్న కోయిలలారా!
మీరు కంటిరే మీరు కంటిరే!
మధుమని తిరిగెడు, భ్రమరములారా!
మీరు కంటిరే మీరు కంటిరే!
గిరిగహ్వరములయం దాడెడు నెమలులారా!
మీరు కంటిరే మీరు కంటిరే
కొలనులందీదెడు కలహంసలారా!
మీరు కంటిరే మీరు కంటిరే!
చెన్న మల్లికార్జును డెచ్చట
నున్నడని మీరు తెలుపరె, మీరు తెలుపరె!

7) [1]భ్రమర సమూహమా, మామిడి వనమా
నిండు వెన్నెలా ఓ కోకిలా
మిమ్మెల్లర నేనొకటి వేడెద
నా యొడయడు చెన్నమల్లికార్జునదేవుని
మీరు చూచిన పిలిచి చూపుదురూ!

8) అంగ సంగముందు లింగ సంగి నైతిని
లింగ సంగమందు అంగ సంగి నైతిని
ఉభయ సంగముల నరయక

[1] అక్కమహాదేవి వచనములు-శివశ్రీ రెకళిగె మఠము వీరయ్యగారు.

పరిణామి నైతిని
నుడిగడణము మరిచి
గురుతు తెలియకుంటిని
నాదేవుడు చెన్నమల్లికార్జుని యందు
కూడిన పిదప
నన్ను నేనేమని తెలియదు నయ్యా!

9) మనమంతయు కల్పతరులు
తరులన్నియు జీవగఱ్ఱలు
శిలలన్నియు స్పర్శవేదులు
వేలయంతయు అవిముక్తక్షేత్రము
జలమంతయు నిర్ఝరామృతము
మృగము లన్నియు కామధేనువులు
గులుకరాళ్ళన్నియు చింతామణులు
చెన్నమల్లికార్జునయ్య మెచ్చి నగిరిని
చుట్టి, చూచి, వచ్చి
కదళి వనమును గంటిని నేను.

10) కదళి యనునది తనువు, కదళి యనునది మనము
కదళి యనునది విషయ సంకులము
కదళి యనునది భవఘోరారణ్యము
ఈ కదళి దాటి బ్రదికి వచ్చి
కదళీ వనమందు భవహరుని గంటిని
భవమును గెలిచి వచ్చిన 'పుత్రీ' రమ్మనుచు పిలిచి
బిగికౌగిట చేర్చుకొనగ
చెన్నమల్లికార్జునుని హృదయ
కమలమందు నిండుకొంటిని.

ఇఁక బసవని వచనములు కూడ కొన్ని పరిశీలింతము.

[1]భక్తిరస ప్రధానములగు బసవని వచనములయందు ఆలంబన విభావము శివుడు. లేదా శివశరణులు. ఉద్దీపన విభావము పురాతన భక్తులను స్మరించుట, విభూతి రుద్రాక్షల ధరించుట, పంచాక్షరి జపించుట, స్తంభాదులు నేత్ర విక్రియాదులు అనుభావములు, ధృతి నిర్వేదాదులు వ్యభిచారి భావము లు పతి వచనమునను సంగమ దేవుని స్మరించుటచే సామాన్యముగ ఆ దేవుడే లేక అతని భక్తులో ఆలంబన విభావ మనవచ్చును, భావ ఖండికలగుటచే పతి వచనమునను రసోత్పత్తి జరుగదు. బసవని నాయకుడెట్టివాడో చూతము.

> "పౌను చెప్పులు తొడిగినవాడు మిన్నుముట్టు కెంజడలవాడు,
> మేనిపై బూది నలమినవాడు, చేత కపాలము బట్టినవాడు।
> అర్ధనారియైనవాడు బాణుని వాకిలి కాయువాడు।
> చేసిన పూజలు చేకొనువాడు వాదేనయ్యా నాసంగయ్య"
>
> (వ. సం. 502)

సాత్త్విక భావములే స్తంభాదులు. ఇవి స్తంభము, స్వేదము, రోమాంచము, వేపధువు, వైవర్ణ్యము, అశ్రువు, ప్రళయము అని యెనిమిది. సత్త్వముచే కల్గెడి వికారములు సాత్త్వికములు. భక్తిరస ప్రతిపాదకులైన రూపగోస్వామి, బోప దేవుడు, మధుసూదన సరస్వతి యీ ముప్పురును భక్తుల యందు వీనిని అను భావములుగా చెప్పిరి. ఈ యనుభావములనే బసవన భక్తిలో మనము చూడ వచ్చును.

> "మాటి మాటికి మహాదేవుని మనసార చూచి చూచి
> బాష్పజలములు కన్నుల మొరవలై పోయె
> పుత్తడి బొమ్మవలె పులకరించిన మేన
> వడగండ్ల రూపువలె చెమట బిందువు లొప్పె
> స్వామి దర్శనస్పర్శచే స్వాంత మలరి
> కూడుకొనుచున్న సంభ్రమ మేమందునయ్యా"
>
> (వ. సం. 493)

---

1 బసవ వచనాలు-డా॥ బడాల రామయ్య గారు.

బాష్ప జలము; చెమట బిందువులే కాక యిట సంభ్రమముగలదు. భక్తి పారవశ్యమున బసవని నేత్ర విక్రియాదులు రోమాంచముల నీ క్రింది వచనమున చూడవచ్చును.

"నీ చూపు లనంతసుఖము నీకూటమి పరమ సుఖము
మూడున్నర కోటిరోమములు కన్నులై చూచె సంగా !
నిను జూచిచూచి మనసున రతిపుట్టు మేనెల్ల కళలుబ్బె"

(వ. సం. 491)

ఈ ప్రపంచమునే కాదు, బసవన తన్ను తానే మరిచిపోయెనట.

"దినమేదో ! వారమేదో ! తెలియనయ్యా !
పగలేదో ! రాత్రియేదో ! ఏది తెలియనయ్యా
నిన్ను పూజించి నన్ను నేనే తెలియనయ్యా!
కూడల సంగమ దేవా !"

ఈ యనుభావమును ఆలంకారికులే కాక బసవనయు నొక చోట చెప్పెను.

"మనసు మనసున చేర తనువు తరుగకున్న స్పర్శలో పులకలు
పుట్టకున్న
చూపులో అశ్రుజలములు రాలకున్న పల్కులో గద్గద
స్వనము కలుగకున్న
ఈ భక్తి చిహ్నాలు నాయెడ లేకున్న దేవా డాంబికుడ
నయ్యా ! నేను"

(వ. సం. 378)

*బసవని వచనములందు విప్రలంబ శృంగారమే యెక్కువగా కలదని డా॥ బడాల రామయ్య గారు పేర్కొనిరి. బసవడు నాయిక. శివుడు, శివ సాక్షాత్కారమునకై యాతడు నిరంతరము బాధపడు చుండెను. ఈ వియోగాగ్నిలో పక్వమై గుబాళించిన బసవని వచనములు సాహితీలోకమునే కాదు,

---

*బసవన వచనాలు - డా॥ బడాల రామయ్య గారు

ప్రతి హృదయమును పట్టిపిండుచున్నవి. ఈ వచనములచే నాతడు శాశ్వ తుడైపోయెను. అభిసారికయై బసవన యొకసారి కనబడును. "'మదన వశం వదయై యెవతె కాంతుని తనకడకు రప్పించుకొనునో లేక తానే యతని కడకు పోవునో ఆ నాయికను అభిసారికయని పండితులు పేర్కొనిరి"(సా.ద.తృతీయ పరిపుట48)తన ప్రియుడగు సంగయ్యను రమ్మని చెలితో చెప్పి పంపుచున్నాడు·

''ముందు తెలియక కోపించి యేమో అంటినమ్మా !
చూడవే మది మెచ్చ వెర్రినై పోతినమ్మా
విను వినుమమ్మా సఖుని విడచి సుఖ మానింపగల్గునే ?
నా కోపము నాలో చల్లబడె, ఇక రమ్మనవే సంగయ్యను"

(వ. సం. 520)

వాసకసజ్జికయై బసవన యొకసారి కనపడును. శివుని రాకకై అతడు వేయి కన్నులతో నిరీక్షించును.

"చిలుకను పంజరమునందిడి దీపమునకు నూనె వోసి
వత్తి నొత్తి ఎదురెదురు చూచుచుంటినమ్మా !
ఎండుటాకులు గలగలమున బయల చూచితి !
ఎడబాటు కల్గునోయని యెదదిగులయ్యెనమ్మా :
శరణులువచ్చి వాకిట నిల్చి శివా ! యన
మదికి తృప్తి కలుగునమ్మా"

ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణమున వాసక సజ్జికను గూర్చి

''ధవుడు వచ్చెడి వేళ దనువును గృహము
సవరించు వాసకసజ్జిక ప్రీతి"

అని చెప్పబడినది (ఆం. ప్ర. రు. య. భూ. పుట 33 అనువాదకులు చలమచర్ల రంగాచార్యులు, హైదరాబాదు, 1961).

•ఇట శివుడే బసవనకు ప్రియుడు, అతడే ఆలంబన విభావము. బస వడు శివుని రాకకై ఎదురు చూచుచున్నాడు. ఆకులు గల గల మన్న వచ్చె

• బసవ వచనాలు-డా॥ బడాల రామయ్య గారు, పుట 343

నేమోయని బయలుచూచుట, ఎడబాటు కల్గునో యని దిగులుపడుట వాసక సజ్జికా నిరీక్షణలోని ఉద్వేగము బసవనిలో కనపడుచున్నది. నాయికగానున్న బసవనయందు కోర్కెలు రేప ఎండుటాకులు గలగల మనుట, శివ భక్తుల యాగమనము, శివా యన్న మాట నాలించుట యీ చేష్టలన్నియు ఉద్దీపన విభావములు. చిలుకను పంజరమున పెట్టుట, దీపమునకు నూనెపోసి వత్తి నొత్తుట బయ లాలకించుట, నాయిక చేష్టల దెల్పుటచే అనుభావములు, ఎడబాటు కల్గునోయని భయపడుటచే వ్యభిచారి భావము. ఈ విప్రలంభ శృంగారమున జీవాత్మ పరమాత్మల సంబంధము ధ్వనించుచున్నది. జీవుడగు బసవన యిట నాయిక. ఇచ్చటి స్థాయి భావము దేవతా రతి. రతి శృంగార రసమునకు స్థాయి. అది శారీరక సంయోగముతో తృప్తిపడును. ఈ దేవతా రతి శివైక ముతో గాని తృప్తిపడదు. ఇట శారీరక సంయోగ ముండదు. కనుకనే యిది దేవతా రతి. దీనిని బోపదేవుడు, రూపగోస్వామి మధుసూదనసరస్వతి అంగీకరించిరి. సామాన్య శృంగారమున వాసకసజ్జిక దీపమును పెట్టుట చిలుకను పంజరమునకు చేర్చుట, పడకటింటి నలంకరించుట సహజమే. కాని దేవతా రతిలోని వాసకసజ్జికయగు బసవన చిలుకను పంజరములో పెట్టె ననగా మనస్సును శరీరమును వదిల పఱచెను. ఏకాగ్ర మనస్కుడయ్యెనని భావము. దీపమునకు నూనెపోసి వత్తి నొత్తుట ఆత్మను సత్వమున ప్రదీపింప జేయుటను సూచించును. ఇది వస్తు ధ్వని. భక్తిలోని విప్రలంబ శృంగారమున కీవచనము చక్కని నిదర్శనము.

[1] ఎండుటాకులు గల గల మనుటలో పండిన శరీరము రాలిపోవుట ధ్వనించు చున్నది. ఈ శరీరము నశించినప్పుడే నిర్గుణ స్వరూపుడగు శివుని చేరుకొనవచ్చును. ఆకాలము ప్రాప్తించుచున్నది. ''బయలు'' అనగ వీర శైవమున ముక్తి శరీరము పడిపోవ ఆత్మ బయలున చేరుననగా ముక్తిని పొంద వచ్చునని ఆశపడుచున్నాడు. ఒకవేళ ఆశనిరాశయై ముక్తిని పొందక మరల జన్మాంతరములు ప్రాప్తించి శివునకు దూరము కాగల నేమో యను భయము కూడ బసవనిలో కనబడు చున్నది. ఆభయము తొలగునట్లు శివశరణుని వచ్చి నాకు సమర ప్రాప్తిని సూచింప 'శివా' అను నొక్క మాట పల్కినచో

1 బసవ వచనాలు-డా॥ బడాల రామయ్య గారు (పుట 394)

నామనస్సు తృప్తి పడుననుచున్నాడు. ఇది వస్తుధ్వని. ఈ వచన మంతయు శివునిలో చేరిపోవు జీవునియవస్థను ధ్వనింప జేయుచున్నది. విప్రలంభ శృంగారములో వాసక సజ్జిక అభిలాష స్థాయి యందున్నది. బసవన కూడ ఈ స్థాయియందే యున్నాడు. జీవాత్మ పరమాత్మ సంయోగము ప్రేయసీ ప్రియుల సమాగమమును సూచించు విప్రలంభ శృంగారము. భక్తి రసము 'చక్కగానిట అంతర్లీనమై పోయినది. ఇదే మధుర భక్తి. విరహోత్కంఠితయైన నాయికగ బసవన మరియొకసారి కనపడును (వ. సం. 370)

అనుభావమనునది యెట్టిదో యను దానిని కూడ బసవనయే కొన్ని వచనముల యందు చెప్పెను. 855వ వచనమున "ఆత్మస్తుతి, పరనిందలు కల వారికి అనుభావ మెక్కడిదో" అనగా అహంకారియైన వానికి అనుభావమలవడదని యర్థము. శరణుల అనుభావము భవబాధితులకు కర్మ పరులకు తెలియదని 856, 857వ వచనములందు దెల్పెను. "నీయనుభావముచే నాపుట్టువే చెడె" (వ. సం. 840) నని బసవన చెప్పెను. శివానుభవమునే జీవన్ముక్తుడగునని తెలియుచున్నది. జీవన్ముక్తికి కారణమైన సాహిత్యమే యీయనుభవ సాహిత్య మన వచ్చును. అనుభవ మనగా నెట్టిదో విపులముగా —

> "అనుభావమన్నది అవని చాటునగల నిధియని తెలియుడో
> అనుభావమన్నది అంతరంగపు రత్నమని తెలియుడో
> అనుభావమన్నది పసిపాప కన్నకలయని తెలియుడో
> అనుభావమన్నది రచ్చపైకూర్చొని ఆడుఉబుసుపోక మాటలగునే
> అనుభావమన్నది సంతపుట్టిన సుద్దియగునే ?
> అనుభావమన్నది నడువీధి చాటుకొనిపోవు చాటువే ?
> ఏమందు నేమందు నామహాఘనతను ?
> ముంతలో చిక్కునేకరి ? దర్పణమున గాక
> చూచినకడ నిచ్చినకడ పల్కినయెడ పట్టుపడునే
> అనుభావము"
> (వ. 1055)

బసవని పై వచనముల బట్టి యనుభావమన్నది యెంత కష్టతర సాధ్యమో తెలియగలదు. అవని చాటున గలద నిధి అంతరంగపు రత్నమనుటచే అనుభావము అవ్యక్తము అని తేలినది. అంతేకాదు "వసి పాప కన్నకల"యను టచే అది యెంతటి యనిర్వచనీయమో స్నిగ్ధమో ముగ్ధమో వ్యక్తము కాగలదు. ఈ దివ్యానుభూతి కలవాడు కనుకనే బసవవన సంఘములోని విపరీత ఘటనల కూడ దివ్యముగా చూడగల్గెను.

"దొంగలు ఆవులు కొనిపోయిరని కూత లిడబోకుడో!
దయచేసి వెతకకుడో! దయచేసి వెతకకుడో!
అటతిన్నా సంగడే యిటతిన్నా సంగడే!
ఏకో భావి మాకూడల సంగమ దేవుడు"

(వ. సం. 827)

ఈ యద్వైత సిద్ధి యెందరికి లభించును? ఇంతటి ఉదార ప్రకృతి కలవాడు కనుకనే స్వర్గ నరకములు, జాతి విజాతులు, సుఖ దుఃఖములు అన నేవియో యిచటనే చూపును.

"అయ్యా! యనగా స్వర్గము ఓరీ! యనగా నరకము"

(వ. సం. 249)

"సత్యము పలుకుటే దేవలోకము మిథ్యను పల్కుటే
మర్త్యలోకము ఆచారమే స్వర్గము అనాచారమే నరకము"

(వ. సం. 239)

"పాడుచు వాడే మాదిగ పొలసు తినువాడే మాల"

(వ. సం. 591)

ఎటనో యున్న ద్వంద్వముల నీ సంఘమున చూపుటయే కాదు. తరించెడి మార్గమును బసవ యెత్తి చూపించెను. ఈ మహాత్ముడు భక్తుడై సంఘమునకు దూరము కాలేదు. సంఘములోని నరకమును దీనికి తగిన శిక్షను చెప్పెను. చెప్పెడి రీతియే విలక్షణముగా నుండును.

"అంకునకు బోవ దొంగ నాణ్యము చిక్కె
పాడు గోడల బడి నడువ తేలుకుట్టె

కూతవిని తలారి కట్టిన కోక పెరికె
సిగ్గున నిల్లుచేర మగడు పీపు విరుగగొట్టె (వ.సం. 111)

ఒక మగనాలు అంకునకు పోయినది. అంకుచే దానికి దొంగ నాణ్యము చిక్కినది. ఆ నాణ్యమీ లోకమున చెల్లదు. దానిచే సుఖము లేకపోవుటయేకాదు, నెత్తి పైబడు కష్ట పరంపరల చూపుచున్నాడు. సందుగొందుల బడిపోవుచున్నది. అంకులాడికి రాచ మార్గము లేదు. అందులో రాత్రి - పాడుగోడలు, అచ్చట తేలు కుట్టినది. దానిచే కెవ్వున కేక వేసినది. దాని ఆకేక విని తలారి పరుగుతో వచ్చి కట్టుకొన్న ఆ కోకను లాగి వేసెను. చీరను చేరిన తేలు మఱి యెక్కడ కుట్టునోయని తలారి చీరను పెరికి వేసెను. ఈ చీకటిలో అంకులాడి సిగ్గున క్రుగ్గిపోయెను. ఇప్పుడా తేలు విషము మనసుకే ప్రాకినది. ఇంటికి వచ్చిన యాదిగంబరురాలను జూచి మగడు చావ గొట్టెను. మగడు ఎవ్వరో కాదు. మన బసవని ఆరాధ్య దైవమగు సంగమేశ్వరుడే. బసవని రాజ్యములో శిక్ష యెంత సహజమో తెలియుచున్నది. మగనాలి అంకు, పాడు గోడల తేలు, తలారి చర్య, మగని శిక్ష, ఒకదాని వెనుక నొకటి సహజముగా నేర్పడిన ఘటనలు. ఈ సహజతలో దివ్యతను అడుగడుగున ధ్వనింపజేయుచున్నాడు. రాజ శిక్షకు మించిన శిక్ష బసవన చక్కగా చిత్రించెను. ఇట ఇంతింతయని విలువ కట్టుటకు వీలుకాని బసవని లోకజ్ఞత, కవితా శక్తి, "యీ దొంగ నాణ్యము"ను మీటుటలో ధ్వనించుచున్నది. నాటి సమాజము తెలియుచున్నది.

బసవన ఉపనిషత్తులలోని జ్ఞాన మార్గము ననుసరించిన ఏక దేవో పాసకుడు, ఆగమ ప్రోక్తమగు శైవ మీతనికి శరణ్యమైయుండెను. శివాధిక్యమును ప్రతిపాదించెను. భక్తియే యితనికి మతము. వర్ణాశ్రమ ధర్మముల పాటింపడు. ఏకత్వమున బహుత్వమును చూచును. పలికినట్టుల ప్రవర్తించు ఋజు వర్తనుడు అనుభావి.

"భక్తి సుభాషను పలికెది, పలికినట్టు నడచెది,
నడతలో పల్కు చెల్లించెది". (వ.సం. 441)

* నా నడనుడులు తప్పిన ఛెన్న బసవడే సాక్షి" (వ.సం. 717) పై వచనములచే నాతడు త్రికరణ శుద్ధి కలవాడని తెలియును. ఆరణ్యకోపనిషత్తులోని

* బసవ వచనాలు - డా॥ బడాల రామయ్య.

అహింసయే బుద్ధ దేవుని మతమునకు జీవము. బసవని యందును జీవకారుణ్య మున్నది.

"దయలేని ధర్మమది యెట్టిదయ్యా?
దయయే ధర్మమునకు మూల"మనును.

యాగాది కర్మల నితడు నిరసించెను. నోరులేని అమాయక ప్రాణుల హింసింపరాదని-

"పండుగకు బట్టిన బలి పశువు
తోరణమునకు తెచ్చు తలిరుల మేసె.
చంపెద రనుటయే తెలియక
మందు పొట్టను మనుపబోయరె కాని
అది అపుడే పుట్టి అపుడే చచ్చె
చంపిన వారు మాత్రము నిలచిరే" (వ.సం. 129)

బసవన వేదనతో చెప్పెను. 572, 248, 711, 573 మున్నగు వచనముల యందట్టి భావములనే చూడ వచ్చును. వీరశైవము గణాచారమును గూర్చి చెప్పెను. శివభక్తుడు కాని వానిని చంపుటయే శివ భక్తుల ధర్మము. ఒక వేళ భవులను చంప శక్తి లేనిచో శివ భక్తుడా ప్రదేశమును త్యజింపవలెను, లేదా భవుల నెదిరించుచు తానే మరణింపవలెను. ఏకదేవోపాసకులగు వీరశైవులీ ధర్మమును పాటింతురు. లేనిచో మనస్సు నిశ్చలము కాదు. లక్ష్యమును ముట్ట జాలరు కాని యిది సాధకులకు మాత్రమే సిద్ధి యందున్న వానికి ఈ మార్గ మనవసరము. బసవడు సిద్ధ పురుషుడే కాని సాధకుడు కాడు. శివేతరులైన భవులను చూచినపుడు బసవన ఆగ్రహించుట సత్యమే.

సంఘములో రాజులు, సేవకులు, సంపన్నులు, దరిద్రులు కలరు. తాను బిజ్జలుని భటుడై సేవించుచుండెను. తన సేవలో లోపము లేదు కాని తాను రాజునకు భయపడడట. ఇట ఒక వచనములో బసవన చెప్పెను.

"ఏనుగంకుశమునకు వెఱచునే అయ్యా!
మానక సింహము గోళ్ళని వెఱచు గాని

నేసీ బిజ్జలునకు వెఱతునే అయ్యా! సంగయ్యా!
సర్వజీవ దయామయుడగుటచే నీకు వెఱతునయ్యా

(వ.సం. 735)

బసవన బిజ్జలునకు భయపడడు. సకల ప్రాణకోటిపై గల శివానుగ్రహమునకు మాత్రమే భయపడునట. అనగా శివుని ప్రసాద దత్తమైన బిజ్జలునిలో గల రాజ్యాధికారమునకు భయపడుచున్నాడని భావము. లోకమున ఉచ్చనీచములు పరమేశ్వరానుగ్రహముచే ప్రాప్తించును. సేవ్యసేవక భావములను భగవంతుడు విధించిన ధర్మముగా భావించి ఆత్మ వంచన లేక పాటు పడవలెనని చెప్పెను. (వ.సం. 691) సోమరి పోతులన్న అతనికి గిట్టదు. దేవుడిచ్చిన దేహముతో జంగమ స్వరూపమగు లోకమునకు సేవ చేయవలెను. 266వ వచనమున "కుంపటి కడకూర్చొని పగటి కలలు కనువారిని ఒల్లడయ్యా సంగమ దేవుడు" అనును. తను మన ధనముల గురులింగ జంగమ సేవకు వినియోగింపవలెనని మాటిమాటికి చెప్పును. చెప్పి నట్టులే తాను కూడ నడచుకొనును. 432వ వచనమున

"బడుగైతినయ్యా నాతను మన ధనముల
వేడు వారు లేక వేడెడి లేచెడి శరణుల దెచ్చి
వేధింపుమా యాచింపుమా"

యని శివుని ప్రార్థించును. అంతే కాదు-

"లేదనుట కంటె మరణించుటే మేలు
యాచకుని చూచి సైరింపదగదు.
ఇయ్యలేని వాని జీవిత మేటికో" (వ.సం. 439)

అని చెప్పెను. బసవనకు భోగ భాగ్యములపై ఆశ లేదు.

"పైడి యందొకరవ, పట్టునందొక పోగు
నేటికి నాటికి నే గోరినట్లైన నీ సాక్షి" (వ.సం 436)

కుల జాత్యభిమానములకు దూరమై బసవన "నన్ను పొరుడనగ సంగయ్య నవ్వునయ్యా" (వ.సం. 844) అనును. మరి యొక సారి "కష్టజాతి కులములో పుట్టితి ఇది విధియే నాకు" (వ.సం. 842) "ఉత్తమ కులమున పుట్టితినను కష్ట

తనము నాపై మోపకయ్యా" (వ.సం. 343) అని దేవుని ప్రార్థించును. ఒక సారి తన జన్మ ప్రసక్తిరాగా అతడు మండిపడి

"చెన్నయ్య యింటి దాసీ పుత్రుడు
కక్కయ్య యింటి దాది కూతురు
ఈ యిరువురు పిడకలేర చేనికి పోయి
చేరి పోవ నా యిద్దరికి పుట్టిన బిడ్డ నేను" (వ.సం 345)

అని ప్రత్యుత్తరమిచ్చును. దీనిచే వర్ణాశ్రమ ధర్మములు నాడెంత ప్రబలమై యుండెనో వాని నెదిరింప బసవన యెంత శ్రమించెనో తెలియగలదు. గుణ కర్మములచే కులములు కలవని అతడు కూడ సమ్మతించును. కాని ఆకులములు కేవలము జన్మచే నేర్పడు ననుటకు అతడు సమ్మతింపడు. "వేదము చదివి బ్రాహ్మణుడయ్యే, కాచి కమ్మరి యయ్యె, ఉతికి చాకలియయ్యె" (వ.సం 591) "పొడుచు వాడే మాదిగ పొలసు తినువాడె మాల" (వ.సం. 591) అని కుల ముల పేర్కొనును. పుట్టుకచే కులము నిర్ణయింపరాదనుటకు - "వ్యాసుడు బోయత కొడుకు, మార్కండేయుడు మాతంగి కొడుకు, కులము నెంచకుడౌ కులమున మున్నేమైనదయ్యా? (వ.సం. 589) అని ప్రశ్నించును. లోకమున ఏ వృత్తియైన పరిగ్రాహ్యమే. వృత్తియందుచ్చ నీచములు లేవు. గురు కైంక ర్యమునకు ఏ వృత్తినైనను చేపట్ట వచ్చును. 708వ వచనమున

"వ్యవసాయము సేతునయ్యా గురు కైంకర్యమునకు
వ్యవహారము సేతునయ్యా లింగార్చనకు
పరుల కూడిగ మొనరింతు జంగమ దాసోఽహమునకు
ఏయే కర్మల ఏయే గతి చేసినా ఆయా
కర్మఫల భోగముల విధిగా నీవయత్తు వనుచు నే నెఱిగితి"

నని చెప్పును. కర్మ అవసరమే, అది యే కర్మయైనను చింత లేదు. కర్మఫల మీశ్వరార్పణ మొనరింపవలయునని బసవన ప్రాచీనుల తత్వమునే మరల స్మరింపజేయును. మార్గము కాక లక్ష్యమునే ప్రధానముగా గ్రహింపవలెనని భావము. అతడెంత నిగ్రహ సంపన్నుడో ఆతని వచనములు బట్టియే చెప్ప వచ్చును.

"చూచిన కడనెల్లానా మన సీడ్చెనా
అనః సీయానః నీ ప్రమథులయాన
పరవధువును మహాదేవియందు" (వ.సం 446)

మరియొక వచనమున-

"పరికింపకు, పలుకరింపకు, పర స్త్రీల చేరకురా"
(వ. సం. 541)

అని హెచ్చరించును.

"పై బడు పాముకు వెఱువ, మందు మంటలకు వెఱువ
కత్తి మొనకు వెఱువ వెఱచెద నొకటికి
పరస్త్రీ పరధనమను వ్యసనమునకు వెఱతు
మును వెఱువక రావణుడే గతి పట్టె" (వ.సం 447)

అని బసవన పరస్త్రీ సంపర్కమునకు భయపడును. ఇక ఆతని వైరాగ్య ప్రవృత్తి జంగమ భక్తి తలంచినచో గుండెలావశించును.

"అర్థ మనర్థమై కోలాహలముగానీ
పుట్టిన బిడ్డలు నవ ఖండములుగా ఖండింపబడనీ,
కట్టుకొన్న కాంతను కంటి ముందె మానభంగము సేయనీ,
దేహంబు పైబడి తుత్తునియలు గావింపనీః
శూలమునకు నన్నె త్తనీ,
లింగారాధన సేసెద, జంగమారాధన సేతు
ప్రసాదమునకు తప్పనయ్యాః
నాయీ బాస లేశంబు తప్పిన
కోయు మా ముక్కు కూడల సంగమదేవా" (వ.సం 705)

యనును. అనుటయే కాదు. అనినట్లు విషమ పరీక్షలయందును బసవన నెగ్గెను. కనుకనే ఆతని జీవితము ఆదర్శమైనది. ఆతని జీవిత మెంత పరిశుద్ధమో ఆతని వాక్కులంత దివ్యములు. అందులకే ఆ వచనములు ఉపనిషత్తులైనవి.

బసవ పురాణములో ఏడు ఆశ్వాసములు గలవు. అందు బసవని జీవిత చరిత్రతో పాటు పాల్కురికి సోమనాథుడు శివ మహిమలు తెలుపు కథలనేకము

చెప్పినాడు. బసవడు, మాదమాంబ, మండంగి మాద రాజులకు పుట్టు వృత్తాంతమునంతయు మొదటి ఆశ్వాసములో వర్ణించినాడు. బసవని భక్తి, ఉపనయనము నిరాకరించుట ఇత్యాది విషయములు. కూడల సంగమ క్షేత్రమునకేగుట, బిజ్జలు నొద్ద మంత్రి పదవికి కుదురుట, పలువురు భక్తులకాశ్రయమిచ్చుట, మొదలగు విషయములే కాక మిగిలిన భక్తులు వీరశైవ మతమవలంబించి శివభక్తికి పాత్రులెట్లులైరో తెలిపినాడు. జొన్నల రాశి ముత్యములగుట, వంకాయలు లింగకాయలగుట మున్నగు వింతలు ద్వితీయాశ్వాసములో గలవు. ఇవికాక పెక్కు కథలుగలవు, మచ్చున కొకటి రెండు కథలనిందు పేర్కొందును. తృతీయాశ్వాసములో ముగ్ధ సంగయ కథ,

సంధ్యా రాగ సమయమున శివ భక్తులు శివార్చనలు చేయుచున్న సమయమున బసవన మంత్రియు దన శివ పూజ కుద్యుక్తుడై యేగు నవసరంబున గొందఱు తృతీయ పురుషార్థ పరులగు జంగమ విటులు దమ శివ పూజలు దమతమ భోగవనితల ఇండ్ల దీర్చుకొనువారై వలయు గంధ కుసుమాది పరికరము బసవన నడిగి తీసికొని తదనుగతి నరుగుచుండిరి.

ఇట్లు విటులగు జంగములు వేశ్యల యిండ్లకు జనుటగని, ముగ్ధసంగయ యను నొక భక్తుడు కేవల లింగపరాయత్తచిత్తుడు ప్రథమ పురుషార్థ పరుడు లింగ శబ్దము తత్సంబంధ సేవా పూజా విషయక పరిభాష తప్ప తదితర శబ్దార్థమైన లెఱుంగని వాడు తన మనమున నిట్లని వితర్కించుకొనెను: పంపెడు వాడు బసవన మంత్రి, వెళ్ళెడి వారు మహాదేవ భక్తులు. తోడుగొని పోవుచున్నవి శివ పూజాద్రవ్య సంభారములు. ఈ భక్తులందఱు శివ పూజ లొనర్చుకొను స్థలము లంజ యిండ్లట. ఒక్కొక్క భక్తుని కొక్క లంజ యిల్లు విడిదిగా నేర్పరుపబడెను. వీరందఱచటికి శివ పూజార్థము పోవుచున్నారు లంజల యిండ్ల శివ పూజలు బహు నిష్ఠతో నిశ్చలత్వముతోనే ప్రతిబంధకములు లేక జరుగునేమో నేనును బసవన మంత్రి నడిగి యొక లంజ యిల్లు విడిదిగా నడిగి యచ్చటకేగి నిశ్చలముగా శివ పూజ చేసుకొనియెద" లంజ యననేమో యెఱుంగని యామహానుభావుడు బసవ దండ నాథుని కడకేగి తనకును వలయు సంభారములతో శివ పూజకై యొక లంజ యిల్లు విడిదిగా నియమింపు మని వేడెను. ఈతని యమాయకత్వమునకు, మౌగ్ధ్య భావమునకు

బసవేశ్వరుల వారు మందహాసము చేసి తగిన సాధన సామగ్రి సంభారముతో నొక యతి చతురురాలగు మనోహరాంగియను నగు వేశ్య యింటికి దోడిచ్చి పంపిరి.

ముగ్ధ సంగయ వేశ్యా శయన గృహములో శివపూజ సేయుట :-

ఆ వేశ్యయు నిట్టి పరమ భక్తాగ్రేసరుడు దనయింటికి వచ్చుచున్న వాడని ముందుగా నెఱింగినది కావున దన గృహమున ననేక శృంగారములు గావించి పచ్చనితోరణములు గట్టించి కస్తూరి కలిపిన నీట గలియంపి జల్లించి ముత్యాల ముగ్గులు పెట్టించి శయనగృహం బలంకరించి బొమ్మల పటములు పెట్టించి మణిదీపము నుంచి పందిరి మంచ మందు పట్టు పరుపును బఱపించి దానికి జుట్టునుం బూల దండలు వ్రేలించి తలగడ దిండ్లు పెట్టించి సువాసన ద్రవ్యంబులు సిద్ధపరచి లోనికి గాలు పెట్టడముతో గామోద్రేకము గలుగు నటుల సేయించి తానును బన్నీట జలకమాడి పసుపు మేన నలదికొని కుంకుమ చందనములను బూసికొని కస్తూరి తిలకం బిడి దివ్య వస్త్ర దివ్యాభరణముల ధరించి వేచి యుండి తన గృహ సమీపమునకు ముగ్ధ సంగయ్య రాగానే యెదురుగా బోయి యడుగుల కెఱంగి కై దండ యొసగి యర్ఘ్య పాద్యములచే హస్త పాద ప్రక్షాళనములు సేయించి యాతడుగొని వచ్చిన నౌకర్ల చేతి పూజా ద్రవ్యంబులం దన దాసిచే లోనికంపి శయ్యా గృహమున కాతని చేర్చునంతలో నాతం డదిగని వెఱగంది యది పరమేశ్వరు నాస్థానమని యామంచంబు హరు నాస్థాన మంటపంబని యెంచి శివ పూజకు నిది సరియగు స్థలమని మనోల్లాసం గదుర నచ్చోదన గంబళి విప్పి పరచి కూర్చుండి శివ పూజకుం దా దెచ్చిన సంభారముల నందుకొని యచ్చో నుంచుకొని విభూతి మేన ధరించుచు వేశ్యను సైత మొక భక్తునిగా భావించి స్త్రీ పురుష విచక్షణ నెఱుంగని యామహాను భావుండు నీవేల విభూతి మేన బూయవని యడుగ నామె "స్వామి! నా మేన బచ్చని బూది బూసితి నిదియే పార్వతి ధరించు విభూతి"యన దారాసుకొన్న పసుపు జూపెను. రుద్రాక్ష మాలలు దీసి తన మెడలో వైచుకొని నీవేల రుద్రాక్షలు ధరింపవని యామె నడుగ నాముగ్ధయు నతి చతురత గావున "స్వామి! యివిగో నామెడలోని రుద్రాక్షలు" అని మౌక్తిక హారములు గన పర్చి

''స్వామీ! రుద్రాక్షలు లవణ సముద్ర ప్రాంతములందుప్పు నీటిచే వృద్ధి యగు రుద్రాక్ష చెట్ల యందుత్పన్నంబులగుట వలన మీవి నల్లగా నుండును. మావి దుగ్ధ సాగర మధ్యమున బడియుండి సర్వదా పాలతో దడియుచు దాని యడుగున నిసుకలో గూరుకొని యుండు శక్తి రుద్రాక్షతలములోని గింజలగుటచే మా రుద్రాక్షలు తెల్లగా నుండు''నని తన హారములు చూపించెను.

ఇట్లు సంగయ వేయు ప్రశ్నల కెల్ల తాను మారుత్తరము లిచ్చుచు నతని మనసునకు తగు నటుల తన యార్యామతంబును బోధింప నదియు నొక శివ మతంబని యాతడనుకొని ''భక్తాగ్రేసరుడా! నీ మతంబు బహు చిత్రమైన మతము, ఈ మతమునకు గురువు లెవ్వ''రనిన నాతలోదరి స్త్రీ పురుష భేదము లేక తన్ను భక్తుడా యని పురుష వాచమున సంబోధన సేయు నాతనికి దద్భేదము తెలుపునదై యిట్లనియె ''స్వామీ! మీది శివమతము. మాది పార్వతి మతము. మా మతమున కాది గురుడు సదాశివుడె. అతని వలన పార్వతి యుపదేశమును బొంది యామె మాకెల్లఱ కుపదేశించెను. కాన మేము పార్వతీ మతస్థులము. పార్వతి యన శివుని భార్య. శివుడు పురుష వ్యక్తి. పార్వతి స్త్రీ వ్యక్తి లోకములోని భక్తులందఱు వారి స్వరూపులు. మీ వంటి పురుషు లందఱు శివ స్వరూపులు, నా వంటి స్త్రీ లందరు పార్వతి స్వరూపులు. శివ పార్వతు లిద్దఱు నేకాంగులు. అట్లనే భక్త స్త్రీ పురుషులు భక్త వనితలు నేకాంగులు. అట్లనే భక్త స్త్రీ పురుషులందఱు నేకాంగులే. బసవన మంత్రి మొదలగు **మహాపురుష** భక్తులందఱు దమతమ కొక్కొక్క యర్ధాంగి గలిగి యుందురు. దానితో వారు సమస్త సుఖము లనుభవించుచుందురు. ఇఁకమీ వంటి ప్రత్యేక స్త్రీలు లేని భక్తులకు మేము స్త్రీలుగా నర్ధాంగ మలంకరించు స్త్రీ భక్తులము. మీరు నేను ఏకాంగులమై చరింపవలెను. కాన వినుము! ఈ రాత్రి సమస్త భోగము లంగీకరించి నా మాట యంగీకరించి మీరు నాతో నేకాంగత్వమున నీ రాత్రి సుఖింపవలెనని కోరుచున్నా''ననెను. అదివిని ''యట్లనే సేతము. ముందు మన శివ పూజ కానిమ్ము. పిమ్మట నీ చెప్పిన యట్లు చూతము''అని తన శివపూజ పెట్టి యందెమ్మన నామె శివపూజ సామానందిచ్చి తన దాసీ జనంబుల నాట పాటలకై సిద్ధ పఱచి శివపూజా సమయమందు దానును వినోదంబు జరుపుచుండెను. ఇక శివ తన్మయత్వంబున నాతండు శివపూజ ముగించె. నంతటితో దెల్లవారును. సూర్యోదయంబయ్యెను. బసవేశ్వరుల త్యాగ శీలత్వము నుదార సాహ

సంబులకు వెఱగంది సిగ్గుపడి పారిపోయిన సూర్యుడు మఱల జూచు కుతూహల మున వచ్చినాడా యను నటుల సూర్యు డుదయించెను. ముగ్ధ సంగయ బస వేశ్వరు నింటికేగి పై జరిగిన వృత్తాంతమంతయు చెప్పగా బసవేశ్వరుడు మంద హాసము చేయుచు నాతనికి గొన్ని హితమార్గములు బోధించి యుచిత సత్కార ములు చేసి పంపెను. ఇట్లే శైవ నిరతి జూపు కథ లల్లుకొని పోయినాడు. చతుర్థాశ్వాసమున సిరియాలుని కథ గలదు. కాంచీపురంబున సిరియాలుడను నొక వీరశైవ భక్తుడు నిత్యము నైదుగురు జంగమయ్యలకు షడ్రసోపేతముగా భోజనము పెట్టి వారలం దృప్తులంజేసి పిమ్మట తాభుజింతునను వీరవ్రత దారణము సేసి యెడతెగక వ్రతాచరణంబు సమధిక భక్తితో జరుపుకొను చుండువాడు. అట్టి వాని భక్తిలోతు గనుగొన గుతూహలంబు గలవాడయి యొకానొక దినంబున భగవంతుడగు నంతకాంతకుండు జంగమ యతివేషం బున బొడ సూపి యాతండొనరించిన అతిథి సత్కారములందుకొని "ఓయి సిరియాల శెట్టి నిత్యము నైదుగురయ్యల కొయ్యన భోజనంబు పెట్టక నీవు భుజింపవని యొక వ్రతము బట్టితివి సంతసించితిమి. నేటికొక హాయనము నుంచి మే మొక వ్రతము గైకొంటిమి. అది మాకు సరిపెట్టువారు కనబడలేదు మాంసంబులలో నరమాంసంబు మిగుల రుచ్యంబని లోకులు వచింతురు. కనుక మాకును నరమాంస భిక్ష నొసంగిన వారి యింటనే వారిచ్చిన షడ్రసోపేత భక్ష్యభోజ్యాహారంబులు గైకొందుము గాని లేని యెడల జల పానంబు సేసి యుపవసించెదము. ఇట్టి మా కోర్కెదీర్ప సమర్థుండెక్కడనుం గానరాకుండు టచే మేమూరూర నిట్లు దిరుగుచున్నాము. నీ కట్టి సామర్థ్యము గలదేని మాకు భిక్ష పెట్టుము. కాదేని బోయివచ్చెదము" అనుటయు విని శిరియాలు శెట్టి దీనికి విచారింపబనిలేదని తనకు పంౘ్రెండేండ్ల బాలకుడు గలడు. వాని మాంస ముతో మిమ్ము సంతృప్తి పరచెదనని గృహమునకేగి భార్యకు విన్నవించగా నామె కూడ నందుల కంగీకరించి పాఠశాలయందున్న బాలుని సంగళవ్వచే పిలి పించి తలకాయ తప్ప మిగిలిన యంగములన్ని ఖండించి మషాలతో కూడి కమ్మని కూర చేసి ఇతర భక్ష్య భోజ్య లేహ్య పానీయంబులను చతుర్విధా హారము సిద్ధపరచినది. తపసి కొరకై ఏగి వారిని తీసికొనిరాగా బార్య అర్ఘ్యం బొసగి ఆశీనుని గావించి శివపూజకు అన్నియు సిద్ధము చేసినది. అంత నా మహానుభావుడు 'నాకై యెద గూర్చిన పలల పదార్థము చూప'మని అడిగెను.

అంత శిరియాళుని భార్య పాక పాత్ర తీసికొని వచ్చి ముందు పెట్టగా దానిని పరిశోధించి "దీనం దలకాయ మాంసమేది? అదియ బహురుచికరము. మాంస భుక్కులు మిక్కిలి యాశతో గటికి వాంఛ్రడమ్మెడు మేక తలలను గొనిపోవుట పట్టణములందు చూచుచుందును అది లేని ఈ మాంసము నా కేల?"యని లేచి పోవనున్న యాభిక్షకుని బ్రతిమాలి యాశిశు శిరంబు దెచ్చి కనబఱచి 'దేవరా యిది కేశ సంకలితము. కేశ దూషితంబగు నరమాంసాహారంబు దొల్లి యగ స్త్యున కొక ముని పెట్టి యాతనిచే శపింపబడి నపరాధుండయ్యె. ఈ క్షణమునే యీతల వండించి తెచ్చెద నను నంతలో నాతని సతియు నతి శీఘ్రంబున వండి తెచ్చెను. అంత నక్కపట నిటల తల నయనుండు మరియొక ఉపా యంబు పన్నెను. "శెట్టి! నీవును నీకు దగిన అర్ధాంగియు నాయెడల గన పఱచు చుండిన దృఢ భక్తికిని మీర లతి వేగంబున సమకూర్చు పదార్థంబుల కును నామనం బతికుతూహల కలితంబైనది, కాని యింకొక పని గావలెను. అది యేది యనిన నీకుడి ప్రక్క నేనును నాయెడమ ప్రక్క నీవును గూర్చుండి నీ యంగన యగు తిరువెంగళాది వడ్డింప యిష్టాగోష్టి సల్లాపంబులు సలుపుచు రుచులుగ్గడించుచు దృప్తికరముగ భుజింపవలెను. ఇట్లయిన నాకు భోజనము పెట్టుము. కాదేని మేము పోయి వచ్చెదము. నీ క్షణంబు నీవ గొనుము" అని మఱల లేవ బోయెడు నా జంగమునికి బదులు చెప్ప నోరు రాక వికవికలాడు మగనిం గని యాతనింజేరి "యేల చింతించెదరు? మన చేతులతో మనము చంపుకొన్న తనయుని మాంసము భుజించుట మాత్రము తప్పగునా? జంతు వధ చేయువారికి, దజ్జంతు మాంసము తాము భుజించిన జంపిన దోషము లేదని పెద్దలు చెప్పుదురు. కనక నిక నెంత మాత్రము మనంబున గొంకక నిశ్శంకతో నాతని యండ గూర్చుండి భుజింపు'డని యిద్దరికి బ్రత్యేకాసనంబులు బెట్టించి రజత పాత్రంబుల నమర్చి సుతు మాంస సహితంబుగా సమస్త పదార్థంబులు వడ్డించి 'యారగించు'డన నక్కపట కాలకంధరుండు తన మనంబున ఘనం బుగ మెచ్చుకొని "ఈతడు దేనికిని వెనుదీయలేదు. ఇఁక నా చేత వంచితుడు గాడు. వీని కన్న వీని భార్య సాహసం బెక్కుడుగనున్నది. "సాహసం షడ్గు ణం బైవ"యను నటుల స్త్రీకున్న మనోనిబిడత్వము పురుషుల కుండదు గదా?"యని తలపోసి మఱియు నాతని కిట్లనియె "ఓయి శెట్టి! యింట

నన్నియు సమకూడినవి. మన భోజనమె తరువాయి. కాని యింకొక గొప్ప లోపము గలదు. దానింగూడ దీర్చెదవేని నే సుఖముగ నీతోడ విందారగించి యదేచ్ఛం బోదును. లోకమున నెవ్వరేని దమయింట నొకరికి విందొనరించి నపుడు దన పుత్ర మిత్ర కళత్ర దాస దాసీజనములతో నానందింప వలెను గదా. నీకున్న కుమారునిం బిలువుము. వారలతో నారగింతు మనుటయు, సిరియాలు కన్నీరు గ్రుమ్మరుచుండ దీన స్వరంబున తన స్థితిని మహేశున కెఱింగింపగా అందులకు దొంగ జంగమ దేవర కోపించిన వానివలె మహోద్రేక ముగా "ఛీ! నీవపుత్రకుండవు" 'అ పుత్రస్య గతిర్నాస్తి'యని శ్రుతులు ఘోషించెడి. నీయట్టి గతిమాలినవాని యింట భుజించుట కన్న నేటికి బస్తుండుటమేలు" అని విసుకుకొని మునికి మాఱుమాట చెప్పలేక కోమటి పిఱికి మనసున నూరకుండెను. అంత జంగముడు శెట్టి భార్యను జేరి "తిరు వెంగళాంబా! నీ మగని కెంత చెప్పినను వినడయ్యెను. నీవైన నామాట మన్నించి నీ చిన్ని కొమరిని బేరువెట్టి పిలువుము. తల్లి పిలిచిన రాని బిడ్డ డుండడు." అని యానతిచ్చు నతనికి మ్రొక్కి మహా ప్రసాదంబున తిరు వేంగళాది యిట్లని నలుదిక్కుల దిరిగి కొడుకును పలువిధముల ఎలుగెత్తి పిలిచినది. అంత నబ్బాలుండు పరుగెత్తుకొని వచ్చి తల్లింగాంచి దండంబు వెట్టుటయు, నాసిరాలుండును తల్లియు, దండ్రియు గలుసుకొని నిజపరి వారముతో, దపసికడకుం బోవ సమకట్టి యేగుసరికి నట నాపినాకి యదృ శ్యుండై తక్షణమ చూచువారలు వెరుగంద రుద్రాక్ష జటామకుటంబుతో నాగ శిఖా పాశంబుతో నాకాశ గంగా ప్రవాహ సంకలిత జటా జూటంబుతో వామార్ధ దేహాలంకృత శ్యామా దేవితో గజచర్మ పరిధానంబుతో బ్రహ్మ విష్ణు రుద్రగణ ప్రమథగణ వీరభద్రాది కుమార వర్గంబుతో శూల వజ్ర ఖడ్గ పర శ్వాధాద్యాయు ద్యాలకరిష్ణుండగుచు వృషభ వాహనారూఢుండై నిరూఢ భక్త పరిపాల దక్షుడగు కటాక్ష నిరీక్షణంబుతో బ్రత్యక్షంబై తన యెదుట కెత్తం బడిన ముకుళిత హస్తంబులతో నిలువంబడి యున్న సిరియాలును దత్ పుత్రీ పుత్రులం గాంచి యభినందించి తత్పరిజనంబులనె గాక సమస్త పుర జనం బునకుం గళేబరంబులతో గొంపోయి యట నిజ ప్రమథ గణంబులతో గలపు కొని సుఖస్థితి నుంచెను. ఇట్లు భద్ర రథుండగు నారుద్రుండు కాంచీ పురం బునం గల సకల జీవులం గైలాసవాసులం జేయ, సిరియాలు శెట్టి ప్రమథ

గణంబులతో గలసి మెలసి సంచరించుచు నొక దినంబున నందరు "విన నిజ పుత్రుంజంపి యీశ్వరునికి విందొనర్చి మెప్పించి మరల పుత్రునిం బడయుట యేగాక పరిజన సమేతముగా గైలాసము జూఱగొన్న నావంటి భక్తుడు ముల్లో కంబులం గలడే" యని గర్వముతో పల్కెను. పిదప శివుడు శిరియాలు శెట్టిని తోడ్కొని నిమ్మవ్వ కడకు వచ్చుట చెప్పబడినది. ఇట్లు బసవ పురాణమున ఏకథ తిలకించినను శైవ మాహాత్మ్యము, భక్తులు తరించిన విధము వర్ణింప బడినది. దీని వలన సోమనాథుడు ప్రతిపాదింప దలచిన వీరశైవ మాహాత్మ్యము బలవత్తర మైనది.

## వృ షా ధి ప శ త క ము

పాల్కురికి సోమనాథుడు రచించిన 'వృషాధిపశతకము' సర్వ సమగ్ర ముగ శతక లక్షణోపేతమగుటచే పండిత విమర్శకు లీతనిని శతక వాఙ్మయ బ్రహ్మగ గీర్తించుచున్నారు. మకుటనియమము, సంఖ్యానియమము లాదిగా లక్షణములు సంపూర్ణముగ గలవు. సోమన రచించిన లఘుకృతులలో వృషా ధిప శతకము ప్రశస్తమైనది.

వృషాధిప శతకరచనము క్రీ॥శ॥ 1200 ప్రాంతమున జరిగియుండునని బండారు తమ్మయగారు తమ 'పాల్కురికి సోమనాథుడు' అను గ్రంథములో వ్రాసిరి.

> "బసవడు ప్రీతిగైకొనియె, భక్తి
> మెయిన్ రచియింవ నాడు మున్,
> బసవ పురాణ మంచు నను బ్రస్తుతి సేయుదు రట్లు గాననీ॥
> యసమదయా ధురీణతకు నంకిలి పాటు ఘటిల్లకుండనన్
> వసిగొని ప్రోవుమయ్య బసవా॥ బసవా॥ బసవా॥ వృషాధిపా"

అను పద్య మీ శతకము బసవ పురాణా నంతరము రచింపబడుట వ్యక్త మొనరించు చున్నది.

ఈ శతకము నందాతడు బసవేశ్వరుని చరితమును, భక్తుల చరితమును సంగ్రహముగ నుల్లేఖించెను. "బసవా॥ బసవా॥ బసవా॥ వృషాధిపా" అను మకుటమే పరమ శివభక్తిని చాటు చున్నది. బసవ నామ కీర్తనమున అతని హృదయము భక్తి పరవశమై ఆవేశపూరితమై ఉప్పొంగిపోవును.

* శతకము నందు నామగుణ స్తుతులను ప్రధానముగ పాటించిన కవులలో సోమన అద్యుడన వచ్చును. యమ కాను ప్రాస ముక్త పదగ్ర స్తాద్యలంకారములతో శతకారంభము నందు నలువది పద్యములలో సోమన యొనర్చిన పరమేశ్వర నామగుణ స్తుతి ఇందులకు నిదర్శనము. ఈ పద్యము లందలి స్తుతులు బసవేశ్వరుని దివ్య లీలా స్వరూపమును కనులకు గట్టినట్లు దర్శింప జేసినాడు. బసవేశ్వరుడు కళా విధిజ్ఞుడు, సరస వచస్కుడు, నాద కళా వినోది, దుష్ట జన మానవ శల్యుడు, శివ ధర్మ హాస్య ధురీణుడు, భక్తి రసాభిషక్తుడు. కవి పండిత గాయక చక్రవర్తి.

శతకమున సహజముగ స్తుతియే ప్రధానము. వృషాధిప శతకము కూడ నిట్టిదే. ఇందలి స్తుతులు శైవ సాంప్రదాయ బద్ధములు. గురువు, లింగము, జంగము నను ముగ్గురును నభేద దృష్టితో నారాధించుటయే శైవ సంప్రదాయ మందలి విశేషము. ఇంచు మించు సగము పద్యములలో బసవని జంగమ భక్తి సూచింపబడినది.

శైవులను భక్తులకు సేవకులుగను, దాసులుగను, స్నేహితులుగను, కుమారులుగను, పరమాప్తులుగను వర్ణించుట సహజము. పండితారాధ్య చరిత్రమున సోమనాథుడు తాను బసవని బంటని, నిలుపుట్టు బానిస కొడుకనియు వర్ణించుకొని యున్నాడు. అటులనే బసవేశ్వరుని గూడ భక్తులు సేవకునిగ, దాసునిగ, స్నేహితునిగ, కుమారునిగ వర్ణించి యున్నాడు. అరువదియేడవ పద్యమునుండి నూట ఒకటవ పద్యము వరకు భక్తుల మహిమలను వర్ణించి యున్నాడు. ఈ భక్తుల కథలన్నియు బసవ పురాణము నందు, పండితారాధ్య చరిత్రము నందు వర్ణితము లైనట్టివే. ఈ శతకము చంపకమాల, ఉత్పలమాల పద్య వృత్తములతో నడచినది. ఇది సోమనాథుని వృత్త రచనకు చక్కని నిదర్శనము.

పాల్కురికి సోమన దాస, సఖ్య, వాత్సల్య, మధుర భక్తి భావములను వివిధ రీతులలో వ్యక్తీకరించిన విధము గమనార్హము.

"నా యొడ యుండ, నావిభుడ, నా హృదయేశ్వర, నామనోరమా
నాయిలవేల్పు, నావరద, నాగురులింగమ, నాదు జంగమా!

* ఆంధ్ర శతక సాహిత్య వికాసము. డా॥కె. గోపాలకృష్ణరావుగారు.

నాయధినాద, నావరుడ, నన్ను గృపామతి బ్రోవుమయ్య దే
వా యమ బృంద వంద్య బసవా! బసవా! బసవా! వృషాధిపా"

జీవేశ్వరులకు గల సంబంధమును వివరించు పట్ల కొన్ని సందర్భములందు విశిష్టాద్వైతుల దృక్పధము గోచరించును.♦ ఒక పద్యమున సోమన కృష్ణావతార లీలను స్ఫురింప జేసెను.

"వేడిన మిండ జంగమము వెక్కస మందగ దత్సభాస్థలిన్
నాడట నాతి వల్వలొగి నొల్చియ మానము దూలకుండా
బోడిమి గట్టు వుట్టములు ప్రోవులు పుట్టిని పుణ్యమూర్తి నీ
వాడజుమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా!

పాల్కురికి సోమనాథుడు ఈ శతకము నందు శివ నాగయ్య, మడివాలు మాచన్న, చెన్న బసవన్న మొదలగు భక్తుల చరితమును భక్తి పురస్సరముగ నుతించెను. పరమేశ్వరుని భక్తానుగ్రహ తత్పరత నీ సందర్భములందు పారవశ్యమున నభివర్ణించెను. పైన చెప్పిన కథల నించుక పరిశీలింతము.

మ డి వా లు మా చ య్య క థ :

ఈ కథ బసవ పురాణమున చతుర్థాశ్వాసమున కలదు. నెప్పరిగె యను చిన్నపల్లెయందు మడివాలు మాచయ్య యనునొక శివభక్తుడు గలడు. ఈతని కులము చాకలి కులము. ఇతను కులములో చాకలి యైనను పరమ శివ భక్తుడు. సర్వదా జంగ మార్చన యందు ఆసక్తి గలవాడు, వీరశైవుడు. కల్యాణ పురమున గల బసవేశ్వరుని భక్తి జ్ఞాన వైరాగ్యములను, జంగమ భక్తార్చన దీక్ష విని దా నా పురమున కేగి బసవేశ్వరుని గాంచి, వారిచే సాక్షాత్ఫాల నేత్రునిగా బరిగణింపబడి సపర్యల నందుచు అందుండెను. తన కుల వృత్తినే ముఖ్య కర్తవ్యముగా భావించి హర భక్తుల మాసిన గుడ్డల నుతికి వారికిచ్చు చుండెను. ఇట్లు శివ భక్తుల గుడ్డ లుతికి తెచ్చునప్పుడు వాని కేవిధమైన మైలయు సోక కూడదని తలంచి, జనులకు 'అడ్డు రాబోకు'దని చేత గంట వాయించుచు ఎవరి బట్టలను వారికిచ్చెడివాడు. ఇట్టి శిష్టాచార సంపన్నుని

♦ ఆంధ్ర శతక సాహిత్య వికాసము డా॥ కె. గోపాలకృష్ణ రావుగారు.

యొక్క వీర భక్తి ప్రతాపంబులు భక్తులచే వినుచు బసవేశ్వరుడు వేయి విధంబుల నాతని గొనియాడు చుండు వాడు. పుర జనులందరు నింతటి భక్తుడు లేడని పొగడు చుండిరి. ఇట్లు బట్టలుతికి గంట వాయించుచు కత్తి త్రిప్పుచు బట్టలు తెచ్చుచుండగ నొకనా డొక వ్యక్తి ప్రమాద వశమున తప్పించుకొను మార్గము లేక అతని ఎదుట నిలువబడెను. అంత నాతడు ఆ వ్యక్తి తల తెగవేసి పైకెగుర వైచినాడు. అదిచూచి జనులందరు రాజువద్దకు పోయి ఈ విషయ మెఱింగించిరి. మరియు నీతడు బసవేశ్వరుని భక్తుడని కూడ రాజున కెఱింగించిరి. నరికిన మొండెము పైకెగిరినదట. క్రిందకు పడలేదు. అంత రాజు తన పాదముల చెంత ప్రార్థించుచున్న ప్రజలను చూచి, బసవనితో యిట్లనియె "చూచితివా! నీ భక్తుడైన చాకలివాని ప్రభావము· మారుమాటాడక ఆచాకలిని ఈ ఊరు విడిచి వెడలునట్లుపాయ మాలోచింపుమ" నెను. అంత బసవడు "రాజోత్తమా! ప్రజల రిత్త మాటలకు భయపడవలదు· వాడు మహానుభావుడు. దైవాంశ సంభూతుడు. అతడు చంపిన వ్యక్తి శిరము ఆవేశమున గలదని క్రింద పడలేదని ప్రజలు చెప్పుచున్నారు. ఇది వింతగానా అందువలన అతని శరణుజొచ్చి ఆ వ్యక్తిని బ్రతికింపుమని కోరెద" అని బసవడు బదులు పల్కెను. అంత రాజు బసవడు ఎల్లప్పుడు ఇట్టి పిచ్చి తలంపులే కలిగి యుండునని కొంతమంది అనుయాయులకు భద్ర గజమును· మాచడికి ఎదురు నిల్పి అతనిని దానిచే త్రొక్కించి చంపమని ఆనతిచ్చెను రాజాజ్ఞ ప్రకారము వారు ఏనుగును మాచని త్రోవకడ్డుగా నిలిపి కాచి యుండిరి' అంత మాచయ్య యథా ప్రకారము వచ్చుచుండ ఆ యేనుగును గాంచి రాజు చేసిన పనిగదా యనుకుని "రాజును విగత జీవుని చేతు" నని శపథ మొన ర్చెను. అది విని బిజ్జలరాజు బసవేశ్వరుని ఈ కష్టము నుండి తప్పింపుమని దీనముగా వేడుకొనెను.

బసవేశ్వరుడు రాజుతో "మాచయ్యను సామాన్య మానవునిగా భావించి చంప యత్నించితివి. కాని అతడు భద్ర గజమునే అంతమొందించెను. భక్తుల కిలలో అసాధ్యము లగునవి లేవు." అని బసవన బదులు చెప్పెను. ఇచట మడివాలు మాచయ్య శివభక్తుడు గావున, అతడు శివభక్తుల గుడ్డల నుతికి యిచ్చు పనికి ఆటంకము కలిగింప కూడదనియు, ఆటంకము కలి

గించిన వారు అధోగతి పొలగుదురని ఈ కథ వలన తెలిసినది. తరువాత ఇరువదత్తుని వృత్తాంతము, బాపూరి బ్రహ్మయ్య కథ చెప్పబడినవి.

చెన్న బసవని చరిత్రము :

బసవ పురాణములోని చెన్న బసవని చరిత్రము ద్వితీయా శ్వాసమున వర్ణింప బడినది. బసవని సోదరియగు నాగమాంబ పుత్రుడీ చెన్నబసవడు. బసవని వెంట అక్క నాగమాంబ కూడలి సంగమ క్షేత్రమున కేగి అచటనే భర్తతో సహా నివసించెను. ఈ చెన్న బసవడు అన్ని విషయములలో మేన మామను పోలి యుండెను. భక్తి జ్ఞాన వైరాగ్యముల మేనమామ కెంత మాత్రము తీసిపోడు. జనులందరు బసవేశ్వరునకు తగిన మేనల్లుడని యను చుండిరి. ఈ చెన్న బసవేశ్వరుని లింగాధారణంబను పంచాక్షరీ మంత్రోప దేశంబును బసవేశ్వరుడే యొసరించి నిజాగ్ర శిష్యునిగా బరిగణించు చుండెను. అతడు గురుర్బ్రహ్మ "గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షా త్పర బ్రహ్మ" యను నామ మనుసరించి బసవేశ్వరుడే సర్వంబని నమ్మకొని యతని సేవయే సర్వదా యేమఱక చేయుచుండెను.

దర్శనార్థము శివ భక్తు లెందర రుదెంచినను ఎదురేగి వారిని నుచిత సత్కారములు గారవించి వారికై యలంకరింప బడిన రాజ మార్గమున కస్తూరి కలిపిన నీటిచే జల్లి ముగ్గులచే యలంకరించెడివాడు. మందిరములలో కొంద ఱిని, పాకలలో కొందఱిని, పందిళ్ళల్లో కొందఱిని, అరుగులమీద కొందరిని సర్ది వారి వారి స్థలములు వారికి చూపించెడివాడు. విభూతి గంధ పుష్ప బిల్వ పత్రము లాదిగా వారికి పూజ నిమిత్త మొసంగు చుండెడివాడు. పూజానంతరము షడ్రసోపేత భోజనముతో వారిని తృప్తిపఱచువాడు. ఏ విషయమునందు కూడ లోటురానీయక వారు కోరినదెల్ల సమకూర్చుచుండెడివాడు. ఒకానొక సమయ ములో భక్తు లీతని పరీక్షించుటకై తమకు నతి చతురములగు వనితలు కావలెనని కోరుచుండెడివారు. బసవడు ఎంతమాత్రము సందేహించక అట్లే వేశ్యా భుజంగుల గావించు చుండెడివాడు. ఇట్లు భక్తులు కోరిన వెల్లను మేన మామను వారడుగ నక్కఱలేకయే తానే వారల కొసంగు చుండెను. తదుపరి నిజ గురువగు (మేనమామ) సామీప్యమునకు దోడ్కొని గురుస్తుతి పూర్వకముగా భక్తుల రాక యాతని కెఱిగించెడివాడు. తన శిష్యుడు, సుత ప్రాయుండును

యగు చెన్న బసవడు శివభక్తులకు సాష్టాంగ ప్రణామములు చేసి తదంఘ్రి రేణువులను తన యొడలం బూసికొని పాదధూళి శిరమున దాల్చి కుశల ప్రశ్న పూర్వకముగా సంభాషించుట, కైంకర్యాది సేవలు చేయుట గని బసవేశ్వరుడు మిగుల నానందించు చుండెను. ఇది చెన్న బసవని చరిత్రము. తదుపరి ఘట్టములలో అల్లమ ప్రభువు వేషములో సంగమేశ్వర స్వామి బసవేశ్వరుని జూడ వచ్చుట, అల్లమ ప్రభువునకు బసవన్న షోడశోపచార మొనర్చుట, బసవేశ్వరుని అల్లమ ప్రభువగు శివుడు కొనియాడుట యిత్యాది విషయములు చెప్పబడినవి. ఈ కథల ప్రసక్తి మహిమలు సోమనాథుడు వృషాధిప శతకములో వర్ణించినాడు.

రచనలో శబ్దాలంకారముల యందాసక్తి అధికముగ జూపినను వీర శైవ మతాభినివేశమును వ్యక్తీకరించు పట్ల, భక్తి పారవశ్యము నభివర్ణించు పట్ల పాల్కురికి సోమన రచన ఆవేశపూరితముగ సాగినది. "దీవ్రము నీమహా మహిమ దివ్యము నీ మహనీయ విక్రమంబు" అను పద్య మిందులకు నిదర్శనము.

వృషాధిప శతక శైలి అనుకరణము అనంతర కావ్యములలో ప్రస్ఫుటముగ గన్పించును. అంత్యనియమము, ముక్తపదగ్రస్తాది అలంకారిక రచనమును పోతన అనుకరించెను. నామ గుణ మహిమాభి వర్ణన విధానమును శతక కర్త లెందరో అనుసరించిరి. ఈతడు ప్రయోగించిన లోకోక్తులను, జాతీయములను కూడ పోతన, పెద్దన మున్నగు కవుల ననుసరించిన సందర్భములు కలవు. భక్తి రసాత్మకమైన శైలిని, భావావేశమును పోతన యథాతథముగ ననుసరించిన పద్యము లెన్నియో కలవు. పాలకురికి సోమన అష్ట భాషా పండితుడు. వృషాధిప శతకమునం దతడు సంస్కృతము, ఆర్య, తమిళ, మిశ్రజానుతెనుగు కన్నడ భాషలలో మణి ప్రవాళ శైలిలో వచించిన పద్యము లీతనికిగల బహు భాషా పాండిత్యమును నిరూపించు చున్నవి. జాను తెనుగు భాషా స్వరూపమును గూర్చి వాదోప వాదములకు దారితీసిన పద్య మీ శతకములోనిదే.

బలుపొడ తోలు చీరయును, పాపపెనల్, గిలుపారుకన్ను, వె
న్నెలతల, చేదు కత్తుకయ నిండిన వేలుపుటేఱు పలుపూ

సలుగలవేని లెంకవని జాను దెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా! బసవా! బసవా! వృషాధిపా!

మణి ప్రవాళ శైలి తెలుగులో ప్రవేశ పెట్టినవాడు సోమనాథుడే. ఈవిధముగా "బసవా! బసవా! బసవా! వృషాధిపా" యను మకుటముతో 108 ఉత్పల చంపకమాలికా వృత్తములతో ననేకములగు పోకడలతో దన భక్తిరసావేశమును బ్రకటించి చివరను మకుట రహితముగ ఇట్లు వ్రాసెను.

"అకుటిల లీల జంగమ సమగ్ర దయాకలిత ప్రసాది పా
లకురికి సోమనాథు డతి లౌల్యమునన్ బసవన్న దండనా
యకునకు నొప్ప నీ శతక మర్పణ చేసె ధరన్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తియున్"

అను పద్యము గ్రంథకర్తృత్వ సూచకముగను, ఫలశ్రుతి ప్రదర్శకముగను సోమనాథుడు రచించినాడు. భక్తి పారవశ్యముతో సోమన రచించిన పద్యములు మచ్చునకు రెండు చూతము.

ఉ॥ శ్రీ గురు లింగమూర్తి! సవిశేష మహోజ్జ్వల కీర్తి! సత్క్రియా
ద్యోగ కళాప్రపూర్తి! యదూవత పునర్భవ జూర్తి! పాలితా
ఖ్యా గత సంశ్రితార్త కవి పండిత గాయక చక్రవర్తి! దే
వా! గతి నీవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ॥ నాద కళా వినోద! యభినందిత వేద! హృతాపవాద! సం
పాదిత భక్తివాద! బుధవందిత పాద! చిర ప్రమోద యా
స్వాదిత సుప్రసాద! యనిషాద! శిలాదసుతా విభేద! దే
వా! దయ జూడుమయ్య! బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఆంధ్ర భాషయందు రానురాను విస్తృతి చెందిన భక్తిరస పూరితమయిన శతక వాఙ్మయమున కీ శతకరాజమే మార్గదర్శకమని చెప్పదగును.

## బసవోదాహరణము

సోమనాథుడు బసవోదాహరణము సంస్కృతములోను, తెలుగులోను రచించినట్లు తెలియు చున్నది. తెలుగు 'బసవోదాహరణము' బసవని స్తుతించు

కావ్యమని చెప్పవచ్చును. సోమనాథుని తొలి కృతియగు 'అనుభవసారము' రచనా నంతరము కొలది కాలమునకు బూర్వోక్తమయిన సోమనాథస్తవ భక్త స్తవములను భక్త పఠనార్థము సులభ శైలిలో సోమనాథుడు లఘు ద్విపద కృతులుగ రచించినట్లు బండారు తమ్మయ్యగారు 'పాల్కురికి సోమనాథ కవి' యను పుస్తకములో వ్రాసిరి. అటు తరువాత క్రమముగ బసవేశ్వరుని మీది భక్తి ముదిరిన కొలది నీతడు సంస్కృతపద భూయిష్ఠములగు పంచ ప్రకార గద్య, నమస్కారగద్య, అక్షరాంక గద్య, బసవాష్టోత్తర శతనామ గద్య మున్నగు గద్య కృతులలోను బసవోదాహరణము, బసవాష్టకము, వృషభాష్టకము, బసవ పంచకము, బసవ రగడ మొదలగు గేయ కృతులలోను, అక్షరాంక పద్యముల వంటి ప్రౌఢ పద్య రచనము లందును బసవ స్తోత్రముల నొనర్చి యవి జన సామాన్యమునకు సుబోధకములయి తన మత ప్రచారమున కంతగా నుపకరింప నందున దేశీయచ్ఛందమగు ద్విపదలో దన ప్రధాన గ్రంథములను* వ్రాయనెంచినట్లు కాననగును.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె,
సరసమై పరగిన జాను తెనుంగు
చర్చింపగా సర్వ సామాన్య మగుట
గూర్చెద ద్విపదలు కోర్కెదైవార"

(బసవ పురాణము)

"ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ,
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యంబుగా మి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకు"

(పండితారాధ్య చరిత్రము)

అను వాక్యముల వలన సోమనాథుని యాశయము వెల్లడి కాగలదు.[2] కావున సోమనాథస్తవ రచనమునకు బసవ పురాణ రచనమునకు మధ్య కాలమున

---

* పాల్కురికి సోమనాథ కవి (బండారు తమ్మయగారు)

2 పాల్కురికి సోమనాథ కవి (బండారు తమయ్యగారు)

బసవ స్తోత్ర రూపకములు పూర్వోక్తములు నగు గద్య పద్య లఘు కృతులు రచియింప బడినట్లు తలంప దగును. వీనిలో కొన్ని బసవ పురాణ రచనాంత రము కూడ గూర్చబడి యుండవచ్చును.

ఉదాహరణ గ్రంథములు తెలుగు సాహిత్యమున నొక ప్రత్యేక శాఖగా పరిగణింప దగినవి. ద్విపదలవలె, పదములవలె, యక్షగానము వలె ఈ ఉదాహరణములు కూడ ఒక కావ్య ప్రక్రియగా పేర్కొన వచ్చును. తెలుగున పద పద్య కవితలలో, పద కవిత దాక్షిణాత్య సంప్రదాయమునకు, పద్య కవిత యార్య సంప్రదాయమునకు జెందినవి. దీనినే దేశి యనియు, మార్గ మనియు ప్రాచీనులు వ్యవహరించిరి. కావున నైసర్గికముగ నాయా దేశముల నుత్పన్నమైన కవిత దేశియనియు, నట్టి దేశి కవిత యార్య సంస్కారమును పొందినది మార్గ మనియు జెప్ప వచ్చును.

♦ తెలుగు సాహిత్యములో మహాకావ్యములు, పురాణములు, చంపువులు, ప్రబంధములు మార్గ కవిత లనియు; ద్విపదలు, యక్ష గానములు, శతకములు, ఉదాహరణములు, దండకములు దేశి కవిత లని జెప్పనొప్పును. ఈ రెండు పథకముల యందు రచనలు వేయేండ్ల నుండి యవిచ్ఛిన్నముగా సాగుచున్నవి.

శ్రీనిడదవోలు వేంకటరావుగారి "ఉదాహరణ వాఙ్మయ చరిత్ర" పలువురి ప్రశంసల నందుకొన్నది. * ఆంధ్ర దేశమునందే గాక, ఉత్తర భారత దేశమున భారతీయ చరిత్రకారులను కూడా నీ గ్రంథ మాకర్షించినట్లు "ఉదాహరణ వాఙ్మయ చరిత" పీఠికలో వారు తెలిపిరి. నవ్య భారతీయ భాషా సాహిత్యములలో అవధాన కవిత, ఉదాహరణ శాఖ తెలుగుననే గాక భారతీయ సాహిత్య మంతటిలోను నొక విశిష్టత గలదని ఆచార్య నాగేంద్ర గారు "All those literatures have these remarkable distinctive merits, the sangam literature in Tamil, the Avadhana and udaharana literature in Telugu, the Sandesh kavyas (message poetry) and the killipattu, as also, the manipravalam style

---

♦ ఉదాహరణ వాఙ్మయ చరిత్ర-నిడదవోలు వేంకటరావుగారు.

* ఉదాహరణ వాఙ్మయము-శ్రీనిడదవోలు వేంకటరావుగారు.

(interwoven with Sanskrit Malayalam) of Malayàlam, the Pawars (a form of ballad) of Marathi, the Akhyan of Gujarathi the Bargut and Buran literature of Assamese the ballads and the romances of the Panjabi, the ghazil of urdu and the Ritu (a kind of thetorical Poetry and chayavada Schools of Hindi Poetry are some of the special features of the various modern Indian Lituratures which are remarkable in themselves" (Introduction page) (Indian Literature - Editor Dr Nagendra) అని వ్రాసియున్నారు. ఇక ఉదాహరణ కావ్య లక్షణము లను పరిశీలింతము. * ఉదాహరణము లనగా భాషయందుగల సప్తవిభక్తులు సంబోధన విభక్తిని నుదాహరించు లఘు కృతి. బసవోదాహరణ మిటువంటిదే. ఇది ప్రధానముగా స్తోత్రరూప మగుటచే దేవతా పరమగు కావ్యము కాని మానవ పరమగు కృతులును నుండును. ఇందు వృత్తములు-కళికలు-ఉత్కళికలు-సార్వ విభక్తిక పద్యము-కవి కృత నామాంకిత పద్యము అను విభాగములు గలవు. ప్రతి విభక్తికి ఒకే వృత్తము, ఒకే కళిక, ఒకే ఉత్కళిక నియతములు, వృత్తములలో చంపకోత్పలములు, మత్తేభ శార్దూల వృత్తములు మాత్రమే ప్రయుక్తమగును. కళిక యనగా మాత్రాచ్ఛందస్సునకు సంబంధించిన రగడ భేదము. ఇందెనిమిది పాదములు మాత్రమే యుండును. ఉత్కళిక యనగా కళికలో సగము భాగము. అర్ధ కళిక-ఇందును నెనిమిది పాదములే.

కళిక యందు ప్రతి పాదాంతమునను విభక్తి ప్రత్యయము భాసింప వలెను. ఉత్కళిక యందు చివరి రెండు పాదములలో మాత్రము భాసింప వలెను. సంబోధన యందు మాత్ర మన్ని పాదములను బోధనాంతములుగానే యుండవలెను.

చతుర్థీ విభక్తి యందు ప్రతి పాదాంతమున విభక్త్యాభాసము స్పష్టముగా నుండవలెను. కళికల యందు ప్రతి పాదమును స్వతంత్ర వాక్యముగా నుండ వలెను. ఉత్కళిక యందేక సమానముగా పాదము లుండవలెను. సార్వ విభక్తికము దీని యందొక్క పద్యముననే యన్ని విభక్తులు ప్రయుక్తములు కావలెను. ఇందు సాధారణముగ మత్తేభమున గాని, శార్దూల వృత్తమున గాని యుండును.

---

* ఉదాహరణ వాఙ్మయ చరిత్ర-నిడదవోలు వేంకటరావుగారు.

కవికృత నామాంకిత పద్యము- ఇందొకే పద్యమున కవిపేరు, నుదాహరణము పేరు నుండవలెను.

ఉదాహరణములలో పైన వివరించిన వృత్తములు తప్ప తక్కిన పద్యము లేవియు ప్రయుక్తములు కావు.

ఇది కేవలము స్తుతి రూపకమైనది కావున గాన యోగ్యమైనది. ఇందలి పద్యములు రాగాంగ ప్రధానములు. అనగా రాగములతో పాడదగినది - కళికోత్కళికలు తాళాంగ ప్రధానములు. త్రిపుట-జంపె-రూపక తాళముల తోడనే పాడవలెను. ఆ తాళము కనుకూలములైన త్ర్యశ్ర - చతురశ్ర మిశ్ర జాతులందు ప్రకటితములు కావలెను. మహాకావ్యము నందలి నాయకు నివలె నిందును నాయక గుణ కీర్తనమే ప్రధానము.

"అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయ గాదె కవి వివేకంబు" అన్న సూక్తికి నుదాహరణములు లక్ష్యములు. ఇందలి కళికోత్కళికా పద్య సంఖ్య యిరువదియాఱు, ఈ యిరువదియాఱు సంఖ్య సదాశివుని షడ్వింశతి తత్త్వములకు ద్యోతకము.

బసవోదాహరణము :

బసవోదాహరణము స్తుతి ప్రధానమైనది. భక్తి ప్రాముఖ్యము కలిగిన లఘు కావ్యము.

లక్షణాను గుణముగా బసవోదాహరణము ప్రథమా విభక్తి పద్యముతో ప్రారంభమైనది. ఈ పద్యములో శుభాస్వానము బసవని స్తుతి ప్రధానముగా నున్నవి. కావ్య ప్రారంభములో నమస్కృతి ఉండుట సాధారణమే. అట్లే బసవేశ్వరుని గురించి వృషభోత్తమ మూర్తి యుదాత్త కీర్తి అని చెప్పి యుండుట చేత వస్తు నిర్దేశము కూడ జరిగినది. పదములన్నియు లక్షణ బద్ధముగా ప్రథమా విభక్తి యందే అంతమగుట గమనించదగినది. ఈ పద్యము తరువాత కళిక ఉత్కళిక రచింపబడి యున్నది. దీనిలోను ప్రథమా విభక్తిలో పరమ పరాపర భరిత జ్ఞానుడు- సాక్షాత్ కలియుగ రుద్రుడు శుభకరుడు ఇల విశ్వ గురుడు అని బసవనికి మాహేశ్వరునకు ఏకీభావము చెప్పబడియున్నది. ద్వితీయా విభక్తి శీర్షికలో ఒక పద్యము, ఒక కళిక, ఒక ఉత్కళిక కూర్పు

బడినవి. పద్యము చంపకమాల కాగా, కళికోత్కళికలు రగడ భేదములై యున్నవి. వీని యందును పై భావమే పునరావృత్తమైనది. "బసవన పుణ్యమూర్తి దలంపఁగదే చిత్తమ" అను పద్యములోను పెక్కు దైవంబులను పేరు మోసిన వాని నొక్కడే రుద్రుడని యుక్తి జూపిన వాని "సకల వాదులనోర్చి" "సుకృత మార్గముతీర్చి" న వానిని బసవేశ్వరుని స్తుతి చేసినాడు. ఇట్లే సప్తమీ విభక్తి వరకు పద్యములు కళికోత్కళికలు కొనసాగినవి. సంబోధన పద్యములో ఓ బసవా! అని సంబోధించినాడు. కళికోత్కళికలలో "భువన పావనావతార పుణ్యమూర్తి ద్వితీయ శంభు నామధేయ భక్త ముక్తి ద్రప్రవీణ" మొదలైన సంబోధనలు కావించి యున్నాడు. ఇవి యన్నియు లక్షణ బద్ధముగానే జరిగినవి. చివరన 'నీవు నియూపయోనిధివి నిన్ను నుతించిన కల్గు భక్తి నీచే వర వీర శైవ రతి చేకూరు నీకై యిత్తు కబ్బముల్ నీ వలనన్ కృతార్థత జనించును "నీకు నమస్కరింతు నా భావము నందు నుండి నన్ను బాయకుమీ బసవయ్య వేడెదన్"అను సార్వ విభక్తిక పద్యము చక్కని భావ సమన్వితముగా వ్రాసి యున్నాడు.

పాల్కురికి సోమనకు ఉదాహరణ ప్రక్రియ మీద చాలా శ్రద్ధ ఉన్నట్లే కనిపించును. ఇతడు రచించిన పండితారాధ్య చరిత్రలోని ఉదాహరణ గ్రంథ లక్షణ సూచనము గావించి నట్లుగా విమర్శకులు భావింతురు.[1] ఇది యదార్థమే కావచ్చును. ఉదాహరణ వాఙ్మయములో పాల్కురికి సోమనాథుడు బసవోదాహరణము ప్రారంభ దశయందే వెలువడినప్పటికి సర్వలక్షణ సముపేతమై భక్తి సంభరితమైన ఆవాఙ్మయ శాఖ యందు ముకుటాయమానముగా నున్నది. సోమనాదుడు ఈ ఉదాహరణము నందు జాను తెనుగు దేశి పద్ధతి అను వాని వైపు శ్రద్ధ చూపించక పోవుటను విశేషముగ గమనించవలెను.

## చతుర్వేదసారము

పాల్కురికి సోమనాథుని పద్యకృతులలో 'చతుర్వేదసారము' చాల ప్రఖ్యాతమైనది. పాల్కురికి సోమనాథుడే పండితారాధ్య చరిత్ర అవతారికలో భక్తులు తన్ను ప్రశంసించినట్లు చెప్పుకొనెను.

---

1. ఉదాహరణ వాఙ్మయము-నిడదవోలు వేంకటరావు పేజి 103.

"వర వీర భక్తి సవైదికంబుగను
విరచించితిని చతుర్వేద సారమున"

ఈ గ్రంథమున శివ పారమ్యము, వీరశైవ తత్త్వము, శ్రుతి స్మృతి పురాణేతి హాసముల నుండి ప్రమాణములతో సమర్థింపబడినవి. సోమనాథుడు సోమనాథ భాష్యములో నిట్టి విషయములను సంస్కృత భాషలో వివరించి యున్నాడు. ఇట్టివి, మరికొన్ని యిందు తెలుగులో సీస పద్యములలో చెప్పబడినవి. ఈ సీస పద్యము లన్నియు తేటగీతులతో, నాటవెలదులతో, బసవ లింగ అను మకుటము గల యెత్తుగీతులతో వెలయుచున్నవి. బసవ పురాణ వృషాధిప శతకములందు సోమనాథుడు బసవేశ్వరుని మహిమాభి వర్ణన మొనర్చి యుండెను. పరమేశ్వరుని అనంత రూపమును, వీరశైవ మత ప్రాధాన్యమును నిరూపించుటకై చతుర్వేద సారము రచించెను. ఇది చతుశ్శతిక వంటిది. ఇందు మూడు వందల పద్యములు మాత్రము లభ్యమైనవని డా॥ కె. గోపాల కృష్ణరావు గారు తమ "ఆంధ్ర శతక సాహిత్య వికాసము"లో పేర్కొనినారు. ఇందు బసవ నామాక్షర మహిమ, పంచాక్షర మంత్ర మహిమ, శివభూతి, రుద్రాక్ష లింగధారణ మాహాత్మ్యము, శివ భక్తి పారమ్యము - ప్రకృతి పురుష నామములు - శివ భక్తుల ప్రశస్తి - అశుచి విరసనము - శీల రక్షణము, శివాను భవ సూత్ర వివరణము మున్నగు అంశములు నిరూపింపబడినవి. ఈ గ్రంథము వలన సోమనాథుని వేద వేదాంగ పరిజ్ఞానము ప్రస్ఫుటమగుచున్నది. సోమ నాథుడీ కృతిలో నీ విధముగా చెప్పినాడు.

"వైదికు లిది శుద్ధ వైదికంబని యెన్న
శాస్త్రజ్ఞు లిది ధర్మశాస్త్ర మనగ
తార్కికు లిది మహాతర్కం బనంగ, పౌ
రాణికు లిదియె పురాణ మనగ
ఆగమవిదులు దివ్యాగమం బిదియన
తంత్రజ్ఞు లిది వీరతంత్ర మనగ
భక్తవారం బిది భక్తి మార్గంబన
ముక్త్యర్థులిది మహాముక్తిద మన

కవులు భువిని నిదియె గావ్యంబనంగ
సజ్జనుల కెల్ల మిగుల సంతసముగ
నిర్వికల్పరతి చతుర్వేదసార మ
న్పద్యముల్ రచింతు బసవలింగ (22)

" 'బ' కారము శివాత్మకము-'స' కారము గుర్వాత్మకము-'వ' కారము మంత్రాత్మకము"అనియు 'బసవ' అను పదము లింగాత్మక మనియు సోమన బసవ నామ మహిమను ప్రస్తుతించెను. బసవేశ్వరుని పాదము భవార్ధిపార మందించు తెప్పలనియు, భవ ధ్వాంత మణచు దీపము లనియు, భక్తి నొసగు సుర భూజము లనియు భక్తి పురస్సరముగ వర్ణించెను. బసవేశ్వర మహిమ వినినచో దుస్స్వప్న, దుర్జన భయములు దొలగు ననియు, నాతని శరణు వేడినచో ముక్తి సౌభాగ్యము కలుగు ననియు వచించి ఆతని విశ్వరూపాత్మకమైన శక్తిని మనోహరములగు రూప కల్పనలతో వర్ణించెను. బసవేశ్వరుడు "పర వాద మద గజ ప్రబల పంచాస్యుడు - పరవాది మేఘ నిర్భర పవమానము. పరవాది లతలకు భాస్వల్లవిత్రము" అని ఆతని మహిమను బహు విధములుగ ప్రస్తుతించెను. ఇట్టి సందర్భము లందు రచింపబడిన పద్యము లన్నియు వృషాధిప శతక పద్య భావముల కనుగుణ ప్రాయములై యున్నవి. త్రిమూర్తులలో పరమ శివునికి గల ప్రాధాన్యమును నిరూపించుచు అజహరీంద్రాదులను పశువులకు ఈశ్వరుడు పతి అని పాశుపత సిద్ధాంతము నాధారముగా సమర్థించి నాడు.

శివుడెఁ దైవంబని శిరమిచ్చి పలుకుదు
గురులింగమూర్తి శంకరుఁ డటంచు
భవుడె దైవంబది పట్టుదురు చేబూని
మలహరు భక్తులే కులజు లనియు
హరుడె దైవంబని ధరియించు విషము ప్ర
సాదంబు మోక్షకసదన మనియు
మృడుడె దైవంబని మురవైరి నాదర
మాహేశ్వరంబె సన్మార్గ మనియు
బశుపతికి బంట్లు దివిజులు పశువులనియు

వెండియును వాడు సర్పి సద్వివర మెలమి
దివిజా సుష్ఠించునిది నా ప్రతిజ్ఞ తెలియ
బరగబరసమయాళిని బసవలింగః

(చ।సా-ప 25)

పై పద్యములో ప్రతినలను బట్టి సోమనాథుడు ప్రామాణిక గ్రంథముల ననేకము గ్రహించి శైవమును స్థాపింప యత్నించినట్లు తెలియును. మొదట చతుర్వేద సారమున హరదత్తాచార్యుని చతుర్వేద తాత్పర్య సంగ్రహము నందలి శ్లోకము లెట్లు గ్రహింపబడెనో చూతము. చతుర్వేద తాత్పర్య సంగ్రహమునందలి శ్లోకములకు బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రి గారిచే వ్రాయబడిన తాత్పర్యము యిట్లు గలదు.

హరి యజ్ఞపురుష డనియు, హరుడు యజ్ఞేశ్వరు డనియు, హరి జగత్కర్త యనియు, హరికి భవుడు కర్త యనియు, హరి విశ్వమయు డనియు, శంకరుడు విశ్వాధికుం డనియు, హరి ప్రకృతి యనియు, తదీయ పురుషుడు శంకరు డనియు, అందువలన శివుడు విష్ణుని కన్నను పరమపదమని నిరూపింపబడినది. (చ.సా 103 ప) ఈ విషయము వాద ప్రకరణములోను (పండితారాధ్య చరిత్రము) నిరూపింపబడినట్లు తెలియ వచ్చుచున్నది. ఇందు సోమనాథుడు అన్య మత సిద్ధాంతములను ఖండించి, హరి అవతారము లన్నియు అపౌరుషేయములగు ఉదంతములతో గూడియున్నవని విమర్శించెను. రామావతారమున శ్రీరాముడు భార్యను గోల్పోవుట, వానరులను తోడుగా గ్రహించుట మొదలగు వానిని తార్కాణముగ జూపెను. శ్రీహరి వివిధ సందర్భములలో వ్యక్తపరచిన శౌర్య హీనతను దృష్టాంతముగ జూపి అనంత శక్తి యుక్తుడని అతని కీర్తించుట తగదనియు భక్తుదే జగత్పతి అని చాటెను. పాల్కురికి సోమన విష్ణు భక్తులు ధరించు శంఖ చక్రాదుల లాంఛనములను నిరసన దృష్టితో విమర్శించెను.

శివుడు పంచాక్షరీ మంత్ర స్వరూపు డనియు కవి వర్ణించి శివ భక్తుల ఆధిక్యమును నిరూపించెను. శ్వపచుడైనను శివ భక్తుడు పరమేశ్వరునకు ప్రీతి పాత్రుడు. సద్భక్తుల దర్శన మీశ్వర దర్శనతుల్యము. శివ భక్తుల దర్శనము నొనర్చినను ముక్తులగుదురని సోదాహరణముగ భక్తి ప్రాధాన్యమును, సోమన

వివరించెను. వృషాధిప శతకము ననుసరించి పాల్కురికి సోమన ఈ శతకము నందును "నా మనో నాయక, నా ప్రియుండ, నా విభుండ, నా ప్రాణ లింగంబ" అను మధుర భక్తిని చాటెను.

ఇంచు మించుగ సోమనాథుని గ్రంథము లన్నియు శైవ మత నిరూపణకై యుద్దేశింపబడినవియే. అందును పండిత లోకము నామోదింప జేయుటకై సోమన మిక్కిలి పాటుబడినాడు. అందుచే ఏ విషయము దెల్పినను వేదములు, ఉపనిషత్తులు, ఆగమములు, పురాణములు దృష్టియందుంచుకొనియే చెప్పినట్లు అన్పించును. చతుర్వేద సారము కూడ నిందులకు తార్కాణ మన వచ్చును.

మొదటి పద్యమున శైవ సంప్రదాయాను సారము గురు, లింగ, జంగమములను స్తుతించినాడు. మరల విపులముగ రెండవ పద్యమున శివుని, 3,4, 5, 6 పద్యములలో భక్తనుతి గావించినాడు. అనంతరము బసవేశ్వరునకు నీశ్వరునకు నభేదము జెప్పినాడు. బసవేశ్వరుడు నందీశ్వరుని యవతారమనియు, నందీశ్వరుడు శివుని యవతారమే యనియు సోమన బసవ పురాణమున దెల్పినాడు. శివ పురాణమునను లింగ పురాణమునను గూడ నందీశ్వరుడు తన యంశమే యని శివుడు జెప్పినటుల గలదు.

చతుర్వేద సారమును బట్టి చూడ శివుడు నిస్సంసారియు, నిర్మల దేహియు, నిష్కర్మియు, నిత్యుడును నైయున్నాడు. అటులనే జీవుడు సంసారియు, మలదేహియు, దష్కర్మియు, ననిత్యుడునునై యున్నాడు. అట్టి తరి వారిరువురకును పర్వత పరమాణువుల కున్నంత భేదమున్నదని జీవాత్మకు పరమాత్మ యోగము పొసగ నేరదనియు సోమన నిరూపించి యున్నాడు. (చ.సా.వ 140)

పశువు దాజీవాత్మ పాశ మంతర్దేహ
బంధ మాపశు పాశపతి గురుండు (చ.సా. 214)

.... .... ....

దేవతలలో శివుడు బ్రాహ్మణుడట. అందుచే భూదేవు లాతనిని కొల్చుట ధర్మమని సోమనాథుడు చెప్పినాడు.

అసమ పరాశ్రయంబున బ్రాహ్మణో
భగవానన శివుఁడు బ్రాహ్మణుండు
తప్పక యాక్షత్రియః పరమో హరి
యనగ సుక్షత్రియుం డచ్యుతుండు
విస్తరింప బితామ హస్తు వైశ్యశ్చనా
నా నొరంగ ధరసువైశ్యుండు బ్రహ్మ
లక్షింపగా వృషస్తు పురందరో
యనంగ శూద్రుండు దానమర విభుడు
యట్లి సామంబు బ్రాహ్మణోస్మ్యహ మనంగ
శివుడు శ్రేష్టుండు హరి, విరించియును హరియు
నట్లు క్షత్రియ వైశ్య శూద్రాదులనగ
భర్గు సములౌదురే వీరు బసవలింగః (చ.సా 120)

శివాధిక్యమును నిరూపించుటకు సోమనాథుడెన్నియో పద్యములు వ్రాసినాడు. 'ఋతం సత్యం పరబ్రహ్మ'యను యజుర్వేద వాక్యము వలనను 'నత్పరం బ్రహ్మేతి'యను అధర్వణ వాక్యము వలనను 'నతత్పరం బ్రహ్మేతి' 'నద్వితీయం పరమాత్మ తద్బ్రహ్మేతి' యను బ్రహ్మోపనిషద్ వాక్యము వలనను 'ఏక ఏవ రుద్రో'యను శ్రుతి వాక్యము వలనను, శివుఁడే పరబ్రహ్మయని నిరూపింపబడినది. 'నో మితి బ్రహ్మ'మను యజుర్వేద సూక్తము, 'సద్బ్రహ్మ సదా వ్నోతి పరమ' మను నారాయణోపనిషద్వాక్యము, 'అమృతం బ్రహ్మ యోనింతథా'యను లైంగోప్యపనిషద్వాక్యము, 'పశ్యంతి సూరయో'యను నథర్వణ వేద వాక్యమును గూడ శివుని పరబ్రహ్మగ నిరూపించుచున్నవని సోమనాథుని యుద్దేశ్యము. అటులనే 'పరబ్రహ్మ శాంభవ' మను సూత సంహిత వలనను, 'ఋతం సత్యం పరబ్రహ్మ'మను సూత పురాణ వాక్యము చేతను, 'సత్పర బ్రహ్మ ఈశాన'యను నాదిత్య పురాణ వాక్యము చేతను, 'ఏక మేవ పరబ్రహ్మ'యను కూర్మ పురాణ వాక్యము వలనను గూడ శివుడే పరబ్రహ్మమని నిరూపించి యున్నాడు. "సంరక్షితాం సృష్టించ జయ' 'సరక్ష్య తదాంశ్చ లోకాంశ్చ లోక పాలాంశ్చ' 'యథా దేవతా సృష్టి' 'పశవోపి' 'పశవః

సృష్టి' 'బ్రహ్మ దయః పశవూ' 'ఉన్మేషమి పద' యను శ్రుతి వాక్యములు గూడ నీ విషయమునే నిరూపించుచున్నవని సోమన చెప్పినాడు. (చ.సా.ప. 117; 119, 121, 122) ఇట్టి పద్యము లింకను కొన్ని గలవు. శివాధిక్యము నంగీకరించుట కందందు నుండి ప్రమాణ వాక్యముల జూపినాడు.

శివుడు బ్రహ్మ యొక్క శిరస్సును ఛేదించి నాడనియు, నందుచే నాత నికి బ్రహ్మ హత్యా మహాదోషము సంభవించిన దనియు నా దోష నివారణార్ధ మయి మహేశ్వరుడు బ్రహ్మకపాలము జేత బుచ్చుగొని భిక్షాటనము గావించి నాడనియు బురాణమున గలదు. ఇయ్యదియు నొక శివలీలా విలాసమే గాని శివునకు బ్రహ్మహత్యా దోషమంటుట హాస్యాస్పదమైన విషయమనియు హర దత్తుడు ఉదాహరణముగ పేర్కొని యున్నాడు. ఈ విషయమును బుగ్వేద సారమున మిక్కిలిగ తడవలేదు కాని పరమేశ్వరుడే పరబ్రహ్మమను సందర్భమున హరి విరంచులు క్షత్రియ వైశ్యులని ప్రమాణ వాక్యములు జూపినాడు. అనగా వైశ్యుడును బ్రహ్మను జంపినను బ్రహ్మహత్య లేదని యాతని భావము.

ఈ సందర్భముననే 'బ్రహ్మణో భగవాన్' 'క్షత్రియః పరమోహారి' 'పితామహస్తు వైశ్యశ్చ' 'వృషస్తు పురందరో' యను పరాశరీయ వాక్యము లను సోమన యుద్ధరించి యున్నాడు.

ఈ పుస్తకములో సోమన సూచన ప్రాయముగ అనేక పురాణ గాథల నేకరువు పెట్టినాడు. విష్ణువు వీరశైవుడని యీ క్రింది పురాణ సందర్భముతో నీ క్రింది పద్యమున చెప్పినాడు.

హరి వీరశైవుడన్నందుకు మరియు గ
ర్భాధానఖండమే ప్రథమసాక్షి
హరి వీరశైవుడన్నందుకు దన నేత్ర
కమల మొసంగిన క్రమము సాక్షి
హరి వీరశైవుడన్నందుకు శంకరు
చేత బొందిన శివగీత సాక్షి
హరి వీరశైవుడన్నందుకు శ్రీ సాంబు

డనెడు పుత్రుని బడసినదే సాక్షి
ఇన్ని సాక్షులు గాక యపన్నుగాను
దేయుడని శంభు పూజించు తెలివి సాక్షి
కాని సద్ధర్మములను నిక్కంబటంచు
బలుక నొల్లరు కూళలో బసవలిగః (చ॥సా॥ 42)

ఈ విధముగా సోమనాథుడు తన గ్రంథ మందెల్లడల శివభక్తిని గూర్చి విశేషముగా వర్ణించినాడు.

## చెన్నమల్లుని సీసములు

పాల్కురికి సోమనాథుడు తెలుగులో రచించిన లఘుకృతులలో నిది యొకటి. ఇందు 32 సీస పద్యములు మాత్రమే గలవు. రెండు కంద పద్యములు ప్రక్షిప్తములని శ్రీ బండారు తమ్మయ్యగారి అభిప్రాయము. సోమనాథుడు శివైక్య సమయములో జీవ సమాధి అగుచు సమాధిలోనికి 32 సోపానములు కట్టించుకొని వాటిని దిగునప్పుడు ఒక్కొక్క సోపానమునకు ఒక పద్యము చొప్పున చెప్పినట్లు ఐతిహ్యము కలదు. కాని ఇది నిరాధారమని బండారు తమ్మయ్యగా రభిప్రాయ పడుచున్నారు. పైన చెప్పిన ఐతిహ్యమును బట్టి చూచిన అవసాన దశలో ఈ 'చెన్నమల్లుని సీసమును' రచించినట్లు తోచుచున్నది. కాని సోమనాథుని కృతుల పూర్వాపరములను నంశము పరిశీలింపగా 'పండితారాధ్య చరిత్ర' చివరికృతి యని తేలుచున్నది. కావున పై ఐతిహ్యము సత్యమో కాదో తెలియదు.

సోమనాథుడు చరమ దశలో శివైక్యము చెందినది మైసూరు రాష్ట్రము బెంగుళూరు జిల్లాలోని కల్యక్షేత్రమని 'పాల్కురికి సోమనాథ కవి' యను పుస్తకములో బండారు తమ్మయగారు పేర్కొనిరి. సోమనాథుని యిష్ట దైవము శ్రీశైలములోని చెన్నమల్లికార్జునుడు. సమస్త శైవ ప్రపంచము బసవ మయముగా గోచరించు భక్త్యావేశముతో చెన్నమల్లికార్జున స్వామి కూడ బసవ నామముచే సోమనాథుడు ప్రణుతించినాడు.

"తెల్లంబుగా నస్మదీయేశు చెన్న మల్లికార్జునదేవు మహిత రూపంబు.... తన యా బసవన దండనాయకుని జా నొంద మత్కృతి స్వామి గావించి మసలక మా చెన్న మల్లినుని బసవనా మంచిది భక్తి పెక్కువను బసవ లింగం బని ప్రణుతించువాడ" అను పద్యము పై విషయమున కాధారము. కనుక పద్య మకుటములోని 'చెన్నమల్లు' శ్రీశైల మల్లికార్జున స్వామియే. సోమ నాథుడు చెన్నమల్లు సీసములను మల్లికార్జున స్వామి పేర నడిమి వయసునందే రచించెనని బండారు తమ్మయ్యగారు నిరుపించినారు.[1] చతుర్వేద సారము రచించుటకు కొంత ముందో వెనుకో సోమన 'చెన్నమల్లు సీసములు' రచించి నట్లు భావించవచ్చును.

ఇందు వీరశైవమత విహితములగు భక్త, మహేశ్వర, ప్రసాది, ప్రాణ లింగి, శరణ, ఐక్యము లను షట్స్థలముల విజ్ఞాన స్వరూపము వరుసగ బదు మూడు, అయిదు, మూడు, నాలుగు, అయిదు, రెండు మొత్తము ముప్పది రెండు పద్యములలో వర్ణింపబడినది. ప్రతి పద్యము చివరను "చెన్న మల్లు" అను మకటము కూర్చబడినది. ఇది సోమనాథునికి మొదటి యిష్టదైవమగు శ్రీశైల మల్లికార్జునుని సంబోధనమయి యుండును. పండితారాధ్య చరిత్రావ తారికలోని "తెల్లంబుగా నస్మదీయేశు చెన్న। మల్లికార్జున దేవు మహిత రూపంబు తానయా బసవ దండనాయకుని జానొంద మత్కృతి స్వామి గావించి" "మసలక మా చెన్న మల్లికార్జునుని బసవనామం బిడి భక్తి పెక్కువను' బసవ లింగం బని ప్రణుతించువాడ" అను వాక్యముల బట్టి సోమనాథునికి మొదట శ్రీశైల మందలి చెన్న మల్లికార్జున స్వామి యిష్ట దైవముగా నుండి యుండు ననియు, రాను రాను బసవేశ్వరుని మీది భక్తి పారవశ్యము సోమనాథునకు బరిణతమై సర్వశైవ ప్రపంచము బసవమయముగా గాన వచ్చినప్పుడు బసవేశ్వరుడా చెన్న మల్లికార్జునుని మహిత స్వరూపమే యని భావించి యా స్వామిని గూడ బసవ లింగంబని ప్రణుతించెడి వాడని తోపగలదు. ఈ క్రింది పద్యముల వలన దత్కృతి స్వరూపము కొంత తెలియ గలదు.

---

1. పాల్కురికి సోమనాథ కవి, బండారు తమ్మయ్యగారు

భ క్త స్థ ల ము :

సీ॥ శ్రీగురు లింగ సంచిత కృపోన్నత జేసి
కంటి జంగమ పాదకమల సేవ
జంగమలింగ ప్రసన్నత్వమున జేసి
కంటి ప్రసాద సుఖంబు నొంద
దత్ప్రసాద ప్రబోధ స్థైర్యమున జేసి
కంటి సర్వాంగ ప్రకాశభక్తి
భక్తి సౌభాగ్యాను భవపూర్తిమై జేసి
కంటి జీవన్ముక్తి కడమ లేక

ఆ. ఇంకనేమి కొఱత యేల నాకాశింప
బాడి యాడి దైన్య పడి భజించి
మెచ్చి పొగడి రేని మీద నొందెడి ఫలం
బెన్న నున్నదెట్లు చెన్నమల్లు!

మాహేశ్వర స్థలము :

సీ. కరమర్థి నీకు శృంగారంబుగా బూజ
సేయుదు గాని యాశింప ఫలము
వేడుకతోడుత విభవార్థముగ నుతుల్
సేయుదు గాని యాశింప మెప్పు
తగిలి నీకు సుఖార్థముగ బదార్థార్పణ
సేయుదు గాని యాశింప రుచుల
లాలితంబుగ నీకు లీలార్థముగ భక్తి
సేయుదు గాని యాశింప ముక్తి

గీ. నీవు పూజాపలార్థివే నిష్ఫలార్థి
నీవు కీర్తి ప్రియుండవే నిష్క్రియుండ
సకల సుఖభోగి నీవె ప్రసాద ముక్తి
సన్నిహితుడను నీ బంట జెన్నమల్లు!

ప్రసాది స్థలము :

సీ. కాయంబు నింద్రియోత్కరమును నర్పించి
సంధిల్లు కాయ ప్రసాది యేని
ప్రాణంబు సత్క్రియా పదమును నర్పించి
సాధించు పాణ ప్రసాది యేని
శబ్దంబు దచ్చబ్ద సౌఖ్యంబు నర్పించి
శబ్దించు వచన ప్రసాది యేని
గమనంబుగ మన సంగతియును నర్పించి
చననేర్చు గమన ప్రసాది యేని

గీ. తలపులను జేష్టలను నర్పితంబు సేసి
సంచరించు వ్యాపార ప్రసాది యేని
అట్టి సర్వ సంపూర్ణ మహాప్రసాద
సన్నిహితులను జేర్పుమీ చెన్నమల్లు!

ప్రాణలింగి స్థలము :

సీ. కాయంబునందు నిన్ బాయకుండిన లీల
బ్రాణంబు నందున బాయదేని
వెలయ జాగ్రదవస్థ దలచిన యమ్మాడ్కి
నలరు స్వప్నావస్థ దలచెనేని
వెలుపలి దృష్టుల వీక్షించు విధమున
భావంబు నందున బదిలుడేని
బాహ్యార్పణంబున బరవశుడైనట్టి
మానసార్పిత సావధాని యేని

ఆ. నతని జెప్పనొప్పు ననిశంబు నతని సాం
గత్య మొప్పు నతని గన్న నొప్పు.
నట్లు గాన నీ మహాభక్తి యుక్తుల
జేర్చి ప్రోవు నన్ను జెన్నమల్లు!

## శరణ స్థలము :

సీ. చేసిన నుపచారి సేయమి సోమరి
ఫలము గోరక చేయ భక్తవరుడు
పొగడిన ప్రౌఢుండు పొగడమి మూఢుండు
నిర వెర్గి పొగడగ పిశ్వరుండు
వలెనన్న సంసారి వలదన్న నిర్మోహి
వల దనర్పిత మన్న వరప్రసాది
తలచిన సువిధాని తల సమినద్వైతి
తన్ను మర్వదలప దత్త్వవిదుడు

ఆ. అట్టుగాన దజ్ఞులగు మహాభక్తుల
సరస లింగ కవుల సత్ప్రసాద
రతుల బరమతత్త్వయుతుల మహాత్ములఁ
జేర్పవయ్య నన్ను జెన్నమల్లు!

## ఐక్య స్థలము :

సీ. ధర "నవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ"
యను కర్మయోగంబు నపహసించి
యేదియు లేక "జ్ఞానాదేవ మోక్ష"మన్
జ్ఞాన యోగంబు హాస్యంబు చేసి
వదలక "యాత్మనామిద మగ్రజే" త్తను
ధ్యాన యోగంబును నాశ్రయించి
తగ "సచపూజ్యో యథాహ్యాహ"మ్మను భక్తి
యోగంబు ముక్తికి జేగ గాఁగ

గీ. తివిరి పొదలు పరమ శివయోగ సుఖ సుధా
శరధి మఱచి తన్ను జగము మఱచి
లింగ గతి జరించు లింగ లింగైక్యుల
జేర్పవయ్య నన్ను జెన్నమల్లు!

క. చెన మల్లేశ్వరు పేరిట
సునిశితముగ బాలకురికి సోమేశుడు దా
ఘన భక్తి వెలయ జెప్పెను
చెనమలు సీసంబు లనగ జెలగ ధరిత్రిన్

క. ఈ సీసము లేవేళను
భాసురముగ బఠన సేయు భక్తుల కిలలో
నాసిగ భుక్తియు ముక్తియు
నా సర్వేశ్వరు డొసంగు ననవరతంబున్.

## పండితారాధ్య చరిత్ర

పాల్కురికి సోమనాథ కవి రచించిన తెలుగు గ్రంథములలో యిదియే కట్టకడపటిదిగా పేర్కొనబడినది. "పండితారాధ్య చరిత్ర" ఉత్కృష్టమైన గ్రంథము. ఇందనేక శైవ సంప్రదాయములు, వీరశైవ సిద్ధాంతములు చెప్ప బడినవి బసవ పురాణములో వలెనే పండితారాధ్య చరిత్రలో కూడ సోమన భక్తుల కథల ద్వారా మహిమలు వెల్లడించినాడు, బసవనికి సమకాలికుడగు పండితారాధ్యుని చరిత్ర యిందలి కథాంశము.

పండితారాధ్య చరిత్రములో వీరశైవ ధర్మము సంపూర్ణముగా వివరింప బడినది. వీరశైవ సిద్ధాంతము నిష్కర్షగా ప్రపంచింపబడినది. వీరశైవ నీతి మార్గము బాహాటముగా వర్ణింపబడినది. దానిలో ఎన్నో అపూర్వములైన ఇతి హాసములు చేరినవి. నూత్న పురాతన శైవ భక్తులను గురించిన పురాణ కథలు చేరినవి.

"బసవన్న బొగడ బాల్పడు కవీంద్రుడను
బసవన్న బొగడ బాల్పడు పాఠకుండ"

పం.చ (1) 14

"వాయూర భక్తుల వర్ణింప గంటి
బాయక నాజిహ్వ పావనంబయ్యె
బ్రదికితి"

పం.చ (2) 13

పండితారాధ్య చరిత్రలో సోమనాథుని కావ్య కళా సిద్ధాంతము నిర్వ చింపబడినది. కావ్యమునకు వస్తువు, స్వరూపము రెండున్ను ముఖ్యములే. వస్తువు పురాతనమైనదిగా ఉండవలెను. ఆద్యసత్కథలతో ఒప్పవలెను. ఆ వస్తువు కవి జీవితాశయముల కనుసంధానము కలిగి ఉండవలెను. అందుచేతనే సోమన్న తన దృష్టిలో హరునితో సమానుడైన బసవన్నను, హరు నతిశ యించిన మల్లికార్జున పండితారాధ్యుని తన కావ్యములకు నాయకులుగా చేసి నాడు. వారి చరిత్రలను పూసలలో దారమువలె పురాతన భక్త వితతి చరిత లోపల సంధించినాడు.♦ తన కావ్య నాయకుల యెడల కవి కసమాన గౌర వము, భక్తి ప్రపత్తి ఉన్నది. పురాతన భక్తుల కతడు పెంపుడు కొడుకు. బసవడు నందికేశుని అవతార మూర్తి. సోమన్న బసవ గోత్రుడు, బసవని పాద పద్మ సేవకుడు, అతని కవీంద్రుడు, అతని పాఠకుడు అతనికి దూత, బంటు, లెంక, లెంగి, ఇలుపుట్టు, బానిస కొడుకు, అతని పన్నల పన్న. ఇక పండితారాధ్యుడు మనుష్యుడే కాడు. వివిధ ప్రమథ గణముల ప్రత్యేక గుణ ముల ప్రోవయి యేర్పడిన మూర్తి. పరమ పరానంద మొసగే శివభక్తి, నందికేశు సర్వజ్ఞత, భృంగి సహజ నిష్ఠ, దుర్వాసాదుల శాపశక్తి, అక్ష పాదాదుల, వాగ్విచక్షత, ఉపమన్యు సద్గురుత్వంబు, ప్రమథ గణముల ప్రసాదైకరతి ప్రాక్తన నూతన భక్త గణముల వ్యక్త దృష్ట ప్రత్యయారూఢ మహిమ, వీర భద్రుని శౌర్యము, ఇవన్ని తగిన పాళ్ళలో మేళనము పొంది, ముద్దగించి, కరుడు గట్టి ఘనీభవించిన మూర్తి అతనిది. అట్టి నాయకులను 'తలచు తలంపు బలు పున గాజేసి' అతని భావము మెరసినది. 'అకలంక లింగ రహస్య సిద్ధాంత సకల వేద పురాణ సమ్మతమైన భక్త గీతార్థ సమితి' తన కావ్యములకు మాతృక. ఇందాంధ్ర దేశమున వీరశైవ మత వ్యాప్తికై పాటుపడిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్రము సాభిప్రాయ నామధేయములగు దీక్షా, పురా తన, వాద, మహిమ, పర్వత ప్రకరణములకు పంచ ప్రకరణములలో వర్ణింపబడినది. బసవ పురాణమువలె నిది కూడ జాతీయచ్ఛందమగు ద్విప దలోనే కూర్పబడినను సోమనాథుడు పాండిత్యము పండువాఱిన నిండు ప్రాయమున దీనిని రచియించుటచే నిందలి రచన మనేక విధముల బసవ

1. పండితారాధ్య చరిత్ర పీఠిక - డా॥ చిలుకూరి నారాయణరావు గారు-100

♦ పండితారాధ్య చరిత్ర పీఠిక - డా॥ చిలుకూరి నారాయణరావు గారు-111

ధారణము, బ్రహ్మ ముఖావిర్భావము, కపాలాస్థిమాలా చర్మధారణము, ఉమా పతిత్వము, భిక్షాటనము, గంగాధారణము, త్రివిక్రమ ఖండనము, హరి హరా భేదము, గరళ ధారణము, నగ్నత్వము, దక్షాధ్వర ధ్వంసములు శివుని సర్వాధిక్యమును స్థాపింపజాలవని నిందింపగా, ఆయా విషయములు శివుని ఆధిక్యము నెట్లు స్థాపించుచున్నవో నిరూపించి, హరుని పంచవింశతి లీలా పరిగణము చేసి, రుద్రాధికత్వమును హరి హర తారతమ్యమును నిరూపించి, శివుని ప్రళయ లీలను, మహాతాండవ లీలను వర్ణించి, సభలోని వారంతా నివ్వె రగు పొందేటట్లు చేయగా, అందరూ పండితారాధ్యుని కీర్తింప మొదలు పెట్టి నారు.♦

దానిని చూచి సహించ లేక, మారు మాట పలుకలేక, బౌద్ధుడు కోపో ద్రిక్తుడై, పండితుని ధిక్కరించి సభాస్థలిని విడిచిపోయినాడు. అక్కడ చేరిన వారి కందరికి బౌద్ధుని మీద కోపమును ఏవయు కలిగినవి. వారిలో రేమయ, దేవయ లను వారు బౌద్ధుని చంపెద మని కంకణము కట్టి అతడు సముద్రము లోని ఒక లంకలో బుద్ధ విగ్రహమును పూజించుటకు పోవునని తెలిసి వాడు రాక ముందే, బుద్ధ విగ్రహము వెనుక దాగొని యుండి, వాడు రాగానే వాని పైబడి వధించినారు. తమ గురువు ఇంకను మరలి రాకుండుట చూచి బౌద్ధుని శిష్యులు పోయి, వాని శవమును చూచి, ఏడ్చుకొనుచు రాజుతో మొర పెట్టు కొనగా రాజు పండితారాధ్యుని పిలిపించి, 'నీవేనా ఈ పనిని చేయించినది' అని అడిగినాడు. 'అవును, నేనే చంపించినాను. బుద్ధుడే పరదైవమో, శివుడే పర దైవమో నీవు చూచినావు గదా! నీవు నన్ను దండించ నెంచుచున్నావు. నీవు నన్ను దండించే దేమిటి? నన్ను నేనే దండించుకొందును. చూడు. మూడు సార్లు కళ్ళను పెరకు కొంటే, మూడు సార్లు తల మొలవ వలెను. మూడు సార్లు కళ్లను పెరకు కొంటే, మూడు సార్లు మళ్ళీ అవి రావలెను. దేశ దేశముల యందు చాటించి అందరినీ రప్పించు. వారందరు చూచెదరు' అని పలుకగా రాజట్లే అందరినీ రప్పించినాడు. అందరు చూస్తూ ఉండగా పండి తుడు ఇనుమారు కన్నులు గోరు గొంటితో పెకలించి తీసినాడు. రెండు సార్ల

♦ పండితారాధ్య చరిత్ర పీఠిక-డా॥ చిలుకూరి నారాయణరావు గారు. 75

తనికి కళ్ల వచ్చినవి. చోడునికి క్రోధము హెచ్చినది. ఇక మూడో సారి తానే కింకరుల చేత పండితుని కన్నులను పెరికించి, 'జీశ్నపాల్ తెప్పించి, నింద బోయించి' చోడుడు పోయినాడు. అప్పుడు పండితుడు,

"అసంఖ్యాత మాహేశ్వర్ధిత సమూయత క్రోధోత్క-
టానల పటల విరచిత జ్వాలల వెలనాటి చోడ ధరణీత
లేశ్వ రాధమ పతంగంబు భస్మమయ్యెడమ;
తద్బంధులు సుతులు విస్మయంబుగ నిష్ట భస్మమైపోదురు;"

అని శాప మిచ్చి వెలనాటి చోడుని వంశ మాశాపము ప్రకారము నాశనము పొందినది.

పండితుడు బుద్ధునితో సంభాషించుట, వాడు శివ నింద చేయగా వినుట మొదలయిన పాపములను తొలగికొనుటకు మహాప్రమథ గణ సంకీర్తనము రుద్రగణ సంకీర్తనము, యోగాచార్య గణ సంకీర్తనము, షోడశగణ సంకీర్తనము, దశగణ సంకీర్తనము, త్రయోదశ గణ సంకీర్తనము చేసి, గణ సహస్ర నామములు పఠించి, అమరా రామమునకు పోయి, అమరేశ్వరుని అమరేశ్వరాష్టకముతో కీర్తించి, తన కన్నుల నెప్పటివలె పొందినాడు. పూర్వ కాలముదోను విష్ణ్వాదు లెందరో ఈ రీతిగానే కన్నులను పొందినారు. ఇరిత్తాండి, నంబెన్న మొదలైన వారి చరిత్రము లిట్టివే.*

పండితుడు తరువాత బసవేశ్వరుని చూడవలెనని కల్యాణ కటకమునకు బయలుదేరి, త్రోవలో ఊరూర శివభక్తులు తన కెదురు వచ్చి పూజించు చుండగా ఇరు (నిడు) గుడుముల అనే గ్రామము చేరి, అచ్చట వీరదాకి దేవయ్య చేత ప్రణిపత్తి చేయించుకొని, అక్కడ ఉండగా బసవేశ్వరు డతనికి విభూతి పంపినాడు. దానివల్ల అతనికి కర్ణాట భాష వచ్చినది. ఆ భాషలో పండితుడు బసవయ్యను కీర్తించినాడు. ఇరు (నిడు) గుడుగుముల నుండి, పానుగంటికి రాగా, అచ్చట బందరువు గోవింద ప్రెగడ అతనిని మహావైభవ ముతో పూజించినాడు. పానుగంటికి ఉదయావనీశు డనువాడు రాజు. ధవళేశు నామయ్య అతని లెంక. నామయ్య శివభక్తి పెంపుతో కొండెములు చెప్పినారు.

---

* పండితారాధ్య చరిత్ర పీఠిక-డా॥ చిలుకూరి నారాయణరావు గారు.

రాజతనిని పిలిచి తన తమ్మను తినుమంటే అతడట్లు చేయ నిరాకరించినాడు. తన్ను దండించక ముందే నామయ్య రాజుకు బసవని మహిమలను తెలిపి, తన తలను తానే ఖండించుకొని కైలాసమునకు పోయినాడు. ఉదయావనీశుడు వంశముతో నాశనమయినాడు.

పండితు డక్కడి నించి వని పురమునకు పోగా శంకరయ్య అనే భక్తు డతనికి సకలోప చారములు చేసి ఆదరించినాడు. అచటి నుండి కల్యాణ కటకమునకు పండితారాధ్యులు బయలు దేరుచుండగా, ఒకడు కల్యాణములో భక్తి గజిబిజి పుట్టి బిజ్జలుని జగదేవ మొల్లె బొమ్మయలు చంపినారనియు, బసవేశ్వరుడు కప్పడి సంగమేశ్వరమునకు పోయి దేహముతో సంగమేశుని గర్భములో చొచ్చినాడని చెప్పగా విని, పట్టరాని దుఃఖముతో పలవించినాడు.

మల్లికార్జున పండితారాధ్యుడు వనిపుర శంకరయ్యా గారిని వీడ్కొని బయలుదేరి శ్రీశైలము చేరుకొనినాడు. అతనికా శైలము తన భక్తి దృష్టికి లింగాకారముగా తోచినది. శ్రీశైలోత్పత్తిని స్మరించి, దాని మహిమను స్తుతించి, దానిపై నెక్కి పాదములతో తాకడమునకు జంకి, శిష్యుడైన దోనయ్యను శైలము నెక్కి మల్లికార్జున స్వామి దర్శనముచే తన భక్తిని నివేదించ వలసిన దని నియోగించినాడు. నానా దేశముల నుంచి శ్రీశైల యాత్రార్థమై వచ్చిన భక్త సంఘములతో దోనయ్య కొండ నెక్కు చుండగా, మల్లికార్జున స్వామి అతనికి వృద్ధ తపోధనుని వేషముతో ఎదురై, పండితారాధ్యుని కుశల మడిగి, దోనయ్యకు శ్రీశైలములో నుండు అన్ని ప్రదేశములను ఒక దీప వృక్షము మీద నుంచి చూపినాడు. దోనయ్య పట్టరాని సంతోషముతో అన్నిటినీ చూచి, పండితుని ప్రసాదము చేత గదా, ఈ భాగ్యము నాకు కలిగినదని వెల్లటూరికి పోయి జరిగిన దంతా విన్నవించినాడు. పండితు డా సంగతుల నెల్ల విని-యావృద్ధ తాపసుడు మల్లికార్జున దేవుడే యని గ్రహించి దోనయ్య వంటి శిష్య సత్తముని మూలమున గదా యాస్వామి యనుగ్రహము తనకు లభించె నని సంతోషము జెంది దోనయ్య సుకృత భాగధేయముల గొని యాడును. అనంతరము పండితారాధ్యుడు బసవేశ్వరు డవతారమును జాలించిన తరువాత దానీ ధారుణి యందుండియు ప్రయోజనము లేదు కావున సంగమేశ్వర లింగ గర్భమున నాతనింబోలె, నిజ గర్భమున దన్ను గూడ బుత్ర కళత్ర సహి

తమ్ముగ నైక్యమ్మొనర్చి కొమ్మని శ్రీశైల మల్లికార్జునుని బ్రార్థించును. పండితా రాధ్యుని ప్రార్థనము నంగీకరించి యామహాదేవు డట్లు గావించును.

శివాజ్ఞా పత్ర సరణి శివగణ ప్రార్థనచే మల్లికార్జున లింగ గర్భమునందు జేరక పండితారాధ్యుని పుత్రులలో మత ప్రచారమునకయి నిలిచి యున్న కేదారయ్యను బండితుని ప్రియశిష్యుడు దోనయ్య లోకారాధ్య పట్టమున కభి షిక్తుని గావించి యాతని సేవించుచుండును. కేదారయ్య పుత్రులు మనుమ పండితుడు, భీమన పండితుడు, మహాదేవయ్య, చెన్న విభుడు నను నల్వురును నాతని శిష్యుడయిన యివటూరి సోమనాథయ్య, తత్తనయులు సూరీశ్వరుడు, విశ్వనాథప్పయ్య, సింగణ మంచెన్న యను మూవురును గూడ మత ప్రచార మునకయి కృషి సలుపుచుందురు."

పండితారాధ్యుడు గొప్ప వీరశైవ కవిగా సోమనాథుడు పేర్కొనినాడు. హర లీల, మహిమ్న స్తవము, మలహణము, అనామయము, హలాయుధము, పంచ గద్యములు, శివ తత్త్వసారము, రుద్ర మహిమ, సంసార మాయా స్తవము, శంకర గీత, ఆనంద గీతములు, బసవ గీతములు, (3) 180-1; దక్షాధ్వరము, న్యాసాష్టకము, గణాడంబరము, శారభము, తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, శంకర పదములు, నివాళి పదములు, వాలేశు పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజ వర్ణన, గణ వర్ణన పదములు (1) 512-13; బాణ గద్య, అక్షర గద్య, వర్ణా డంబరము, నీల కంఠ స్తవము, మయూర స్తవము, మలయ రాజీయము, మౌని దండకము, మహాస్తోత్ర సూత్రములు, శతకము, దీపకళిక, మహానాటకము, ఉదాహరణములు, ముక్తకములు, గీత సూక్తములు, భృంగి స్తవము, రుద్ర సహస్ర నామము, (2) 432-3; మొదలయిన గ్రంథముల పేళ్ళను సోమనాథుడు మల్లికార్జున పండితారాధ్య రచితములుగా ధ్వనించునట్లు సూచించినాడు. వీటిలో శివ తత్త్వసార మొక్కటి మాత్రము బయలు పడినది.1 తక్కినవి ఏమయినవో తెలియదు.

సోమనాథుని తొలికృతులలో నామ మాత్రముగానున్న వీరశైవ సిద్ధాంతము బసవ పురాణ పండితారాధ్య చరిత్ర లందు పరాకాష్ఠనందె అమతాను

1. పండితారాధ్య చరిత్ర పీఠిక 79 - డా॥ చిలుకూరి నారాయణరావు.

యాయుల కాదర్శప్రాయ మయ్యెనని ఊహించ వచ్చును. సోమనాథుడు కవిత్వము మూలముగా వీరశైవ మత వ్యాప్తికి కంకణము కట్టుకొన్న అసమాన మేధాశాలి. పండితారాధ్య చరిత్ర వర్ణనా ప్రధానమగు కావ్యము. పర మత ఖండనమున కీత డవలంబించిన పద్ధతిలో ఒక విశిష్టత కలదు. అతడొక్క వాదమును తీసికొని, దాని స్వరూపమును ముందుగా తెలిపి, తరువాత వేద వాక్యముల నుదహరించి, ఆవాక్యముల కావాద మెట్లు విరుద్ధముగా ఉన్నదో స్పష్టము చేసి. తరువాత పురాణేతిహాసముల నుండి ఐతిహ్యముల నను సంధించి, దానిని తుక్కు తుక్కుగా ధూళి కెగర గొట్టును. ఆవాద పద్ధతి సంపూర్ణముగా నైయాయిక పద్ధతి ననుసరించి యుండును. వీరశైవ సిద్ధాంతమే సరియైన సిద్ధాంత మని సంపూర్ణమైన విశ్వాస ముండుట చేత అతని కెక్కడ లేని వాగౌద్ధత్యము కలిగినది. అతని కొకరి లక్ష్యము లేదు. ఎదరి పక్షము వారతని కొక చీమవలెనో, దోమవలెనో కనబడెదరు. వాద ప్రకరణములో ఒక్కొక్క వాదము నెత్తికొని దానిని చీల్చి, చెండాడి, దుమ్మున కెత్తిపోసి, తుట్టతుదకు శివ పరమోత్తమత్వమును సిద్ధాంతించి, అదే సరియైన సిద్ధాంత మని రుజువు చేయుటకు "గౌరీశు మీద దైవంబు లేదని తల యిచ్చి పద యుదును, మంట బట్టుదు, దొడరిన గెలుతు బనుగొన వాద వితండ జల్ప ములను" అని ప్రతిజ్ఞ చేసి "శివు మీద నొకఁడు గలడన్న నాఱయకా లెత్తి వాని నడుదల దన్నుదు" అని గర్జించినాడు.[1]

సోమనాథుని వైదుష్యము, లోకజ్ఞానము "పండితారాధ్య చరిత్ర"లో అనేక విధముల ప్రస్ఫుటితమైనది. మచ్చునకు

> "సత్కృతి యన నూత్న సంగతి దనర,
> దొమ్మిది రసములు దులుకాడ, దాని
> యిమ్మడి వర్ణన లెసగంగ, ద్విగుణ
> మగు నలంకారంబులసలార, దాని
> ద్విగుణార్థ భావముల్ దీటు కొనంగ
> దేట తెనుంగున ద్విపద రచింతు"

(పం.చ. పుట 17, 18)

1. పండితారాధ్య చరిత్ర పీఠిక - డా॥ చిలుకూరి నారాయణరావు గారు.

*వీరశైవేతరులకు అపరిచితులైన శైవభక్తుల పేర్లు, కథలు మొదలైన వాటిని కూడ చెవులలో గింగురు మనేటట్లు ప్రయోగించి, ప్రయోగించి అవి పరిచితము లయ్యేటట్లు చేయు చాతుర్యము సోమనలో పుష్కలముగా గలదు.

> "దాసయ్య, శంకర దాసయ్య, దాన-
> కేసయ్య, ధూర్జటి కేశిరాజయ్య,
> దారయ్య, భోగయ్య, దసరయ్య, శివకు-
> మారయ్య, దోరయ్య, మలయ రాజయ్య,
> యోహిషు, డుచ్చటు, ఉత్తుంగ చోడ
> డాహుతి మల్లి దేవయ్య, యెల్లయ్య,
> మధుపయ్య, జగదేవ మల్లబ్రహ్మయలు"
>
> (పం.చ. పుట 217)

అనుచూ 'మహిమా ప్రకరణములో' పెక్కుమంది శివభక్తుల పేర్లను పేర్కొన్నాడు. అనేకములైన భక్త మాహాత్మ్య కథలను ఒక్కచోట చేర్చి, అవి అన్ని ప్రత్యేక కథలు కానట్లు కావ్య స్వరూపమును సోమన కల్పించెను. "సుకేశి కథ, సూరసాని కథ, సామవేది కథ, తిరునాళ్ళపోవ కథ" మొదలైన వాటిని ఉదాహరణగా చెప్పవచ్చును.

సోమన జాను తెనుగు పేరుతో సమ సంస్కృతోక్తులతో రచన సాగించెను. 'దేశి'నుడి కారమును సంపూర్ణముగా అవలంబించి, తెనుగు తీయ దనమునకు లోనై "జాతులు రీతులు నేతులుట్టంగ" రచించినాడు. కేవలము దేశీయ పదముల నుపయోగించుచు, ఉపయోగించుచూ వాటివలన కవిత పేలవం కాకుండా మధ్య మధ్య సందర్భానుసారముగా దీర్ఘ సంస్కృత సమాసములను గుప్పించుట కనబడుచున్నది.

> "వివిధ దానానేక విపుల ధర్మముల
> సకల తీర్థవ్రజ జపతపోధ్యాన
> నికర నానావ్రత ప్రకర సంజనిత"
>
> (పం.చ. పుట 51)

* కావ్య సౌరభాలు - (పుట 10)

"ఈ క్షితిజను పూర్వపక్ష సిద్ధాంత
పక్షముల్ దత్కర్మ భాగైక పూర్వ
పక్షేతర జ్ఞాన భాగ సిద్ధాంత
పక్ష వేదాంతోప పాదితపరము
శైవాత్మకాచార్య సంసిద్ధ శుద్ధ" (పం.చ.పుట 172)

పై ఉదాహరణలు సోమనాథుని దీర్ఘ సంస్కృత రచనకు నిదర్శనములు. కావ్యములో తొమ్మిది రసములుండ వలెనని చెప్పి సోమన తన కావ్యములో పోషించినాడు. శృంగార, హాస్య, రౌద్ర, కరుణ, వీర, అద్భుత, భీభత్స, భయానక, శాంత రసాలకు పండితారాధ్య చరిత్రలో ఉదాహరణలు చూప వచ్చును.* హాస్య రసమును రమ్యముగా పోషించిన కవులు చాల తక్కువ మంది కలరు. అందు సోమనకు స్థానము కలదు. సూరసాని ఇంటిలో మాదిగ వేషంలో ఉన్న శివుడు మాదిగయే అని నిశ్చయించి అక్కడ చేరిన బ్రాహ్మణులు :

'అగ్రహారంబును నలుకువలేక
.... ... ....
ఉక్క డగింతు రన్నులుకును లేక
యలరుచు దానొక యయగారువోలె
నిలవేషధారి జంగిలి యున్నవాడు,
వచ్చె దనకు జావునవడి చప్పదనుచు
జెచ్చెర గుడిచియే చచ్చెద ననుచు
నా యంత్యజుండుండె బో...." (పం.చ. 124 పేజీ)

అని పలికిన వెటకారపు మాటలలో హాస్యము రమ్యముగా నున్నది. "దక్షాధ్వర ధ్వంసము, ప్రళయలీల" మొదలైన వర్ణనలలో రౌద్ర రసము మూర్తీభవించినది.

"వీరావతారుని వీరభద్రేశు
గ్రూర నృసింహ విదారణు బనుప

* కావ్య సౌరభాలు; గుదిమెళ్ల భావనారాయణాచార్యులు.

శ్రీవీరభద్ర గణావలి గొలువ
శ్రీవీరభద్రు డజేయుడే తేర
ద్వరిత దక్షాధ్వర ధ్వంస నోద్యుక్త
పరిచిత క్రోధ విస్ఫురితాభిజాత-
నిటల తటానలోత్కట చటులాగ్ని-
పటల పరిస్ఫుటోద్భట విస్ఫులింగ
పటు పాతముననుు ..'' (పం.చ. పుట 692)

''... హరుని
ఫాల విశాల కరాలనేత్రాగ్ని
కీలావలీస్ఫురత్కాలాగ్ని గ్రమ్మ
నిది జగ ద్విప్లవ హేతువై తనర
నదియు తా సుఖహేతువగు బ్రహ్మాదులకు''

(పం.చ. 696)

పాల్కురికి సోమనాథుడు పరమత ఖండనములో ఒక విశిష్టమైన పద్ధతి కలవాడు. వీరశైవ సిద్ధాంతమును వివరించు ఉద్దేశముతో కావ్యమనే ఆధారమును కల్పించుకుని, సిద్ధాంతమును ప్రత్యేకముగా విస్తరించి చెప్పకుండా కథతో మేళవించి కవి తన సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నాడనే విషయమును పాఠకులకు తోచకుండా చేయుటలో సోమన నేర్పు అసామాన్యమైనది. సోమనాథుని నవీన గుణములను డా॥ చిలుకూరి నారాయణరావు గారు తమ 'పండితారాధ్య చరిత్ర' పీఠికలో వివరించినవి యథాతథముగా వ్రాయుచున్నాను.

1) ఇతనికి పూర్వము శైవ కావ్యములున్నను వాటికిని సోమనాథుని కావ్యములకును పోలిక లేదని వారు చెప్పిరి. కథా వస్తువులో క్రొత్తదనము ఈతని ప్రత్యేకత.

2) అనేకము లయిన విడివిడి భక్త మహాత్మ్య కథల నొక్క చోట చేర్చి; అవి అన్నీ ప్రత్యేక కథలు కానట్లు కావ్య స్వరూపమును కల్పించుట.

3) తనకు గల ప్రత్యేక విద్యలను గురించిన జ్ఞానమును విస్తరించి చెప్పినా, పాండిత్య ప్రకటనము కోసమిట్లు చేయుచున్నాడన్న భావము చదువరులకు కలుగనివ్వకపోవుట.

4) వేద, వేదాంగ, స్మృతి, పురాణేతిహాసముల నుంచి వాక్యముల నున్న వున్నట్లుగా ఉదహరించినను, అవి ఉద్ధృత వాక్యములనే జ్ఞానము కల్పించక, తన కవితాధారలో వాటిని లయము చేయుట.

5) వేద శాఖలు, పురాణములు, ఉపనిషత్తుల పేళ్లు, రాగములు, అభినయ భేదముల పేళ్ల, పత్తిరి, పండ్లు, కాయలు, పుష్పముల పేళ్లు, మనుష్యుల పేళ్లు ఈరీతిగా ఎన్నో ఉత్త పేళ్ల గుత్తడముల మపుటల కొలది నింపి నప్పటికిని, విసుగెత్తించకుండా ద్విపదలను సాగించుట.

6) చెప్పిన విషయమునే మళ్లీ చెప్పుచున్నా, అది పునరుక్తిగా తోచకుండా చెప్పుట.

7) తనకు పూర్వము కేవలము పాటలకు, వచములకు మాత్ర ముపకరించు ద్విపదచ్ఛందస్సును, మహాకావ్యోపయోగిగా దిద్ది తీర్చుట.

8) ద్విపదలలోని మాత్రా గణముల సులువుగా నుపయోగించుకొని, ఆయా మనోవస్థల కనుకూల పడునట్లు వాటిని సవరించుట.

9) అంతకు పూర్వము సంస్కృత భూయిష్ఠముగా నుండు ఆంధ్ర కావ్య రచనలను నిరసించి జాను తెనుగను పేర సమ సంస్కృతోక్తులతో రచనను సాగించుట.

10) దేశి నుడికారమును సంపూర్ణముగా అవలంబించి, తెనుగు తీయదనమునకు లోనై, 'జాతులు రీతులు నేతులుట్టంగ' రచించుట.

11) కేవల దేశీయ పదముల నుపయోగించుచూ, వానివల్ల కవిత పేలవము కాకుండా మధ్య మధ్య సందర్భము ననుసరించి దీర్ఘ సంస్కృత సమాసములను గుప్పించుట.

12) ప్రాచీన కావ్య లక్షణ మీద దృష్టిని విడువకుండా ఇటూ అటూ పరుగులెత్తి, మళ్లీ స్థాయికి వచ్చుట.

13) అనుప్రాసాది శబ్దా లంకారములను బలాత్కరించి తెచ్చి పెట్టకుండా, ఉత్సాహము, ఆవేశము, భావప్రవాహము. సిద్ధాంత స్థాపనము, మొదలయిన సందర్భములలో ఇక్కడ ఈ అలంకారము గలదని తోచ నీయకుండానే పాఠకుని తన కవితా ప్రవాహములో ఈడ్చుకొని పోవుట.

14) ఉపమాద్యర్థా లంకారములను సహజముగా ఉండవలసిన చోట్ల నుపయోగించి, మనస్సుకు ఆనందము కూర్చుట.

15) ఉపమానములను కుప్పలు తిప్పలుగా గుప్పించి పాఠకుని కూపిరి తిరుగకుండా చేయుట.

16) సంపూర్ణాసంపూర్ణ క్రియా పదములను విధి విరామములు లేక, గ్రుక్క తిరుగ కుండా, ఒకదాని వెంట నొక దానిని గుండ్ల బారులవలె ప్రయోగించుట.

17) ఆమ్రేడితోక్తుల చేత భావమున కందము తెచ్చుట.

18) కావ్య లక్షణమునకు తాను వశుడు కాక, లక్షణమును, సంపూర్ణముగా తన వశములో ఉంచుకొనుట.

19) ద్విపదలను రోకటి పాటగా చేయక, మహా వేగముతో పోవుచున్న రైలు నడకవలె, అనేక ప్రకారములుగా నడిపించుట.

20) శబ్దముల ధ్వని, నడక, వేగములతోనే ఆయా సందర్భముల కర్థస్ఫూర్తి నతిశయింప జేయుట.

21) వీర శైవేతరుల కపరిచితులైన శైవ భక్తుల పేళ్ళు, కథలు, మొదలయిన వాటిని కూడా చెవులలో గింగురు మనునట్లు ప్రయోగించి, అవి పరిచితము లయినట్లు చేయుట.

22) వీర శైవేతర పాఠకుని కితర సమయములలో వెగటుగా తోచు విషయముల నయినా, తన కవితా నైపుణ్యము చేత హితవుగా ఉన్నట్లు తోపింప జేయుట.

23) సందర్భము ననుసరించి భాష పోకడలను మార్చి వేయుట.

ఈరీతిగా పాల్కురికి సోమనాథుని కవితలోని నూత్న సంగతి నెంత యినను వివరించి చెప్ప వచ్చును.

# ఉపయుక్త
## గ్రంథముల పట్టిక


1. ఆంధ్రమహాభారతము - సంశోధితముద్రణము (ఉస్మానియా విశ్వవిద్యాలయము ప్రచురణ)
2. నిగూఢ వేదరహస్యములు - శ్రీ అరవిందులు.
3. Indian Philosophy - Dr. S. Radha Krishnan.
4. South Indian Incriptions (Vol. 2)
5. The Religion and Philosophy of the Veda and Upanishads (By Keith)
6. Archaeological Survey of India - Memoirs.
7. ప్రబోధచంద్రోదయము.
8. శివసిద్ధాంతవరాలరు (తమిళము) అనంత వినాయకంపిళ్లే.
9. శివసూత్రములు - క్షేమరాజువ్యాఖ్యానము.
10. సావిత్రి - శ్రీ అరవిందులు.
11. మహెంజదారో మరియు సింధునాగరికత
    (Mahonjadaro and Indus Civilization)
12. History and Philosophy of Lingayata Religion
    Prof. Sakhare
13. బసవపురాణము - శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.
14. బసవపురాణము - వచనకావ్యము -
    బ్రహ్మశ్రీ పూడి పెద్దిలింగమూర్తి పంతులు.
15. Cultural Heritaga of India (Vol-1)
16. కుమారసంభవము - నన్నెచోడుడు - డా॥ కోరాడ మహదేవశాస్త్రి.
17. మహాభారతము - పీఠిక.
18. బసవ వచనాలు - డా॥ బడాల రామయ్య.

19. కుమార సంభవము - టీకాతాత్పర్యము-
శ్రీ చలమచర్ల రంగాచార్యులు.

20. శివతత్త్వసారము - మల్లికార్జున పండిత ప్రణీతము. శ్రీ నిడదవోలు వెంకటరావు (పీఠిక)

21. పండితారాధ్య చరిత్ర - డా॥ చిలుకూరి నారాయణరావు.

22. బసవ పురాణము.

23. అనుభవసారము - పాల్కురికి సోమనాథకవి.

24. కవితరంగిణి - మూడవసంపుటము - చాగంటి శేషయ్యగారు.

25. వృషాధిపశతకము - పాల్కురికి సోమనాథకవి.

26. చెన్నమల్లు సీసములు - పాల్కురికి సోమనాథకవి.

27. చతుర్వేదసారము - పాల్కురికి సోమనాథకవి.

28. బసవోదాహరణము - పాల్కురికి సోమనాథకవి.

29. బసవపురాణము - పిడుపర్తి సోమనాథకవి.

30. పండితారాధ్య చరిత్ర - పాల్కురికి సోమనాథకవి.

31. పాల్కురికి సోమనాథకవి - బండారు తమ్మయ్య.

32. ఆంధ్రశతక సాహిత్యవికాసము - డా॥ కే. గోపాలకృష్ణ.

33. వీరశైవ శివ మహిళాశరణులు - రెకళిగ్ మఠము వీరయ్యగారు.

34. ఉదాహరణ వాఙ్మయచరిత్ర - శ్రీ నిడదవోలు వెంకటరావుగారు.

3 . తెలుగు సాహిత్యసమీక్ష - (మొదటిసంపుటము) డా॥ జి. నాగయ్య.

36. ఆంధ్ర ద్విపదసాహిత్య చరిత్ర - డా॥ టి. సుశీల.

37. సమగ్ర ఆంధ్రసాహిత్యం - ఆరుద్రగారు.

38. వచన సాహిత్య వికాసము - డా॥ యం. కులశేఖరరావుగారు.

39. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర - డా॥ దివాకర్ల వెంకటావధానిగారు.

40. సారస్వత వ్యాసములు - డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు,